ఓమ్ పరబ్రహ్మణేనమః.

శ్రీ మదష్టాదశ పురాణాంతర్భూతంబగు

స్కాందపురాణమునందలి

# వైశాఖమాహాత్మ్యము.

ఇది

మఛిలీపట్టణ నివాసులైన

చల్లా నాగలింగశాస్త్రులవారి పుత్రుఁడగు

## లక్ష్మీనృసింహశాస్త్రిచే

ఆంధ్రతాత్పర్యసహితముగా వ్రాయఁబడి

బ్రహ్మశ్రీ కావూరి రంగయ్యశాస్త్రులవారిచేఁ

బరిష్కరింపఁబడి

మఛిలీపట్టణస్థిత స్వకీయ

శ్రీ ఆర్యానంద ముద్రాక్షరశాలయందును,

కాకినాడపట్టణస్థిత స్కేపుఅండుకంపెనీముద్రాక్షశాల

యందును ముద్రించి ప్రకటింపఁబడియె.

ప్రథమ ముద్రణము



దీని వెల రు. 2 0 0

1923

శ్రీరస్తు.

శ్రీగణాధిపతయేనమః

# శ్రీస్కాన్దపురాణోక్తం వైశాఖమాహాత్మ్యం
# తాత్పర్యేణసహితం లిఖ్యతే.

సూతఉవాచ॥

శ్లో॥ భూయోప్యంగభువంరాజా బ్రహ్మణః పరమేష్ఠినః।
పుణ్యంమాధవమాహాత్మ్యం నారదంపర్యపృచ్ఛత॥ ౧

తా. సూతమహాముని చెప్పుచున్నాడు. సృష్టికర్తయగు బ్రహ్మయొక్క మానసపుత్త్రుండగు నారదమహాముని వలన అంబరీష మహారాజు అనేక ధర్మములను విని తిరిగి పుణ్యకరమైన వైశాఖ మాహాత్మ్యమునుగురించి నారదమునీశ్వరునడిగెను.

అంబరీషః॥

శ్లో॥ సర్వేషామపిమాసానాంత్వత్తో మాహాత్మ్యమంజసా।
శ్రుతంమయాపురాబ్రహ్మన్ యథాచోక్తంతథాత్వయా॥ ౨

తా. అంబరీష మహారాజడుగుచున్నాడు. ఓ నారదా! మీరు చైత్రము మొదలగు పండ్రెండు మాసముల మాహాత్మ్యమును బాగుగా జెప్పితిరిగాన నేను శ్రద్ధతో వింటిని.

శ్లో॥ వైశాఖఃప్రవరోమాసోమాసేష్వేతేషునిశ్చితమ్।
ఇతితస్మాద్విస్తరేణమహాత్మ్యంమాధవస్యచ॥ 3
శ్రోతుంకౌతూహలం బ్రహ్మన్కథంవిష్ణుప్రియోహ్యసౌ!
కేచవిష్ణుప్రియాధర్మామాసేమాధవవల్లభే॥ ౪

తా. పండ్రెండు మాసములలో వైశాఖమాసము శ్రేష్ఠమైనదిగా నిశ్చయించు కొంటిని గాన యావైశాఖమాసముయొక్క మాహాత్మ్యమును వినుటకు కుతూహలముగల వాడనై యున్నాను. కాబట్టి యోనారదా ! ఈ వైశాఖమాస మెట్లు విష్ణువునకు ప్రీతికరమైనది ? వైశాఖమాసములో విష్ణుప్రీతికరములగు జేయవలసిన ధర్మములెవ్వి ?

శ్లో॥ తత్రాప్యస్యతు కర్తవ్యాః కేధర్మావిష్ణువల్లభాః।
కిందానం కింఫలం తస్యకిముద్దిశ్యాచరేన్నరః॥ ౫
కైర్ద్రవ్యైః పూజనీయోఽసౌ మాధవో మాధవాగమే ।
ఏతన్నారద విస్తార్య మహ్యం శ్రద్ధావతేవద॥ ౬

తా. వానిలో ముఖ్యముగా విష్ణుప్రీతికరములగు ధర్మములేవి ? ఏమిదానము చేయవలయును ? ఏమిఫలము సంభవించును ? విష్ణునిగుఱించి యేయేధర్మముల నేయే ద్రవ్యముతో జేయవలయును ? వైశాఖమాసమునందు విష్ణుమూర్తి నేయే వస్తువులతోఁ బూజింపవలయును ? ఓ నారదా ! దీనినంతయును వినుటకొఱకు మిక్కిలి శ్రద్ధగలవాడనై యున్నాను. కాఁబట్టి సవిస్తారముగా జెప్పుమని యంబరీష మహారాజు నారదునినడిగెను.

నారదఉవాచ.

శ్లో॥ మయాపృష్టః పురాబ్రహ్మామాస ధర్మాన్పురాతనాన్ ।
వ్యాజహారపురాప్రోక్తం యచ్ఛ్రియైపరమాత్మనా॥ ౭

తా. నారదమునీశ్వరుఁడు చెప్పుచున్నాడు. ఓయంబరీష మహారాజా ! రహస్యములగు మాసధర్మములను గుఱించి పూర్వమందు బ్రహ్మనడుగగా లక్ష్మీదేవికి విష్ణుమూర్తి చెప్పినట్లుగా బ్రహ్మ నాతో జెప్పెనుగాన దానినే చెప్పుచున్నాను వినుము.

శ్లో॥ తత్రోక్తామాసా విశిష్టోక్తాః కార్తికో మాఘ ఏవచ ।
మాధవస్తేషు వైశాఖం మాసానాముత్తమం వ్యధాత్॥ ౮

తా. మాసములలో కార్తికము మాఘము వైశాఖము శ్రేష్ఠములుగా జెప్పఁబడినవి. వానిలో వైశాఖమాసము మిక్కిలి శ్రేష్ఠమైనదిగా జెప్పఁబడెను.

శ్లో॥ మాతేవ సర్వజీవానాం సదైవేష్టప్రదాయకః ।
దానయజ్ఞవ్రతస్నానైస్సర్వపాపవినాశనః॥ ౯

తా. వైశాఖమాసములోఁజేయఁబడినదానములు, యజ్ఞములు, వ్రతములు, స్నానములు మొదలగునవన్నియు సమస్తపాపములనునశింపఁజేయును. కాఁబట్టియావైశాఖమాసము సమస్తజీవులకు తల్లివలెనే యిష్టములనొసంగుచుండును.

శ్లో॥ ధర్మయజ్ఞః క్రియాసార స్తపస్సార స్సురార్చితః ।
విద్యానాం వేదవిద్యేవ మంత్రాణాం ప్రణవో యథా॥ ౧౦

తా. ఈ వైశాఖమాసము సమస్త ధర్మముగాను యజ్ఞస్వరూపముగాను క్రియలలో శ్రేష్ఠమైనదిగాను శ్రేష్ఠమైన తపస్సుగాను దేవతలచే పూజింపఁబడునదిగాను చెప్పఁబడియె. మఱియు విద్యలలో వేదమువలెను మంత్రములలో నోంకారమువలెను జెప్పఁబడియె.

శ్లో॥ భూరుహాణాం సురతరు ర్ధేనూనాం కామధేనువత్ ।
శేషవ త్సర్వనాగానాం పక్షిణాం గరుడో యథా॥ ౧౧

తా. వృక్షములలో కల్పవృక్షమువలెను ఆవులలో కామధేనువవలెను సర్పములలో నాదిశేషువవలెను పక్షులలో గరుత్మంతుడువలెను శ్రేష్ఠముగా జెప్పబడెను.

శ్లో॥ దేవానాంతు యథావిష్ణుర్వర్ణానాం బ్రాహ్మణోయథా ।
ప్రాణవత్ప్రియవస్తూనాం భార్యేవ సుహృదాంయథా॥ ౧౨

తా. దేవతలలో విష్ణువుగాను వర్ణములలో బ్రాహ్మణుడుగాను ఇష్టముగల వస్తువులలో ప్రాణమువలెను స్నేహితులలో భార్యవలెను చెప్పబడియెను.

శ్లో॥ ఆపగానాం యథాగంగా తేజసాం తురవిర్యథా ।
ఆయుధానాం యథాచక్రం ధాతూనాం కాంచనంయథా॥ ౧౩

తా. నదులలో గంగవలెను తేజస్సులలో సూర్యునివలెను ఆయుధములలో చక్రమువలెను లోహములలో బంగారమువలెను చెప్పబడెను.

శ్లో॥ వైష్ణవానాం యథారుద్రో రత్నానాం కౌస్తుభోయథా ।
మాసానాం ధర్మహేతూనాం వైశాఖశ్చోత్తమ స్తథా॥ ౧౪

తా. విష్ణుభక్తులలో సాంబమూర్తియు మణులలో కౌస్తుభమణియు నెట్లు అధికమైనవో ఆప్రకారమే ధర్మమునకు కారణమైన మాసములలో వైశాఖమాసము శ్రేష్ఠమైనదిగా జెప్పబడియెను.

శ్లో॥ నానేన సదృశో లోకే విష్ణుప్రీతి విధాయకః ।
వైశాఖస్నాన నిరతే మేషే ప్రాగర్యమోదయాత్॥ ౧౫

తా. మేషసంక్రమణముతోఁగూడిన వైశాఖమాసమునందు సూర్యోదయమునకు ముందుగా స్నానముజేసిన యెడల దీనితో సమానమైన విష్ణుప్రీతికరమైనధర్మము వేరొకటిలేదు.

శ్లో॥ లక్ష్మీసహాయో భగవన్ప్రీతిం తస్మిన్కరోత్యలమ్ ।
జంతూనాం ప్రీణనం యద్వద న్నేనైవహిజాయతే॥ ౧౬

తా. లక్ష్మీదేవికి ప్రాణనాథుండగు విష్ణుమూర్తి వైశాఖస్నానమను ధర్మము నందభిలాషగలవాడు కాబట్టి యన్నదానముచే భూతములు తృప్తినొందునట్లు వైశాఖస్నానముచే భగవంతుడు సంతోషించును.

శ్లో॥ తద్వద్వైశాఖస్నానేన విష్ణుః ప్రీణాత్యసంశయః ।
వైశాఖస్నాననిరతాన్జనాన్ దృష్ట్వానుమోదతే॥ ౧౭

తా. వైశాఖస్నానము విష్ణుప్రీతికరముగావున వైశాఖస్నానమందాసక్తిగల జనుల ననుగ్రహించును సందేహములేదు.

శ్లో॥ తావతాపి విముక్తోఽఘైర్విష్ణులోకే మహీయతే।
సకృత్స్నాత్వా మేషసంస్థే సూర్యే ప్రాతః కృతాహ్నికః
మహాపాపైర్విముక్తోఽసౌ విష్ణోస్సాయుజ్యమాప్నుయాత్॥ ౧౮

తా. విష్ణుమూర్తి యనుగ్రహించిన మాత్రముననే పాపములవలన విడువబడినవాడై విష్ణులోకమునందు నివసించును. మఱియు సూర్యుండు మేషరాశియందుండగా ప్రాతఃకాలమునందొకసారి స్నానముజేసి సంధ్యావందనాది క్రియాలొనర్చిన యెడల విశేషపాపముల వలన విడువబడినవాడై విష్ణువునందైక్యము జెందును.

శ్లో॥ స్నానార్థం మాసి వైశాఖే పాదమేకంచరేద్యది।
సోఽశ్వమేధాయుతానాంచ ఫలం ప్రాప్నోత్యసంశయః॥ ౧౯

తా. వైశాఖమాసములో నాల్గవవంతు దినములలోనైనను స్నానముజేసిన యెడల పదివేల అశ్వమేధములను జేసినఫలము లభించును. సందేహము లేదు.

శ్లో॥ అథవాకూట చిత్తస్తు కుర్యాత్సంకల్పమాత్రకం।
సోఽపి క్రతుశతం పుణ్యం లభేదేవనసంశయః॥ ౨౦

తా. మఱియు స్నానముజేయుటకు శక్తిలేని యెడల స్థిరచిత్తుడై మనస్సునందు సంకల్పముజేసినట్టి మనుష్యుడను నూరుయజ్ఞములను జేసిన పుణ్యమును పొందును. సందేహము లేదు.

శ్లో॥ యోగచ్ఛేద్ధనురాయామం స్నాతుం మేషగతేరవౌ।
సర్వబంధవినిర్ముక్తో విష్ణోస్సాయుజ్యమాప్నుయాత్॥ ౨౧

తా. సూర్యుఁడు వైశాఖమాసములో మేషరాశియందుండగా నెవఁడు స్నానముజేయుటకొఱకు నొకధనువు ప్రమాణముకలిగినంతదూరము నేగుచెంచునో, వాఁడు సమస్తబంధములవలనను విడువబడి విష్ణుమూర్తియం దైక్యము నొందును.

శ్లో॥ త్రైలోక్యేయాని తీర్థానిబ్రహ్మాండాంతర్గతానిచ।
తానిసర్వాణిరాజేన్ద్రసన్తిబాహ్యే ఽల్పకేజలే॥ ౨౨

తా. ఓయంబరీష మహారాజా! స్వర్గమర్త్య పాతాళలోకములయందేయే తీరములుగలవో మఱియు బ్రహ్మాండమందెక్కడనైన నేయేతీర్థములుగలవో అవియన్నియు వెలుపలనుండు జలములయందాసన్నమై యుండును. అనగా తటాకము కాలువ మొదలగువాని యందుండు జలములయందాసన్నమై యుండును.

శ్లో॥ తావల్లిఖితపాపాని గర్జంతియమశాసనాత్।
యావన్నకురుతేజంతుర్వైశాఖస్నానమంభసి॥ ౨౩

తా. మనుష్యుడు వైశాఖమాసములో నెంతపర్యంతము చెఱువులు మొదలగు వానియందుండు నీటిలో స్నానముజేయడో అంతపర్యంతము యముని యాజ్ఞప్రకారము వానియొక్క పాపములు మొఱబెట్టుచుండును.

శ్లో॥ తీర్థాధి దేవతాస్సర్వా వైశాఖేమాసిభూమిప।
బహిర్జలంస మాశ్రిత్యసదాసన్నిహితాన్నృప॥ ౨౪

తా. ఓరాజా! తీర్థములకు నధిదేవతలగు దేవతలందరు వైశాఖమాసమునందు తటాకాదులలోనుండు జలముల నాశ్రయించి యెల్లప్పుడు సన్నిహితులై యుందురు.

శ్లో॥ సూర్యోదయం సమారభ్యయావత్షడ్ఘటి కావధి।
తిష్ఠంతిచాజ్ఞయా విష్ణోర్నరాణాంహిత కామ్యయా॥ ౨౫

తా. సూర్యోదయము మొదలారుఘడియల పర్యంతము మనుష్యులయొక్క మేలుకొఱకు విష్ణుమూర్తి యొక్కయాజ్ఞప్రకారముగా దేవతలందరు బాహ్యమందుండు జలముల నాశ్రయించి యుందురు.

శ్లో॥ తావన్నాగచ్ఛతాంపుంసాంశాపందత్వాసుదారుణం।
స్వస్థానంయాంతి రాజేన్ద్రతస్మాత్స్నానం సమాచరేత్॥ ౨౬

తా. ఓరాజా! వైశాఖమాసములో నారుఘడియల పర్యంతము నెవఁడు స్నా

ము జేయుటకు రాకపోవునో వానికి తీర్థాధిదేవతలు శాపంబిచ్చి స్వస్థానములకు వెళ్ళుదురు. కాబట్టి వైశాఖమాసములో ప్రాతఃకాలమందు ముఖ్యముగా స్నానముజే యవలయును.

ఇతిశ్రీస్కాందపురాణే వైశాఖమాహాత్మ్యేనారదాంబరీషసంవాదోనామ ప్రథమోధ్యాయః॥

తా. ఈప్రకారముగా స్కాంద పురాణమునందు జెప్పబడిన వైశాఖమహాత్మ్యను గురించి నారదాంబరీషులకు జరిగిన ప్రశ్నోత్తరరూపమైన మొదటియధ్యాయము ము సంపూర్తినొందెను.

---

## అథ ద్వితీయోధ్యాయః

### నారదః.

శ్లో॥ నమాధవసమోమాసోనకృతేనసమంయుగం।
నచవేదసమంశాస్త్రంనతీర్థంగంగయాసమం॥

తా. నారదుడు చెప్పుచున్నాడు. వైశాఖమాసముతో సమానమైన మాసము కృతయుగముతో సమానమైన యుగము వేదముతో సమానమైన శాస్త్రము గంగతో సమానమైన తీర్థవిశేషము లేదు.

శ్లో॥ నజలేనసమం దానం నసుఖంభార్యయాసమం।
నకృషేస్తు సమం విత్తం నలాభో జీవితాత్పరః॥ ౨

తా. జలదానముతో సమానమైన దానము భార్యవలన గలుగుసుఖముతో సమానమైన సుఖము వ్యవసాయమువలన గలిగెడు ధనముతో సమానమైన ధనము జీవించుట కంటె నితరమైన లాభము లేదు.

శ్లో॥ నతపో ఽనశనాత్తుల్యం నదానాత్పరమం సుఖం।
నధర్మస్తు దయాతుల్యో నజ్యోతి శ్చక్షుషాసమం॥ 3

తా. ఉపవాసముతో సమానమైన తపస్సు దానముకంటె నితరమగు సుఖము దయతో సమానమైన ధర్మము నేత్రములతో సమానమైన కాంతియు లేదు.

శ్లో॥ నతృప్తి రశనాత్తుల్యా నవాణిజ్యం కృషేస్సమం।
నధర్మేణ సమం మిత్రం న సత్యేన సమంయశః॥ ౪

తా. భోజనతృప్తితో సమానమైన తృప్తియు వ్యవసాయముతో సమానమైన

వర్తకము ధర్మముతో సమానమైన స్నేహితుఁడు సత్యముతో సమానమైన కీర్తియు మ తియొకటి లేను.

శ్లో॥ నారోగ్యసమ ముత్థానం నతాౢతా కేశవాత్పరః।
నమాధవసమం లోకే పవిత్రం కవయో విదుః॥ ౫

తా. ఆరోగ్యముతో సమానమైన శరీరస్థితియు విష్ణుమూర్తి తోసమానమైన మతియొక రక్షకుఁడు వైశాఖమాసముతో సమానము పవిత్రకరమైన మతియొకమాస ము లేదని కవీశ్వరులు చెప్పిరి.

శ్లో॥ మాధవః పరమో మాసో శేషశాయిప్రియ స్సదా।
అవ్రతేన క్షిపేద్యస్తు మాసం మాధవవల్లభం॥
తిర్యగ్యోనిం స యాత్యాశు సర్వధర్మ బహిష్కృతః॥ ౬

తా. ఈ వైశాఖమాసము యెల్లప్పుడు విష్ణుమూర్తికి ప్రియకరమైనది. కాబట్టి విష్ణుప్రీతికరమైన వైశాఖమాసమును వ్రతశూన్యముగా నెవఁడు వెళ్ళబుచ్చునో అట్టి పురుషుఁడు సమస్త ధర్మములనుండి బహిష్కారము జేయబడినవాడై తిర్యగ్యోనిగా పశు జన్మంబెత్తును.

శ్లో॥ అవ్రతేనగతో యేషాం మాధవో మర్త్యధర్మిణాం।
ఇష్టాపూర్తౌ వృధా తేషాం ధర్మో ధర్మభృతాంవర॥ ౭

తా. ధర్మముజేయువారలలో శ్రేష్ఠుండవగు నోయంబరీషా! మనుష్యజన్మంబె త్తినయేనరులు వైశాఖమాసమును వ్రతశూన్యముగా గడుపుచున్నారో అట్టివారు చేసిన యజ్ఞాదిధర్మములు వ్యర్థమగును.

శ్లో॥ ప్రవృత్తానాం తు భక్ష్యాణాం మాధవే నియమేకృతే।
అవశ్యం విష్ణుసాయుజ్యం ప్రాప్నోత్యేవ నసంశయః॥ ౮

తా. వైశాఖమాస వ్రతమునుజేయుచున్నప్పుడు భుజించిన ఫలములు మొదలగు వానికిగూడ ముఖ్యముగా విష్ణుసాయుజ్యము సంభవించును. సందేహములేదు.

శ్లో॥ సంతీహ బహువిత్తాని వృత్తానివివిధానిచ।
దేహాయాసకరాణ్యేవ పునర్జన్మ ప్రదానిచ।
వైశాఖస్నానమాత్రేణనపున ర్జాయతే భువి॥ ౧౦

తా. ఈలోకములో ననేకధనంబు లనేక చరిత్రములు కలవు గాని యాడయున్ని

రయు మరల జన్మమును కలుగజేసి శరీరమునకు కష్టము నొసంగునవియైయున్నవి. కాబట్టి వైశాఖ మాసములో ప్రాతఃకాలమందు స్నానముజేసిన యెడల తిరిగి భూలోకమునందు జనింపడు.

శ్లో॥ సర్వదానేషు యత్పుణ్యం సర్వతీర్థేషు యత్ఫలం।
తత్ఫలం సమవాప్నోతి మాధవే జలదానతః॥ ౧౧

తా. సమస్త దానములయందు నేపుణ్యముకలదో గంగాది సమస్త తీర్థముల యందు నేఫలముకలదో అటువంటి ఫలము వైశాఖ మాసములో జలదానము జేసినయెడల లభించును.

శ్లో॥ జలదానాసమర్థేన పరశ్యాపి ప్రబోధనమ్
కర్తవ్యం భూతికామేన సర్వదానాధికం హి తత్॥ ౧౨

తా. పుణ్యమునే యైశ్వర్యము పొంద నిశ్చయించినవాడై తాను జలదానముజే యుటకు సమర్థుడు కానియెడల అట్టి సమర్థుండగు వానినెవ్వనినైనను ప్రోత్సాహపఱచి చేయుంచవలయును. ఏలనగా జలదానము అన్నిదానములలో శ్రేష్ఠంబై యున్నది.

శ్లో॥ ఏకత స్సర్వదానాని జలదానం హి చైకతః।
తులా మారోపితం పూర్వం జలదానం విశిష్యతే॥ ౧౩

తా. పూర్వమందు త్రాసులోనొక ప్రక్కను జలదానమును మఱియొకప్రక్క ను ఇతరమైన సమస్తదానములనుంచి తూచగా జలదానముమే మొగ్గుగా నుండెను.

శ్లో॥ మార్గేఽధ్వగానాం యోమర్త్యః ప్రపాదానం కరోతి హి
స, కోటికుల ముద్ధృత్య విష్ణులోకే మహీయతే॥ ౧౪

తా. అనేక బాటసారులు నడుచుచుండెడి మార్గమధ్యమునందు చలివేంద్రినే ర్పరచి వైశాఖమాసములో నెవడు జలమునిచ్చుచున్నాడో అట్టి సత్పురుషుండు తన వంశమునందు జనియించిన కోటితరములవారెట్టి హీనలోకములయందున్నను తీసికొని విష్ణులోకమున కరుగుదురు.

శ్లో॥ దేవానాం చ పితౄణాం చ ఋషీణాం రాజసత్తమ।
అత్యంతప్రీతిదం సత్యం ప్రపాదానం న సంశయః॥ ౧౫

తా. ఓ రాజశ్రేష్ఠుడా! చలివేంద్రినేర్పరచి జలదానముచేయుట దేవతలకు పితృదేవతలకు మునీశ్వరులకు మిక్కిలి సంతోషకరమైయున్నది. సత్యము. సందేహ మేదా-

శ్లో॥ ప్రపాదానేన సంతుష్టా యేనాధ్వశ్రమకర్శితాః।
తోషితా స్తేన దేవా శ్చ బ్రహ్మవిష్ణుశివాదయః॥ ౧౩

తా. మార్గాయాసము జెంది వచ్చినవారిని జలదానముచే తృప్తి నొందించినయెడల బ్రహ్మవిష్ణువు శివుడు మొదలగు సమస్తదేవతలు తృప్తినొందినవారగుదురు.

శ్లో॥ సలిలం సలిలాకాంక్షీ ఛాయాం ఛాయా మపీచ్ఛతి।
వ్యజనం వ్యజనాకాంక్షీ వైశాఖే మాసి భూమిప।
జలం ఛత్రం చ వ్యజనం దానం యేషాం విశిష్యతే॥ ౧౪

తా. ఓరాజా! జలమునందభిలాషగలవాడు జలమును కోరును. నీడయందభిలాషగలవాడు నీడను గోరును. విసనకఱ్ఱయందభిలాషగలవాడు విసనకఱ్ఱ గోరును. కాబట్టి వైశాఖమాసములో జలము గొడుగు విసనకఱ్ఱ మొదలగువానిలో నెవడు దేనినికోరితే దానినియ్యవలయును.

శ్లో॥ మాధవే మాసి సంప్రాప్తే బ్రాహ్మణాయ కుటుంబినే।
అదత్వో దకకుంభం చ చాతకో భువి జాయతే॥ ౧౫

తా. వైశాఖమాసము వచ్చినదగుచుండగా కుటుంబియగు బ్రాహ్మణునకు నెవడు జలముతో నిండింపబడిన కలశమును దానముచేయడో అట్టివాడు భూమియందు చాతకపక్షిగా జనియించును.

శ్లో॥ యో దద్యా చ్ఛీతలం తోయం తృషార్తాయ మహాత్మనే।
తావన్మాత్రేణ రాజేంద్ర రాజసూయాయుతం లభేత్॥ ౧౬

తా. ఎవడు దప్పికగొనిన మహానుభావునకు చల్లని జలము నిచ్చుచున్నాడో ఓరాజశ్రేష్ఠుడా! అట్టి మనుష్యుడంతమాత్రముననే యుతక రాజసూయయాగములను చేసి నంతఫలమును పొందును.

శ్లో॥ ఘర్మశ్రమార్తవిప్రాయ వీజయే ద్వ్యజనేన యః।
తావన్మాత్రేణ నిష్పాపో విహంగాధిపతి ర్భవేత్॥ ౧౭

తా. ఎవడు గ్రీష్మముచే తపింపబడి యలసిన బ్రాహ్మణునకు విసనకఱ్ఱచే విసునోవాడు అంతమాత్రముననే పాపహీనుండై గరుత్మంతునిస్వరూపమును ధరించి త్రిలోకసంచారియగును.

శ్లో॥ అదత్వా వ్యజనం భూప వైశాఖే తు ద్విజాతయే।
వాతరోగశతాకీర్ణో నరకానేవ విందతి॥ ౨౧

తా. ఓరాజా వైశాఖమాసమునందు బ్రాహ్మణునకు విసనకఱ్ఱ నివ్వనియెడల న
నేక వాయురోగములచే పీడింపబడినవాడై నరకములనే పొందుచుండును.

శ్లో॥ యో వీజయే త్పఠేనాపి పథి శ్రాంతం ద్విజోత్తమం।
తావతా భువి ముక్తోఽసౌ విష్ణుసాయుజ్య మాప్నుయాత్॥

తా. మార్గాయాసముచే నలసియున్న బ్రాహ్మణోత్తమునకు వస్త్రముచేనైనను
విసరునో అంతమాత్రముననే వాడు భూమియందు సమస్తపాపములవలన విడువ
బడినవాడై విష్ణుమూర్తియందైక్యము నొందువాడగును.

శ్లో॥ య స్తాలవ్యజనం వాపి దత్వా శుద్ధేన చేతసా।
విధూయ సర్వపాపాని బ్రహ్మలోకం స గచ్ఛతి॥ ౨౩

తా. ఎవడు పరిశుద్ధాంతఃకరణముగలవాడై తాటియాకులచే నిర్మింపబడిన విసన
కఱ్ఱనైన నిచ్చుచున్నాడో వాడు సమస్త పాపములను పోగొట్టుకొని బ్రహ్మలోకము
నుపొందుచున్నాడు.

శ్లో॥ సర్వ శ్శ్రమహరం పుణ్యం న దద్యా ద్వ్యజనం నరః।
నారకీం యాతనాం భుక్త్వా కశ్మలో జాయతే భువి॥

తా. ఇచ్చిన తక్షణమునందే ఆయాసమును పోగొట్టునటువంటిదియు పుణ్యకర
మైనదియు నగు విసనకఱ్ఱను ఏమనుష్యుండీయడో అటువంటివాడు నారకమనుపొప
మనుభవించి భూలోకములో కలుషముగలవాడై జనియించును

శ్లో॥ ఆధ్యాత్మికాదిదుఃఖానాం శాంతయే మనుజేశ్వర।
ఛత్రం దద్యా త్ప్రియత్నేన వైశాఖే మాసివాసకృత్॥

తా. ఓరాజశ్రేష్ఠుడా! ఆధ్యాత్మిక ఆధిదైవిక ఆధిభౌతికములనెడు దుఃఖముల
నివృత్తికొఱకు వైశాఖ మాసములో సమస్త విధములను గొడుగును దానమియ్యవ
లయును.

శ్లో॥ అఛత్రదో నరో యస్తు వైశాఖే మాధవప్రియే।
ఛాయాహీనో మహాక్రూరపిశాచో భువి జాయతే॥ ౨౬

తా. విష్ణుమూర్తికి ప్రీతికరమైన వైశాఖ మాసమునందు గొడుగు దానముచే
యనివాడు నీడలేనివాడై క్రూరమగు గొప్పపిశాచమై భూమియందు బుట్టును.

శ్లో॥ యో దద్యాత్పాదుకే దివ్యే మాధవే మాధవప్రియే।
యమదూతాన్నిరాకృత్య విష్ణులోకం స గచ్ఛతి ౨౭

తా. విష్ణుమూర్తికి ప్రీతికరమైనవైశాఖమాసమునందు చెప్పులదానమెవఁడు జేయునో ఆట్టి పుణ్యాత్ముఁడు యమభటులను తిరస్కరించి విష్ణులోకమునకు వెళ్లును.

శ్లో॥ పాదత్రాణం తు యో దద్యాద్వైశాఖే మాధవేశ్వరే।
న తస్య నారకో లోకో న క్లేశా ఐహికాశ్చ యే॥ ౨౮

తా. విష్ణుమూర్తికి ప్రియకరమైన వైశాఖమాసములో నెవడు చెప్పులదానమిచ్చునో, ఆట్టివానికి నిహలోకమునందు కష్టములుగాని పరలోకమునందు నరకముపొందుటగాని సంభవింపవు.

శ్లో॥ పాదుకే యాచమానాయ యో దద్యాద్బ్రాహ్మణాయ చ।
స భూపాలో భవేద్భూమౌ కోటిజన్మస్వసంశయః ౨౯

తా. పాదుకలను కావలయునని కోరినట్టి బ్రాహ్మణునకు నెవడుపాదుకలనిచ్చునో, ఆట్టివాడుకోటిజన్మముల పర్యంతము భూమియందు రాజుగాబుట్టుచుండును సందేహములేదు.

శ్లో॥ అనాధమంటపం మార్గే శ్రమహారి కరోతి యః।
తస్య పుణ్యఫలం వక్తుం బ్రహ్మణాపి న శక్యతే॥ ౩౦

తా. దిక్కులేనివారికి నాయాసమును పోగొట్టుకొనతగినట్టి మంటపమును దారిలో నెవడు కట్టించునో ఆట్టివాని ఫలమును చెప్పుటకు బ్రహ్మదేవుండైనను సమర్థుడుకాడు.

శ్లో॥ మధ్యాహ్నే బ్రాహ్మణం ప్రాప్త మతిథిం భోజయేద్యది।
న తస్య ఫలవిశ్రాంతి బ్రహ్మణాపి నిరూపితా॥ ౩౧

తా. మధ్యాహ్నకాలమందు వచ్చినట్టి యతిథియగు బ్రాహ్మణునకు నెవఁడుభోజనంబిడునో ఆట్టివాని ఫలమునకంతము బ్రహ్మదేవుఁడైనను నిరూపించలేడు.

శ్లో॥ సద్యస్త్వాప్యాయనం నృణామన్నదానం నరాధిప।
తస్మాన్నాన్నేన సదృశం దానం లోకేషు విద్యతే॥ ౩౨

తా. ఓరాజా! అన్నదానము తత్క్షణమునందే మనుష్యులకుతృప్తినిఁజేయును. కాఁబట్టి మూఁడు లోకములయందు నన్నముతో సమానమైన దానము లేదు.

శ్లో॥ మార్గశ్రాంతాయ విప్రాయ ప్రశ్నదం ప్రదదాతి యః।
తస్య పుణ్యఫలం వక్తుం బ్రహ్మణాపి న శక్యతే॥ 33

తా. మార్గమునందలసివచ్చినట్టి బ్రాహ్మణునకు కుశలప్రశ్నజేసి మర్యాదపూర్వకముగా సన్మానించినట్లాయెనా అట్టివానిపుణ్యఫలమును జెప్పుటకు బ్రహ్మదేవుఁడైనను సమర్థుఁడుకాఁడు.

శ్లో॥ దారాపత్యగృహాదీని వాసోఽలంకారభూషణాం।
అసహ్యాం నాశ్నతః పుంసస్సహ్యాం భుక్తవతో ధ్రువం॥ 34

తా. భార్య, సంతానము, గృహము, వస్త్రము, అలంకారములు, ఆభరణములు యివి యెందఱికున్ననూ శ్రీమకు నాస్పదమైననైనను భోజనము చేయక నాకలిచే బాధింపబడునట్టివానికి నసహ్యమైనవిగా దోచును. భుజించినవానికైతే యిష్టములుగా దోచును. నిశ్చయము.

శ్లో॥ తస్మాదన్నసమం దానం న భూతం న భవిష్యతి॥ 35

తా. కాబట్టి యన్నదానముతో సమమగుదానమిదివరలో గలుగలేదు. ముందు కలుగబోదు.

శ్లో॥ వైశాఖే యేన నాదత్తం మార్గశ్రాంతే చ భూసురే।
స పిశాచో భవేద్భూమౌ స్వమాంసాన్యేవ ఖాదతి।
యస్మాద్విభూత్యా దాతవ్యం తస్మాదన్నం ద్విజాతయే॥ 36

తా. వైశాఖమాసములో మార్గాయాసముచే నలసివచ్చిన బ్రాహ్మణునకెవఁ డన్నము నొసంగడో వాఁడు భూలోకములో పిశాచమైపుట్టి తనమాంసమును తానే భక్షించును. కాబట్టి తనశక్త్యనుసారముగా బ్రాహ్మణులకు నన్నదానము జేయవలయును.

శ్లో॥ అన్నదో మాతృపిత్రాదీన్ విస్మారయతి భూమిప।
తస్మాదన్నం ప్రశంసంతి లోకాస్త్రైలోక్యవర్తినః॥ 37

తా. ఓ రాజా! అన్నము పెట్టినవాఁడు తల్లిదండ్రులనైనను మరపించును. అనగా భుజించిన సౌఖ్యము నేమరచిపోవుదురు. అట్టివిశేషసౌఖ్యమునిచ్చునట్టిది కాబట్టి మూఁడులోకములయందుండునట్టి మనుష్యులు అన్నదానము నధికమైనదానముగా కొనియాడుచుందురు.

శ్లో॥ మాతరః పితర శ్చాపి కేవలం జన్మహేతవః ।
అన్నదం పితరం లోకే వదంతి చ మనీషిణః॥ 37

తా. లోకములో కేవలము పుట్టుకకు కారణమైన తల్లిదండ్రులు సామాన్యులని యు నన్నంబిడి పోషించినట్టి వానినే యధికమైన తండ్రియనియు విద్వాంసులు చెప్పిరి.

శ్లో॥ అన్నదే సర్వతీర్థాని అన్నదే సర్వదేవతాః ।
అన్నదే సర్వధర్మాశ్చ తిష్ఠం త్యరిధరాజయ॥ 38

తా. శతృవులనుజయించునట్టి యోయంబరీషా! అన్నదానము చేయువానియం దు సమస్తతీర్థములు సమస్తదేవతలు సమస్తధర్మములు నివసించుచున్నవి.

ఇతి శ్రీస్కాందపురాణే వైశాఖమాహాత్మ్యే నారదాంబరీష
సంవాదే దానని రూపణం నామ ద్వితీయోధ్యాయః॥

తా. ఈప్రకారముగా స్కాందపురాణమునందు చెప్పబడిన వైశాఖమహాత్మ్యను గురించిజరిగిన నారదాంబరీషసంభాషణములో దాననిరూపణస్వరూపమగుద్వితీయాధ్యాయము ముగిసెను.

---

## అథతృతీయోఽధ్యాయః

### నారదఉవాచ.

శ్లో॥ యో మర్త్యో ద్విజవర్యాయ పర్యంకం తు శ్రమాపహం ।
యత్ర స్వపన్సుఖం శేతే శీతానిల నిషేవితః॥

తా. నారదుడు చెప్పుచున్నాడు. చల్లగాలివీచుచుండగా నెటువంటిశయ్యయం దు పరుండి సుఖముగా నిద్రించునో ఆయాసమును పోగొట్టునటువంటి ఆట్టిశయ్యను బ్రాహ్మణునకు దానమిచ్చినయెడల స్వర్గలోకములోనుండి సౌఖ్యమనుభవించును.

శ్లో॥ ధర్మసాధనభూతోహి దేహో నిరుజ మానసః ।
తం దత్వా సకలం తాపం నిరస్య గతకల్మషః ।
అఖండపదవీం యాతి యోగినా మపి దుర్లభాం॥ 2

తా. 'శరీరమాద్యంఖలు ధర్మసాధనం' అనియున్నది కాబట్టి సమస్తధర్మములను చేయుటకు శరీరమే ముఖ్యసాధనమైయున్నది. ఆట్టిశరీరము నారోగ్యముగా నుంచుకొనవలయును. ఆరోగ్యమునకు మృదుశయ్యాదులేకారణములు కాబట్టి ఆ

టుకంటిశయ్యను నిర్మలమనస్సుకలవాఁడై యెవఁడిచ్చునో యట్టివాఁడు తాపత్రయమును పోఁగొట్టుకొని యోగీశ్వరులకైనను పొందరానిదియు నాశనరహితమైనదియునగు వైకుంఠపదమును పొందుచున్నాఁడు.

శ్లో॥ వైశాఖే ఘర్మతప్తానాం శ్రాంతానాం తు ద్విజన్మనాం ।
దత్వా శ్రమాపహాం దివ్యం పర్యంకం మనుజేశ్వర ।
న జాతు సీదతే లోకే జన్మమృత్యుజరాదిభిః॥ ౪

తా. వైశాఖమాసములో నెండచే తపింపబడి యలసియున్న బ్రాహ్మణులకు ఆయాసమును పోఁగొట్టునట్టిదియు శ్రేష్ఠమైన శయ్యాదానము చేసినయెడల ఓరాజా! అట్టివాఁడు జన్మమృత్యువు ముదిమి మొదలగువానిని విడిచి వైకుంఠమును జెందును.

శ్లో॥ గృహీత్వా బ్రాహ్మణో యత్ర శేతే చాజీవమాస్థితః ।
ఆసీనే సకలం పాపం జ్ఞానతోఽజ్ఞానతః కృతం ।
విలయం యాతి రాజేంద్ర! కర్పూరఇవ చాగ్నినా॥ ౫

తా. బ్రాహ్మణుఁడు శయ్యనుగ్రహించి యెల్లకాలము సుఖించును కాబట్టి ఓరాజశ్రేష్ఠుఁడా! దానియందుకూర్చున్నను దానమిచ్చినవానిచే తెలిసియు తెలియకయు చేయఁబడిన మహాపాపములు అగ్నిహోత్రముచే హారతికర్పూరమువలెనే నాశనము పొందును.

శ్లో॥ శయనే బ్రహ్మనిర్వాణం స నరో యాతి నిశ్చితం॥ ౬

తా. దానియందు పరుండినయెడల దానిమిచ్చినపురుషుఁడు యెన్నటికిని నాశనములేని బ్రహ్మానందమును పొందుచుండును. నిశ్చయము.

శ్లో॥ యో దద్యా త్త్రిశిపుం మాసే వైశాఖే స్నానవల్లభే ।
సర్వభోగసమాయుక్త స్తస్మిన్నేవ హి జన్మని ।
నాన్వయో వర్తతే నూనం రోగాదిభి రనాహతః ।
ఆయుష్యం పరమారోగ్యం యశో ధైర్యం చ విందతి॥ ౭

తా. ప్రాతఃకాల స్నానముచే పుణ్యఫలము నొసగునట్టి వైశాఖమాసములో నెవఁడు పరుపునిచ్చుచున్నాఁడో అట్టివాఁడును అతనివంశమువారును రోగములు మొదలగు బాధలనుజెందక ఈలోకమునందే సమస్త సౌఖ్యములను జెంది దీర్ఘాయుష్మంతుఁడై శ్రేష్ఠమగు నారోగ్యము కీర్తి ధైర్యము మొదలగువానిని పొందును.

శ్లో॥ నాధార్మికః కులే తస్య జాయతే శతపౌరుషం ।
భుక్త్వా తు సకలాన్భోగాం స్తతః పంచత్వమాగతః॥

తా. వానియొక్క వంశములో నూరుపురుషాంతరములవరకు ధర్మశూన్యుడు పుట్టబోడు. పుట్టినవాడు సమస్తభోగముల ననుభవించి మరణించినపిమ్మట స్వర్గమునుపొందువాడగును.

శ్లో॥ నిర్ధూతాఖిలపాప స్తు బ్రహ్మనిర్వాణ మృచ్ఛతి ।
శ్రోత్రియాయ ద్విజేంద్రాయ యో దద్యా దుపబర్హణం॥

తా. శ్రోత్రియుడగు బ్రాహ్మణునకు నెవడు తలగడదిండు నిచ్చుచున్నాడో వాడు సమస్తపాపములను పోగొట్టుకొని బ్రహ్మానందము ననుభవించును.

శ్లో॥ సుఖం నిద్రాం వినా యేన న నృణాం జాయతే క్వచిత్ ।
సర్వేషా మాశ్రయో భూత్వా భువి సామ్రాజ్య మశ్నుతే॥

తా. మనుష్యులకు నిద్రలేక సుఖముకలుగదు కాబట్టి అట్టిశయ్యనిచ్చుటచే సమస్తజీవులకు నాధారభూతుడై భూమియందఖండ సామ్రాజ్యము ననుభవించును.

శ్లో॥ పున స్సుఖీ పున ర్భోగీ పున ర్ధర్మపరాయణః ।
ఆసప్తజన్మ రాజేంద్ర జాయతే సర్వతో జయీ॥
పశ్చా త్సప్తకులై స్సార్ధం బ్రహ్మభూయాయ కల్పతే॥ ౧౨

తా. ఓ రాజశ్రేష్ఠుడా! శయ్యాదాత మాటిమాటికి సుఖముగలవాడగుచును భోగముగలవాడగుచును ధర్మమునందాసక్తిగలవాడగుచు నేడుజన్మములపర్యంతము సమస్తదిక్కులయందు దిగ్విజయము గలవాడగుచునుండి బ్రహ్మాంతంబున యేడుతరములవారితో గూడి బ్రహ్మలోకమునందు నివసించును.

శ్లో॥ తాళం కటం తు యో దద్యా త్కటమన్య దథాపి వా ।
తత్ర శేతే స్వయం విష్ణుః ప్రీతస్థః పరమేశ్వరః॥ ౧౩

తా. ఎవడు తాటియాకులచే నిర్మింపబడిన చాపనిచ్చునో లేక మఱియేచాపనైన నిచ్చునో అట్టిచాపయందు భగవంతుడగు విష్ణుమూర్తి స్వతహాగావచ్చి శయనించును. కాబట్టి అట్టిచాపనిచ్చుటచే విశేషమైన పుణ్యమునుపొందును.

శ్లో॥ యథా జలగతా చోర్ణా నజలైర్బధ్యతే క్వచిత్।
తథా సంసరతో జంతు స్సంసారే న చ బధ్యతే॥
ఆసనే శయనేఽశక్తః కటద స్సర్వతస్సుఖీ॥ ౧౫

తా. ఏప్రకారముగా నూలుపోగు జలములయందుపడినను బంధింపకుండునో ఆప్రకారముగా శయ్యాదానముచేసినవాడు సంసారములోనున్నను సంసారముచే చిక్కుబడడు. అశక్తి శయ్యనుగాని ఆసనమునుగాని యిచ్చుటకు సమర్థుడు కానియెడల చాపను దానమిచ్చినను సర్వకాలములయందును సుఖముకలవాడగుచుండును.

శ్లో॥ శ్రోత్రియే శయనార్థాయ యో దద్యాత్కటకం బలం।
తావన్మాత్రేణ ముక్త స్స్యాన్నాత్ర కార్యా విచారణా॥ ౧౬

తా. ఎవడైనను శయ్యకొఱకు యాచింపగా దృఢమగు చాపనైన నిచ్చునో వాడు ఆంతమాత్రముననే ముక్తిని పొందును. ఇందువిషయమై విచారింపకూడదు.

శ్లో॥ నిద్రయా హీయతే దుఃఖం నిద్రయా హీయతే శ్రమః।
సా నిద్రా కటసంస్థస్య సుఖం సంజాయతే ధ్రువం॥ ౧౭

తా. నిద్రయే దుఃఖమునుపోగొట్టును. నిద్రయే యలసటనుపోగొట్టును. కాబట్టి అట్టి నిద్ర చాపయందు పరుండినవానికి సుఖమును కలిగించును. నిశ్చయము.

శ్లో॥ యో దద్యాత్కంబలం రాజన్! వైశాఖే మాధవాగమే।
అపమృత్యోః కాలమృత్యోర్ముక్తో జీవతి వైశతం॥ ౧౮

తా. ఓ రాజా! వైశాఖమాసము రాగానే యెవడు కంబళిదానము జేయునో వాడు అపమృత్యువలనను కాలమృత్యువువలనను విడువబడి నూరుసంవత్సరముల పర్యంతము జీవించును.

శ్లో॥ దద్యాద్వస్త్రం సూక్ష్మతరం ద్విజేంద్రే ఘర్మకర్శితే।
స పూర్ణమాయు స్సమాప్నోతి పరత్ర చ పరాంగతిమ్॥ ౧౯

తా. ఎవడు యెండచే తపింపబడిన బ్రాహ్మణోత్తమునకు పలచనైనవస్త్రమును దానమిచ్చుచున్నాడో వాడు సంపూర్ణాయుష్యమును జన్మాంతంబున నుత్తమలోకమును పొందును.

శ్లో॥ అంతస్తాపహరం దివ్యం కర్పూరం తు ద్విజాతయే।
దత్వా మోక్ష మవాప్నోతి దుఃఖశాంతిం చ విందతి॥ ౨౦

తా. లోపలనుండు వేడిని పోగొట్టునదియు శ్రేష్ఠమైనదియునగు హారతికర్పూరము నిచ్చినవాడు సర్వదుఃఖములను పోగొట్టుకొని మోక్షమును పొందును.

శ్లో॥ కుసుమాని చ యో దద్యా త్కుంకుమం చ ద్విజాతయే।
సార్వభౌమో భవే ద్రాజా సర్వలోకవశంకరః॥
పుత్రపౌత్రాదిభోగాం శ్చ భుక్త్వా మోక్ష మవాప్నుయాత్ ॥ ౨౧

తా. ఎవడు పుష్పములనుగాని కుంకుమగాని బ్రాహ్మణునకు నిచ్చుచున్నాడో అట్టివాడు చతుస్సముద్రపర్యంతంబగు భూమి నేలువట్టి ప్రభువగుచు లోకమునంతయు తాను స్వాధీనము చేసికొనినవాడగు. పుత్రులు పౌత్రులు మొదలగుభోగములననుభవించి మోక్షమును పొందును.

శ్లో॥ త్వగస్థిగతసంతాపం సద్యో హరతి చందనం।
తాపత్రియవినిర్ముక్త స్తద్దత్వా మోక్ష మాప్నుయాత్॥ ౨౨

తా. మంచిగంధము శరీరమందుగాని యెముకలయందుగాని యుండునట్టి తాపమును పూసికొనినతక్షణము నందే హరించును కాబట్టి చందనమునిచ్చువాడు తాపత్రయములవలన విడువబడి మోక్షమును పొందును.

శ్లో॥ ఔశీరం చంపకం కౌశం యో దద్యా జ్జలవాసితం।
సర్వభోగేషు రాజేంద్ర స తు దేవసహాయవాన్॥
పాపహానిం దుఃఖహానిం ప్రాప్య నిర్వృతి మాప్నుయాత్॥ ౨౪

తా. ఓరాజా! ఎండచే తపింపబడినవానికి వట్టివేరు సంపంగి కుంకుమ వేళ్ళు మొదలగువానిచే మిశ్రితంబగు జలమునిచ్చి స్నానమువముజేయించునో అట్టివాడు సమస్తభోగములయందు దేవతలసహాయమును పొందుచు పాపము దుఃఖమును పోగొట్టుకొని మోక్షసుఖమును పొందును.

శ్లో॥ గోరోచం మృగనాభిం చ దద్యా ద్వైశాఖధర్మవిత్।
తాపత్రియవినిర్ముక్తః పరం నిర్వాణ మృచ్ఛతి॥ ౨౫

తా. వైశాఖ మహాత్మ్యమును తెలిసినవాడు గోరోచనమును కస్తూరిని దానమిచ్చినట్టాయెనా తాపత్రియములను పోగొట్టుకొనినవాడై యుత్తమమగు బ్రహ్మానందసౌఖ్యమును జెందును.

శ్లో॥ తాంబూలం చ సకర్పూరం యో దద్యా న్మాధవే రవౌ।
సార్వభౌమసుఖం భుక్త్వా పరం నిర్వాణ మృచ్ఛతి॥ ౨౬

తా. సూర్యుడు మేషరాశి యందుండగా కర్పూరసహితముగా తాంబూలము నెవ్వఁడిచ్చునో అట్టివాడు జగత్తున కంతయు ప్రభువగుచు సర్వసౌఖ్యముల ననుభవించి యుత్తమమగు బ్రహ్మపదమును పొందును.

శ్లో॥ శాతపత్రీం చ యూథీం చ మేషమాసే దదన్నరః।
స సార్వభౌమో భవతి పశ్చా న్మోక్షం చ విందతి॥ ౨౭

తా. మేష సంక్రమణమునందు పద్మముల దండను గాని యడవిమల్లె పువ్వుల దండను గాని యిచ్చినట్టి పురుషుండు చతుస్సముద్ర పర్యంతము భూమి నేలువాడై జన్మాంతరమున మోక్షమును పొందును.

శ్లో॥ కేతకీం మల్లికాం వా పి యో దద్యా న్మాధవాగమే।
స తు మోక్ష మవాప్నోతి మధుశాసనశాసనాత్॥ ౨౮

తా. వైశాఖ మాసము ప్రవేశించగానే యెవడు మొగలి పువ్వుల దండను గాని మల్లిపువ్వుల దండను గాని యిచ్చుచున్నాడో యట్టివాడు విష్ణుమూర్తియొక్క యాజ్ఞప్రకారముగా మోక్షమును పొందును.

శ్లో॥ పూగీఫలం తు యో దద్యా త్సుగంధం తు ద్విజాతయే।
నారికేళఫలం రాజ న్తస్య పుణ్యఫలం శృణు॥ ౨౯

తా. పోకచెక్కలను మంచి పరిమళద్రవ్యము నెవడు బ్రాహ్మణునకొసఁగు నిచ్చునో యో రాజా! మరియు కొబ్బరికాయలను దానమిచ్చుచున్నాడో యట్టివానికి కలుగు పుణ్యఫలమును చెప్పుచున్నాను వినుము.

శ్లో॥ సప్తజన్మ భవే ద్విప్రో ధనాఢ్యో వేదపారగః।
పశ్చా త్సప్తకులైర్యుక్తో విష్ణులోకం స గచ్ఛతి॥ ౩౦

తా. పూర్వమందు జెప్పినట్లుగా దానమిచ్చినవాడు యేడు జన్మముల పర్యంతము బ్రాహ్మణుఁడుగా బుట్టుచు వేదశాస్త్ర సంపన్నుండై జన్మానంతరమున యేడుతరముల వారితో గూడ వైకుంఠమును పొందును.

శ్లో॥ విశ్రామమంటపం యస్తు ప్రకుర్యా ద్ద్విజమందిరే।
తస్య పుణ్యఫలం వక్తుం నాహం శక్నోమి భూపతే॥ ౩౧

తా. యో రాజా! బ్రాహ్మణ గృహమునందలసట దీర్చుకొనుటకు తగిన మంటపము నెవడు కట్టించుచున్నాడో వానియొక్క పుణ్యఫలమును జెప్పుటకు నేను సమర్థుడను కాను.

శ్లో॥ సచ్ఛాయామంటపం యస్తు సికతాకీర్ణ మంజసా।
సప్రపం కారయేద్యస్తు స తు లోకాధిపో భవేత్॥ 32

తా. ఎవడు నీడతో గూడినదియు నిసుక తిన్నెలు గలదియు చలివేంద్రి గలదియు నగు మంటపమును కట్టించుచున్నాడో వాడు యీలోకమునకంతకు ప్రభువగును.

శ్లో॥ మార్గోద్యానం తటాకం వా కూపం మంటప మేవ చ।
యః కరోతి స ధర్మాత్మా తస్య పుత్రై స్తు కిం ఫలం॥ 33

తా. మార్గమునకు సమీపమునందు తోట వేయించుట, చెఱువును త్రవ్వించుట నుయ్యి కట్టించుట మంటపమును కట్టించుట మొదలగు కార్యముల నెవడు చేయుచున్నాడో యట్టి ధర్మాత్మునకు పుత్రులతో ప్రయోజనములేదు.

శ్లో॥ కూప స్తటాక ముద్యానం మంటపం చ ప్రపా తథా।
సద్ధర్మకరణం పుత్ర స్సంతానం సప్తధోచ్యతే॥ 34

తా. నుయ్యి కట్టించుట చెఱువుత్రవ్వించుట తోటవేయించుట మంటపమును కట్టించుట చలివేంద్రి నేర్పరుచుట మంచి ధర్మములను జేయుట పుత్రుడు ననునగుని వి యేడువిధములుగా సంతాన మేర్పడియున్నది.

శ్లో॥ ఏతేష్వన్యతమాభావే నోర్ధ్వం గచ్ఛంతి మానవాః॥

తా. ఈ యేడింటిలో నేదిలేకపోయినను వానికి పరలోక సుఖము కలుగదు.

శ్లో॥ సచ్ఛాస్త్రశ్రవణం తీర్థయాత్రా సజ్జనసంగతిః
జలదానం చాన్నదాన మశ్వత్థారోపణం తథా।
పుత్ర శ్చేతిచ సంతానం సప్త వేదవిదో విదుః॥ 36

తా. మంచిశాస్త్రములను వినుట పుణ్యతీర్థములకు వెళ్లుట, సత్పురుషులతో సహవాసము జేయుట, జలము నిచ్చుట, అన్నము నిచ్చుట, రావిచెట్టును ప్రతిష్ఠించుట, తనయుడు అని యేడు విధములుగా సంతాన మేర్పడి యున్నదని వేదవేత్తలగు మఱికొందరు పెద్దలు చెప్పిరి.

శ్లో॥ నాసంతతి ర్లభే ల్లోకాన్ కృత్వా ధర్మశతా న్యపి।
తస్మాత్సంతాన మన్విచ్ఛే త్సంతానే ష్వేకతో వ్రజేత్॥ 37

తా. సంతానము లేనివాడు నూరు ధర్మములను చేసినప్పటికి పుణ్యలోకములను పొందలేడు. కాబట్టి యీ యేడు సంతానములలో నొక సంతానము గలవాడైనను పుణ్యలోకములను పొందువాడగును.

శ్లో॥ పశూనాం పక్షిణాం చైవ మృగాణాం చైవ భూరుహాం।
నోర్ధ్వలోక సుఖం యాతి మనుష్యాణాం తు కా కథా ౩౭

తా. పాపపుణ్యవివేకము లేని పశువులు, పక్షులు, మృగములు, చెట్లు మొదలగునవియే ఊర్ధ్వలోక సుఖమును పొందలేవు. పుణ్యపాప విభాగములు తెలిసినమనుష్యులు సత్కర్మములను జేయనియెడల పుణ్యలోకముల నెట్లు పొందగలరు.

శ్లో॥ పూగీఫలసమాయుక్తం నాగవల్లీదళైర్యుతం।
కర్పూరాగరుసంయుక్తం దదం స్తాంబూల ముత్తమం।
శారీరై స్సకలైః పాపై ర్ముచ్యతే నాత్ర సంశయః ౩౮

తా. పోక చెక్కలు, తమలపాకులు, కర్పూరము, అగరు మొదలగు వస్తువులతో గూడిన తాంబూలము నిచ్చినవాడు శరీరసంబంధమైన సమస్త పాపముల చేతను విడిచి పెట్టబడుచున్నాడు. ఇందువిషయమై సందేహము లేదు.

శ్లో॥ తాంబూలదో యశో ధైర్యం శ్రియ మాప్నోతి నిశ్చితం। ౪౦

తా. తాంబూలము నిచ్చినవాడు కీర్తిని ధైర్యమును సంపత్తును నిశ్చయముగా పొందుచున్నాడు.

శ్లో॥ రోగీ దత్వా విరోగ స్స్యా దరోగీ మోక్ష మాప్నుయాత్॥ ౪౧

తా. రోగము గలవాడు తాంబూల దానము చేసినయెడల రోగము లేనివాడగును. రోగము లేనివాడు చేసినయెడల మోక్షమును పొందును.

శ్లో॥ వైశాఖే మాసి యో దద్యా త్తక్రం తాపవినాశనం।
విద్యావాన్ ధనవా న్భూమౌ జాయతే నాత్ర సంశయః॥ ౪౨

తా. వైశాఖ మాసమునందు తాపమును పోగొట్టునట్టి చల్లని మజ్జిగ నిచ్చినవాడు విద్యగలవాడును ధనముగలవాడునై భూమియందు పుట్టుచున్నాడు. సందేహము లేదు.

శ్లో॥ న తక్రసదృశం దానం ధర్మకాలేషు విద్యతే।
తస్మాత్తక్రం ప్రదాతవ్య మధ్వశ్రాంతద్విజాతయే॥ ౪౩

తా. ధర్మము జేయతగిన కాలములయందు మజ్జిగతో సమానమైన దానము లేదు. కాబట్టి మార్గాయాసముచే నలసియున్న బ్రాహ్మణునికొఱకు మజ్జిగ నియ్యవలయును.

శ్లో॥ జంబీరసురసోపేతం లసల్లవణమిశ్రితం।
యస్తక్రం మరుచిఘ్నం తు దత్వా మోక్ష మవాప్నుయాత్ ౪౪

తా. మజ్జిగలో నిమ్మపండ్ల రసమును ఉప్పును కలిపి దాహము పుచ్చుకొనినయె
డల నాలుకయందు రుచిలేకపోవుట యనెడి దోషమున్నయెడల కొట్టివేయును. కాబ
ట్టి యటువంటి మజ్జిగ నిచ్చినయెడల మోక్షమును పొందును.

శ్లో॥ యో దద్యా ద్దధిఖండం తు వైశాఖే ఘర్మశాంతయే।
తస్య పుణ్యఫలం వక్తుం నాహం శక్నోమి భూమిప! ౨౫

తా. వైశాఖ మాసములో యెవడు పెరుగును ఘర్మముచే తపించుచున్న
బ్రాహ్మణుని కొఱకు నిచ్చుచున్నాడో ఓరాజా! వానియొక్క పుణ్యఫలమును
చెప్పుటకు నేను సమర్థుడనుకాను.

శ్లో॥ యోదద్యా త్తండులా న్దివ్యా న్మధుసూదనవల్లభే।
స లభే త్పూర్ణ మాయుష్యం సర్వయజ్ఞఫలం లభేత్॥ ౨౬

తా. విష్ణుమూర్తికి ప్రీతికరమైన వైశాఖ మాసమునందు శ్రేష్ఠమైన బియ్యము
ను దానమిచ్చినయెడల వాడు సంపూర్ణాయుర్దాయమును పొంది సమస్త యజ్ఞములు
జేసిన ఫలమును పొందును.

శ్లో॥ యో ఘృతం తేజసో రూపం గవ్యం దద్యా ద్ద్విజాతయే।
సోశ్వమేధఫలం ప్రాప్య మోదతే విష్ణుమందిరే॥ ౨౬

తా. తేజస్స్వరూపమైన ఆవునెయ్యి బ్రాహ్మణునకు దానమిచ్చినవాడు అశ్వ
మేధము చేసిన ఫలమును పొంది జన్మాంతమున వైకుంఠమును పొందును.

శ్లో॥ ఉర్వారుగుడసంమిశ్రం వైశాఖే మేషగే రవౌ।
సర్వపాపవినిర్ముక్త శ్శ్వేతద్వీపే వసే ద్ధ్రువం॥ ౨౭

తా. సూర్యుడు మేష సంక్రమణమునందున్న వైశాఖమాసములో బెల్లముకలిపి
న దోసకాయ ఇచ్చినవాడు సమస్త పాపములను విడిచినవాడై శ్వేతద్వీపమునందు
నివసించును. నిశ్చయము.

శ్లో॥ య శ్చే క్షుఖండం సాయాహ్నే దివాతాపోపశాంతయే।
బ్రాహ్మణాయ చ యో దద్యా త్తస్య పుణ్యమనంతకం॥

తా. పగటియందు గలిగిన వేడిమిచే తపింపబడిన బ్రాహ్మణునకు తాపము పో
వుటకొఱకు సాయంకాలమందు చెఱుకుగడ నెవడిచ్చుచున్నాడో యట్టివానియొక్క
పుణ్య మమితమైనది.

శ్లో॥ వైశాఖే పానకం దత్వా సాయాహ్నే శ్రమశాంతయే।
సర్వపాపవినిర్ముక్తో విష్ణో స్సాయుజ్య మాప్నుయాత్॥

తా. వైశాఖమాసములో సాయంకాలమందాయాసమును పోగొట్టుటకొఱకు పానక మిచ్చినయెడల సమస్తపాపముల వలన విడువబడి విష్ణుమూర్తి యందైక్యము నొందువాడగును,

శ్లో॥ సఫలం పానకం మేషమాసే సాయం ద్విజాతయే।
దద్యాత్తేన పితౄణాం తు సుధాపానం న సంశయః॥ ౧

తా. మేష సంక్రమణముతో గూడిన వైశాఖ మాసమునందు బ్రాహ్మణునకు పండ్లను పానకము నిచ్చినయెడల పితృదేవత లమృతపానము జేసినట్లుగా సంతోషింతురు. సందేహములేదు.

శ్లో॥ వైశాఖే పానకం చూతసుపక్వఫలసంయుతం।
తస్య సర్వాణి పాపాని వినాశం యాంతి నిశ్చితం॥ ౨

తా. వైశాఖమాసములో చక్కగా పండిన మామిడి[illegible] లిపినట్టి పానక మిచ్చినయెడల వానియొక్క సమస్తపాపములు నశించుచున్నవి. సందేహములేదు.

శ్లో॥ యోదద్యాచ్చైత్రదర్శే తు కుంభం పూర్ణం తు పానకైః।
గయాశ్రాద్ధశతం తేన కృత మేవ న సంశయః॥ ౩

తా. చైత్ర బహుళ అమావాస్యయందు పానకముతో నిండింపబడిన కలశము నిచ్చినట్టి పురుషుండు గయలో నూరుపర్యాయములు శ్రాద్ధమును పెట్టిన ఫలమును పొందుచున్నాడు సందేహములేదు.

శ్లో॥ కస్తూరీకర్పూరోపేతం మల్లికోశీరసంయుతం।
కలశం పానకైః పూర్ణం చైత్రదర్శే తు మానవః॥
దద్యాత్పితౄన్ సముద్దిశ్య స షణ్ణవతిదో భవేత్॥ ౪

తా. కస్తూరి కర్పూరము మల్లెపుష్పములు వట్టివేళ్లు మొదలగువానితో మిశ్రితమైనట్టి పానకముచే నిండింపబడిన కలశమును చైత్ర బహుళ అమావాస్యయందు యిచ్చినట్టి పురుషుండు పితృదేవతలకొఱకు షణ్ణవతి శ్రాద్ధములను జేసినవాడగును.

ఇతి శ్రీస్కాందపురాణే వైశాఖమాహాత్మ్యే నారదాంబరీషసంవాదే దాననిరూపణం నామ తృతీయోఽధ్యాయః॥

తా. ఈ ప్రకారముగా స్కాంద పురాణము నందు చెప్పబడిన వైశాఖ మహాత్త్మ్యమును గురించి నారదాంబరీషసంవాదములో దాన నిర్ధారణ స్వరూపమైన మూడవ అధ్యాయముగిసెను.

## అథచతుర్థోఽధ్యాయః
### నారదఉవాచ॥

శ్లో॥ తైలాభ్యంగం దివాస్వాపం తథా వై కాంస్యభోజనం।
ఖట్వానిద్రాం గృహేస్నానం నిషిద్ధస్య తు భక్షణం॥
వైశాఖే వర్జయే దష్టౌ ద్విభుక్తం నక్తభోజనం॥

తా. నూనెతో తలయంటికొనుట, పగలు నిద్రించుట, కంచుపాత్రియునందు భుజించుట, మంచముమీద పరుండుట, గృహమునందేస్నానము జేయుట, నిషేధింపబడిన పదార్థమును భుజించుట, రెండుపర్యాయములు భుజించుట, పగలుమాని రాత్రియందు భుజించుట అను నీయెనిమిదింటిని వైశాఖమాసములో విడిచిపెట్టవలయును.

శ్లో॥ పద్మపత్రే తు యో భుక్త్వా వైశాఖే వ్రతసంస్థితః।
స తు పాపవినిర్ముక్తో విష్ణులోకం స గచ్ఛతి॥ 2

తా. ఎవడు వైశాఖమాస సంబంధమైన వ్రతము నాచరించుచున్నాడో వాడు తామరాకునందు భుజించినయెడల సమస్తపాపముల వలన విడువబడి వైకుంఠమును పొందును.

శ్లో॥ వైశాఖే మాసి మధ్యాహ్నే శ్రాంతానాం తు ద్విజన్మనాం।
పాదావనేజనం కుర్యా త్తద్వ్రతం సువ్రతోత్తమం॥ 3

తా. వైశాఖమాసములో మధ్యాహ్న కాలమునం దలసిన బ్రాహ్మణులకు పాద ప్రక్షాళనము చేసినయెడల దీని నన్నిమంచివ్రతములలో నుత్తమమైనదానిగా చెప్పిరి.

శ్లో॥ అధ్వశ్రాంతం ద్విజం యస్తు మధ్యాహ్నే స్వగృహాగతం।
ఉపవేశ్యా సనే రమ్యే కృత్వా పాదావనేజనం॥
ధృత్వా శిరసి తాశ్చాపో విధ్వస్తాఖిలబంధనః।
గంగాదిసర్వతీర్థేషు స్నాతో భవతి నిశ్చితం॥ 4

తా. మార్గాయాసము చేనలసి తనయింటికి వచ్చిన బ్రాహ్మణుని మంచిపీటయందుగూర్చుండబెట్టి పాదప్రక్షాళనముజేసి యాజలమును శిరస్సున ధరించినయెడలసమస్త బంధములవలన విడుపబడినవాడును గంగమొదలగు సమస్త తీర్థములయందు స్నానముజేసినవాడునగును. సందేహములేదు.

శ్లో॥ అస్నాయీ వా వ్రతహీనశ్చ వైశాఖం తు నయే ద్యది।
పాపభీం యోని మాసాద్య పశ్చా దశ్వతరీ భవేత్॥ 5

తా. వైశాఖమాసములో ప్రాతఃకాలమునందు స్నానమును జేయకయు ఆకులను భక్షింపకయు నెవడు గడుపునో వాడు గాడిదయోని యందు తిరిగి కంచర గాడిదె యందు జనియించువాడగును.

శ్లో॥ దృఢాంగో రోగహీనశ్చ తథా స్వస్థోపి మానవః।
వైశాఖే తు గృహే స్నాత్వా చాండాలీం యోని యాప్నుయాత్॥

తా. దృఢమైన శరీరముగలిగి రోగములేక ఆరోగ్యముగా నున్నట్టి మనుష్యుడు వైశాఖమాసములో చెఱువు మొదలగు వానియందు స్నానముజేయక నింటిలో బిందెల యందుండు నీటితో స్నానము జేసినవాడు చండాలుడై జనియించును.

శ్లో॥ వైశాఖే మాసి రాజేంద్ర మేషసంస్థే దివాకరే।
న కరోతి బహిస్స్నానం శ్వానయోనిశతం వ్రజేత్॥ ౮

తా. ఓ రాజశ్రేష్ఠుడా వైశాఖమాసములో సూర్యుడు మేషసంక్రమణమునందుండగా నెవడు చెఱువు మొదలగు వానియందు స్నానముజేయనివాడు నూరుజన్మంబుల పర్యంతము కుక్కగాబుట్టుచుండును.

శ్లో॥ అస్నాత్వా చాప్యదత్వా చ వైశాఖో ఏవ నీయతే।
స పిశాచో భవేన్నూన మావైశాఖాదధో వ్రజేత్॥

తా. ఎవడు ప్రాతఃకాలమందు స్నానముజేయకయు దానములనీయకయు వ్యర్థముగా వైశాఖమాసమును గడపినవాడు పిశాచజన్మంబెత్తి వైశాఖమహాత్మ్య ఫలమును పొందుపర్యంతము దుర్గతిని పొందుచుండును.

శ్లో॥ యో న దద్యాజ్జలం చాన్నం వైశాఖే లోభమానసః।
పాపహానిం దుఃఖహానిం నైవాప్నోతి న సంశయః॥ ౧౦

తా. లోభియై వైశాఖమాసమునందు అన్నమునుగాని జలమునుగాని యివ్వనివాడు పాపమును దుఃఖమును పోగొట్టుకొనలేడు. సందేహములేదు.

శ్లో॥ నదీస్నానం తు యః కుర్యాద్వైశాఖే విష్ణుతత్పరః।
జన్మత్రయార్జితాత్పాపాన్ముచ్యతే నాత్ర సంశయః ౧౧

తా. వైశాఖమాసములో విష్ణుభక్తిగలవాడై ప్రాతఃకాలమందు నదిలో స్నానముజేసినవాడు మూడు జన్మంబులయందు జేయబడిన పాపమును పోగొట్టుకొనును. సందేహములేదు.

శ్లో॥ సముద్రగానదీస్నానం కుర్యాత్ప్రాతర్భగోదయే।
సప్తజన్మార్జితైః పాపైస్తత్క్షణాదేవ ముచ్యతే॥ ౧౨

తా. సముద్రములో ప్రవహించునట్టి నదిలో సూర్యోదయ మగుచుండగా ప్రాతఃకాలమునందెవడు స్నానముజేయునో వాడు యేడుజన్మంబులనుండియు జేయబడిన పాపములవలన శీఘ్రముగా విడువబడును.

శ్లో॥ కుర్యా దుషసి య స్స్నానం సప్తగంగాసు మానవః
కోటిజన్మార్జితా త్పాపా న్ముచ్యతే నాత్ర సంశయః
జాహ్నవీ వృద్ధగంగా చ కాళిందీ చ సరస్వతీ।
కావేరీ నర్మదా వేణీ సప్తగంగాః ప్రకీర్తితాః॥ ౧౪

తా. జాహ్నవి, వృద్ధగంగ, కాళింది, సరస్వతి, కావేరి, నర్మద, కృష్ణవేణి,యని గంగానది యేడువిధములైనది. ఆయేడు విధములగు గంగలయందు ప్రాతఃకాలమునందు స్నానము జేసినట్టి మనుజుడు కోటిజన్మంబులయందు జేయుబడిన పాపమునుండి యువిడువబడును. సందేహము లేదు.

శ్లో॥ దేవఖాతేషు యః కుర్యా త్ప్రాత ర్వైశాఖమజ్జనం।
జన్మారభ్య కృతా త్పాపా న్ముచ్యతే నాత్ర సంశయః॥ ౧౫

తా. దేవతలచే త్రవ్వబడిన సముద్రము మొదలగు వానియందు వైశాఖమాసములో ప్రాతఃకాలంబున స్నానముజేసినవాడు తాను జన్మంబెత్తినది మొదలు జేసినపాపములవలన విడువబడును సందేహము లేదు.

శ్లో॥ వైశాఖే మాసి సంప్రాప్తే యో వాపీష్వవగాహనం॥
ప్రాత ర్హ్వాంతి మహారాజ మహాపాతకసంచయం॥ ౧౬

తా. వైశాఖమాసము రాగానే ప్రాతఃకాలమునందెవడు దిగుడు బావులయందు స్నానముజేయునో వానియొక్క సమస్తపాపములు నశించిపోవును.

శ్లో॥ అపి గోష్పదమాత్రేషు బహిస్థేషు జలేషు చ।
తిష్ఠంతు సరిత స్సర్వా గంగాద్యా ఇతి నిశ్చయం॥
ఇతిజానన్ సమాప్నోతి సర్వతీర్థాధికంఫలం॥ ౧౭

తా. గోవునకట్టివేయు స్థలమెంతయుండునో అంతప్రదేశమందున్నప్పటికిని బాహ్యజలములయందు (అనగా కొద్దిప్రదేశమందున్నను) గంగ మొదలగు నదులన్నియు నందున్నని యెవడు తెలిసికొనునో వాడుసమస్త తీర్థములయందుండు పుణ్యమునకంటె నధికమగు ఫలమును పొందుచున్నాడు.

శ్లో॥ క్షీరం రసాధికం క్షీరా దధికం దధి భూమిప?।
దధ్నోఽధికం ఘృతం యద్వ ద్దూర్జో మాసాధిక స్తథా॥

తా. ఓరాజా యేప్రకారముగా రసద్రవ్యములలో పాల ధికమైనవో పాలు కంటె పెరుగధికమైనదో పెరుగుకంటె నెయ్యి అధికమైనదో ఆ ప్రకారముగా మాసములలో కార్తీకమాసశ్రేష్ఠముత్తమమైనది.

శ్లో॥ కార్తికా దధికో మాఘో మాఘా ద్వైశాఖ ఉత్తమః।
తస్మిన్ మాసే కృతో ధర్మో వర్ధతే వటబీజవత్॥ ౨౦

తా. కార్తిక మాసముకంటె మాఘమాసముత్తమమైనది. మాఘమాసముకంటె వైశాఖమాసముత్తమమైనది. కాబట్టి ఆవైశాఖమాసములో జేయబడినధర్మము మఱ్ఱివిత్తువలె నేవృద్ధిపొందును.

శ్లో॥ ఆఢ్యో వా తిదరిద్రో వా పరతంత్రో థవా నరః
యద్వస్తు లభ్యతే యేన తద్దాతవ్యం ద్విజాతయే॥ ౨౧

తా. ధనవంతుడుగాని దరిద్రుడుగాని స్వతంత్రుడుగాని, స్వతంత్రములేనివాడుగాని యెవడైననుఎవనికి యేవస్తువులభ్యమానో ఆవస్తువను బ్రాహ్మణునకు దానమియ్యవలయును

శ్లో॥ కందమూలఫలం శాకం లవణం గుడ మేవ చ।
కోలంపత్రం జలం తక్రం మానంత్యాయో పకల్పతే॥ ౨౨

తా. మనుష్యులుభుజించతగిన దుంపలు వేళ్ళు పండ్లు కూర ఉప్పు బెల్లము రేగు పండ్లు ఆకు, జలము మొదలగునవియైనను యేమియును శక్తిలేనివారిచ్చిన యెడల అమితఫలముకలుగుచున్నది.

శ్లో॥ నా దత్తం లభ్యతే క్వాపి బ్రహ్మాద్యై స్త్రిదశై రపి॥

తా. బ్రహ్మ మొదలగు ముప్పదిమూడుకోట్ల దేవతలకైనను పూర్వజన్మంబునమంచిధర్మములను జేయని యెడల యీజన్మమందుమంచికలుగదు.

శ్లో॥ దానేన హీనస్స భవే దకించనోనిష్కించనత్వాచ్చకరోతిపాపం
పాపా దవశ్యం నరకం ప్రయాతి దాతవ్య మస్మాచ్ఛుక మిచ్ఛతా
సదా॥ ౨౩

తా. దానముచేయని యెడల దరిద్రుడగును. దరిద్రత్వమువలన పాపముచేయును. పాపము చేయుటవలన నరకమును పొందును. కాబట్టి సుఖమును పొందగోరువాడెల్లప్పుడుధర్మమును జేయవలయును.

శ్లో॥ యథా గృహం సర్వగుణోపపన్నం పరిచ్ఛదైర్హీన
మశోభనంతథామూసేషు ధర్మస్సకలే ష్వనుష్ఠితో వైశాఖహీన
స్తు వృథైవ యాతి॥ ౨౪

తా. గృహము ననేకచిత్తరువులచే నలంకరించి యందముగానుండు రీతిచేసిన
ను పైకప్పులేక ప్రకాశించనట్లుగా నన్నిమాసములయందు సమస్తమైనధర్మములను జేసి
నను వైశాఖమాసవ్రతము జేనిది వ్యర్థమగును.

శ్లో॥ యథైవ కన్యా సకలై శ్చ లక్షణై ర్యుక్తా పి జీవత్పతిలక్షణాపి।
ప్రియానురాగా కలితాపిరాజన్ వైశాఖహీనాతువృథైవతాంవిదుః॥

తా. ఆడదిసమస్త స్త్రీలక్షణములు గలదైనను దీర్ఘసుమంగలియైనను పెనిమిటి
చేప్రేమించినదైనను వైశాఖమాస వ్రతమును జేయని దానిని వ్యర్థురాలనిచెప్పిరి.

శ్లో॥ దయావిహీనా స్తు యథా గుణా వృథా
వైశాఖధర్మేణ వినా తథా క్రియాః॥ ౨౬

సమస్తసుగుణములున్నను దయలేనియెడల నేపరికారము వ్యర్థమగునో వైశాఖ
మాసవ్రతమును సలుపక జేసిన యితరవ్రతములన్నియు వ్యర్థమగును.

శ్లో॥ శాకం తు యద్వ ల్లవణేన హీనం
న రోచతే సర్వగుణోపపన్నం
వైశాఖహీనం తు తథైవ పుణ్యం
న సాధు సేవ్యం న ఫలాప్తిహేతుః॥ ౨౭

తా. అన్నిరుచులు గలదియైనను కూర ఉప్పులేనిది యేపరికారము రుచింపదో
వైశాఖమాస వ్రతములేని పుణ్యము సత్పురుషులచే కొనియాడ తగినదికాదు. ఫలమునొసం
గునదియు కాదు.

శ్లో॥ యద్వ ద్విభూషా సుకృతా న శోభతే
వస్త్రేణ హీనా లలనాసురాజన్
క్రియాకలాప స్సుకృతో పి పుంభి
ర్న భాశతే మాధవమాసహీనం॥ ౨౮

తా. ఓరాజా! వనిత అనేక అలంకారములు సౌందర్యముగలది యైనను వస్త్ర
మును ధరింపక నెట్లు ప్రకాశింపదో యట్లే పురుషునిచేననేక సుకృతములు చేయబడినను
వైశాఖమాస వ్రతమును చేయనియెడల ప్రకాశింపవు.

శ్లో॥ తస్మాత్సర్వప్రయత్నేన యేన కేనాపి జంతునా
ధర్మో వైశాఖమాసే తు కర్తవ్య ఇతి నిశ్చయః॥

తా. కాబట్టి యేజంతువైనను సమస్త ప్రయత్నములచే వైశాఖమాసములో ధర్మము చేయవలయునని నిశ్చయము.

శ్లో॥ మధుసూదన ముద్దిశ్య మేషసంస్థే దివాకరే।
ప్రాత స్స్నాత్వార్చయే ద్విష్ణు మన్యథా నరకం వ్రజేత్॥

తా. విష్ణుమూర్తి ప్రీతినిమిత్తమై సూర్యుడు మేషరాశియందుండగా ప్రాతఃకాలంబున స్నానముజేసి విష్ణుమూర్తిని పూజింపవలయును లేనియెడల నరకమును పొందును.

శ్లో॥ వైశాఖ స్సఫలో మాసో మధుసూదనదైవతః।
తీర్థయాత్రాతపోయజ్ఞ దానహోమఫలాధికః॥

తా. విష్ణుమూర్తి అధిదేవతయగు వైశాఖమాసము ఫలము నిచ్చునదియగును. మరియు తీర్థయాత్ర, తపస్సు, యజ్ఞము, దానము, హోమము మొదలగువాని ఫలములకంటె నధిక ఫలమిచ్చును.

ప్రార్థనామంత్రః

శ్లో॥ మధుసూదన దేవేశ వైశాఖే మేషగే రవౌ।
ప్రాత స్స్నానం కరిష్యామి నిర్విఘ్నం కురు మాధవ॥ 32

తా. దేవతలకు ప్రభువగునో మధుసూదనా! వైశాఖ మాసములో సూర్యుడు మేషరాశియందుండగా నేను ప్రాతస్స్నానమును చేయుచున్నాను కాబట్టి విఘ్నములను కలుగనీయకుము. అను అర్థమిచ్చునట్టి మధుసూదన అనెడుశ్లోకము చదివి ప్రార్థించవలయును.

అర్ఘ్యమంత్రః

శ్లో॥ వైశాఖే మేషగే భానౌ ప్రాత స్స్నానపరాయణః।
అర్ఘ్యం తేఽహం ప్రదాస్యామి గృహాణ మధుసూదన॥ 33
గంగాద్యా స్సరిత స్సర్వా స్తీర్థాని చ హ్రదాశ్చ యే।
ప్రగృహ్ణంతు మయా దత్త మర్ఘ్యం సమ్యక్ప్రసీదథ॥ 34
ఋషభిః పాపినాం శాస్తా త్వం యమ స్సమదర్శనః।

గృహాణార్ఘ్యం మయా దత్తం యథోక్తఫలదో భవ॥ 3౫

ఇతి చార్ఘ్యం సమర్ప్యాథ పశ్చాత్స్నానం సమాచరేత్॥ 3౫

తా. ఓవిష్ణుమూర్తీ! వైశాఖమాసములో సూర్యుడు మేషరాశియందుండగాప్రాతస్స్నానమందాసక్తి కలవాడనై నీకొఱకర్ఘ్యమిచ్చుచున్నాను గ్రహించుము. గంగ మొదలగు నో నదులారా! ఓతీర్థములారా ఓసరస్సులారా! మీకొఱకు నేను శ్రేష్ఠతోనర్ఘ్యమిచ్చుచున్నాను గ్రహించి అనుగ్రహింపుడు. ఓవిష్ణుమూర్తీ! నీవందరిలో శ్రేష్ఠుడవు. పాపాత్ములను శిక్షించువాడవు సమస్తజీవులనునియమించువాడవు. సమస్తభూతములయందు సమదృష్టిగలవాడవుగాన నేనిచ్చునట్టియర్ఘ్యమును గ్రహించి నేను చేసినవ్రతమునకు తగినఫలమునిమ్ము అనుయర్ఘ్యమిచ్చు వైశాఖే, గంగాద్యాః, ఋషభః, అనుమూడు మంత్రములను చదివియర్ఘ్యమిచ్చితిరిగి స్నానముజేయవలయును.

శ్లో॥ వాససీ పరిధాయాథ కృత్వా కర్మాణి సర్వశః।
మధుసూదన మభ్యర్చ్య పుష్పై ర్మాధవోద్భవైః॥ 3౬
శృత్వా విష్ణుకథాం దివ్యా మేతన్మాసప్రశంసినీం।
కోటిజన్మార్జితా త్పాపా న్ముక్తో మోక్ష మవాప్నుయాత్॥ 3౭

తా. అనంతరమునరయుతికిన శుభ్రవస్త్రములను ధరించిసంధ్యావందనాది సమస్తకర్మముల నెఱవేర్చి వైశాఖమాసమునందుపూచిన పుష్పములచే విష్ణుమూర్తినిపూజించి వైశాఖమాసమును ప్రశంసించునదియు శ్రేష్ఠంబైనవిష్ణుకథను వినినయెడలకోటిజన్మంబులనుండి నను చేయబడిన పాపమువలన విడువబడి మోక్షమునుపొందును.

శ్లో॥ న జాతు ఖిద్యతే భూమౌ న స్వర్గే న రసాతలే।
న గర్భే జాయతే క్వాపి న భూయ స్తనపో భవేత్॥ 3౮

తా. స్వర్గలోకమునందుగాని భూలోకమునందుగాని పాతాళలోకమునందుగాని యొకప్పుడు నేవిధమైనస దుఃఖమును పొందడు. గర్భనరకమనుభవించుటగాని శిశువుగాబెత్తుటగాని సంభవింపదు.

శ్లో॥ వైశాఖే కాంస్యభోజీ య స్తథాన శ్రుతసత్కథః।
న స్నాతో నాపి దాతా చ నరకా నేవ గచ్ఛతి॥ 3౯

తా. వైశాఖమాసములో నెవడు కంచములోనన్నము తినునో సత్కథలను వినడో ప్రాతఃకాలమునందుస్నానముజేయడో దానమియ్యడో అట్టివాడునరకములనే పొందుచుండును.

శ్లో॥ బ్రహ్మహత్యాసహస్రస్య పాపం శామ్యే త్కథంచన।
వైశాఖే యేన న స్నాతం తత్పాపం నైవ గచ్ఛతి॥ ४०

తా. వెయ్యిబ్రహ్మహత్యలవలన గలిగినపాపము నేదోయొకవిధముగా పోగొట్టు కొనవచ్చునుగాని వైశాఖమాసములో స్నానము జేయనివానిపాపము పోగొట్టుకొనుటకుశక్యముకాదు.

శ్లో॥ స్వాధీనేన చ కాయేన హ్యాప్సు స్వాతంత్ర్యవర్తిషు।
స్వాధీనజిహ్వయో చ్చార్యాం హరి రిత్యక్షరద్వయం॥ ४१

తా. తనశరీరము జబ్బులేకధర్మమాచరించుటకు స్వాధీనమైయుండగా స్వాధీనమందున్నజలములయందు స్నానముజేసి నాలుక స్వాధీనమైయుండగానే హరియనుభగవన్నామస్మరణజేయవలయును. అనగావృద్ధాప్యముచే నింద్రియపటుత్వము చెడకమును పే భగవద్ధ్యానముజేయవలయును.

శ్లో॥ న కుర్యా ద్యది వైశాఖే ప్రాత స్స్నానం నరాధమః।
జీవ న్నేవ చ పంచత్వ మాగతో నా త్ర సంశయః॥ ४२

తా. ఏదుర్మార్గుడు వైశాఖమాసములో ప్రాతఃకాలమునస్నానముజేయడో వాడుబ్రతికియుండగానే చండాలుండగును. సందేహములేదు.

శ్లో॥ యేన కేనా ప్యుపాయేన మాధవే మధుసూదనం।
నా ర్చయే ద్యది మూఢాత్మా సౌకరీం యోని మాప్నుయాత్॥

తా. వైశాఖమాసములో నేవిధముగానైనను విష్ణుమూర్తినిపూజించనిమూఢుడు పందియోనియందుపుట్టును.

శ్లో॥ యో ర్చయే త్తులసీపత్త్రై ర్వైశాఖే మధుసూదనం।
నృపో భూత్వా సార్వభౌమః కోటిజన్మసు భోగవాన్॥
పశ్చాత్కోటికులై ర్యుక్తో విష్ణో స్సాయుజ్య మాప్నుయాత్॥ ४४

తా. వైశాఖమాసములో విష్ణుమూర్తిని తులసీదళములచేపూజించినవాడు చతుస్సముద్రపర్యంతము నేలునట్టి ప్రభువగుచు కోటిజన్మములపర్యంతమైశ్వర్యముగలవాడై అనంతరమున కోటిపురుషాంతరములవారితోగూడ విష్ణులోకమును పొందివిష్ణునందైక్యము జెందును.

ఇతిశ్రీస్కాందేవైశాఖమహాత్మ్యే నారదాంబరీష సంవాదే వైశాఖధర్మప్రశంసో నామచతుర్థో ऽ ధ్యాయస్సమాప్తః॥

## వైశాఖ పురాణే పంచమోఽ ధ్యాయః

నారదఉవాచ.

శ్లో॥ వైశాఖ స్సర్వధర్మేభ్య స్తపోధర్మేభ్యఏవచ ।
కథం స సర్వమాసేభ్యో దానేభ్యో వ్యధికోఽ భవత్ ॥ ౧
తద్వ్యాఖ్యామిమహాప్రాజ్ఞశృణుచైకమనాభవ॥ ౧½

తా॥ విశేషముగా తెలిసిన యోరాజా! సమస్తపవిత్రధర్మములకంటెను తపోధర్మములకంటెను అన్నిమాసములకంటెను అన్నిదానములకంటెను వైశాఖమాసమెట్లు యధికమైనదో ఆవిషయమునుగురించి చెప్పుచున్నాను. సావధానమనస్సు గలవాడవై వినుము.

శ్లో॥ కల్పాంతే దేవరాడ్విష్ణు శ్శేషశాయీ మహాప్రభుః ।
కుక్షిస్థలోకసంఘాయం స శేతే ప్రలయార్ణవే ।
అనేకో హ్యేకతాం ప్రాప్య భూతిభి ర్యోగమాయయా॥ ౩

తా॥ పూర్వము సృష్టియొక్క చివరను (అనగా సంహారకాలమందు) దేవతులలో శ్రేష్ఠుండును ఆదిశేషువయందు శయనించువాడును గొప్పప్రభువు నగు విష్ణుమూర్తి అష్టైశ్వర్యముల శక్తిచేతను యోగశక్తిచేతను ఈలోకములను జీవులను తనయందైక్యముచేసుకొని ప్రళయకాలమందంతటను వ్యాపించియున్నట్టి సముద్రమునందు పరుండెను.

శ్లో॥ నిమేషస్యావసానే తు శ్రుతిభి ర్బోధిత స్తతః ।
కుక్షిస్థజీవసంఘానాం రక్షాంచక్రే దయానిధిః॥ ౪

తా॥ నిద్రపూర్తియైనపిమ్మట వేదములచే మేలుకొలుపబడినవాడై దయాసముద్రుండగు విష్ణువు తనగర్భమందున్నట్టి జీవులనురక్షించెను.

శ్లో॥ తత్తత్కర్మఫలప్రాప్త్యై సృజ్యాక్ సృష్టుం మనోదధే॥
తస్య నాభే రభూ త్పద్మం సౌవర్ణం భువనాశ్రయం॥

తా॥ తనగర్భమందిమిడియున్న జీవులను తిరిగి ఆయాజీవులకు తగిన కర్మఫలమును తగినట్లుగా సృజించవలయునవనెడి కోరిక యుద్భవించగానే ఆభగవంతుని నాభివలన సమస్తలోకములతోనిండియున్న బంగారువికారమైనయొకపద్మముప్రభవించెను.

శ్లో॥ బ్రహ్మాణం జనయామాస వైరాజం పురుషాహ్వయం ।
తస్మిం త్ససర్జ భగవా న్భువనాని చతుర్దశ॥ ౬

తా॥ భగవంతుడైనవిష్ణుమూర్తి ఆపద్మమువలన పురుషుడు అనే పేరుగలప్రకాశించుచున్న బ్రహ్మదేవుని పదునాలుగు లోకములను సృజించెను.

శ్లో॥ భిన్నకర్మాశ్రయప్రాణిసంఘాంశ్చ వివిధాన్ బహూన్ ।
త్రిగుణాః ప్రకృతిం లోకే మర్యాదాశ్చాధిపాం స్తథా ।
వర్ణాశ్రమవిభాగాంశ్చ ధర్మక్లృప్తిం చ సోఽకరోత్॥ ౮

తా. వేరువేరు కర్మల నాశ్రయించియున్న జీవరాసులను ఆయా కర్మఫలముల కనుకూలముగా ననేక విధములగాను త్రిగుణములను మాయను లోకమునందు ప్రభువులను వారికి తగిన పాలనావిషయమగు పద్ధతులను బ్రాహ్మణాది వర్ణములయొక్కయు బ్రహ్మచర్యాద్యాశ్రమములయొక్కయు విభాగములను ధర్మనిర్ణయము నేయేవిధముల జేయవలయునో ఆభగవంతుండట్లు చేసెను.

శ్లో॥ వేదై శ్చతుర్భి స్తన్త్రైశ్చ సంహితా స్స్మృతిభి స్తథా
పురాణై రితిహాసైశ్చ స్వాజ్ఞారూపై ర్మహేశ్వరః
ఋషీన్ ప్రవర్తకాంశ్చక్రే ధర్మగుప్త్యై మహాప్రభుః॥ ౯

తా. గొప్ప ప్రభువగు విష్ణుమూర్తి ధర్మమును కాపాడుట కొఱకు నాలుగు వేదములను తంత్రములను సంహితలను స్మృతులను పురాణములను తన ఆజ్ఞ ననుసరించి యున్న ఇతిహాసముల నభ్యసించి యాచరించునట్లుగా మునీశ్వరులను ప్రవర్తింపజేసెను.

శ్లో॥ తైః ప్రవర్తితధర్మా స్తు వర్ణాశ్రమవిభాగజాః ।
ప్రజాశ్శ్రద్దధిరే సర్వా స్స్వోచితాన్ విష్ణుతోషదాన్॥ ౧౦

తా. ఆమునీశ్వరులచే నాచరింపబడినవియు వర్ణాశ్రమ విభాగరూపమైన ధర్మములను సమస్తప్రజ లాచరించుచు తమకు తగినవియు విష్ణుప్రీతికరములగు ధర్మముల నాచరించుచుండిరి.

శ్లో॥ తాం స్తు ప్రవర్తమానాం స్తు స్వాశ్రమాన్ ద్రష్టు మీశ్వరః ।
హృదిస్థో హ్యవ్యయ స్సాక్షా ద్విభీషార్థం పరీక్షయా॥ ౧౧

తా. నాశనరహితుండగు విష్ణుమూర్తి జీవుల హృదయమందుండినను తనచే నేర్పరుపబడిన ధర్మములెట్లు జరుగుచున్నవో పరీక్ష చేయవలయునను తలంపుతో తన సంబంధమగు నాశ్రమములను జూచుటకు వచ్చెను.

శ్లో॥ అనూనాన్ కుశలా న్యత్ర ధర్మాన్ కుర్వంతి వై ప్రజాః।
స కాలః కో భవే ద్యద్వ న్నితి తం చింతయన్ ప్రభుః॥ ౧౨

తా. ప్రభువగు విష్ణుమూర్తి విశేషమైనవియు యోగ్యమైనవియు నగు ధర్మముల నేకాలమందు ప్రజలు జేయగలరో అట్టి తగినకాలమును విచారించుచున్నాడు.

శ్లో॥ వర్షాకాలో మయా సృష్టి స్సీదంత్యస్త్రా ఇమాః ప్రజాః।
తత్రాన్నానాన్ న కుర్వంతి ధర్మాన్ పంకాద్యుపద్రుతాః॥ ౧౩

తా. వర్షాకాలము నాచే సృజింపబడినదిగదా ధర్మమాచరించుటకు వీలుగానుండు నాయనిన ఈప్రజలు బురద మొదలగు కష్టములనుపొంది ధారాళముగా విశేషమైన ధర్మములను చేయజాలకుండిరి.

శ్లో॥ తాం దృష్ట్వా కోప ఏవ స్యా త్తేషు తుష్టి ర్న మే భవేత్।
మయేక్షితా న సీదంతు తస్మా త్తా నవలోకయే॥ ౧౪

తా. కాబట్టి ఆ వర్షాకాలమును జూచితేనాకు కోపమువచ్చుచున్నది. వర్షాకాలమునందు ధర్మములను జేసినవారియందును నాకు అంతగా ప్రేమలేదు. కాబట్టి వారిని నేనుజూచితినేని మోక్షమియ్యవలయును గాన వారిని జూడకుండుటయే మంచిదనుకొనెను.

శ్లో॥ శరద్యపి తథా పూర్తిః కర్షణా న్నైవ జాయతే।
కేచిత్పక్వఫలాసక్తాః కేచి ద్వ్యాధిభి రార్దితాః॥ ౧౫
కేచిచ్ఛీతార్దితా స్తస్మా త్తాన్ దృష్ట్వా రోష ఏవమే।
వైగుణ్యం పశ్యమానస్య న మే తోషో భిజాయతే ౧౬

తా. ఇకను శరత్కాలము విషయమై విచారింతుమనిన కృషివలన గలుగు ఫలితము సంపూర్తికానేరదు. కొందఱు బాగుగా పండినపండ్లను తినుటయందే వాంఛగలవారలై యుందురు. మఱికొందరు నేత్రవ్యాధులచేపీడింపబడుచుందురు. మఱికొందరు చలిచేబాధపడుచుందురు. కాబట్టి వారిని జూచితినేని కోపము సంభవించును. ఇట్టిదుర్గుణములు వారియందు కలుగుచుండగా నాకు ప్రేమయెట్లు కలుగును.

శ్లో॥ ఉత్థాపనంతు నేష్యంతి ప్రాత ర్హేమంత ఆగతే।
కోపో మే ఽనుత్థితాన్ దృష్ట్వా ప్రాత స్సూర్యోదయే సతి॥ ౧౭

తా. హేమంతఋతువులో చలిబాధయధికమగుటచే నుదయమున లేచుటయందింతమాత్ర మిష్టముండదు. అట్లు సూర్యోదయమైనను ప్రాతఃకాలమునందు లేవనివారియందు నాకు కోపము కలుగును.

శ్లో॥ శిశిరేపి తథైవార్తాః ప్రాతః కాలే ఇమాః ప్రజాః
తథా పక్వఫలాదాన సక్తా హ్యనిశ మంజసా॥ ౧౮

తా. శిశిరఋతువునందును జనులు ప్రాతఃకాలమందు చలిచే బాధింపబడినవార లగుచుందురు. మఱియు నెల్లప్పుడు పండిన పండ్లను తినుటయందాసక్తి కలిగి యుందురు.

శ్లో॥ పున శ్శీతార్దితాః ప్రాత స్స్నానార్థమితి చింతితాః।
తేషాం తు కర్మలోప స్స్యా న్నైవ పూర్తిః కథంచన॥ ౧౯
ప్రేక్షాయా స్సమయో నాయ మితి చింతాకులో విభుః।
వసంతసమయం మేనే సర్వాపత్తినివారకం॥ ౨౦

తా. ఈ శీతకాలములో స్నానము చేసిన తిరిగి విశేషముగా చలిబాధించునని స్నానముజేయ నిచ్చగించరు. అట్టి వారికి కర్మలోపమే గాని కర్మపూర్తి యెట్లగును. కాబట్టి వర్షఋతువు మొదలు శిశిరఋతుపర్యంతమందు కాలముధర్మయోగ్యమైనది కాదు గాన యిప్పుడు నేను జూచుటకు సమయము కాదని భగవంతుడు విచారించి వసంతఋతువునందే విధములగు కష్టములు సంభవించవు గాన నదియే ధర్మయోగ్యమైన కాలమని తలచెను.

శ్లో॥ స్నానే దానే తథా యాగే క్రియాయాం భోగ ఏవచ।
నానాధర్మవిధానే చ హ్యనుకూలో హ్యయం ఋతుః॥ ౨౧

తా. ఈ వసంతఋతువు స్నానముజేయుటయందును దానమిచ్చుటయందును యజ్ఞముజేయుటయందును మరియు సౌఖ్యముల ననుభవించుటయందును మఱియు నివి గాక ననేక ధర్మములజేయుటయందును యోగ్యమైన కాలము.

శ్లో॥ అప్రయాసేన లభ్యాని ద్రవ్యా ణ్యసుభృతాం ధ్రువం।
యేన కేన చ ద్రవ్యేణ తుష్టి స్తనుభృతాం భవేత్॥ ౨౨

తా. ప్రాణముగల సమస్తజీవరాసులకు వసంతఋతువునందు సులభముగా పదార్థములు సంభవించును. ఏపదార్థముచేతనైనను దేహధారులకు తృప్తికలుగును.

శ్లో॥ విష్ణో రాధారభూతానాం తద్ద్రవ్యం ధర్మసాధనం।
వసంతే సకలం ద్రవ్యం ప్రాణినాం తు సుఖావహం॥ ౨౩
దానయోగ్యం ధర్మయోగ్యం భోగయోగ్యం తు సర్వశః॥ ౨౪

తా. వసంతఋతువునందు జీవులకు సమస్త పదార్థములు సులభముగా సంభవించును. అట్టి ద్రవ్యముచే విష్ణుసంబంధమగు వస్త్రి పత్రికములను కేయవలెను. మఱియు నట్టి ద్రవ్యము యెల్లప్పుడు దానమునకు ధర్మమునకు అనుభవించుటకు యోగ్యమైన దగును.

శ్లో॥ నిర్ధనానాం తు పంగ్వాదివికలానాం మహాత్మనాం।
దవ్యాణి చ సులభ్యాని జలాదీని న సంశయః॥
ద్రవ్యైరేతై స్స్వాత్మహితం ధర్మం కుర్వంతి మత్ప్రియాః॥ ౨౭

తా. కుంటివాడు మొదలగు వికలాంగులకు ధనములేని వారికి మహానుభావులకు మఱియు నందరికిని జలము మొదలగు పదార్థములన్నియు సులభముగా లభించును. నా భక్తులైనవారు యీద్రవ్యములచే నాకిష్టమగు ధర్మమును చేయుచుందురు.

శ్లో॥ పత్రైః పుష్పైః ఫలై రన్యై శ్శాకై శ్చాపి ప్రియోక్తిభిః
స్రక్తాంబూలై శ్చందనాద్యైః పాదప్రక్షాళ నాదిభిః
ప్రశ్రయాద్యై రహం తేషాం సదనే హా మిత్రీగయాన్
సంచిత్య భగవాన్ విష్ణుః ప్రతస్థే రమయా సహ॥ ౨౮

తా. వసంతఋతువునందు అతిధిగావచ్చిన బ్రాహ్మణులకు పత్రముల చేతను పుష్పములచేతను పండ్లచేతను ఇతరమైన కూరగాయలచేతను ప్రియమైనమాటలచేతను మాలికలచేతను తాంబూలముల చేతను మంచిగంధము మొదలగువానిచేతను కాళ్ళుకడుగుట మొదలగువానిచేతను ప్రార్థనావాక్యములచేతను గౌరవించినవారి కిష్టమగువరముల నిచ్చుచున్నానని భగవంతుడగు విష్ణుమూర్తి లక్ష్మీదేవితోకూడ ప్రయాణమై వెళ్ళెను.

శ్లో॥ వనాని సర్వతః పశ్యన్ వికసత్కుసుమాని చ
హృష్టపుష్టజనాకీర్ణం మత్తాళి ద్విజసేవితం॥ ౨౯
ఆశ్రమాణా మహార్హాణాం వనగామునివాసినాం
ప్రాంగణాదీని రమ్యాణి చైత్యద్యానాని సర్వాణిచ॥ ౨౯
రమాయై దర్శయన్విష్ణు స్సహ దేవై ర్మునీశ్వరైః
సిద్ధచారణగంధర్వ కిన్నరోరగరాక్షసైః ౩౦
స్తూయమానో భృశం దేహ స్వర్ణాశ్రమనివాసినాం॥ ౩౧

తా. వికసించిన పుష్పములుగలవియు సంతోషబలములు గలిగిన మనుష్యులు గలవియు పూజనీయములు గొప్పవియునగు యాశ్రమములతోఁగూడిన వనములనంతట జూచుచు గ్రామములయందు గృహములకు ముందుగానుండు రమ్యమైన వాకిలి ప్రదేశములను మనోహరమైన తోటలను విష్ణుమూర్తి లక్ష్మీదేవికి చూపించుచు దేవతలు మునీశ్వరులు సిద్ధులు చారణులు గంధర్వులు కిన్నరులు ఉరగులు రాక్షసులు మొదలగు దేవయోని విశేషులచే నుతింపబడుచు బ్రాహ్మణాది వర్ణములయొక్కయు బ్రహ్మచర్యాద్యాశ్రమముల యొక్కయు స్థానములను జూచుచు వెళ్ళుచుండెను.

శ్లో॥ మీనాదికర్కటాంతం వై స తిష్ఠన్ రమయా సురైః।
పార్థం ప్రతీక్ష్య పురుషాన్ కృతాకృతసమర్పణాన్॥
తత్ర ధర్మవతాం పుంసాం దదా తీష్టాన్మనోరథాన్ 37

తా. ఆ విష్ణుమూర్తి లక్ష్మీదేవితోడను ఇంద్రుడు మొదలగు సమస్తదేవతలతోడను గూడి మీనరాశిమొదలు కర్కటకరాశియంతము పర్యంతము. (అనగా చైత్ర వైశాఖ జ్యేష్ఠాషాఢములయందు) భూలోకంబున సంచరింపుచు తన సంబంధమగు సత్కర్మలను జేయువారిని జేయని వారిని జూచుచు తన వ్రతము జేయుభక్తులగు మనుష్యులకు కోరిన కోరికల నిచ్చుచున్నాడు.

శ్లో॥ మర్త్యాన్ న సహతే పుంసో హరత్యాయు ర్దినాదికం।
యది కుర్వంతి వైశాఖే సపర్యాం పరమాత్మనః॥
తథాపి చలమూర్తీనాం సాధూనాం యత్ర వై విభుః।
మాసే ష్వన్యేషు యజ్జాతం కర్మ లోపం సహిష్యతి॥ 38

తా. మదించి తన సంబంధమగు వ్రతములు సలుపనివారియందు నసహ్యముగలిగి వారి సంబంధమగు నాయుర్దాయమును హరించుచున్నాడు. వైశాఖమాసములో పరమేశ్వరుని యొక్కయు లేక విగ్రహముల యొక్కయు సత్పురుషుల యొక్కయు పూజజేసినవా డితరమాసములయందు యేకర్మ లోపము సంభవించినను దానినంతయు ప్రభువైన విష్ణుమూర్తి సహించును.

శ్లో॥ యథా దేశాగతం భూపం దృష్ట్వా జానపదాః ప్రజాః
యది తం చోపతిష్ఠంతి ప్రశ్రయాద్యై ర్మహార్హణైః 39
తదా కరాదికం న్యూనం పూర్ణం జానాతి పార్థివః
పున రభ్యధికం చేష్టం తుష్టో దాస్యతి నిశ్చితం॥ 3౬

తథా త్వకృతపూజానాం దండం తేషాం కరోతి చ॥ ౨౯

తా. ఇతర దేశమునుండి వచ్చుచున్న రాజునకు ప్రజలెదురుగావెళ్లి కానుకలను సమర్పించి స్తోత్రవాక్యములను పలుకుట మొదలగు మర్యాదలను జేసిన యెడల యీరాజు సంతసించి వారియందనుగ్రహము కలవాడై వారిచ్చుచున్న స్వల్పమైనను అధికమైనదానిగా దలచి తిరిగివారికిష్టమైన గోరికలనెట్లు యొసగునో తనకుమర్యాదజేయనివారినెట్లు దండించునో

శ్లో॥ తథా విష్ణుస్స్వకీయానాం వైశాఖే మాధవాగమే।
సపర్యాం కుర్వతాం పుంసాం దదాతీష్టాన్ మనోరథాన్॥
అకుర్వతాం తథా పుంసాం ధనాదీని హరత్యలం॥ ౩౦

తా. ఆప్రకారముగానే వైశాఖమాసములో తన సంబంధమగు పూజను సలుపుచున్న భక్తులకు వారు కోరిన కోరికల నిచ్చుచున్నాడు. తన పూజను జేయనివారియొక్క ధనము ఆయువు మొదలగు వానిని హరించుచున్నాడు.

శ్లో॥ ధర్మగోప్తుర్మహావిష్ణోర్దేవదేవస్య శార్ఙ్గిణః।
పరీక్షాకాల ఏవాయం తస్మాన్మాసోత్తమో హ్యయం॥ ౩౧

తా. ధర్మమును రక్షించువాడును దేవతలకు దేవుండును శార్ఙ్గమును ధరించినవాడును మహానుభావుండునగు విష్ణుమూర్తిచే పరీక్షజేయబడుకాలము కాబట్టి వైశాఖమాసము మాసములన్నిటిలో శ్రేష్ఠమైనదానిగా జెప్పిరి.

ఇతి శ్రీస్కాందపురాణే వైశాఖమాహాత్మ్యే నారదాంబరీషసంవాదే వైశాఖశ్రేష్ఠత్వనిరూపణో నామ పంచమోధ్యాయస్సమాప్తః

## అథషష్ఠోధ్యాయః

### నారదఉవాచ.

శ్లో॥ వైశాఖేఽధ్వని తప్తానాం తృషార్తానాం మహీపతే।
జలదానమకుర్వాణస్తిర్యగ్యోనిమవాప్నుయాత్॥ ౧

తా. నారదుడు చెప్పుచున్నాడు ఓరాజా! వైశాఖమాసమందు మార్గములో నెండచే తపింపజేయబడి నసి దాహ గొన్నవానికి జలమునీయనివాడు పశుజన్మం బెత్తును.

శ్లో॥ అత్రైవోదాహరంతీ మ మితిహాసం పురాతనం ।
విప్రస్య గృహగోధాయా స్సంవాదం పరమాద్భుతం॥ ౨

తా. ఈజలదానమువిషయమై పూర్వంబున్న జరిగినదియు మిక్కిలి యాశ్చర్యము కలిగించునదియు బ్రాహ్మణునకు బల్లికి జరిగిన వృత్తాంతరూపమైన యొకకథను దృష్టాంతముగా చెప్పుచున్నాను.

శ్లో॥ పురా చే క్ష్వాకువంశే౽ భూ ద్ధేమాంగ ఇతి భూమిపః।
బ్రహ్మణ్య శ్చ వదాన్య శ్చ జితామిత్రో జితేంద్రియః 3

తా. పూర్వకాలమందు బ్రాహ్మణభక్తిగలవాడును త్యాగముగలవాడును శత్రువులను జయించినవాడును ఇంద్రియములను జయించినవాడునగు హేమాంగుడను రాజు ఇక్ష్వాకువంశమునందు జనియించెను,

శ్లో॥ యావంతో భూమికణికా యావంతో జలబిందవః ।
తారావంత్యుడూని గగనే తావతీ రదదాత్సగాః॥ ౪

తా. ఆహేమాంగదుడనేరాజు భూరేణువులెన్నిగలవో జలబిందువులెన్ని గలవో ఆకాశంబున నక్షత్రములెన్నిగలవో అన్ని గోదానములను జేసెను.

శ్లో॥ యే నేష్టం యజ్ఞదర్భై శ్చ భూమి ర్నహి౽ వృతీ శుభా।
గోభూతిలహిరణ్యాద్యై స్తోషితా బహవో ద్విజాః॥ ౫

తా. ఆరాజుచే జేయబడిన యజ్ఞములయందు పరచబడిన దర్భలచే భూమియంతయు నిండియుండెను (అనగా ననేక యజ్ఞములను జేసెను) గోదాన భూదాన తిలదాన సువర్ణదానము మొదలగు షోడశమహాదానములచే ననేక బ్రాహ్మణులు తృప్తినొందించబడిరి.

శ్లో॥ తేనాదత్తాని దానాని న విద్యంత ఇతి శ్రుతం
తేనాదత్తం జలం చైకం సుఖలభ్యధియా నృప॥ ౬

తా. ఓరాజా! ఆయనచే నీయబడని దానములు లేవని వింటిమిగాని అందరికి సులభముగా దొరకుననెడిబుద్ధిచే నొక్కజలదానముమాత్రము జేయబడలేదు.

శ్లో॥ బోధితో బ్రహ్మపుత్రేణ వసిష్ఠేన మహాత్మనా।
అమాల్యం సర్వతోలభ్యం తద్ధాతుః కింఫలం లభేత్॥ ౭

తా. బ్రహ్మదేవుని మానసపుత్రుండగు వసిష్ఠమహాముని చేత వైశాఖమాసములో జలదానము జేయవలయునని చెప్పబడినను జలమంతటను దొరకునదియే యిదియేమి ఖరీదుకలది దీనినిచ్చినవానికి నేమిపుణ్యము సంభవించును.

శ్లో॥ దుర్బుద్ధిహేతువాదైశ్చ న జలం దత్తవాన్విభుః॥

తా. ఈప్రకారముగా కుయుక్తులను ప్రయోగించుచు దుర్బుద్ధిగలవాడై యారాజు జలమునిచ్చినవాడు కాడాయెను.

శ్లో॥ అలభ్యదానే పుణ్యం స్యాదితివాక్యం సుయుక్తిమత్
సహానర్చ్య ద్విజాన్ వ్యంగాన్ దరిద్రాన్ వృత్తికర్శితాన్॥
నార్చయచ్ఛ్రోత్రియాన్ విప్రాం స్తత్వజ్ఞాన్ బ్రహ్మవాదినః॥ ౯

తా. యేమైనను దొరకనివస్తువిచ్చినను యెవరును పూజించనివారిని పూజించినను పుణ్యముకలుగునని యుక్తిచే ఆరాజు వికలాంగులైన బ్రాహ్మణులను దరిద్రులను అనాచారులను పూజించుచు శ్రోత్రియులును బ్రహ్మవేత్తలును యథార్థజ్ఞానముగల వారునగు బ్రాహ్మణులను పూజించకపోయెను.

శ్లో॥ ప్రఖ్యాతాన్పూజయిష్యంతి సర్వే లోకా మహార్హణాః।
అనాథానా మవిద్యానాం వ్యంగానాం చ ద్విజన్మనాం॥
దరిద్రాణాం గతిః కా వా తస్మాత్తే మే దయాస్పదాః
ఇతి మత్వాఽనపాత్రేషు దత్తవాన్ కిమపి స్వయం॥

తా. ఈమనుష్యులందరు ప్రసిద్ధిగల సత్పురుషులనే పూజించవలయునని యుద్దేశముగలవారేగాని దిక్కులేనివారును చదువులేనివారును వికలాంగులును దరిద్రులునగు బ్రాహ్మణులను పూజించరు. అట్టివారిని పూజించనియెడల వారికి దిక్కెవ్వరు. కాబట్టి దరిద్రులు మొదలగువారియందే నాకు ప్రేమ కలుగుచున్నదని దుష్టస్వభావముగలవాడై అయోగ్యులనే పూజించుచుండెను గాని సత్పాత్రులగు బ్రాహ్మణులకు కొంచెమైనను దానమియ్యలేదు.

శ్లో॥ తేన దోషేణ మహతా చాతకత్వం త్రిజన్మసు।
ఏకజన్మని గృధ్రత్వం శ్వా భవ త్సప్తజన్మసు॥ ౧౨

తా. ఆహేమాంగమహారాజు సత్పురుషులగు బ్రాహ్మణులను పూజింపకపోవుటవలనను వైశాఖమాసమునందు గాని మతియెప్పుడు గాని జలదానము చేయకుండుట

అనేడు గొప్పదోషములచే మూడుజన్మంబులవరకు వానకోయిలగాపుట్టి తరువాత నొక జన్మమందు గ్రద్దగా జన్మించి యనంతరమేడు జన్మంబులవరకు కుక్కగా జన్మించెను.

శ్లో॥ పశ్చాత్ నృపగృహే జాతో భూపోయం గృహగోధికా
శ్రుతకీర్త్యాఖ్యభూపస్య మిథిలాధిపతే ర్నృప ౧౩

తా. ఓరాజా! అటుపిమ్మట నా హేమాంగుడను రాజు మిథిలా దేశమునకు ప్రభువగు శ్రుతకీర్తి యను రాజుయొక్క గృహమునందు బల్లిగా జనియించెను.

శ్లో॥ గృహద్వారప్రతోళ్యాం చ వర్తతే కీటకాశనా
సప్తాశీతి తు వర్షేషు స్థితా తేన దురాత్మనా ౧౪

తా. దురాత్ముండగు నా రాజు శ్రుతికీర్తి మహారాజు యొక్క వాకిటనుండు గానుండే పెద్ద వీధికి సమీపములోనుండు గోపురద్వారమందుండి యక్కడనుండుయీగలు మొదలగు పురుగులను దినుచు నెనుబదియేడు సంవత్సరములుండెను.

శ్లో॥ విదేహాధిపతే ర్గేహే కదాచి దృషిసత్తమః
శ్రుతదేవ ఇతిఖ్యాత శ్శాంతో మధ్యాహ్న ఆగతః ౧౫

తా. ఇట్లుండగా నొకానొక సమయమునందు విదేహదేశములకు ప్రభువగు ఆ శ్రుతకీర్తియొక్క గృహమునకు శ్రుతదేవుండను మునిశ్రేష్ఠుడు మార్గాయాసముచే సలసి మధ్యాహ్న కాలమందు వచ్చెను.

శ్లో॥ తం దృష్ట్వా సహసోత్థాయ జాతహర్షో నరాధిపః
మధుపర్కాదిభిః పూజ్య తస్య పాదావనేజనీః ౧౬
ఆపోమూర్ధ్నా వహత్ క్షిప్రం తతో త్సృష్టై ర్చ బిందుభిః
దైవోపదిష్ట కాలేన ప్రోక్షితా గృహగోధికా॥ ౧౭

తా. అట్లువచ్చిన బ్రాహ్మణునిజూచి యాశ్రుతకీర్తి మహారాజు మిక్కిలి సంతోషముగలవాడై శీఘ్రముగాలేచి యెదుర్కొని ఆసనమిచ్చి కూర్చుండబెట్టి మధుపర్కము మొదలగు పూజాద్రవ్యములచే బూజించి యాబ్రాహ్మణుని పాదములను కడిగి యాజలమును తనశిరస్సున శీఘ్రముగా జల్లుకొనెను. ఆ రాజు శిరస్సునందు చిమ్ముకొనిన సమయమందు కొన్ని జలబిందువులు యెగిరి దైవవశముచే పైన గోడయందుండు బల్లిపై బడినవి.

శ్లో॥ సద్యోజాతస్మృతి రభూ త్స్వకృతకర్మాదిదుఃఖితా
త్రాహిత్రాహీతి చుక్రోశ బ్రాహ్మణం గృహ మాగతం॥

తా. అప్పుడు జలబిందువులు పైనబడినంతమాత్రముననే యజ్ఞానము తొలగిపోయి తత్క్షణమునందే దివ్యజ్ఞానము కలిగి తనకు పూర్వము సంభవించిన హీనజన్మములను దెలిసికొని దుఃఖించి యాబ్రాహ్మణునిజూచి రక్షింపుము రక్షింపుము అని మొఱబెట్టెను.

శ్లో॥ తిర్యగ్జంతు రవంశ్రుత్వాబ్రాహ్మణో విస్మితో ఽ వదత్।
కుతః క్రోశసి గోధే త్వం దశేయం కేన కర్మణా॥ ౧౯

తా. అప్పుడా బ్రాహ్మణుడు తిర్యగ్జంతువైనను మనుష్యవాక్కుచే పలికిన యాబల్లి పలుకులనువిని యాశ్చర్యమునొంది యోబల్లీ! ఏకర్మముచే నీకిట్టి యవస్థసంభవించినది యెందుకు మొఱబెట్టుచున్నావు.

శ్లో॥ త్వం దేవః పురుషః కశ్చి న్నృపో వాథ ద్విజో థవా
క స్త్వం బ్రూహి మహాభాగ త్వా మద్యాహం సముద్ధరే॥ ౨౦

తా. నీవు దేవతవా ? పురుషుడవా ? ఒకానొకరాజువా ? లేక బ్రాహ్మణుడవా ? ఓమహానుభావా ! ఎందుకు నీకిట్లు కష్టముసంభవించెనో చెప్పుము. ఇప్పుడే యాపదనుండి తొలగించెదను.

శ్లో॥ ఇత్యుక్త స్సృణిపః ప్రాహ శ్రుతదేవం మహామతిం।
అహ మిక్ష్వాకుకులజో వేదశాస్త్రవిశారదః॥ ౨౧

తా. ఈప్రకారం మడుగగా విశేషజ్ఞాన సంపన్నుండగు యాశ్రుతదేవునితోనిట్లు బల్లి చెప్పుచున్నది. నేను ఇక్ష్వాకువంశమునందు బుట్టినవాడను వేదశాస్త్రములయందు విశేషమైన ప్రజ్ఞగలవాడను.

శ్లో॥ యావంతో్య భూమికణికా యావంత స్తోయబిందవః।
యావం త్యుడూని గగనే తావతీ రదదం స్మ గాః॥ ౨౨

తా. భూమియంతయు నెన్నికణికలగునో యెన్నిజలబిందువులుగలవో ఆకాశమునందు యెన్నినక్షత్రములుగలవో అన్ని గోదానములను జేసితిని.

శ్లో॥ సర్వే యజ్ఞా మయా చేష్టాః పూర్తా న్యాచరితాని మే।
దానా న్యపి చ దత్తాని ధర్మరాజ్యం త్వనుష్ఠితం॥ ౨౩

తా. నేను సమస్తయజ్ఞములను జేసితిని, చెఱువులుత్రవ్వించుట తోటలువేయించుట మొదలగు సత్కర్మములను చేసితిని మఱియు నివిగాక నాచే సమస్తదానము లీయబడినవి. కాబట్టి ధర్మప్రకారముగానే నేను రాజ్యము నేలితిని.

శ్లో॥ తథాపి దుర్గతి ర్జాతా మమ చోర్ధ్వగతిం వినా
త్రివారం చాతకత్వాం మే గృధ్రిత్వం చైకజన్మని॥
సప్తజన్మసు శ్వానత్వం ప్రాప్తం పూర్వం మయాద్విజ॥ ౨౪

తా. ఓబ్రాహ్మణుడా ! ఈప్రకారము యెల్లప్పుడు సత్కర్మములనే జేయుచు ధర్మప్రకారముగా రాజ్యపరిపాలన జేసినను పుణ్యలోకములేక పాపమునుభవించుచు మూడుపర్యాయములు వానకోయిలగాను ఒకపర్యాయము గ్రద్దగాను ఏడుపర్యాయములు కుక్కగాను జన్మించి యిప్పుడు బల్లిగా జన్మించితిని.

శ్లో॥ సించతానేన* భూపేన త్వపః పాదావనేజనీః
బిందవో దూర ముత్క్షిప్తా స్తైః క్షిప్తోహం కథంచన॥
తేనజన్మస్మృతి రభూ త్సర్వపాప్మాహృత శ్చ మే॥ ౨౬

తా. ఇప్పుడీరాజు మీపాదప్రక్షాళనముజేసిన యుదకమును జల్లుకొనుటకు పైకి చిమ్మగా వానిలో కొన్నిబిందువులు నాపైబడుటచే నాపాపము యజ్ఞానము తొలగి పోయి పూర్వజన్మస్మృతి గలదాననైతిని.

శ్లో॥ గోధాజన్మాని భావ్యాని హ్యష్టావింశతి మే ద్విజ।
దృశ్యంతే దైవసృష్టాని బిభ్యే తై ర్జన్మభి ర్భృశం॥ ౨౭

తా. ఓబ్రాహ్మణుడా ! ఇకముందు నాకు ఈబల్లిజన్మమందు యిరువదియెనిమిది పర్యాయములు పుట్టవలసినట్లు ఈశ్వరసృష్టి యున్నట్లుగా నాకు కనుపించుచున్నది కాబట్టి ఆజన్మంబుల నెట్లు తప్పించుకొందునా యని భయపడుచున్నాను.

శ్లో॥ న కారణం ప్రపశ్యామి తన్మే విస్తరతో వద ।
ఇత్యుక్త స్స ద్విజః ప్రాహ జ్ఞాత్వా విజ్ఞానచక్షుషా॥ ౨౮

తా. ఈజన్మములను పోగొట్టుకొనుటకు కారణమును తెలిసికొన సమర్థురాలను కాను కాబట్టి ఆ కారణమును నాకు సవిస్తరముగా జెప్పుమని బల్లి పలుకగా నా బ్రాహ్మణుడు దివ్యజ్ఞానముచే తెలిసికొని యిట్లు చెప్ప దొడంగెను.

శ్లో॥ శృణు భూప ప్రవక్ష్యామి తవ దుర్యోనికారణం।
న జలం తు త్వయా దత్తం వైశాఖే మాధవప్రియే॥ ౨౯

తా. ఓరాజా ! నీకు యీదురవస్థ సంభవించుటకు హేతువును జెప్పుచున్నాను వినుము. నీవు పూర్వమందు రాజవైయుండగా విష్ణుమూర్తికి ప్రీతికరమైన వైశాఖ మాసములో నొక్కనికైనా జలదానమును చేసి యుండలేదు.

శ్లో॥ తజ్జలం సులభం మత్వా హ్యమూల్య మితి నిశ్చితం ।
నాధ్వగానాం ద్విజాతీనాం ధర్మకాలే ప్యజానతా॥ 30

తా. ఆజలము ప్రతిస్థలమందును సులభముగా దొరకుననియు పిశేష ఖరీదుగల వస్తువుగాదనియు నిశ్చయముగా దలచి మార్గాయాసముచే నలసి వచ్చిన బ్రాహ్మణులకైనను ధర్మముచేయదగిన కాలమని విచారించక జలదానముచేసితివి కావు.

శ్లో॥ తథా పాత్రం సముత్సృజ్య హ్యపాత్రే ప్రతిదత్తవాన్ ।
జ్వలంత మగ్ని ముత్సృజ్య న హి భస్మని హూయతే॥ 31

తా. అగ్నిహోత్రమును జేయదలచినవాడు మండుచున్న యగ్నిహోత్రమును విడిచి బూడిదెయందు హోమముజేసినట్లువలెనే నీవు ధర్మముజేయదలచియు సత్పాత్రులగు బ్రాహ్మణులకు దానమీయక అపాత్రులైనవారికే దానమిచ్చితివి.

శ్లో॥ బహుధా వర్ణితస్యాపి సౌగంధ్యాదియుతస్య చ।
కంటకాన్వితవృక్షస్య న కుర్వంతి సమర్చనం॥ 32

తా. అనేక విధములుగా వర్ణింపబడిన దైనను పరిమళము మొదలగు సుగుణములుగలవియైనను ముండ్లకంపచే నావరింపబడిన వృక్షమునకు నెవరును పూజజేయరుగదా ?

శ్లో॥ విశిష్టానాం పాదపానా మశ్వత్థ స్సేవతాం గతః।
తులసీం తు సముత్సృజ్య బృహతీ పూజ్యతే చ కిం॥ 33

తా. వృక్షములన్నిటిలోను రావిచెట్టు శ్రేష్ఠమైనది. అట్టి రావిచెట్టును పూజింతురు. లేక తులసిని పూజింతురుగాని వాకుడు చెట్టు నెవరు పూజింతురు.

శ్లో॥ అనాథత్వం పూజ్యతాయాం న ప్రయోజకతా మియాత్ ।
పంగ్వాద్యా యే హ్యనాథా హి దయాపాత్రం హి కేవలం॥ 34

తా. దిక్కులేక పోవుట పూజించుట కారణముకాదు. కాబట్టి దిక్కులేని కుంటివారు మొదలగువారిని దయచే పోషింపవలయునే గాని పుణ్యము సంపాదించుకొనుటకు కారణములేదు.

శ్లో॥ తపోనిష్ఠా జ్ఞాననిష్ఠా శ్రుతిశాస్త్రవిశారదాః
విష్ణురూపా స్సదా పూజ్యా నేతరే తు కదాచన॥ 35

తా. తపస్సునందు జ్ఞానమునందు నిష్ఠగలవారును వేదములయందును శాస్త్రములయందును నేర్పరులైన వారును విష్ణు స్వరూపులుగాన అట్టివారినే యెల్లప్పుడు పూజింపవలయునుగాని యితరులను పూజించిన ప్రయోజనములేదు.

శ్లో॥ తత్రాపి జ్ఞానినో త్యర్థం విప్రా విష్ణో స్సదైవ హి
జ్ఞానినా మపి భూపాల విష్ణు రేవ సదా ప్రియః॥ ౩౬

తా. వారిలో జ్ఞానముగలవారు ముఖ్యముగా విష్ణుస్వరూపులైయున్నారు. విష్ణుమూర్తియు జ్ఞానముగలవారియందు నెల్లప్పుడు ప్రియముగలవాడు.

శ్లో॥ తస్మాత్ జ్ఞానీ సదా పూజ్యః పూజ్యా త్పూజ్యతర స్స్మృతః
అవజ్ఞా సాధువృత్తానా మిహాముత్ర చ దుఃఖదా॥ ౩౭

తా. ఆకారణమువలన జ్ఞానముగలవాడు యెల్లప్పుడు పూజింపతగినవాడు. పూజ్యులందరిలోను మిక్కిలి పూజింపతగినవాడు. అట్టిసచ్చరిత్రుల నవమానముజేయుట యిహలోక పరలోకములయందు దుఃఖము కలుగజేయుచుండును.

శ్లో॥ సేవా వై మహాతాం పుంసాం పుమర్థానాం హి కారణం।
కోటయో ప్యంధజాతీనాం న పశ్యంతి యథా యథం॥ ౩౮

తా. మహానుభావులగు పురుషులను సేవించుట పురుషార్థములగు ధర్మార్థకామమోక్షములకు సాధనము. అజ్ఞానముచే నంధులగు యావన్మందియు ఈయథార్థవిషయమును తెలిసికొనలేరు.

శ్లో॥ ఏవం మందాయుతానాం తు సంగతి ర్నార్థదా భవేత్॥

తా. కాబట్టి మూఢులైనవారి ననేకుల సహవాసముజేసినను పురుషార్థములు కలుగవు.

శ్లో॥ న హ్యమ్మయాని తీర్థాని న దేవా మృచ్ఛిలామయాః
తేపునం త్యురుకాలేన దర్శనా దేవ సాధవః
న సాధుసేవనా త్క్వాపి సీదంతే త్రై స్సుశిక్షితాః॥ ౪౦

తా. జలమయములగు తీర్థములను మట్టి విగ్రహములను రాతివిగ్రహములనుసేవించినయెడల బహుకాలమునకు తరింతురు సత్పురుషులను చూచినంతమాత్రముననే తరింతురు. కాబట్టి సత్పురుషులను సేవించినయెడల వారిచే మంచివిషయములను బోధింపబడినవారలై కష్టములను పొందరు.

శ్లో॥ జన్మమృత్యుజరావ్యాధి ర్వా సుధయా ప్యాయితా యథా।
న జలం తు త్వయా దత్తం సాధవో నా న సేవితాః॥

తా. అమృతపానమును జేసినయెడల జన్మముమృత్యువు ముదిమిపోవురీతిగా సమస్తపాపములను పోగొట్టునట్టి జలదానమునుజేసితివికావు. సత్పురుషులనైనా సేవించితివికావు.

శ్లో॥ తేన తే దుర్గతి శ్చేయం ప్రాప్తా చేక్ష్వాకునందన
వైశాఖే మత్కృతం పుణ్యం తుభ్యం దాస్యామి శాంతయే
భూతంభవ్యం భవే ద్యేన కర్మజాతం విజేష్యసి
ఇత్యుక్త్వాప ఉపస్పృశ్య దదౌ పుణ్య మనుత్తమం॥ ౪౩

తా. ఇక్ష్వాకువంశమందు బుట్టిన నోహేమాంగుడా ! ఆకారణంబున నీకు యిట్టి దుర్గతికలిగినది. అట్టినీదుర్గతి పోవుటకు నేను వైశాఖ మాసంబున జేసిన పుణ్యాము ను నీకిత్తును దానిచే నాగామిసంచిత ప్రారబ్ధస్వరూపములగు కర్మములను జయింపగలవు. అని పలికి యామునీశ్వరుడు జలమును స్పృశించి శ్రేష్ఠంబగు వైశాఖ మాసవ్రత సంబంధమైన పుణ్యాము నిచ్చెను.

శ్లో॥ యదా దత్తం బ్రాహ్మణేన స్నానం కతిదినే కృతం
తేన ధ్వస్తాఖిలాఘ స్త్యక్త్వా తాం గృహగోధికాం
దివ్యం విమాన మారుహ్య దివ్యస్రగ్వ స్త్రభూషణః
పశ్యతా మేవ భూతానాం మైథిలస్య గృహాంతరే
బద్ధాంజలిపుటో భూత్వా పరిక్రమ్య ప్రణమ్య చ
అనుజ్ఞాతో యయౌ రాజా స్తూయమానో ఽమరైర్దివం॥ ౪౯

తా. ఆమునీశ్వరుడు వైశాఖ మాసములో కొన్ని దినములయందు స్నానమును జేసిన పుణ్యామునిచ్చిన వెంటనే యాబల్లి స్వరూపముగానుండు రాజు తన పూర్వజన్మ పాపమంతయును నశించిపోవుటచే బల్లి రూపమును విడిచి యాశ్రుతకీర్తి మహారాజు యొక్క గృహమునందు అందరు చూచుచుండగా దేవతా సంబంధమైన వస్త్రముల ను మాలికలను అభరణములను ధరించినవాడై దోసిలిజేసి యామునీశ్వరుని చుట్టు ప్రదక్షిణముజేసి నమస్కరించి యానుజ్ఞవడసి యాహేమాంగమహారాజు దేవతావిమానము నెక్కి దేవతులచే నుతింపబడుచు స్వర్గమును గూర్చి వెళ్ళెను.

శ్లో॥ తత్ర భుక్త్వా మహాభోగాన్ వర్షాయుత మతంద్రితః
స ఏవ చేక్ష్వాకుకులే కాకుస్థో భూ న్మహాప్రభుః ౪౭

తా. ఆ స్వర్గలోకమునందు పదివేల సంవత్సరములు గొప్పభోగముల ననుభవించి మందుడుగాని వాడై పిమ్మట నాహేమాంగుడే ఇక్ష్వాకువంశమందు కాకుస్థుడను గొప్పప్రభువుగా జన్మించెను.

శ్లో॥ సప్తద్వీపవతీపాలో బ్రహ్మణ్య స్సాధుసంమతః
దేవేంద్రస్య సఖా విష్ణో రంశ ఏవ మహాప్రభుః ౪౮

తా. ఆరాజు యేడుద్వీపముల పర్యంతము రాజ్యము నేలువాడును బ్రాహ్మణ భక్తిగలవాడును సత్పురుషులకు నిష్టుడును దేవేంద్రునకు స్నేహితుడును విష్ణువుయొక్క ఆంశము పరిగ్రహించిన వాడునైయుండెను.

శ్లో॥ బోధిత స్తు వసిష్ఠేన వైశాఖోక్తాన్ మనోరమాన్ ।
అనుష్ఠాయాఖిలాన్ ధర్మాన్ తేన ధ్వస్తాఖిలాశుభః ।
దివ్యం జ్ఞానం సమాసాద్య విష్ణో స్సాయుజ్య మాప్నుయాత్ ।
వైశాఖ శ్శుభద స్తస్మా త్సుంభి స్సర్వైరనుష్ఠితః॥ ౫౦

తా. ఆరాజు వసిష్ఠమహామునివలన తెలిసికొనబడి వైశాఖమాస సంబంధమైన విహితము నాహ్లాదకరమైనవియు నగు సమస్తధర్మములనుజేసి వానివలన సమస్తపాపములను పోగొట్టుకొని శ్రేష్ఠమైన యాత్మజ్ఞానమునుపొంది జన్మానంతరమున విష్ణుమూర్తియందైక్యమునొందెను కాబట్టి వైశాఖమాసము శ్రేష్ఠమైనదిగా జెప్పబడినదిగాన సమస్తమైనవారిచే వైశాఖమాససంబధమైన వ్రతము జేయతగినది.

శ్లో॥ ఆయుర్యశఃపుష్టిదోఽయం మహాపాపౌఘనాశనః।
పుమర్థానాం నిదానం చ విష్ణుః ప్రీణాత్యనేన తు॥ ౫౧

తా. ఈవైశాఖమాసవ్రతము ఆయుస్సును కీర్తినిబలమునిచ్చును. మహాపాపములనన్నిటిని పోగొట్టును. పురుషార్థములగు ధర్మార్థకామ మోక్షములకు కారణమైనది ఈవ్రతముచే విష్ణుమూర్తియు సంతోషించును.

శ్లో॥ చాతుర్వర్ణ్యనరై స్సర్వై శ్చతురాశ్రమవర్తిభిః ।
అనుష్ఠేయో మహాధర్మో వైశాఖే మాధవాగమే॥ ౫౨

తా. బ్రాహ్మణాది నాలుగువర్ణములవారును బ్రహ్మచర్యాది నాలుగాశ్రమములవారును యావజ్జనులును వసంతఋతువు సంబంధమగు వైశాఖమాసవ్రతమును జేయవలయును.

ఇతి శ్రీస్కాందపురాణే వైశాఖమాహాత్మ్యే నారదాంబరీష
సంవాదే గృహగోధికాఖ్యానంనామ
షష్ఠోధ్యాయస్సమాప్తః

అథసప్తమోధ్యాయః
నారదఉవాచ.

శ్లో॥ రాజా తదద్భుతం దృష్ట్వా మైథిలో ధర్మవిత్తమః ।
కృతాంజలి స్సుఖాసీనం విస్మితో వాక్య మబ్రవీత్॥ ౧

తా. నారదుడు చెప్పుచున్నాడు. మిథిలకు నధిపతియు ధర్మమును తెలిసినవాడునగు యాశ్రుతకీర్తి మహారాజు అప్పుడు జరిగిన వృత్తాంతమునంతయు జూచి ఆశ్చర్యమునొంది నవ్వుచు దోసిలియొగ్గి సింహాసనమున సుఖముగా గూర్చుండియుండిన యామునీశ్వరునితో నిట్లు పలుకుచున్నాడు.

శ్లో॥ దృష్ట మేత న్మహాశ్చర్యం సాధూనాం చరితం తథాః ।
యేన ధర్మేణ ముక్తోభూ ద్రాజా చేక్ష్వాకునందన ।
తం ధర్మం విస్తరేణైవ శ్రోతుం కౌతూహిలం హిమే ।
మహ్యాం శ్రద్ధావ తే విద్వా౯ కృపయావిస్తరా ద్వద॥ 3

తా. ఓమునీశ్వరుడా ! సత్పురుషుల చరిత్రను జూచిన మిక్కిలి యాశ్చర్యముగానుండును. ఈ హేమాంగు డేధర్మముచే ముక్తినొందెనో! ఆధర్మమును సవిస్తరముగా వినుటకు మిక్కిలి కోరిక గలవాడనై యుంటిని గాన శ్రద్ధతోగూడిన నాకు సవిస్తరముగా జెప్పుము.

శ్లో॥ ఇతి రాజ్ఞా సుసంపృష్టః శ్రుతదేవో మహామునిః ।
సాధుసాధ్వితి సంభాష్య వ్యాజహార నృపోత్తమం॥ ౪

తా. ఈప్రకారముగా శ్రుతకీర్తి మహారాజుచేనడుగబడినవాడై శ్రుతదేవుండను మహాముని నీచేనడుగబడిన ప్రశ్నమిక్కిలిబాగుగానున్నదని ప్రశంసించి యారాజుతోనిట్లు పలుకుచున్నాడు.

శ్లో॥ సమ్యగ్వ్యవసితా బుద్ధి స్తవ రాజర్షిసత్తమ ।
వాసుదేవప్రియాన్ ధర్మాన్ శ్రోతుం యస్మాన్మతి స్తవ॥ ౫

తా. ఓరాజశ్రేష్ఠుడా! విష్ణుప్రీతికరమైన ధర్మములను వినవలయునని వాంఛ గలిగినది గాన నీకు మంచిబుద్ధి కలిగినది.

శ్లో॥ బహుజన్మార్జితం పుణ్యం వినా కస్యాపి దేహినః ।
వాసుదేవకథాలాపె మతి ర్నైవోపజాయతే॥ ౬

తా. యేమనుష్యుడైనను అనేక పూర్వజన్మములయందు పుణ్యమును జేయని యెడల అట్టివానికి విష్ణుసంబంధమగుకథలను స్మరించుటయందాసక్తి కలుగదు.

శ్లో॥ యౌవనే రాజాధిరాజాయ జాతేయం మతిరీదృశీ।
శుద్ధం భాగవతం మన్యే తేనత్వాం సాధుసత్తమ॥ ౭

తా. సత్పురుషులలో శ్రేష్ఠుడా! నీవు రాజులకందరికి రాజువైయుండి గొప్ప భోగము ననుభవించునట్టి యౌవనదశయందుండినవాడవై నప్పటికి నీకిట్టిసద్బుద్ధి కలుగుటవలన నిన్ను పరమభాగవతోత్తమునిగా దలచుచున్నాను.

శ్లో॥ తస్మాత్తుభ్యం బ్రువే సౌమ్య ధర్మాన్ భాగవతాన్ శుభాన్
యాన్ జ్ఞాత్వా ముచ్యతే జంతు ర్జన్మసంసారబంధనాత్॥ ౮

తా. ఓసత్పురుషుడా! నీవు భాగవతోత్తముడవు గాన మనుష్యుడే ధర్మములను దెలిసికొని జన్మమృత్యురూపమైన సంసారబంధమును విడిచిపెట్టగలడో। అట్టిశుభకరంబులగు భగవత్సంబంధమైన ధర్మములను నీకొఱకు చెప్పుచున్నాను,

శ్లో॥ యథా శౌచం యథాస్నానం యథాసంధ్యా చతర్పణం।
అగ్నిహోత్రం యథాశ్రాద్ధం తథావైశాఖసత్క్రియాః॥ ౯

తా. శుచిగానుండుట స్నానముజేయుట సంధ్యావందనముజేయుట తర్పణముజేయుట అగ్నిహోత్రములనుజేయుట యెట్లు పుణ్యకరమో అతీరుననే వైశాఖమాసంబున జేసిన ధర్మములు పుణ్యకరములైనవి.

శ్లో॥ వైశాఖే మాధవే ధర్మా నకృత్వా నోర్ధ్వ గోభవేత్।
నవైశాఖసమో ధర్మో ధర్మజాతేషువిద్యతే॥ ౧౦

తా. విష్ణుప్రీతికరమైన వైశాఖ మాసములో ధర్మములను జేయనివాడు స్వర్గాది పుణ్యలోకములను పొంద నేరడు. కాబట్టి ధర్మములలో వైశాఖమాసధర్మముతో సమానమైన ధర్మము మఱియొకటిలేదు.

శ్లో॥ సంత్యేవ బహవో ధర్మా ప్రజా శ్చారాజకా ఇవ
ఉపద్రవై శ్చ లుప్యంతి నాత్ర కార్యా విచారణా॥ ౧౧

తా. రాజుచే పరిపాలింపబడని ప్రజలవలెనే యనేక ధర్మములున్నవిగాని యవియన్నియు దుఃఖకరములైనవి. ఇందువిషయమై యెంతమాత్రము విచారింపనగత్యములేదు.

శ్లో॥ సులభా స్సకలా ధర్మాః కర్తుం వైశాఖచోదితాః॥

తా. వైశాఖ మాసములో సులభముగాఁజేయుతగిన సమస్త ధర్మములను చెప్పుచున్నాను.

శ్లో॥ ఉదకుంభం ప్రపాదానం పథిచ్ఛాయా సునిర్మితం
ఉపానత్పాదుకాదానం ఛత్రవ్యజనయో స్తథా
తిలయుక్తమధో ర్దానం గోరసానాం శ్రమాపహం॥ ౧౩

తా. జలసహితమైన కలశముమ మార్గమధ్యమందు చెట్లనీడలయందు చలివేంద్రనేర్పఱచి జలము నిచ్చుటయు చెప్పులను పావకోళ్ళను గొడుగులను విసనకఱ్ఱలనిచ్చుటయు తిలసహితమైన తేనెను అయాసమును పోగొట్టునట్టి గోసంబంధమగు మజ్జిగ మొదలగు వాని నిచ్చుటయును జేయవలయును.

శ్లో॥ వాపీకూపతటకాదికరణం పథికాశ్రయం।
నారికేళేక్షుకర్పూరకస్తూరీదాన మేవ చ॥ ౧౪

తా. మార్గములమధ్యమందు మార్గస్థులకుపయోగకరమగునట్లుగా నూతులను దిగుడుబావులను చెఱువులను నిర్మించుట కొబ్బరికాయలను చెఱకుగడలను కర్పూరమును కస్తూరి మొదలగు వాని నిచ్చుటయును జేయనలయును.

శ్లో॥ గంధానులేపనం శయ్యాఖట్వాదానం తథైవ చ।
తథా చూతఫలం రమ్య మూర్వారురసాయనం॥

తా. మంచిగంధమును పూయుటయు పఱుపు మంచము మొదలగువాని నిచ్చుటయు రుచికరములైన మామిడిపండ్లను దోసపండ్ల నిచ్చుటయు జేయవలయును.

శ్లో॥ దానం దమనపుష్పాణాం తథా సాయం గుడోదకం।
చిత్రాణ్యన్నాని పూర్ణాయాం దధ్యన్నం ప్రత్యహం తథా॥ ౧౬

తా. దమనమును పుష్పముల నిచ్చుటయు సాయంకాలమునందు పానకమిచ్చుటయు పూర్ణిమదినమునందు పులిహోర మొదలగు చిత్రాన్నముల నిచ్చుటయు ప్రతిదినంబున పెరుగు సహితమైన యన్నము నిచ్చుటయు జేయవలయును.

శ్లో॥ తాంబూలస్య సదా దానం చైత్రదర్శే కరీరకం।
రవావనుదితే పూర్వం ప్రాతస్స్నానం దినేదినే। ౧౭

తా. ఎల్లప్పుడు తాంబూలముల నిచ్చుటయు చైత్రబహుళామావాస్యయందు వెదురుకొమ్మల నిచ్చుటయును ప్రతిదినమందును సూర్యుడుదయింపక పూర్వమందు ప్రాతస్స్నానమాచరించుటయు జేయవలయును.

శ్లో॥ మధుసూదనపూజా చ కథాయా శ్శ్రవణం తథా।
అభ్యంగవర్జనం చైవ తథా వై పత్రభోజనమ్॥ ౧౮

తా. విష్ణుసంబంధమగు పూజను విష్ణుకథను వినుటయు తలయంటి కొనుట మానుటయు విస్తరిలో భుజించుటయు జేయవలయును.

శ్లో॥ మధ్యేమధ్యే శ్రమార్తానాం వీజనం వ్యజనేన చ।
సుగంధైః కోమలైః పుష్పైః ప్రత్యహం పూజనం హరేః ౧౯

తా. మార్గాయాసముచే నలసియున్న వారికి అప్పుడప్పుడు విసనకఱ్ఱతో విసరుటయు సువాసనగలవియు మృదువైనవియునగు పుష్పములతో నిత్యము విష్ణుమూర్తిని పూజించుటయు జేయవలయును.

శ్లో॥ ఫలం దధ్యన్ననైవేద్యం ధూపదీపై ర్దినేదినే
గోగ్రాసం నృపపత్నీనాం ద్విజపాదావనేజనం॥ ౨౦

తా. ప్రతిదినమందు విష్ణుమూర్తిని పూజించి ధూపదీపములనిచ్చి ఫలములను పెరుగు సహితమైన యన్నము నైవేద్యము జేయవలయును. ఆబోతులకు గోవులకు నాహారమిచ్చుటయు బ్రాహ్మణుల పాదప్రక్షాళనమును జేయుచుండవలయును.

శ్లో॥ గుడనాగరదానం చ ధాత్రీపిష్టప్రదాపనం
పథికానాం ప్రశ్రయం చ దానం తండులశాకయోః ౨౧

తా. బెల్లము శొంఠి నిచ్చుటయు నుశిరికపప్పు నిచ్చుటయు మార్గస్థులను కుశలప్రశ్నలచేసి యడుగుట బియ్యమును కూరగాయలనిచ్చుట జేయవలయును.

శ్లో॥ ఏతే ధర్మాః ప్రశస్తా హి వైశాఖే మాధవప్రియే॥

తా. ఓరాజా! ఈచెప్పబడిన ధర్మములన్నియు విష్ణుప్రీతి కరమైన వైశాఖమాసములో ముఖ్యముగా జేయతగినవిగా జెప్పబడినవి.

శ్లో॥ తథా చ విష్ణోః కుసుమార్పణాం హరేః
పూజా చ కాలోచితపల్లవాద్యైః
దధ్యన్ననైవేద్యనివేదనం చ సమస్తపాపౌఘ వినాశ హేతుః ౧౭

తా విష్ణుమూర్తికి పుష్పములను సమర్పించుటయు ఆయాకాలములయందుండునట్టి చిగుళ్లు మొదలగు వానిచే విష్ణుని పూజించుటయు పెరుగుసహితమైన యన్నమును నివేదన జేయుటయు సమస్త పాపరాసులను పోగొట్టుకొనుటకు కారణమైయున్నది.

శ్లో॥ నారీపుష్పై ర్మాధవం నార్చయేద్యా।
ద్విజాఖ్యాతం మందిరే వా గృహే వా।
పుత్రం సౌఖ్యం క్వాపి నాప్నోతి హంతీ
చ్ఛాం వా భర్తుస్స్వాత్మనో వా మహాత్మన్ ౧౮

దా. ఓమహానుభావుడా! యేస్త్రీబ్రాహ్మణోత్తములచే ప్రకటింప జేయబడుచుండెడి విష్ణుమూర్తిని దేవాలయమందుగాని తనగృహమునందుగాని పూజింపకుండునో అట్టిస్త్రీ పుత్రాది సంతానమును సౌఖ్యమును గానియెప్పుడును పొందనేరదు. మరియు పెనిమిటికిని సంతోషమును కలిగించలేదు. తానైనను సంతోషచిత్తురాలైయుండనేరదు.

శ్లో॥ రసూనసహాయేమాధవేమాసివిష్ణౌహరితాయైధర్మసంస్థాంప్రజానాం
గృహం యాతే మునిభిర్దైవతైశ్చ
కాలేష్వేతం నార్చయేద్యస్సుమాఢః॥ ౧౮
సమూఢాత్మా రౌరవం ప్రాప్య పశ్చా
ద్యాయాద్యోనిం రాక్షసీంపంచవారం।
జలం చాన్నం సర్వదా దేయమస్మిన్
క్షుధార్తానాం ప్రాణినాం ప్రాణహేతుః॥ ౨౦

తా. వైశాఖమాసమునందు విష్ణుమూర్తి భూలోకములో మనుష్యులేమైనను ధర్మ మాచరించుచుండిరో, లేదోయని పరీక్షించుటకొఱకు లక్ష్మీదేవితోడను మునీశ్వరుల తోడను దేవతలతోడను గూడి వచ్చి ప్రతి గృహమందు నుండును. కాబట్టి యేమాధుండు ఆవిష్ణుమూర్తిని పూజించడో అట్టివాఁడు రౌరవమను నరకమనుభవించి యనంతరమున ఆయిదు జన్మంబుల పర్యంతము రాక్షసయోని యందు బుట్టుచుండును. కాబట్టి ప్రతి మనుష్యుఁడును వైశాఖమాసములో విష్ణుమూర్తిని పూజించుచు నాకలిచే పీడింపఁబడువారికి ప్రాణాధారమైనట్టి జలమునన్నము నెల్లప్పుడిచ్చుచుండ వలయును.

శ్లో॥ తిర్యగ్జంతు ర్జాయతే వై హ్యదానా।
దన్నాదానా జ్జాయతే వైపిశాచః।
అన్నాదానే చానుభూతాం కథాం తే।
చాహం వక్ష్యే చాద్భుతాం భూమిపాల॥ ౨౭

తా. జలదానమునియ్యని యెడల పశువుగా జనియించుచున్నాఁడు. అన్నదానము జేయనియెడల పిశాచమై పుట్టుచున్నాఁడు. ఓరాజా! అన్నదానము జేయనివిషయములో ప్రత్యక్షముగా నాచేఁజూడఁబడినదియు నాశ్చర్యకరమగునదియునైనయొక కథను చెప్పుచున్నాను వినుము.

శ్లో॥ రేవాతీరే మత్పితా భూత్పిశాచ।
స్స్వమాంసాశీ క్షుత్తృషా శ్రాంతగాత్రః।
ఛాయాహీనే శాల్మలీవృక్షమూలే।
హ్యన్నాభావా న్నష్టచైతన్యపక్షః॥ ౨౮

తా. పూర్వమందు మాతండ్రి మృతినొందినపిమ్మట పిశాచశరీరము గలవాఁడై రేవానదీ సమీపమందు తిరుగుచు నాకలి దప్పికలచేసలసినవాఁడై తనమాంసమునే భక్షించుచు నాహారము లేకపోవుటచే శుష్కించిన శరీరముగలవాఁడై నీడలేని బూరుగచెట్టునందు నివసించుచుండెను.

శ్లో॥ క్షుధాతృషా కర్మణా తన్ముఖస్య।
సూక్ష్మం ఛిద్రం కంఠనాలస్య చాసీత్।
మాసం చాంతఃకంఠమధ్యే నిమగ్నాం।
కుర్యా త్పీడాం ప్రాణపర్యంతమేవ॥ ౨౯

జలం దృష్ట్వా కాలకూటప్రకల్పం సుశీతం వాపీహా కాసారసంస్థం॥

తా. ఆకలి దప్పికల చేతను పూర్వముజేసిన దుష్కృతముల చేతను పీడింపబడు చుండగా నాపిశాచముయొక్క కంఠమునందు సూక్ష్మరంధ్రిమేర్పడి గాయమై కంఠ మధ్యమందు బాధనొందుచున్నవాడై దగ్గిర సరస్సులో చల్లనియుదకమున్నను కాల కూటవిషమునువలె గ్రహింపక ప్రాణాంతకమైన బాధను పడుచుండెను.

శ్లో॥ తస్యాస్తీరే చాగతో దైవయోగా।
ద్గంగాయాత్రాకారణాన్మార్గమధ్యే।
దృష్ట్వాద్భుతంశాల్మలివృక్షసంస్థం।
తృట్వాతృట్వా భక్షయంతం స్వమాంసం।
క్రోశంతంక తం బహుధా శోచ్యమానం।
క్షుధాతృషావ్యధితం ర్మభిస్సైవః॥ 30

తా. అటువంటిసమయములో నేను కాశీయాత్రను చేయుటకు బయలుదేరి దారేవానదీమార్గమున నే వచ్చుచుండి మార్గమధ్యమందు బూరుగచెట్టుకు సమీపమున తన మాంసమును మాటిమాటికి కొరికి భక్షించుచున్నవాడును అరుచుచున్నవాడును పూర్వదుష్కృతకర్మములచేతను ఆకలిదప్పికలచేతను పీడింపబడి దుఃఖించుచున్న వాడునగు పిశాచమును జూచితిని.

శ్లో॥ స మాం హంతుం ప్రాద్రవత్పాపకర్మా।
మత్తేజసా నిహతో దుద్రువే చ।
తం చాబ్రువ న్కృపయా క్లిన్నచిత్తో।
మాభైష్ట త్వం హ్యభయం తే హి దత్తం॥ 31

తా. అప్పుడా పాపాత్ముడు నన్ను చంపుటకొరకు వచ్చినవాడై నా తేజస్సు చేకొట్టబడి పారిపోయెను. అంతట దయచేమెత్తబడిన మనస్సుకలవాడనైనీకు భయము లేదు అభయమునిచ్చితినని యాపిశాచముతో బలికితిని.

శ్లో॥ క స్త్వం తాత బ్రూహి సద్యో న్న హేతుం।
కృచ్ఛ్రాద్దస్మాన్మోచయే మావిషీద।
ఇత్యుక్తో మాం ప్రాహ పుత్రిం త్వజాన।
న్సూర్యావర్తే భూవరాఖ్యే పురే చ। 32

నామ్నా మైత్రి స్సంకృతే గోత్రిజో ఽ హం ।
తపోవిద్యాదాన యజ్ఞాదినిష్ఠః
మయా ధీతా ధ్యాయితా స్సర్వవిద్యాః
కృతో మయా సర్వతీర్థావగాహః॥ ౩౪

తా. మఱియు ఓతండ్రీ నీవెవరవు (ఇక్కడ తండ్రీ అను పదము మర్యాదార్థము) నీవు దుఃఖింపకుము. ఆహారములేక దుఃఖించుటకు కారణమేమైయుండునో చెప్పినయెడల యేవిధముగానైనను ఆకష్టమును దొలగించెదనని నే పలుకగా నన్ను కుమారునిగా తానెఱుగక నిట్లు పలుకుచున్నాడు. పూర్వకాలంబున భూవరమను పట్టణంబున నివసించుచుండువాడను. మైత్రుండను పేరుగలవాడను, సంకృతియను గోత్రమున జనించినవాడను. తపస్సు విద్యదానము యజ్ఞము మొదలగు వానియందాసక్తిగలవాడను. సమస్తవిద్యలను నేను చదివితిని, యితరులకు చెప్పితిని, సమస్తతీర్థ యాత్రలను సేవించితిని.

శ్లో॥ దత్తం నాన్నం మాసి వైశాఖసంజ్ఞే ।
లోభా ద్భిక్షామాత్ర మప్యంగ కాలే ।
శోచే చాహం ప్రాప్యపై శాచయోనిం ।
నాన్యో హేతు స్సత్య మేవోక్త మంగ॥ ౩౫

తా. లోభిగుటచే వైశాఖమాసములో అన్నదానమును జేయనైతిని, సకాలమందు వచ్చువారికి భిక్షమునైనను బెట్టనైతిని, ఓబ్రాహ్మణుడా ! అందువలన పిశాచజన్మమును పొందితిని, కాబట్టి దుఃఖించుచున్నవాడను. ఇంతకంటె వేరొక కారణము లేదు. నిజము నే జెప్పితిని.

శ్లో॥ పుత్రోఽధునా వర్తతే మద్గృహే చ ।
భూరిఖ్యాతి శ్శ్రుతదేవాభిధానః ।
వాచ్యా తస్మై మద్దశా చాత్మజాయ ।
వైశాఖాన్నాదానతోఽభూత్పిశాచః॥ ౩౬

తా. మఱియు విశేషకీర్తిగలవాడును శ్రుతదేవుండను పేరుగల కుమారుఁడు నాగృహమందుండెను కాబట్టి యచ్చటికేతెంచి వైశాఖమాసములో నన్నదానము జేయకపోవుటచే నేను పిశాచజన్మంబును పొందుటను నాకుమారునితో జెప్పుము

శ్లో॥ దృష్ట స్తీరే తే పితా నర్మదాయా ।
నోర్ధ్వం గతో వర్తతే వృక్షమూలే ।
ఖాద న్మాంసం స్వీయ మేవా సుఖిద్య ।
త్పితు రుక్తే మాసి వైశాఖసంజ్ఞే ।
ప్రాతస్స్నాత్వా పూజయిత్వా చ విష్ణుం ।
నిర్వ్యాజా న్మాంతర్పయిత్వా జలైశ్చ।
దేయం చాన్నం ద్విజవర్యే గుణాఢ్యే ।
ముక్తోఽ యోనే ర్యామివిష్ణోః పదం చ॥ ౩౮

తా. మఱియు నీతండ్రిని నర్మదాతీరమునందు జూచితిననియు నూర్ధ్వలోకమును పొందలేదనియు బూరుగవృక్షముక్రింద నుండెననియు తన మాంసమును తానే భక్షింపుచుండెననియు అట్టి నీతండ్రి ముక్తినిపొందుటకు వైశాఖమాసములో ప్రాతఃకాలమునందు స్నానముజేసి నిష్కల్మషమనస్సుగలవాడవై విష్ణుమూర్తిని పూజించి జలముచే నాకొఱకు పితృతర్పణముజేసి సర్వగుణసంపన్నుండగు బ్రాహ్మణునకన్న దానముజేసినయెడల నేను ముక్తుడనై యాగిమధ్యాంత రహితుండైనవిష్ణువుయొక్క స్థానమును పొందగలననియు జెప్పెను.

శ్లో॥ ఇత్థం చోక్తం త్వత్పురస్తా ద్వదేతి
దయా చైషా మత్కృతే నాత్ర శంకా।
భద్రం భూయాత్సర్వశో మంగళం తే
శ్రుత్వా చాహం భాషితం మే పితుశ్చ॥ ౩౯
దుఃఖా త్కాయం దండవ త్పాతయిత్వా
భృశార్తోహంపాదయో ర్భూరికాలం।
నిందన్నిదః భూర్యహం బాష్పనేత్రః
పుత్రోహం? తే తాతదైవాగతోహం

తా. ఈప్రకారముగా నీయెదుటచెప్పిన వృత్తాంతమునంతయు నాయందు దయయుంచి చెప్పవలయును ఇందువిషయమై సందేహింపవలదు, నీకు సర్వకాలములయందు శుభమగు, నని చెప్పిన మాతండ్రిమాటలను విని చారముగలవాడనై యాయనయొక్క పాదములయందు సాష్టాంగముగా పడి విశేషదుఃఖముగలవాడనై చాలాకాల

మువరకు లేవక తనను నిందించుకొనును కండ్లనుండి బాష్పములను విడుచుచు ఓతండ్రీ! నేను నీకుమారుడను దైవవశమువలన నేనిచ్చటకు వచ్చితిని.

శ్లో॥ కర్మభ్రష్టో భూసురాణాం వినింద్యో
నాభూ ద్యస్మాత్కేశ మోక్షః పితౄణాం।
ఆఖ్యాహి త్వం కర్మణా కేన ముక్తో
భవితా వై తత్కరోమి ద్విజేంద్ర॥ ౪౧

తా. ఓబ్రాహ్మణశ్రేష్ఠుడా! ఏకర్మనుజేసిన పితృదేవతలకు మోక్షముకలుగ నేరదో అట్టి భ్రష్టకర్మమును జేసినను బ్రాహ్మణులకు నింద్యమేగాని యోగ్యతకాదు. కాబట్టి యేకర్మమునుజేసిన నీవు ముక్తినిజెందెదవో, అట్టికర్మమునుజెప్పినయెడలచేసెద నని కుమారుడు చెప్పెను.

శ్లో॥ తతః ప్రాహ ప్రీతసర్వాంతరాత్మా
యాత్రాం కృత్వా శీఘ్రమాగత్య గేహం
ప్రాప్తే మాసే మేషసంస్థే చ భానౌ
నివేద్యాన్నం విష్ణవే త్వంగుణాఢ్య॥ ౪౧
దానం దేహి ద్విజవర్యే మహాత్మన్
తస్మా న్మోక్షో భవితాసాన్వయస్య॥

తా. ఈప్రకారముగా పుత్రదేహుండగు తనకుమారుండు యచ్చటికే దైవవశమున వచ్చుటచే సంతోషయుక్తమైన యావత్తుదేహముగలవాడై ఓకుమారుడా! నీవు యాత్రలను సేవించి శీఘ్రముగా నింటికివచ్చి సూర్యుడు మేషరాశియందు ప్రవేశించి నప్పుడు విష్ణువునకు నన్నమును నివేదనముజేసి మహానుభావుండగు బ్రాహ్మణునకు నన్న దానముజేసినయెడల అట్టివానియొక్క యావత్తువంశము తరించి మోక్షమునుపొందును.

శ్లో॥ పితా ద్రిష్టః కృతయాత్రః స్వగేహే
ప్రాప్యా కరం మాధవేచాన్నదానం।
తస్మా న్ముక్తో మత్పితా మాం సమేత్య
యానారూఢో హ్యభినంద్యా శిషా చ॥
గతో లోకం శ్రీపతే ర్దుర్విభావ్యం
యస్మిన్ గతా ననివర్తంతిభూయః॥ ౪౪

తా. ఈప్రకారము నాతండ్రిచే నాజ్ఞాపింపబడి తీర్థయాత్రలను సేవించి తిరిగి నాగృహమునకువచ్చి వైశాఖమాసములో నన్నదానమును జేసితిని. అందువలన నాతండ్రి పిశాచశరీరమునుండి విడువబడి నావద్దకువచ్చి నన్ను కొనియాడి యాశీర్వదించిదివ్యవిమానము నెక్కి యే విష్ణులోకమును పొందితిరిగి జన్మమునుపొందరో అట్టి దుర్లభమైన విష్ణులోకమును పొందెను.

శ్లో॥ తస్మాద్దానం సర్వశాస్త్రేషు చోక్తం
తుభ్యం ప్రోక్తం ధర్మసారం సధర్మ్యం
కిమన్య త్తే శ్రోతు మిచ్ఛా వదస్వ
శ్రుత్వా సర్వం తే వదామీతి సత్యం॥ ౪౫

తా. ఓరాజా! అటువంటి విశేషఫలముకలది కాబట్టి ధర్మములలో శ్రేష్ఠమైనదియు ధర్మయుక్తమైనదియు సమస్తశాస్త్రములలో జెప్పబడినయన్నదానమాహాత్మ్యమును నీకొఱకు జెప్పితిని, తిరిగి నీవు దేనిని వినవలయునను కొంటివో దానిని చెప్పితే ని యాధర్మములనన్నియు నీకు నిశ్చయముగా చెప్పుచున్నాను.

ఇతి స్కాందపురాణే వైశాఖమహాత్మ్యే నారదాంబరీషసంవాదే
పిశాచమోక్షప్రాప్తిర్నామ సప్తమోధ్యాయః॥

---

## అష్టమోధ్యాయః ప్రారభ్యతే

### మైథిలఉవాచ॥

శ్లో॥ బ్రహ్మ న్నిక్ష్వాకుతనయో జలాదానాచ్చ చాతకః।
త్రివార మభవ త్పశ్చా న్మద్గృహే గృహగోధికా॥

తా. మిథిలాధిపతియగు శ్రుతకీర్తి చెప్పుచున్నాడు. ఓబ్రాహ్మణుడా! ఇక్ష్వాకువంశస్థుడైన హేమాంగ మహారాజు జలదానమును చేయక పోవుటవలన మూడు జన్మముల వరకు చాతకపక్షిగా జన్మించి యనంతరము బల్లిగాపుట్టి నాగృహమునందే యుండెను.

శ్లో॥ కర్మానుగుణ మేతద్ధి యుక్తం తస్య కృతాత్మనః।
సతామసేవనా త్తస్య గృధ్రత్వం సారమేయతా ౨౪
సప్తవారమితి ప్రోక్తం తస్మై భాతి చ నోచితం॥

తా. పుణ్యమును జేయనట్టి యాహేమాంగదునకు కర్మానుసారముగా చాతకాదిజన్మంబులు రావచ్చునుగాని సత్పురుషులను సేవించుటలేని హేతువుచేవానికి గ్రద్దజన్మమనంతరము యేడుపర్యాయములు శునకజన్మములు సంభవించుటయ్యియుచితమైనదిగానాకు దోచలేదు.

శ్లో॥ సంతో న దూషితా స్తేన న తథా కృపణా అపి
తస్మా దసేవిన స్తస్య ఫలాభావో భవే ద్ధృవం,
నానర్థకరణాభావా దిదం హి పరపీడనం
అనిమిత్త మిదం కస్మా త్కుయోనిత్వ మవా ప్తవాన్
తదేత త్సంశయం ఛింధి శిష్యస్యా త్మని యస్యతే॥ ౫

తా. ఎందువలననగా నాహేమాంగ మహారాజు సత్పురుషులను పూజించలేదుగాని వారిని దూషించలేదుగదా అతీరుగానే దుష్టుల నైనను దూషింపలేదు. కాబట్టి సేవింపక పోవుటచే పుణ్యఫలములేకపోవచ్చును. పరులకు బాధలుమొదలగునవి కలిగించిన యెడల దుర్గతి రావచ్చును. అట్టిదుర్గతి కారణములితనియందు లేనందుననిష్కారణముగా శునకాది జన్మంబు లీరాజునకెట్లు సంభవించెనోయని నామనస్సు సందేహపడుచున్నది కాబట్టి మీకు శిష్యుండనగు నామనస్సునందుండు సందేహమును నివర్తింపజేయుము.

శ్లో॥ ఇతి రాజ్ఞా సుసంపృష్ట శ్శ్రుతదేవో మహాయశాః।
సాధుసాధ్వితి సంభావ్య వచో వ్యాహర్తు మాదదే॥ ౬

తా. ఈప్రకారము శ్రుతకీర్తియనురాజు యోగ్యముగా ప్రశ్నజేయగా విశేషకీర్తిగల యాశ్రుతదేవుండను బ్రాహ్మణుండు విని సంతసించి యోరాజా! నీవుచక్కగా ప్రశ్నజేసితివని కొనియాడితాను జెప్పనారంభించెను.

శ్రుతదేవ ఉవాచ

శ్లో॥ శృణు రాజన్ ప్రవక్ష్యామి యత్పృష్టం తు త్వయానఘ।
శివాయైచ శివే నోక్తం కైలాస శిఖరేఽమలే॥

తా. ఓరాజా! నీవుదేని నడిగితివో దానిని నే చెప్పుచున్నాను వినుమని పుణ్యాకరమైన కైలాస పర్వతమందు నివసించియుండి సాంబమూర్తి పార్వతీదేవితో జెప్పిన రీతిగా జెప్పనారంభించెను.

శ్లో॥ సృష్ట్వేమా న్సకలాన్ లోకా న్సృష్ట్వా త్రేషా మవస్థితిం।
ఆముష్మికా మైహికాం చ ద్వివిధాం పర్యకల్పయత్॥ ౮

తా. భగవంతుఁడు సమస్తలోకములను సృజించి పిమ్మట వానియొక్క స్థితిని యిహలోకసంబంధమైనదనియు పరలోక సంబంధమైనదనియు రెండువిధములుగా నేర్పరచెను.

శ్లో॥ హేతుత్రియం చ ప్రత్యేకం భూతస్థిత్యై మహాప్రభుః।
జలసేవాన్నసేవా చ సేవా చైవౌషధస్య చ॥

తా. ప్రభువగు భగవంతుఁడు సమస్తప్రాణులు జీవింపగలుగుటకు జలమును త్రాగుట, యన్నమును తినుట, రోగము సంభవించినప్పుడు ఔషధము పుచ్చుకొనుట యని మూఁడు కారణముల నేర్పరచెను.

శ్లో॥ యథా ఏతే మహాభాగ హ్యైహికస్థితిహేతవః।
ఏవ మాముష్మికే రాజన్ త్రియ ఏవేరితా స్సృతౌ॥
సాధుసేవా విష్ణుసేవా సేవాధర్మపథస్య చ।
పురా సంపాదితా హ్యేతే పరలోకస్య హేతవః॥ ౧౧

తా. ఓరాజా! ఈలోకస్థితిని గురించి యేవిధముగా మూఁడు కారణములేర్పడి యున్నవో ఆవిధముగానే పరలోకగతిని గురించి సత్పురుషులను సేవించుటయనియు విష్ణుమూర్తిని సేవించుటయనియు ధర్మమార్గము నాచరించుటయనియు మూఁడు కారణములను పూర్వమందు భగవంతుం డేర్పరచి నట్లుగా శ్రుతియందు జెప్పబడుచున్నది.

శ్లో॥ గృహే సంపాదితం యద్వ త్పాథేయం పథతౌ యథా।
ఐహికా హేతవో రాజన్ సద్య స్సంపాదితార్థదాః ౧౨

తా. గృహమందుండి సంపాదించిన పదార్థమును మార్గమున ప్రయాణసమయమునప్పుడెట్లు దారిభత్యమునుగా తీసికొని వస్తున్నదో ఆతీరుగానే ఓరాజా! ఇహలోకమునుండి యిక్కడ సంపాదించిన ప్రయోజనములు పరలోకమును గురించియు కారణములగు చున్నవి.

శ్లో॥ కించేష్ట మపి సాధూనాం మనసో యది దుస్సహం।
కుతశ్చి త్కారణా ద్రాజన్ తచ్చానర్థాయ కల్పతే॥

తా. ఓరాజా ! ఒకానొక కార్యము కొందరికిష్టమైనప్పటికి సాధువులకు నయిష్టమైన యెడల అట్టి కార్యమొకానొక కారణము వలన తనకు ననర్థము కలిగించునది యే యగుచున్నది.

శ్లో॥ అప్రియం కిముపక్తవ్యం దుఃఖహేతు రితి స్ఫుటం॥

తా. అయిష్టకార్యమునే చేసిన యెడల దుఃఖమునకు కారణమని చెప్పవలసినది యేలేదు. (అనగాముఖ్యముగా దుఃఖమును కలిగించును.)

శ్లో॥ అత్రాప్యుదాహరంతీ మ మితహాసం పురాతనం।
పాపఘ్నం మహదాశ్చర్యం శృణ్వతాం రోమహర్షణం॥

తా. దీనినిగురించి పాపమును పోగొట్టునదియు వినువారికి నాశ్చర్యము కలిగించునదియు ఆనందముచే పులకాంకురమును జేయునదియునగు పూర్వచరిత్రమును దృష్టాంతముగా జెప్పుచున్నాను.

శ్లో॥ యజ్ఞదీక్షా ముపగతః పురా దక్షః ప్రజాపతిః।
ఆహ్వానార్థంభూతపతే రగమద్రజతాచలం॥

తా. పూర్వకాలమందు దక్షప్రజాపతి యజ్ఞమును జేయదలచి తనయల్లుండగు సాంబమూర్తిని పిలుచుటకొఱకు కైలాసమునకు వచ్చెను.

శ్లో॥ తం దృష్ట్వా నోత్థిత శ్శంభు స్తస్యై వహితకామ్యయా
సర్వామరగురు శ్చాహం ఛందోగమ్య స్సనాతనః।
భృత్యా హి తే బలిహారా శ్చంద్రేంద్రాద్యా స్సురేశ్వరాః ౧౮

తా. అప్పుడు సాంబమూర్తి తానుసమస్తదేవతలకు పూజ్యుడననియు వేదములచే నిర్ధారణ జేయబడువాడ ననియు సమస్త భూతములకంటె ప్రాచీనుండననియు చంద్రుండు ఇంద్రుడు మొదలగుసమస్త దేవతలు తనకు కానుకలు తెచ్చియిచ్చునట్టి భృత్యులు కాబట్టి అట్టివారు వచ్చినయెడల తానులేచి మర్యాదజేయ నవుసరములేదనియుననియెంచి మంచియుద్దేశ్యముతో దక్షప్రజాతిరాగానే ఆయన మేలుకొఱకు లేచి మర్యాద జేయలేదు.

శ్లో॥ స్వామీ భృత్యాయ నోత్తిష్ఠే త్స్వభార్యాయై పతి స్తథా।
గురు శ్శిష్యాయ నోత్తిష్ఠే దితి శాస్త్రవిదాం మతం॥ ౧౯

తా. భృత్యుడువచ్చెనేని ప్రభువు లేవకూడదు భార్యవచ్చిన యెడల పెనిమిటిలేవకూడదు శిష్యుడువచ్చిన గురువు లేవకూడదు. అని శాస్త్రముల దెలిసిన వారిమతమైయున్నది.

శ్లో॥ న సంబంధో గురుత్వే చ కారణం త్వితి వై శ్రుతిః

తా. అయితే దక్షుడు మామగారు సాంబమూర్తి యల్లుడు గనుక మామగారి యందు పూజ్యత యుండును కాబట్టి లేవవలయునని ప్రశ్నజేసితిరేని చెప్పుచున్నాడు. పూజించుటయందు చుట్టరికము కారణము గాదని శ్రుతులు చెప్పుచున్నవి.

శ్లో॥ బలం జ్ఞానం తప శ్శాంతి ర్యత్రి చైవాధికం భవేత్।
స గురు శ్చేతరేషాం చ నీచా ఈయు శ్చ ప్రేష్యతాం

తా. బలము జ్ఞానము తపస్సు ఓర్పు మొదలగునవి యెవనియందధికముగానుండు నోవాడుయితరులకు గురువనదగును. తక్కువ వారు యెక్కువవారిచే నియోగింపబడుదురు.

శ్లో॥ ఉత్తిష్ఠంతి చ స్వామ్యాద్యా భృత్యాదీ న్యది చాగ్రహాత్
ఆయు ర్విత్తం యశ స్తేషాంసద్యో నశ్యతి సంతతిః॥

తా. ప్రభువు పెనిమిటి గురువు మొదలగువారు భృత్యుడు భార్య శిష్యుడు మొదలగు వారిని గూర్చి కోపము మొదలగు నొకానొక కారణముచే లేచిరేని భృత్యు డు మొదలగువారి యొక్క ఆయుస్సు ఐశ్వర్యము కీర్తి సంపత్తు మొదలగునవి నశించి పోవును. కాబట్టి తనకంటె తక్కువవారిని గూర్చి యెక్కువవారు లేవ గూడదు.

శ్లో॥ తస్మా దహం తు నోత్తిష్ఠే ప్రియో ఽయం శ్వశురో మమ।
ఇతి తస్య హితాన్వేషీ నోచ్చచాలా సనా ద్విభుః॥
నోత్థితం తు మృడం దృష్ట్వా కుపితో భూ త్ప్రజాపతిః॥ ౨౨

ఆకారణమువలన నాకు మామగారైనను దక్షునుగురించి నేను లేవగూడదు లేచిన యెడల ఆయన సంపత్తు హరింతును అను యూహచే సాంబమూర్తి సింహాసనమునుండి లేవలేదు. అప్పుడు దక్షప్రజాపతి తాను వచ్చి యుండగా తనకు నల్లుడైయుండి సాంబమూర్తి లేచినవాడుగాడని కోపముగలవాడాయెను.

శ్లో॥ అనింద ద్బహుధా తస్య పురతో గిరిజాపతేః
అహో దర్ప మహో దర్పం దరిద్రస్యా కృతాత్మనః॥ ౨౩

తా. అప్పుడు దక్షప్రజాపతి సాంబమూర్తి యెదుటనే ముందు జెప్పబోవు విధమున విశేషముగా నిందించెను. అది యెట్లనగా. దరిద్రుడును దుర్మార్గుడునగు ఈ తనికి యెంతగర్వము కలిగినది. ఎంతయాశ్చర్యము. ఎంతయాశ్చర్యము.

శ్లో॥ యస్య విత్తం బహు వయో వృష శ్చర్మావశేషితః।
అతఏవ కపాలా స్థిధరః పాషండగోచరః॥ ౨౪

తా. ఇతనియొక్క భాగ్యమును విచారించితిమేని యెక్కుటకు తగినవాహనము లేక చర్మావశిష్టమైన మిక్కిలి ముసలి యెద్దునెక్కెడివాడు. అటువంటి దరిద్రుడు గనుకనే యెముకలను తలపుఱ్ఱెలను ధరించువాడు. మఱియు వేదబాహ్యులచే నారాధింపబడువాడునై యున్నాడు.

శ్లో॥ వృథాహంకారిణో దైవం కుతో దాస్యతి మంగళం।
లోకే కృత్యే న చర్మాణి శుచీనీతి విదో విదుః॥
క్షత్తే దరిద్రిశ్శీతార్తో ఽ పవిత్రం చ గజాజినం।
వేశ్మ శ్మశానం యస్య స్యా ద్భుజగః కిల భూషణం॥ ౨౬

తా. వ్యర్థముగా నహంకారిగానుండు వానికి భగవంతుఁడెట్లు శుభములను కలుగఁజేయును. లోకములో నేకార్యమునందైనను చర్మములను ధరించుట శుచిగాదని నీతిని తెలిసినవారెఱుంగుదురు. లేక దరిద్రుడు గాని చలిచే పీడింపబడు వాడు గాని అపవిత్రమైన గజచర్మమును ధరించుచున్నాడు. ఇకనిల్లుమాతుమనిన శ్మశానములోని వసించుచుండును. పాములను కిరీటము మొదలగు నాభరణములనుగా ధరించుచుండును.

శ్లో॥ న ధీరతా పిచ జ్ఞానం వృకా త్తస్మా త్పలాయితః।
భూతప్రేతపిశాచాదిదుర్జనై స్సంగతో ఽ నిశం॥ ౨౭

తా. ధైర్యమువిషయ మాలోచించిన యొకప్పుడు తోడేలునుజూచి పారిపోయెను. సహవాసమెట్టిదనిన భూతములు ప్రేతములు పిశాచములు మొదలగు దుర్మార్గులతో సహవాసమెల్లప్పుడు జేయుచుండెడివాడు.

శ్లో॥ న కులం శ్రూయతే క్వాపి నాఽసౌ వై సాధుసమ్మతః॥

తా. ఎక్కడ విచారించిన నీతనికి కులగోత్రములే లేవు. ఇతని ప్రవర్తనను విచారించిన సత్పురుషులెవరు నీతని మెచ్చరు.

శ్లో॥ వృథా విజృంభితః పూర్వం నారదేన దురాత్మనా।
యేనాహం బోధితః ప్రాదాం కన్యాం చైతాం సతీం మమ॥

తా. పూర్వమందు దుర్మార్గుండగు నారదుఁడువచ్చి సాంబమూర్తి మహాగొప్పవాడు మహామంచివాడు. అని వ్యర్థమైన పొగడ్తలను నాతోజెప్పగా వానిమాటలను నమ్మి యితనికి నాకుమార్తెయగు సతీదేవినిచ్చి వివాహముజేసితిని.

శ్లో॥ పృథగ్ధర్మగతా చైషా సుఖం వసతు తద్గృహే॥

తా. ధర్మానుకూలియగు సతీదేవియూ సాంబమూర్తియొక్క గృహమునందే యుండి పెనిమిటని సేవించుచు సుఖముగా నుండుగాక.

శ్లో॥ నాస్మాభి శ్లాఘనీయో ఽ సౌ మత్సుతాపి కదాచన
యథా కులాలకలశ శ్చండాలస్యవశంగతః॥ 30

తా. మాబోటివారికి నితడు కొనియాడతగినవాడుకాడు. కుమ్మరవానివద్దనుండినప్పుడు కలశము పవిత్రమైనను మాలవాడు తాకినపిమ్మట మనకెట్లు స్పృశింపతగినదికాదో అప్రకారముగానే నాకుమార్తెయు స్వతస్సిద్ధముగా యోగ్యురాలైనను ఈదుర్మార్గున కిచ్చుటచేత నయోగ్యురాలాయెను.

శ్లో॥ ఇతి దక్షో విమూఢాత్మా హ్యమూం నాహూయ తం మృడం।
బహుధా తం వినిర్భర్త్స్య తూష్ణీ మేవ గృహం యయౌ॥ 31

తా. ఈప్రకారముగా మూఢుండగు దక్షప్రజాపతి అనేకవిధములుగా సాంబమూర్తిని నిందించియల్లునికూతురిని పిలువక యూరకయే యింటికివెళ్ళెను.

శ్లో॥ యజ్ఞవాటం తతో గత్వా ఋత్విగ్భి ర్మునిభి స్సహ।
ఈజే యజ్ఞవిధానేన నిందన్నేవ మహాప్రభుం॥ 32

తా. అనంతరము యజ్ఞముజేయు ప్రదేశమునకు వెళ్ళిఋత్విక్కులు మునీశ్వరులుమొదలగువారితో గూడినవాడై ఈశ్వరుండగు సాంబమూర్తిని నిందించుచు యజ్ఞమునుజేయవలసిన విధిగాజేయుచుండెను.

శ్లో॥ బ్రహ్మావిష్ణూ విహాయైవ సర్వే దేవా స్సమాగతాః।
సిద్ధచారణగంధర్వా యక్షరాక్షస కిన్నరాః॥ 33

తా. ఆయజ్ఞప్రదేశమునకు బ్రహ్మావిష్ణువు లిద్దరుతప్ప మిగిలినసిద్ధులు చారణులు గంధర్వులు యక్షులు రాక్షసులు కిన్నరులు ఏరు వారనిజెప్పనేల సమస్తదేవతలు వచ్చిరి.

శ్లో॥ తదా దేవీ సతీ పుణ్యా స్త్రీచాంచల్యా త్ప్రలోభితా।
ఉత్సుకా చోత్సవం ద్రష్టుం బంధూం స్తత్రసమాగతాః 34

తా. అప్పుడు యోగ్యురాలగు పార్వతీదేవి తండ్రిపిలువకపోయినను స్త్రీయగుటచే చంచలచిత్తురాలై యజ్ఞమహోత్సవమును యజ్ఞమునకువచ్చిన బంధువులను చూచుటకు కోరికగలదాయెను.

శ్లో॥ నివార్యమాణా రుద్రేణ తరలా స్త్రీస్వభావతః।
పరిత్యక్తాపి పున శ్చైవ గంతవ్యమితి నిశ్చితా॥ 36

తా. సాంబమూర్తి అనేకపర్యాయములు వెళ్ళవద్దని చెప్పినప్పటికిని వానిమాటలకన్నిటికిని సమాధానముజెప్పి స్త్రీస్వభావముచే నాశగలదియై వెళ్ళుటకొఱకు తిరిగి నిశ్చయించుకొనెను.

శ్లో॥ స నిందతి సభామధ్యే సదా మాం వరవర్ణిని।
తచ్చాసహ్యం చ త్వం శ్రుత్వా కాయం సత్యం జహాసివై।
అసహ్య మపి సోఢవ్యం త్వయాపి గృహ మిచ్ఛతా।
మయా యథా కృతం దేవి తథా త్వం నైవ వర్తసే।
తస్మా న్నాగచ్ఛ శాలాం వైన శుభం తు భవే ద్ధ్రువం।
ఇత్యేవం బోధితా దేవీ చాపల్యం పున రాగమత్॥ 37

తా. అప్పుడు సాంబమూర్తి యెట్లుబోధించుచున్నాడనగా. ఓపార్వతీ నీవు యజ్ఞప్రదేశమునకు వెళ్ళగానే ఆసభలో దక్షుడు నన్ను విశేషముగానిందించును. విన శక్యముగాని యాదూషణములను విని నీవు శరీరమును విడిచిపెట్టగలవు. అప్పుడు కష్టమైనప్పటికిని గృహస్థాశ్రమ ధర్మము నాలోచించి సహించవలయును. అట్లు దక్షుడు నాయెదుట నన్ను దూషించినప్పుడు సహించితిని, అట్లునీవు యోర్చియుండలేవు. కాబట్టి నీవుసమస్తవిధములచేతను యజ్ఞప్రదేశమునకువెళ్ళుట యుచితముకాదు. అలా వెళ్ళితివేని నీకు శుభముగలుగదు, అని యీప్రకారముగా సాంబమూర్తి యెన్నివిధముల బోధించినను వినక యాపార్వతీదేవి స్త్రీస్వభావముచే యజ్ఞమునుజూడ వాంఛ గలదియై యుండెను.

శ్లో॥ నిశ్చక్రామ సతీ గేహా దేకాకీ పాదచారిణీ।
తాం దృష్ట్వా వృషభ స్తూర్ణం పృష్ఠే దేవీ ముమావహత్॥ 38

తా. అప్పుడు పార్వతీదేవి తానొక్కతెయే బయలుదేరి నడిచివెళ్ళుచుండగా నా పార్వతీదేవిని చూచి వృషభవాహనము వచ్చి తన వీపుమీద పార్వతీదేవి నెక్కించుకొని వెళ్ళుచుండెను.

శ్లో॥ కోటిశో భూతసంఘా శ్చ హ్యనుజగ్ము స్సతీం తదా।
యజ్ఞవాటం తు సా గత్వా పత్నీశాలాం యయౌ పురా॥ 40

తా. పిమ్మట సాంబమూర్తికి ననుచరులగు భూతసమూహములుకూడ బయలుదేరిపార్వతీదేవికి సహాయముగా వెళ్లినవి. అట్లు పార్వతీదేవి భూతసమూహములతోకూడ బయలుదేరి యజ్ఞపరిదేశమునకువెళ్లి భూతసమూహములను బయట నిలిపి తాను ముందుగాయజ్ఞమును జేయుస్థలమునకు వెళ్లినది.

శ్లో॥ తూష్ణీమాస స్సతీం దృష్ట్వా ఖేదా త్తస్మా ద్వినిర్గతా।
పతివాక్యం తు సంస్మృత్య జగామో త్తరవేదికాం॥ ౪౧

తా. అట్లు వెళ్లగానక్కడనుండెడి బంధువులు మొదలగువారుచూచి మర్యాద జేయకనూరకుండిరి. అందువలన విచారముగలదియై పెనిమిటిచెప్పిన హితమునువినకపోతి ననితలచుచు తండ్రివద్దకువెళ్లిన యెడల ఆయనయేమైనను గౌరవించుననుభావముతో ఉత్తర వేదికయను హోమపరిదేశమునకు వెళ్లెను.

శ్లో॥ పితా సభ్యా శ్చ తాం దృష్ట్వా స్థితా స్తూష్ణీం హతాశిషః।
సా రుద్రాహుతిపర్యంతం పశ్యంతీ పితృచేష్టితం॥
త్యక్త్వా రుద్రం చ జుహ్వంత మువాచా శ్రుకులేక్షణా॥

తా. అప్పుడు నిర్భాగ్యులగు, నామెతండ్రియు నక్కడనుండు సభ్యులును ఆమెనుజూచి యూరకుండిరి. ఆపార్వతీదేవియు రుద్రునికినివ్వలగిన యాహుతినచ్చువఱకుతన తండ్రి ఏడవడి యెట్లుండునోయని చూచుచుండెను. పిమ్మట హోమములన్నియును జేయుచు రుద్రాహుతి మాత్రము విడిచి మిగిలిన హోమములను జేయుట జూచి విచారముగలదియై నేత్రములయందు కన్నీరు వ్యాపించియుండ నిట్లుపలుకుచున్నది.

శ్లో॥ మహదుల్లంఘనం పుంసాం న ప్రాయ శ్శ్రేయసే భవేత్॥
లోకకర్తా లోకభర్తా సర్వేషాం ప్రభు రవ్యయః।
ఏవంభూతస్య రుద్రస్య కథం నో దీయతే హవిః॥

తా. ఓతండ్రీ! మహానుభావులను తిరస్కరించిన వారికి తలుచుగాశుభముకలుగనేరదు. కాబట్టి లోకములను సృజించినవాడును లోకములను పోషించువాడును సమస్తప్రాణులకు ప్రభువునగు మహానుభావుడైన సాంబమూర్తికి యెందువలన హవిస్సునిచ్చుటలేదు.

శ్లో॥ జాతాం న కిం తే దుర్బుద్ధిం హరం త్యస్యే సమాగతాః।
న చేదృశా మహాత్మానః కిమేషాం విముఖో విధిః॥ ౪౫

తా. ఇటువంటి దుర్బుద్ధినీకు పుట్టియుండగా తెలిసినవారెవరైనను వచ్చి యిది నీకు తగినదికాదని చెప్పినవారు లేరా ? ఇక్కడుండు సభికులైనను చెప్పలేదా ? వీరికి తెలియదా ? అని పార్వతీదేవి పలికెను.

శ్లో॥ ఇత్యేవం భాషమాణాం తాం పూషా దేవో జహాసహా।
శ్మశ్రూణాం చాలనం చక్రే భృగు ర్హాతశుభ స్తథా ౪౬

తా. ఈ ప్రకారము పార్వతీదేవి పలికినదగుచుండగా పూషుడను సూర్యుడు నవ్వెను. భృగుమహాముని చెడుస్వభావముగలవాడై గడ్డమును మీసములను సవరించుకొనెను.

శ్లో॥ భుజపాదోరు కక్షాణాం స్ఫాలనం చక్రిరే పరే
బహుధా నిందనం చక్రే తత్పితా హతభాగ్యవాన్॥ ౪౭

తా. మరియు నితరమైన సభికులలో కొందఱుభుజములను చరచువారును కొందఱు పాదములను చరచువారును కొందఱు చంకనుకొట్టుకొనువారునై యుండిరి. పార్వతీదేవి తండ్రియగు దక్షుడు కష్టమును పొందువాడు గనుక నే యనేక విధములుగా నా పార్వతీదేవిని నిందించెను.

శ్లో॥ తచ్ఛ్రుత్వా రుద్రభార్యా సా కోపాకులితమానసా।
ప్రాయశ్చిత్తం శ్రుతేః కర్తుం దేహం తత్యాజ సా సతీ॥
హోమాగ్నౌ వేదికామధ్యే సర్వేషా మేవ పశ్యతాం॥ ౪౮

తా. సాంబమూర్తి యొక్క భార్యయగు పార్వతీదేవి దక్షుని దూషణలను విని మిక్కిలి కోపముగల మనస్సుగలదెయై తన పెనిమిటిని నిందించిన దక్షునిదూషణవాక్యములను వినినందుకు తనశరీరమును విడిచిపెట్టుటయే ప్రాయశ్చిత్తమనుకొని సభికులందరు చూచుచుండగా హోమమునుజేయుచుండెడి యగ్నికుండములోబడి మృతినొందెను.

శ్లో॥ హాహాకారో మహా నాసీ ద్రుదుద్రువుః ప్రమథా ద్రుతం॥
ఆచఖ్యు ర్దేవదేవాయ వృత్తాంత మఖిలం తదా॥ ౪౯

తా. ఇట్లు పార్వతీదేవి మృతినొందగా ప్రమథగణంబులు మిక్కిలి రోదనము జేయుచు శీఘ్రముగా సాంబమూర్తి యొద్దకువెళ్ళి దేవతలకు దేవుండగు నాయీశ్వరునితో దక్షునియజ్ఞ ప్రదేశమునందు జరిగిన వృత్తాంతమునంతయు జెప్పిరి.

శ్లో॥ తచ్ఛ్రుత్వా సహసోత్థాయ రుద్రః కాలాంతకోపమః
జటా ముత్పాట్య హస్తేన భూతలే తా మతాడయత్॥

తా. ఇట్లు చెప్పిన ప్రమథగణవాక్యములను సాంబమూర్తివిని సంహారకాలము నందుండు యమునివలెనే భయంకరాకారుడై శీఘ్రముగాలేచి తన శిరస్సునందుండు జటలలో నొకటి పెరికి దానిని నేలమీద కొట్టెను.

శ్లో॥ తతో భవ న్మహాకాయో వీరభద్రో మహాబలః।
సహస్రబాహు రభవ త్కాలాంతకసమ ప్రభః॥
బద్ధాంజలిపుటో భూత్వా వ్యాజహార హరం తదా॥ ౫౨

తా. అనంతరము పెద్దశరీరముగలవాడును విశేషబలము గలవాడును వేయిచేతు లుగలవాడును ప్రళయకాల యమునితో సమానమైన కాంతిగలవాడునగు వీరభద్రుడు పుట్టిదోసిలి పట్టికొని సాంబమూర్తితో నిట్లు పలుకుచున్నాడు.

శ్లో॥ మత్సృష్టి స్తు యదర్థం తే తదర్థం మాం నియోజయ।
ఇత్యుక్తః ప్రాహ తం క్రుద్ధో ధూర్జటి స్తం పురస్థితం॥ ౫౩

తా. ఓస్వామీ! ఏకార్యము నిమిత్తమునన్ను సృజియించితివో ఆకార్యమును డివితిరేని చేయుదునని గా రౌద్రాకారముతో నున్నట్టి యా సాంబమూర్తి తనయెదుట నున్నట్టి వీరభద్రునితో నిట్లుచెప్పుచున్నాడు.

శ్లో॥ హన త్వం నిందకం దక్షం యదర్థే మత్ప్రియా హతా।
భూతసంఘా స్తు గచ్ఛంతు సహైతేన బహుబలాః ౫౪

తా. ఓవీరభద్రా! నాప్రియురాలైన పార్వతీదేవి యేదక్షుని కారణమున మృతినొందెనో అట్టిదక్షుని సంహరింపవలయును. విశేషబలముగల భూతసమూహములును నీకు సహాయకారిగా రాగలవు.

శ్లో॥ ఇత్యాదిష్టా భగవతా యయు ర్యజ్ఞసభాం తదా।
జఘ్ను స్సర్వా న్మహావీరా న్దేవాసురనరాదికాన్॥ ౫౫

తా. ఈప్రకారముగా భగవంతుడగు సాంబమూర్తిచే నాజ్ఞాపింపబడి ప్రమథ గణము లప్పుడు వీరభద్రసహితములై దక్షుడు యజ్ఞము చేయుచున్న దేశమునకువెళ్లి అక్కడనుండు దేవతలు అసురులు నరులు మొదలగువారిని మరియు విశేష పరాక్రమ ముగల వందరిని కొట్టిరి.

శ్లో॥ పూష్ణశ్చ హసతో దంతాన్ జటాభూశ్చ బభంజ హ।
శ్మశ్రూణ్యుత్పాటయాంచక్రే భృగో స్తస్య దురాత్మనః॥

తా. పూషుడను సూర్యుడు పూర్వము నవ్వుటవలన ఆయన దంతములను వీరభద్రుడు డాడ గొట్టెను. దుర్మార్గుండగు భృగువు గడ్డము మీసములను సవరించుకొనుటచే గడ్డమును మీసములను పెరికివేసెను.

శ్లో॥ యద్యదాస్ఫాలితం పూర్వం తత్తచ్చిచ్ఛేద వీర్యవాన్।
తతో దక్షశిరో హంతుం బహూద్యోగం చకారహ॥ ౫౭

తా. పార్వతీదేవి వెళ్లినప్పుడు పూర్వము ఎవడెవడే యేయవయవములను ఆక్షేపణకలుగునట్లు కొట్టుకొనెనో పరాక్రమవంతుండైన వీరభద్రుడు వారివారి యంగములను కొట్టి పిమ్మట దక్షుని శిరస్సు ద్రుంచవలయునని విశేష ప్రయత్నము జేసెను.

శ్లో॥ ముని మంత్రపరిగుప్తం తు నైవ కృంతతి తద్బలం।
హరో జ్ఞాత్వా తు చిచ్ఛేద స్వయ మేత్య దురాత్మనః ౫౮

తా. మునీశ్వరుల మంత్రములచే నభిమంత్రితమైనది కాబట్టి దక్షుని శిరస్సు ద్రుంచలేకపోయెను. అప్పుడు సాంబమూర్తి దక్షుని శిరస్సు యితడు ద్రుంచలేడని తెలిసికొని తాను స్వయముగావచ్చి యాదుర్మార్గునియొక్క శిరస్సును ద్రుంచివేసెను.

శ్లో॥ ఏవం మఖగతాన్ హత్వా సానుగస్స్వాలయం యయౌ।
హతావశిష్టాః కేచిత్తు బ్రహ్మాణం శరణం యయుః॥ ౫౯

తా. ఈప్రకారముగా సాంబమూర్తి వీరభద్రుడు మొదలగువారు యజ్ఞప్రదేశమునందుండు దుర్మార్గులను చంపి ప్రమథగణములతో సహితమై స్వస్థానమగు కైలాసమునకు వెళ్ళిరి. అంతట నక్కడ చంపబడగా మిగిలినవారుకొందరు బ్రహ్మదగ్గరకువెళ్ళి రక్షింపుమని వేడుకొనిరి.

శ్లో॥ తై రన్వితో యయౌ బ్రహ్మ కైలాసం తు శివాలయం।
తతో రుద్రం సాంత్వయిత్వా వచోభి ర్వివిధై రపి॥ ౬౦
తేనైవ సహితః ప్రాగా ద్యజ్ఞవాటం మహాప్రభుః।
తేనైవోజ్జీవయామాస సర్వా న్యజ్ఞసభాగతాన్॥ ౬౧

తా. అప్పుడు బ్రహ్మదేవుండు ఆదేవతలతో కూడి శివునిలోకమగు కైలాసమునకు వెళ్ళి యనేక ప్రియవాక్యములను జెప్పి యాసాంబమూర్తిని శాంతపరచి యా

సాంబమూర్తితో సహితముగా దక్షుని యజ్ఞప్రదేశమునకు వెళ్ళి అక్కడ మృతినొం దినవారి నందరిని యాసాంబమూర్తిచే బ్రతికింపజేసెను.

శ్లో॥ ఖ్యాత్యై ప్రాదాదజముఖం దక్షస్య తు తదా శివః।
అజశ్మశ్రూణ్యదా చ్ఛంభు ర్భృగవే తు మహాత్మనే॥ ౬౨

తా. సాంబమూర్తి లోకములో ప్రసిద్ధిగానుండుకొఱకు మేకయొక్క శిరస్సును తెచ్చి యతికించి దక్షుని బ్రతికించెను. మేకయొక్క గడ్డమును తెచ్చిమహానుభావుండగు భృగువునకిచ్చెను.

శ్లో॥ పూష్ణ శ్చ దంతా న్న ప్రాదా త్పిష్టాదం చ చకార హ।
తదంగానాం వ్యతికరం కేషాంచి దపి వైశివః॥ ౬౩

తా. పూష్ణుడనువానికి దంతములనియ్యక పిండినిమాత్రమే తినునట్లుగాజేసెను, మరియు నెవరెవరికి నేయేయవయవములుపోయెనో ఆయాయవయవములనిచ్చెను కొందరికి వ్యతిరేకముగాను యిచ్చెను.

శ్లో॥ శివ మాపు శ్చ తే సర్వే బ్రహ్మణా చ శివేన చ
పునః ప్రవర్తితో యజ్ఞో యథాపూర్వం మహాత్మనః

తా. ఆబ్రహ్మదేవుని చేతను శివుని చేతను వారందరు మేలుపొంది పూర్వమందు యెట్లు యజ్ఞమునుజేయుచుండిరో ఆరీతిగా తిరిగి యజ్ఞమునుజేయ ప్రారంభించిరి.

శ్లో॥ యజా స్తే సర్వదేవా శ్చ జగ్ము స్తే స్వం స్వమాలయం।
నైష్ఠికం బ్రహ్మచర్యం తు కృత్వా రుద్రో మహాతపాః॥
తేపే గంగాతటే రుద్రః పున్నాగతరుమూలతః॥

తా. అప్పుడా దేవతలందరు యజ్ఞమును సంపూర్తినొందించి యెవరిగృహములకు వారు వెళ్ళిరి, అనంతరము సాంబమూర్తియు భార్యావియోగచే గృహమునందుండుట మాని నిష్టతో బ్రహ్మచర్యము నవలంబించి గంగానదీసమీపమందు పున్నాగవృక్షము క్రింద తపస్సుజేయుచుండెను.

శ్లో॥ దక్షాత్మజా సతీ దేవీ త్యక్తదేహా పతివ్రతా।
జజ్ఞేహిమాద్రే ర్మేనకాయాం వవృధే తస్య వేశ్మని॥ ౬౬

తా. అనంతరము దక్షునికుమార్తెయు సాంబమూర్తి భార్యయు పతివ్రతయు నగు సతీదేవియు దేహత్యాగముజేసినపిమ్మట హిమవంతునివలన మేనకయందు జనియించి ఆహిమవంతుని యొక్క గృహమునందే పెరుగుచుండెను.

శ్లో॥ ఏతస్మిన్నేవ కాలే తు తారకాఖ్యో మహాసురః
సుతీవ్రతపసా రాధ్య బ్రహ్మాణం పరమేష్టినం।
[illegible]ధ్యత్వం వరం నవ్రే దేవాసురనరోరగైః। ౬౮
[illegible]రస్త్రసంపైశ్చ సర్వై శ్చేవ మహాబలైః।
రుద్[illegible]ం వినా దైత్యో హ్యవధ్య స్సకలై రపి॥ ౬౯

తా. ఇట్టి సమయములో తారకుడను గొప్పరాక్షసుడు తీక్ష్ణమైన తపస్సుజేసి సృష్టికర్తయగు బ్రహ్మను మెప్పించి దేవతలు అసురులు నరులు సర్పములు ఆయుధములు అస్త్రములు మరియు నితరమగు గొప్పబలముగలవారు ఈమొదలగు వారిచే తాను జంపబడకుండునట్లు వరమును కోరగా సాంబమూర్తికుమారునివలన తప్ప నురి యొకరివలనను నీవు జంపబడవనియెను.

శ్లో॥ ఇతి తస్మై వరం ప్రాదా ద్బ్రహ్మా లోకపితామహః।
అస్త్రీక త్వాదపుత్రత్వా ద్విదిస్యేతితథా స్త్వితి॥ ౭౦
వరంగృహీత్వా స్వగృహం ప్రాప్య లోకాన్ బబాధహ॥ ౭౦

తా. ఈ ప్రకారము బ్రహ్మదేవుండు వరమివ్వగా సాంబమూర్తికి యిదివరకు సంతానమేలేదు యికముందు కలుగుననుకొందుమనిన భార్యయు మృతినొందెను కాబట్టి అట్టిభయము తనకు లేదనియనుకొనినవాడై బహ్మదేవుండిచ్చిన ప్రకారము వరమును గ్రహించి యింటికివెళ్ళి మూడులోకములను బాధింప మొదలు పెట్టెను.

శ్లో॥ దానా దేవా మార్జనాదా దాస్యో దేవ్య శ్చ తద్గృహే।
తత స్తత్తాడితా దేవా బ్రహ్మాణం శరణం యయుః।
తైః పీడాం జ్ఞాపితాం శ్రుత్వా వేధాః ప్రాహ సురానిదం॥ ౭౨

తా. దేవతలను తనకునౌకర్లనువారిభార్యలను తనగృహమునందుకసువునూడ్చుట మొదలగు పనులుసేసెడి దాసీలగాను సేర్పచి తననుఎదిరించినవారినికొట్టుచు నిట్లుతారకాసురుడు బాధించుచుండగా దేవతలు వాని బాధకోర్వజాలక సత్యలోకమునకు వెళ్ళి బ్రహ్మదేవునితో విన్నవింపగా వారి విన్నపమాలకించి బ్రహ్మదేవుండు దేవతలతో నిట్లు పలుకుచున్నాడు.

శ్లో॥ వరప్రదానకాలే హం రుద్రపుత్రం వినాసురాః
నాన్యైర్వధ్య ఇతి ప్రాదాం వరం తస్మై దురాత్మనే ౭3

తా. ఓ దేవతలారా! నేను దుర్మార్గుండగు తారకాసురునకు వరమిచ్చినప్పుడు సాంబమూర్తియొక్క కుమారునివలనతప్ప మరియొవరివలనను నీవు చంపబడవని వరమిచ్చితిని.

శ్లో॥ పురా సతీ రుద్రపత్నీ సతేత్యక్తకళేబరా।
జాతాహిమవతః పుత్రీ పార్వతీ తి చ యాం విదుః॥ ౨౦

తా. సాంబమూర్తి భార్యలేనివాడు గదా సంతానము కలుగు టెట్లుయని ప్రశ్నజేసితిరేని కారణమును జెప్పుచున్నాను. పూర్వమందు సాంబమూర్తి భార్య యగు సతీదేవి దక్షునియజ్ఞ కాలమునందు మృతినొందినదియై హిమవంతునకు కూతురుగా జనియించి పార్వతీయను పేరుగలదియై యున్నది.

శ్లో॥ రుద్రో హిమవతః పృష్ఠే తప శ్చరతి దుశ్చరం।
యోజయధ్వం చ పార్వత్యా రుద్రం లోకేశ్వరం ప్రభుః॥ ౨౧

తా. సాంబమూర్తియు హిమవత్పర్వత శిఖరమునందు విశేషమైన తపస్సును జేయుచుండెను. గానలోకములకు నధిపతియు ప్రభువునగు యాసాంబమూర్తిని పార్వతీదేవితో కలియునట్లుగా మీరుజేయుడు.

శ్లో॥ పున ర్దేవేంద్రసదనే సంగతై రమరేశ్వరైః।
ధిషణేనాపి సంమంత్ర్య దేవేంద్రః పాకశాసనః॥
సస్మార చ స్వకార్యార్థం నారదం స్మర మేవ చ।
తత్రాగతౌ తత స్తౌ తు బలభి ద్వాక్య మబ్రవీత్॥ ౨౨

తా. ఈప్రకారము బ్రహ్మదేవుఁడు చెప్పి తనలోకమునకు వెళ్లెను అనంతరము దేవేంద్రుని సభలో దేవేంద్రుడు దేవతలు బృహస్పతియుకలసి యాలోచించి దేవేంద్రుడు తామాలోచించిన కార్యసిద్ధికొఱకు నారదునిమన్మథుని స్మరియించెను. అటుపిమ్మట వారిద్దరచ్చటికి రాగా నారదునితో నిట్లు పలుకుచున్నాడు.

శ్లో॥ హిమవంతం భవాన్ గత్వావచసా తన్నిబోధయ।
పుత్రీ తవ ప్రాగ్దక్షస్య హారపత్నీ సుతా సతీ॥ ౨౩
తపశ్చరతి తే శృంగే వియుక్తో దక్షకన్యయా।
మృడ స్తస్య సపర్యాయై వినియోజయ తత్ప్రియాం ౨౪
తస్యైవ పత్నీ భవితా స ఏవ భవితా పతిః।
ఇత్యాదిష్టో మఘోనా చ నారదో పేత్య తం గిరిం॥ ౨౫

తథైవ కారయామాస దేవేంద్రో చోదితంయథా॥
పశ్చాత్కామం సమాహూయ మఘవా నిద మాహ చ॥ ౮౧

తా. ఓ నారదా! నీవుహిమవత్పర్వతమునకువెళ్లిహిమవంతునితో నేనునీతోచెప్పినట్లుయొక కార్యమునుజేయుంచుము అదియేదియనగా నీకుమార్తెయగుపార్వతీదేవి పూర్వజన్మంబున దక్షునికుమార్తెయు సాంబమూర్తికిభార్యయు నగు సతీదేవి. ఆమెమృతినొందగానే సాంబమూర్తి వైరాగ్యము నవలంబించి నీయొక్క శిఖరమునందు తపస్సు జేయుచున్నాడు. కాబట్టి యీజన్మమునందైనను నీకుమార్తెకు సాంబమూర్తియే భర్తయగును. సాంబమూర్తికి నీకుమార్తెయే భార్యయగును కాబట్టి యాసాంబమూర్తికి శుశ్రూషజేయుటకు నీకుమార్తెయగు పార్వతీదేవిని నియోగింపుమని హిమవంతునితో జెప్పి జేయింపుమనగా నారదుండా ప్రకారమే వెళ్లి చేయించెను. అనంతరమున దేవేంద్రుడు మన్మథునిబిలచియిట్లుచెప్పుచున్నాడు.

శ్లో॥ దేవానాం చ హితార్థాయ తథా మృడహితాయచ।
వసంతేన సమాయుక్తో గత్వా రుద్రతపోవనం॥ ౮౨
గుణా న్విజృంభయిత్వా తు వాసంతాన్। హృచ్ఛయావహాన్
యదా సన్నిహితా దేవీ పార్వతీ తు మృడస్య తు॥ ౮౩
తదా ప్రయుజ్య త్వం బాణా న్మోహయస్వ మహాప్రభుం॥
తయో స్తు సంగమే జాతే కార్యసిద్ధి ర్భవిష్యతి॥ ౮౪

తా. దేవతల హితవుకొఱకును సాంబమూర్తి హితవుకొఱకును నీవువసంతునితోగూడి రుద్రుడు తపస్సుజేసెడి వనమునకు వెళ్ళి మనోహరమైనవసంతఋతుధర్మములనచ్చట ప్రకాశింపజేసి పార్వతీదేవి సాంబమూర్తి సమీపములోనుండు సమయమున సాంబమూర్తియందు పుష్పబాణములను ప్రయోగించి పార్వతీదేవియందు మోహము కలుగునట్లుగా జేసితివేని వారిద్దరు కలియుటవలన మనకార్యసిద్ధి కాగలదు.

శ్లో॥ ఇత్యాదిష్ట స్స్మర స్తూర్ణం ప్రతస్థే బాఢ మిత్యథ।
సవసంత స్సరతిక స్సానుగ స్తద్వనం యయా॥ ౮౫

తా. ఈ ప్రకారము దేవేంద్రుడాజ్ఞాపించగా నాలాగేచేయుదునని యంగీకరించి మన్మథుఁడు వసంతునితోడను రతీదేవితోడను అనుచరులతోడను గూడి శీఘ్రముగాబయలుదేరి సాంబమూర్తి తపస్సుజేయు వనమునకు వెళ్ళెను.

శ్లో॥ అకాలే తు వసన్తర్తుం జృంభయిత్వాస్వశక్తితః।
తద్వనే సర్వతో రమ్యే మందానిలనిషేవితే॥

తా. అప్పుడు మన్మథుడు మలయమారుతముచే వీవఁబడునదియు అంతటను మనోహరముగా నున్నదియునగు వనమందు తన సామర్థ్యమువలన సమయముగాకపోయిన నువసంతఋతుధర్మములను వ్యాపింపజేసెను.

శ్లో॥ కదాచి ద్దేవదేవోఽపి పార్వత్యాశ్చ సపర్యయా।
ప్రీత స్స్వాంకం సమారోప్య కించిద్వ్యాహర్తు మారభత్॥ ౧౭

తా. సాంబమూర్తియు పార్వతీదేవి చేసిన శుశ్రూషకు సంతసించి యొకప్పుడామెను తొడయందు గూర్చుండబెట్టుకొని యేదోకొంచెము మాట్లాడుట ప్రారంభించెను.

శ్లో॥ ప్రాణప్రియాసంగమస్య కాలోఽయ మితి నిశ్చితః।
పేశలం ధను రాదాయ స తస్థౌ పారపృష్ఠతః॥ ౧౮

తా. పార్వతీదేవియందు మోహమును కలిగింపజేయుటకు నిదే సమయమని నిశ్చయించినవాడై మన్మథుడు మృదువైన ధనుర్బాణములను గ్రహించి సాంబమూర్తి యొక్క వెనుక దాగియుండెను.

శ్లో॥ కృత్వా జవనికాం వృక్షం బాణ మేకం ముమోచ సః।
ద్వితీయ మపి సంధాయ చక్రే మోక్తుం సముద్యమం॥ ౧౯

తా. అప్పుడు మన్మథుడు యొక చెట్టునుచాటుగా చేసికొని యొకబాణమును ప్రయోగించి వ్యర్థముగాని మఱియొక బాణమును గూడ ప్రయోగించుటకుద్యుక్తుడాయెను.

శ్లో॥ అథ క్షుబ్ధ మనాభూత్వా వ్యూఢ శ్చింతా మనాపసః।
న మే మన శ్చలే త్క్వాపి కేనవా కశ్మలీకృతం॥ ౨౦
ఇతి చింతాకులో వామే పార్శ్వే కామం దదర్శ సః॥ ౨౦

తా. అనంతరము సాంబమూర్తి చలించిన మనస్సుగలవాడై యేమి నామనస్సు యెప్పుడును చలింపదే ఇట్టిమనస్సు యెవనిచేచలింపచేయబడినదనివిచారించి కలతచెందుచు అక్కడనుండి యెడమభాగమందు మన్మథుని జూచెను.

శ్లో॥ క్రుద్ధోఽస్మిల్యలలాటాక్షం స్వాంకాద్దేవీ ముపాస్య చ॥
తస్మాత్యక్షస్సముద్భూ దగ్ని స్తీక్ష్ణో లోకవిభీషణః।
తేన దగ్ధో భవ త్సద్యో మన్మధ స్స శరాసనః॥ ౫౨

తా. అప్పుడు సాంబమూర్తి కోపముగలవాడై పార్వతీదేవిని తనతొడమీద నుండి తోసివేసి మూడవనేత్రమును తెఱువగా నానేత్రమువలనలోకమునకు భయంకరమగు తీక్ష్ణమైన యగ్ని బయలుదేరగా దానివలన నప్పుడే ధనుర్బాణములతో కూడమన్మధుడు భస్మమాయెను.

శ్లో॥ కార్యసిద్ధిం చ పశ్యంతో దుద్రువు స్సామరా దివం।
శంకమానా స్వదండం చ వసంతో రతి రేవ చ। ౫౩
నిమీల్య లోచనే భీతా దేవీ దూరం ప్రదుద్రువే।
సన్నిధానం స్త్రియో హర్తుం మృడో ప్యంతర ధీయత॥ ౫౪

తా॥ దేవతలు మన కార్యసిద్ధి యగువా కాదాయని యాలోచించుచు స్వర్గమునకు పారిపోయిరి. వసంతుడు రతీదేవియు తమకును శిక్షకలిగించునేమోయని భయపడుచుండిరి. పార్వతీదేవియు కండ్లుమూసికొని అక్కడనుండి దూరముగా పారిపోయెను సాంబమూర్తియు స్త్రీలయొదుట నుండగూడదని యంతర్ధాన మయ్యెను.

శ్లో॥ రుద్రస్యేష్టం ప్రకుర్వాణో దేవానాం మనసోహితం।
లేభే నర్థ మనిర్వృత్తం విప్రియం కుర్వత స్తుకిం॥ ౫౫

తా. మన్మధుడుచేసిన కార్యము సాంబమూర్తికిని దేవతలకు నిష్టమైనదైనప్పటికి మన్మధునకు అనర్థమే సంభవించినది ఇక అప్రియము నే చేసినయెడల అనర్థము సంభవించునని చెప్పవలసినది యేమున్నది.

శ్లో॥ తస్మా దిత్యాకుత నయ స్సాధూనా మప్రియస్సదా।
తస్మా దాత్మహితాం సేవాం నాకరోఽన్మదధీ స్సతాం। ౫౬

తా. ఆకారణమువలన హేమాంగుడు యెల్లప్పుడు సత్పురుషులకు నయిష్టుడని నే చెప్పదగును. సత్పురుషులను సేవించుట లేకుండుటచే నాకు ప్రియకరమగుసేవ జేసినవాడు కాకపోయెను.

శ్లో॥ అనుభూతంమహద్దుఃఖం తస్మా ద్దుర్యోని రేవ చ।
తస్మా త్కుర్యా త్తు సాధూనాం సేవా సర్వార్థసాధినీ

తా. సత్పురుషులనీ లేని కారణముచేత శునకాది హీనజన్మముల నెత్తి ప శేవ

మైన దుఃఖమనుభవింపబడెను. కాబట్టి సమస్త ప్రయోజనములను సిద్ధింపజేయునట్టి సత్పురుషులసేవను ముఖ్యముగాజేయవలయును.

శ్లో॥ రుద్రస్యాప్రియ కారిత్వా త్స్మరో భామిని జన్మని।
దుఃఖం తు బహులం లేభే జన్మకాలే మహాప్రభుః॥ ౫౦

తా. మహానుభావుండగు మన్మథుడు సాంబమూర్తికి నిష్టముగాని తపోభంగమొనరించుటచే తిరిగియుత్తరజన్మమునందు పుట్టినకాలమునందే విశేషమయిన దుఃఖమనుభవించెను.

శ్లో॥ ఇతిహాస మిమం పుణ్యం యే శృణ్వంతి దివానిశం।
జన్మమృత్యుజరాదిభ్యో ముచ్యంతే నాత్ర సంశయః ౫౧

పుణ్యాకరమగు నిట్టి యితిహాసము నెవరు రాత్రింబవలు వినుచుందురో అట్టివారు పుట్టుకముదిమి మరణములేనివారగుదురు. ఇందు విషయమై సందేహమేమియులేదు.

ఇతి శ్రీస్కాందపురాణే వైశాఖమహాత్మ్యే నారదాంబరీష సంవాదే కామదహనోనామ అష్టమోధ్యాయః॥

తా. ఈప్రకారముగా స్కాందపురాణమునందు అంబరీషునకు నారదునిచే చెప్పబడిన వైశాఖ మాహాత్మ్యమునందు మన్మథుని దహనమును గురించిన యష్టమోధ్యాయము సంపూర్ణము.

## నవమోఽధ్యాయః

మైథిలఉవాచ॥ శ్లో॥ తస్య దగ్ధస్య కామస్య కస్మా జ్జన్మాఽభవ ద్విభో
కిం దుఃఖ మభవ త్తస్మి న్కర్మణ స్సహలంఘనాత్॥
ఏత దాచక్ష్వ మే బ్రహ్మన్ శ్రోతుం కౌతూహలం హి మే॥1½॥

తా. మిథిలాధిపతి యడుగుచున్నాడు. మహానుభావుండవగు నో బ్రాహ్మణుడా! ఆమన్మథునకు సాంబమూర్తిచే దహింపబడినప్పటికి తిరిగి యెందువలన జన్మము కలిగెను? చేయబడినకర్మము కూడవచ్చున దగుటచే నాజన్మంబున నేమి దుఃఖమును పొందెను? ఇదియంతయు సవిస్తరముగా వినుటకు కోరికగలవాడనై యుంటిని గాన నానతీయుమని శ్రుతదేవు నడిగెను.

శ్లో॥ కుమారజన్మ వక్ష్యామి శ్రవణా త్పాపనాశనం।
యశస్యం పుణ్యదం ధర్మ్యం సర్వరోగవినాశనమ్॥2

తా. వినుటతోడనే పాపములను పోగొట్టునదియు కీర్తినిచ్చునదియు పుణ్యములనిచ్చునదియు ధర్మకరమైనదియు సమస్తరోగములను పోగొట్టునదియు నగు మన్మథుని జననమును సావధానముతో జెప్పెదను వినుము.

శ్లో॥ శంభునా తు హతే కామే తత్పత్నీ రతిసంజ్ఞికా।
ముమోహ పురతో దృష్ట్వా పతిం భస్మావశేషితం॥
జాతసంజ్ఞా ముహూర్తేన విలలాప హ చిత్రధా॥ ౪

తా. అప్పుడు మన్మథుడు సాంబమూర్తిచే దహింపబడగా నాతనిభార్యయగు రతీదేవియు తనపెనిమిటి శరీరమును తనముందరనే భస్మీభూతమైనదానిగా జూచి మూర్ఛనొంది కొంతతడవునకు తెలివితెచ్చుకొని యనేకవిధములుగా దుఃఖించుచుండెను.

శ్లో॥ యద్విలాపాధ్వగం వాపి సమదుఃఖ మభూ త్తదా॥

తా. ఏదుఃఖమును వినిన మార్గమునందు పోవుచున్నవానికైనను విచారము కలుగునో అతీరుగా విలపించుచుండెను.

శ్లో॥ తచ్చితాగ్నౌ స్వకాయం తు త్యక్తుకామా చ మాధవం।
పత్యు స్సఖాయం సంస్మార కర్తుం తాత్కాలికీః క్రియాః॥

తా. ఈప్రకారము రతీదేవి విలపించి పెనిమిటియొక్క దహనాగ్నియందు తన శరీరమును దహింపజేయుటకు నుద్యుక్తురాలై యప్పుడు తగినక్రియలను జేయుకొఱకు తనపెనిమిటికి మిత్రుడగు వసంత ఋతువును స్మరించెను.

శ్లో॥ స ఆగత శ్చితిం కర్తుం వీరపత్న్యా మహాప్రభుః।
స తు తత్రస్థ స్నేహిం దృష్ట్వా క్షణం మూర్ఛాపరో భవేత్॥
రతిం తు సాంత్వయామాస సాంత్వై ర్బహువిధై రపి॥ ౭

తా. మహానుభావుండైన యావసంతుడు శూరుండగు మన్మథుని భార్యకు చితి పేర్పరుచుటకు వచ్చినవాడై భయపడి స్నేహితుని భార్యయగు నా రతీదేవినిజూచి మూర్ఛాపరవశుడై యనేక విధములగు ప్రియవాక్యములచే సహగమనమును నివారింప జేయువాడై యిట్లు చెప్పదొడంగెను

శ్లో॥ పుత్రితుల్యో స్మి భద్రే తే స్థితే మయి చ నార్హసి।
కాయం త్యక్తుం ధర్మహేతు మిత్యాద్యై ర్బహుధాపి సా॥
నైవ స్థాతుం మనశ్చక్రే తేన సంస్తంభితా రతిః।
దృష్ట్వా దృష్ట్వా వసంతో౽పి చితిం చక్రే సరిత్తటే॥ ౯

తా. ఓమంగళప్రదురాలా! నీకు కుమారునితో సమానుండైన నేనుండగా నీవు శరీరము విసర్జించుటకూడదు. అనియీ ప్రకారము ధర్మహేతువులగు వాక్యములను జెప్పియనేక విధముల ప్రార్థించి నివారించినను యారతీదేవి జీవించుటయందు నిచ్ఛలేని దానిగా జూచి వసంతుడు యానదీతీరమునందు చితి పేర్చెను.

శ్లో॥ స్నావగాహ్యా ద్యునద్యాం చ కృత్వా కార్యాణి సర్వశః
సన్నియ మ్యేంద్రియగ్రామం నివేశ్యా త్మని వైమనః॥
చితి మారోఢు మారేభే తతో జాతా౽ శరీరవాక్।
మా ప్రవేశయ కల్యాణి? వహ్నిం పతిపరాయణా॥ ౧౧

తా. ఆరతీదేవి ఆకాశగంగలో స్నానముజేసి పైతృక కృత్యములన్నిటిని నెరవేర్చి పంచేంద్రియము లనిగ్రహించి మనస్సు నాత్మయందు నిలిపి శరీరమును దహింపజేయుటకు కాష్ఠమునధిష్ఠించబోవుచుండగా ఓ మంగళప్రదురాలా! నీవు పెనిమిటియందు భక్తిగలదానవైనను అగ్నియందుప్రవేశింపవలదని యొకయశరీరవాక్కు వినబడెను.

శ్లో॥ భవిష్యతి చ తే పత్యు ర్హారా ద్విష్ణో శ్చయాదవాత్।
జన్మద్వయం క్రమేణైవ తత్ర చో త్తరజన్మని॥
భైష్మ్యాం కృష్ణా న్మహావిష్ణోః ప్రద్యుమ్నాఖ్యో భవిష్యతి।

వసిష్యసి త్వం చ శాపా ద్బ్రహ్మణ శ్శంబరాలయే॥ ౧౩
ప్రద్యుమ్నాఖ్యేన తే పత్యా సంగతి శ్చ భవిష్యతి।
ఇత్యుక్త్వా విరరామాథ వాణీ చాకాశగోచరా॥ ౧౪

తా. ఓరతీదేవి! మన్మథుడు సాంబమూర్తివలనను యదువంశమునందు కృష్ణావతారముగ జనియించిన విష్ణుమూర్తి వలనను పుట్టి నీకు పెనిమిటి కాగలడు. అదియెట్లు అనగా నీకు పెనిమిటి యగుమన్మథుడు యికముందు రెండుజన్మంబు లెత్తును అందులో నుత్తరజన్మంబునందు శ్రీమహావిష్ణువగు కృష్ణునివలన రుక్మిణీదేవియందు ప్రద్యుమ్నుడను పేరుగలవాడైపుట్టి బ్రహ్మశాపమువలన శంబరాసురుని గృహమునందుండగా నీవు నీపెనిమిటితో కలిసికొని స్వేచ్ఛగావిహారసౌఖ్యమును పొందగలవనియశరీరవాక్కుపలికి చాలించెను.

శ్లో॥ శ్రుత్వా తాం తు నివృత్తా భూన్మరణే కృతనిశ్చయా।
తతో దేవా స్సమాజగ్ము స్స్వార్థే కామె హతే హరాత్॥ ౧౫
రత్యా దృష్టం ప్రకుర్వాణా గుర్వింద్రాగ్ని పురోగమాః।
తాం తే నివర్తయామాసు ర్వ్యాకేణ మహతా రతిం॥ ౧౬

తా. ఈప్రకారము పలికినయశరీరవాక్కును విని యారతీదేవి మరణించుటకు నిశ్చయము గలదైయున్నప్పటికిని చాలించెను. అనంతరమందు బృహస్పతి ఇంద్రుడు అగ్నిహోత్రుడు మొదలగు దేవతలు తమప్రయోజన కారియగు మన్మథుడు సాంబమూర్తివలన దహింపబడగా రతిదేవికడకువచ్చి యామెకు ప్రత్యక్షులై విశేషమైనవరములిచ్చి యామెను మరణ ప్రయత్నమువల్లనుంచి మాన్పించిరి.

శ్లో॥ అనంగోపి భవే త్సాంగో మృత స్సోప్యాత్మగో భవేత్।
ఇతి తాం తు వినిర్వార్య త్యే ధర్మాం శ్చోపదిదేశిరే॥ ౧౭

తా. ఆమన్మథుడు మృతుడైనను నీకంటబడగలడు శరీరములేనివాడైనను శరీరముకలవాడుగానే నీకుకనుపించును. అని ఈప్రకారము నామెతో జెప్పియామెను దుఃఖమునుండి నివారించి మరియు ననేకవిధములగు ధర్మముల నుపదేశించిరి,

శ్లో॥ పూర్వకల్పే త్వయం రాజా సుందరాఖ్యో మహాప్రభుః।
త్వమేవ పత్నీ తత్రాపి రజస్సంకరకారిణీ॥
తేనేయం చ దశా భూ త్తే కుర్విదానీం చ నిష్కృతిం।

మందాకిన్యాం తు వైశాఖే ప్రాతస్స్నానం తథా కురు॥ ౧౯

తా. ఓరతీదేవి! మీయొక్క పూర్వవృత్తాంతమును జెప్పెదవినుము. పూర్వ మందు నీపెనిమిటి సుందరుడనెడు పేరుగల గొప్పప్రభువుగానుండెను. నీవును ఆతని కుభార్యగా నయ్యుండి యొకానొకప్పుడు బహిష్టయి వెలుపలనుండక గృహమునందే యుండి యాచారసంకరము నొందించెను. అందువలననీకిట్టి కష్టమిప్పుడు సంభవించె ను గాన వైశాఖమాసము ప్రాతఃకాలమునందు నాకాశగంగయందు స్నానముజేసి యాపాపమునకు తగిన ప్రాయశ్చిత్తమును జేసికొనుము.

శ్లో॥ మధుసూదన మభ్యర్చ్య కథాం దివ్యాం తథాశ్రృణు।
అశూన్యశయనం నామ వ్రత మారభ భామిని॥ ౨౦
ధర్మేణా నేన తే భద్రే వ్రతేనాపిచ మాధవే।
నూనం తే భవితా పత్యు రుపలబ్ధి ర్న సంశయః॥ ౨౧
ఇతి తస్యై వరం దత్వా దేవా జగ్ము ర్యథాగతాః॥ ౨౧

తా. ఆప్రాయశ్చిత్త మెట్లనగా ఓచిన్నదానా! విష్ణుమూర్తినిపూజించి దేవతా సంబంధమగు కథనువిని అశూన్యశయనమనెడు వ్రతమారంభించి చేసినయెడల పుణ్యాక రమగు ఆవ్రతము చేతను నీపెనిమిటి నీకుతిరిగి సంభవించగలడు. నిశ్చయము. ఎంతమా త్రము సందేహములేదు. అనిపలికి యామెకు కోరినవరములనిచ్చి యాదేవతలు వారి వారి స్థానములకు చేరిరి.

శ్లో॥ తతః కృచ్ఛ్రాన్నివృత్తా సా దేవీ కామసతీ తథా॥
గంగావగాహనం చక్రే మేషసంస్థే దివాకరే।
అశూన్యశయనం నామ వ్రతం చాపి మహామనాః॥ ౨౩

తా. మన్మధుని భార్యయగు రతీదేవి యనంతరమున యతికష్టముగా దుఃఖము నివారింపజేసికొని సూర్యుడు మేషరాశి యందుండగా గంగానదిలో స్నానము జేసి పరిశుద్ధమైన మనస్సుగలదియగుచు ఆశూన్యశయన మనెడు వ్రతము నారంభించిచేసెను.

శ్లో॥ తేన పుణ్యప్రభావేన సద్యః కామో౽క్షిగోచరః।
అభూ త్తస్యై మహారాజ లోకే చావార్యవీర్యవాన్॥ ౨౪

తా. ఓమహారాజా! అపుణ్య మహత్తుచే అప్పుడే మన్మధుడు రతీదేవికి కండ్ల కగపడినవాడై విశేషమైన పరాక్రమము గలవాడై రతీదేవితో క్రీడించుచుండెను.

శ్లో॥ పూర్వకల్పే హ్యయ మపి రాజాధర్మపరాయణః।
వైశాఖోక్తా న్మహాధర్మా న్న చక్రే తేన వై స్మరః॥ ౨౫

తా. పూర్వమందు మంథరాడనెడు పేరుగల రాజు యనేకములగు ధర్మములను జేసినవాడైనను వైశాఖమాసమునందు జేయదగిన మహాధర్మములలో నొక్కటైనను జేయలేదు.

శ్లో॥ దేహనాశం ప్రపేదే సౌ పుత్రోపి పరమాత్మనః।
వృథా నీతే తు వైశాఖే మేషసంస్థే దివాకరే॥ ౨౬

తా. ఆరాజు అప్పుడు జేసిన పుణ్యవశమున విష్ణుమూర్తికి మన్మథుడను పేరుగల తనయుడుగా బుట్టినవాడైనను సూర్యుడు మేషసంక్రమణమును పొందియున్న వైశాఖమాసమును వ్యర్థముగా వెళ్లబుచ్చుటచేత దేహనాశనము సంభవించెను.

శ్లో॥ అవస్థేయం చ దేవానాం మనుష్యాణాం తు కా కథా॥

తా. దేవతులకే యిట్టి కష్టదశ సంభవించుచున్నప్పుడు వైశాఖమాసములో ధర్మము జేయకున్న మనుష్యులకు కష్టము సంభవించునని చెప్పనక్కరయే లేదు.

శ్లో॥ త్ర్యంబకేం త్వర్దితే పశ్చా న్నిరాశా గిరికన్యకా॥
మూర్ఛాం స్థితాం తదా భ్రాంతాం తాం దృష్ట్వా హిమవాన్ గిరిః।
చకితః స్స్వగృహా న్నిన్యే దోర్భ్యాం తాం పరిరభ్య చ॥ ౨౭

తా. ఈ ప్రకారము మన్మథుడు దహింపబడిన పిమ్మట సాంబమూర్తి మాయమైపోయెను. అనంతరము పార్వతీదేవి తనకోరిక వ్యర్థమాయెనని విచారము నొంది యుండగా నక్కడకు ఆమె తండ్రియగు హిమవంతుడు వచ్చి వ్యాకులచిత్తురాలగు నామెను జూచి తానును భయపడి యామెను కౌగలించుకొని చంకయందు నిడుకొని తన గృహమునకు తీసికొనివెళ్లెను.

శ్లో॥ రూపౌదార్యగుణాన్ దృష్ట్వా హరస్యైవ మహాత్మనః।
స ఏవ మే పతి ర్భూయా దితి తన్నిష్ఠమానసా॥ ౨౯
గంగోపకూల మాపేదే తప స్తప్తుం దృఢవ్రతా।
నివారితా పి సా దేవీ పిత్రా మాత్రా స్వకై ర్జనైః ౩౦

తా. అనంతరము పార్వతీదేవి మహానుభావుండగు సాంబమూర్తియొక్క రూపము ఔదార్యము మొదలగు గుణములను జూచి యా సాంబమూర్తియే నాకు భర్తగా [illegible]

పెనిమిటికాని మరియొకడు తగినవాడు కాడని యా సాంబమూర్తియందే నిశ్చలమైన మనస్సుగలదై తన తండ్రియు తల్లియు మరియు నితరులగు బంధుజనులు నెంత నివారించినను విననిదై తొట్రుపాటులేని ప్రతము నవలంబించి గంగానది యొడ్డున తపస్సును జేయుటకు ప్రారంభించెను.

శ్లో॥ అర్చయంతీ మహాలింగం నిరాహారా జటాధరా
దివ్యవర్ష సహస్రాంతే ప్రత్యక్షోభూన్మహేశ్వరః॥ ౩౦

తా, ఆ పార్వతీదేవి యాహారము విసర్జించి కేశములను జడలనుగా జేసికొని మహాలింగ స్వరూపమగు సాంబమూర్తి నిట్లు శివ ప్రతముతో బూజించుచుండగా నా సాంబమూర్తి దేవతాసంవత్సరములు వెయ్యి గడచినపిమ్మట నా పార్వతీదేవికి ప్రత్యక్షమాయెను.

శ్లో॥ భూత్వా వర్ణ్యపి సాయాహ్నే పర్ణశాలాముఖే విభుః
స్వనిష్ఠమనసో దార్ఢ్యం నాత్యర్థ్యాన్నాపిదైరపి॥
జ్ఞాత్వా వద ద్వరం భద్రే వరయేతి మహాప్రభుః
సా వవ్రే ధ పతిం రుద్రం త్వాం భవేతి వరాననా ౩౩

తా. సర్వశక్తిమంతుండగు యా సాంబమూర్తి సన్యాసివేషమునుధరించి సాయంకాలమునందు యా పార్వతీదేవి తపమొందు పర్ణశాలవద్దకు వచ్చి తనయందు గట్టి యభిప్రాయ మున్నదో? లేదో? తెలిసికొనుటకు సాంబమూర్తిని గూర్చి తాను కొన్ని నీచోక్తులాడినను దానిని విని సహింపకుండుటచే తనయందు నిశ్చలమైన మనస్సుగలదానిగా నెఱింగి యప్పుడు మహానుభావుడగు సాంబమూర్తి నిజస్వరూపము నగపఱచి నీవు వరము కోరుమిచ్చెదనని పల్కగా శ్రేష్ఠంబగు ముఖముగల యా పార్వతీదేవి నీవు నాకు పెనిమిటివగుమని సాంబమూర్తిని గోరెను.

శ్లో॥ స తథైవ వరం దత్వా ఋషీన్ సస్మార సప్త చ।
ఆజగ్ముస్తేపి మునయః స్మృతాః ప్రాంజలయః పురః॥ ౩౪

తా. సాంబమూర్తి అట్లే గానిమ్మని పార్వతీదేవికి వరమిచ్చి సప్తమునీశ్వరులను స్మరింపగా నా యేడుగురు మునీశ్వరులు వచ్చి చేతులుజోడించుకొని సాంబమూర్తియెదుట వచ్చి నిలబడిరి.

శ్లో॥ ఋషీనాజ్ఞాపయామాస కన్యాం ప్రార్థ్య హిమాలయం।
తే ఆదిష్టా భగవతా కన్యార్థం హిమవద్గృహం॥

ప్రావృ త్యేహాయసా సర్వే ద్యోతయంతో దిశో దశ।
ప్రత్యుజ్జగామ సగిరి స్సైత్తైతాన్ బ్రహ్మవిత్తమాన్॥ ౩౬

తా. అప్పుడు భగవంతుండగు సాంబమూర్తి పార్వతీదేవిని తనకిచ్చుటకు హిమవంతుని యడుగుటకు వెళ్లవలయునని చెప్పగా నా యేడుగురు మునులు కన్యక నడుగుటకు పదిదిక్కులను తమ శరీరకాంతిచే ప్రకాశింప జేయుచున్నవారలై యాకాశమార్గమున హిమవంతుని గృహమునకు రాగా నా హిమవంతుడు బ్రహ్మవేత్తలగు నా మునీశ్వరులకు నెదురుగా వెళ్లి తీసికొనివచ్చెను.

శ్లో॥ సంపూజ్యవిధివ త్సర్వాన్ సుఖాసీనా నపృచ్ఛత।
ధన్యోస్మి కృతకృత్యోస్మి యద్భవంతో గృహాగతాః॥ ౩౭

తా. ఆమునీశ్వరులకు శ్రేష్ఠంబులగు నాసనములనిడి కూర్చుండబెట్టి యథావిధిగా పూజించి యిట్లు కుశలప్రశ్న జేయుచున్నాడు. ఓమునీశ్వరులారా ! మీరు నాగృహమునకు దయచేయుటచే నేను ధన్యుడనైతిని. సఫలమైన కార్యములు గలవాడనైతిని.

శ్లో॥ భవదాగమనం మన్యే మమ జన్మఫలం త్వితి,
న కార్యం విద్యతే స్మాభిః పుణ్యార్థానాం మహాత్మనాం॥ ౩౮

తా. మీరు పుణ్యాత్ములును మహానుభావులును కాబట్టి నాతో మీకు యేపనియును లేదు. అందువలన మీయొక్క రాకను నాజన్మమును సఫలము జేయుటకొరకే కాని మరియొక కారణము లేదని తలచెదను.

శ్లో॥ తథాపి బ్రూత కార్యం వో య త్కర్తవ్యం మయా ధునా।
ఇత్యుక్తా స్తే తథా ప్రోచు ర్హిమవంతం మహాగిరిం

తా. ఐనను యేకొంచమైనను నేను జేయవలసిన కార్యముండినేని చెప్పినయెడల చేతునని హిమవంతుడు పలుకగా నా యేడుగురు మునీశ్వరులు హిమవంతునితో నిట్లు చెప్పుచున్నారు.

శ్లో॥ త్వయా తే సదృశం వాక్య ముక్తం గిరిపతే ధ్రువం।
అస్మదాగమనే హేతుం వక్ష్యామ స్తే మహోదయ॥

తా. సమస్తపర్వతములకు నధిపతియు మహానుభావుడవునగునో! హిమవంతుడా నీకు తగినమాటను పలికితివి మాయొక్క రాకను గురించి హేతువును చెప్పెదము వినుము.

శ్లో॥ త్వత్కన్యా పార్వతీ నామ పూర్వం దక్షాత్మజా సతీ।
జాతా తవ కుమారీ యా యజ్ఞే త్యక్తకళేబరా॥ ౪౧
అస్యాః పాణిగ్రహే దక్షః శంభు ర్నాన్యో జగత్త్రయే।
దేయా సా శంభవే దేవీ భవతానంద మిచ్ఛతా॥ ౪౨

తా. ఓహిమవంతుడా! పూర్వమందు దక్షునికుమార్తె యగు సతీదేవి దక్షయజ్ఞమునందు తండ్రియందు కోపముచే దేహముచాలించి నీకు కుమార్తెగాపుట్టి పార్వతియను పేరుగలదియై యుండెను, ఆమెను వివాహమాడుటకు మూడులోకములయందును సాంబమూర్తికంటె సమర్థుడగుమరియొకపురుషుడులేడు, కాబట్టి నీవుని శేషముచేలును పొందదలచితివేని ఆపార్వతీదేవిని సాంబమూర్తికిచ్చి వివాహముచేయుము.

శ్లో॥ పూర్వజన్మసహస్రేషు భవతా సుకృతం కృతం।
ఇదానీం తవ దిష్ట్యా తు పరిపాక ముపాగతం॥

తా. నీవు పూర్వజన్మముల యేమిపుణ్యముజేసినావో నీయొక్క అదృష్టమువలన అట్టి పుణ్యముపరిపాకము పొంది ఫలించినది.

శ్లో॥ తేషాం తద్వచనం శ్రుత్వా సంహృష్టాత్మా మహాగిరిః।
వ్యాజహార పున ర్వాక్యం పుత్రీ వల్కలధారిణీ॥ ౪౪
గంగాతీరే నిరాహారా తపశ్చరతి దుశ్చరం।
కాంక్షమాణా పతిం శంభుం తస్యా ఇష్ట మిదం త్వితి॥ ౪౫

తా. పర్వతశ్రేష్ఠుండగు యాహిమవంతుడు ఆమునీశ్వరులు చెప్పినమాటలను విని సంతుష్టహృదయుండై యోమునులారా! నాకుమార్తెయగు పార్వతి నారచీరెలను ధరించి యాహారమును విడిచి సాంబమూర్తి తనకు పెనిమిటియగుటకుగాను గంగానదియొడ్డున కఠినతపస్సును జేయుచున్నది. కాబట్టి యీకార్యము ఆమెకు నిష్టమైనదియే.

శ్లో॥ దత్తా కన్యా మయా తస్మై త్ర్యంబకాయ మహాత్మనే।
శీఘ్రం గత్వా భవంత స్తు యతి శంభు ర్మహాప్రభుః॥ ౪౬
ప్రీత్యా హిమవతా దత్తాం గృహాణేతి నివేద్య చ।
భవంత ఏవ కుర్వంతు చైతద్వైవాహికీం క్రియాం॥ ౪౭

తా. పార్వతీదేవికి సాంబమూర్తియందు నపేక్షగలుగుటజేసి మహానుభావుడగు సాంబమూర్తికి పార్వతి యింతకుపూర్వమే యివ్వబడియున్నది కాబట్టి యోమునులారా! మీరు సాంబమూర్తియున్న ప్రదేశమునకు శీఘ్రముగావెళ్లి హిమవంతుడు సంతుష్టాంతరంగుడై పార్వతీదేవిని పూర్వమే మీకు యిచ్చియున్నాడని చెప్పి మీరే యీవివాహవిధిని నెఱవేర్ప వలయును.

శ్లో॥ ఇత్యుక్తా స్తే హిమవతా త మామంత్ర్య శివం యయుః।
లక్ష్మ్యాద్యా యోషిత స్సర్వా విష్ణ్వాద్యా దేవతా అపి॥ ౭౮
మహర్షాతరో థ మునయో ద్రష్టుం జగ్ము ర్మహోత్సవం॥

తా. ఈప్రకారము హిమవంతుడు చెప్పగా విని మునీశ్వరులు హిమవంతుని యొద్ద ననుజ్ఞతీసికొని సాంబమూర్తియొద్దకు వెళ్లిరి. పిమ్మట నిట్టి మహోత్సవమును జూచుటకు లక్ష్మీదేవి మొదలగు స్త్రీలును విష్ణు మొదలగు దేవతులును మహర్మాతరలును మునీశ్వరులును వచ్చిరి.

శ్లో॥ శివ స్సర్వామరగణై ర్మునిభి ర్మాతృభిస్తథా।
అన్వితో వృషభారూఢః ప్రమథానాం గణై ర్వృతః॥
భేరీశంఖమృదంగాద్యైః కహళాపటహాదికైః॥ ౭౦
బ్రహ్మఘోషై ర్బంధుభి శ్చ ప్రావిశ ద్ధిమవత్పురీం॥

తా. సాంబమూర్తి వృషభవాహనము నెక్కి సమస్తదేవతాసమూహములతోడను మునీశ్వరులతోడను మహర్మాతలతోడను ప్రమథగణములతోడను గూడినవాడై భేరిశంఖము మృదంగము ఢంకవ పఖత్ మొదలగు వాద్యములు మ్రోగుచుండగా బ్రాహ్మణులు వేదములను పఠియింపుచుండగాను బంధువులతో గూడినవాడై హిమవంతుని పట్టణమునకు వెళ్లెను.

శ్లో॥ సుముహూర్తే శుభే లగ్నే శుభగ్రహనిరీక్షితే।
వివాహ మకరో చ్ఛైలః ప్రహృష్టేనాం తరాత్మనా॥
మహోత్సవ స్తదా చాసీ త్త్రిలోక్యాం ప్రాణినాం నృప॥ ౭౧

తా. అనంతరము హిమవంతుడు సంతోషించిన మనస్సుగలవాడై శుభగ్రహములచే జూడబడుచుండిన శ్రేష్ఠమగు లగ్నమందు పార్వతిని సాంబమూర్తికిచ్చి వివాహముజేసెను, ఓరాజా! అప్పుడు మూడులోకములయందుండు సమస్తప్రాణులకును మిక్కిలి యానందమాయెను.

శ్లో॥ మహోత్సవే నివృత్తే తు శంకరో లోకశంకరః।
రేమే స్వచ్ఛందయా దేవ్యా లోకధర్మా ననువ్రితః॥ ౹౹3

తా. ఈప్రకారము వివాహమహోత్సవము సంపూర్తినొందిన పిమ్మట లోకమునకు శుభమునుజేయు సాంబమూర్తి లోకములోనుండు ధర్మముల నవలంబించి స్వేచ్ఛగా పార్వతీదేవితో క్రీడించుచుండెను.

శ్లో॥ బుద్ధిమద్ధినువద్గేహే దేవేంద్రభవనోపమే।
శర్వర్యాం నందినీతీరే వనరాజిషు శంకరః॥ ౹౹౪
మత్తాళిద్విజసన్నాదమయూరరవమండితే।
దివ్యవర్షసహస్రాణి రేమే స్వచ్ఛందయా విభుః ౹౹౫

తా. సమస్తసంపత్తులు కలదిగనుక నే దేవేంద్రుని గృహములో సమానమైన హిమవంతుని గృహమునందును రాత్రులయందు ఆనందకరమైన సరస్సులతీరమందును వనపంక్తులయందును మదించిన తుమ్మెదలు పక్షులు నెమళ్ళు మొదలగు జంతువుల ధ్వనులతోగూడిన ప్రదేశమునందును ప్రభువగు సాంబమూర్తి యనేకవేల దివ్యసంవత్సరములు స్వేచ్ఛగా పార్వతితోగూడి క్రీడించుచుండెను.

శ్లో॥ స్త్రీణా మింద్రవరాభావా త్తస్మి న్కాలే నృపోత్తమ।
పుంసంసర్గా త్పున ర్గర్భో నారీణాం స్రవతి ధ్రువం॥ ౹౹౬

తా. ఓరాజా! ఆకాలమునందు దేవేంద్రునియొక్క వరము లేకుండుటచే స్త్రీలకు పురుషులతో సంభోగము కలిగినప్పటికిని తిరిగి గర్భము స్రవించుటయే కాని గర్భోత్పత్తి యగుటలేదు.

శ్లో॥ ప్రత్యహం రమణా ద్దేవ్యాం నాభూ ర్గర్భో హరాద్భుత।
దేవానా మభవ చ్చింతా పుత్రలాభా ద్వరా ద్విభో॥ ౹౹౭

తా. ఓరాజా! కాబట్టి సాంబమూర్తి పార్వతీదేవితో నిత్యము సంభోగించుచున్నప్పటికి గర్భోత్పత్తికలుగలేదు. ఎంతయాశ్చర్యము అని ఈప్రకారము దేవతలాలోచించి సాంబమూర్తివలన కుమారుడెట్లు కలుగునోయని యుపాయమాలోచించుచుండిరి.

శ్లో॥ సర్వే సంగత్య సంమంత్ర్య మిథః ఏవం బభాషిరే।
కామినా వాభూ ద్రతో నిత్యం సక్తో దేవ్యా హార స్స్వరాట్॥ ౹౹౮

తా. దేవతులందరు యొకరినొకరు పిలచికొని యొకచోటగూడినవా వారు రహస్యముగా నిట్లుచెప్పుకొనిరి స్వయంప్రకాశమానుడైన సాంబమూ గమునందు కోరికగలవాడై నిత్యము పార్వతీదేవితో సంభోగించుచు న్నాడు

శ్లో॥ నాస్మాకం సిద్ధ్యతే కార్యం నిత్యం గర్భస్య సంస్రవాత్
పునా రతి ర్యథా నాభూ త్తథా స్మాభి ర్విధీయతాం॥

తా. నిత్యము గర్భము స్రవించుటచే మనయొక్క కార్యసిద్ధి కాలేదు సంభోగము పూర్తిఅయిన పిమ్మట తిరిగి సంభోగము చేయకుండునట్లుగా మ త్నము జేయవలయును.

శ్లో॥ మిథ ఏవం తు సంభాష్య విచిన్త్య క్షణ మత్రిహి।
అగ్నిం కృత్యే వినిశ్చిత్య హ్యూచు ర్మానపురస్సరం॥

తా. ఈ ప్రకారము రహస్యముగా మాట్లాడుకొని క్షణకాలమాలో కార్యమును సాధించుటయందు నగ్నియే తగినవాడని నిశ్చయించి యాయ ని బిలచి మర్యాదజేసి యిట్లు చెప్పిరి.

శ్లో॥ త్వం ముఖోఽగ్నే హి దేవానాం త్వం బంధు ర్గతి రేవ
ఇదానీ మపి గచ్ఛ త్వం రమతే యత్ర వైహరః॥
రత్యంతే దర్శయా త్మానం పునారతి ర్యథా న వై।
త్వాం దృష్ట్వా వ్రీడితా దేవి తత శ్చాపసరే ద్ధృవం॥

తా. ఓయగ్నిహోత్రుడా! నీవు దేవతులకందరికిని ముఖస్వరూపమ వాడవు. నీవేబంధువు. నీవేగతివి. కాబట్టి నీవిప్పుడు సాంబమూర్తి సం స్న ప్రదేశమునకు వెళ్ళి సంభోగముపూర్తి అయినపిమ్మటవారి యెదుటకు డల పార్వతీదేవినిన్ను జూచి సిగ్గుపడి యచ్చటనుండి లేచి వెళ్ళును. కా సంభోగము సంభవింపదు నిశ్చయము.

శ్లో॥ శిష్యో భూత్వా తు రత్యంతే పృచ్ఛ తత్వం స్మరాంతకం
తత్వాసంప్రశ్నవ్యాజేన కాలం బహు నయ ప్రభో॥

తా. సంభోగసమయమందు వెళ్ళుటయెట్లంటివేని. సంభోగాంతమ శిష్యుడవుగావెళ్ళి మన్మథ సంహారకుడైన యాసాంబమూర్తిని వేదాంతమ ప్రశ్నజేయుము. ఓస్వామీ! యిట్లు వేదాంతసంభాషణయను కపటవ్యా కాలమును గడుపుము.

శ్లో॥ బహుకాలె గతే దేవీ కుమారం ప్రసవిష్యతి।
దేవై రేవం ప్రార్థితో గ్నిరో మిత్యుక్త్వా హరం యయౌ॥

తా. విశేషకాలము గడచిన యీపార్వతీదేవి కుమారుని కనగలదు. అని యీ ప్రకారము దేవతలు ప్రార్థించగా నగ్నిహోత్రుడు యాతీరుగానే జేయుదునని యొప్పుకొని సాంబమూర్తియుండు ప్రదేశమునకు వెళ్ళెను.

శ్లో॥ వీర్యోత్సర్గా త్పూర్వ మేవ గతో వహ్ని రతాంతరే।
తం దృష్ట్వా వ్రీడితా దేవీవివస్త్రా విమనా యయౌ॥ ౬౫

తా. అప్పుడు సంభోగము పూర్తికాకుండుటచే పార్వతీదేవియందు సాంబమూర్తిచే వీర్యమువిడువబడలేదు. అట్టిసమయమునో సెచుటనుండు యగ్నిహోత్రుని జూచి యాపార్వతీ వస్త్రరహితముగా నుండినందున సిగ్గుపడి వెలవెలబోయి చాటునకు వెళ్ళెను.

శ్లో॥ రతిం విహాయ త్వరయా తతో రుద్రో తికోపితః।
వహ్నిం ప్రాహ గృహాణేద మవిసృష్టం తు దుర్మతే॥ ౬౬
మద్వీర్యం దుస్సహం పాపరతివిఘ్న స్త్వయా భవత్।
ఉత్సృజామి చ మద్వీర్యం త్వన్ముఖే హవ్యవాహన॥ ౬౭

తా. పార్వతీదేవి సంభోగమును విడిచి శీఘ్రముగా లేచిపోవుటచే నగ్నిహోత్రునియందు మిక్కిలి కోపముగలవాడై యాతనితో నిట్లు పలుకుచున్నాడు. దుష్టబుద్ధిగలవాడవును పాపుడవునగునో యగ్నిహోత్రుడా! మాసంభోగమునకు నీవు విఘ్నమును కలిగించితివి నాచే పార్వతియందు వీర్యముంచబడలేదు. కాబట్టి యట్టిదుస్సహమైన వీర్యమును నీముఖమునందు విడిచెదను దీనిని నీవే మోసికొనిపొమ్ము.

శ్లో॥ ఇత్యుక్త్వో త్సృష్టవా న్వీర్యం హవ్యవాహముఖే హరః।
తద్ధృత్వా దహ్యమాన స్స్వ స్వోదరే వీర్య ముల్బణం॥ ౬౮
చింతయానో యయౌ ధామ దేవానాం యజ్ఞపూరుషః।
కథంచి త్ప్రాణతో ముక్తో దేవేభ్య స్తన్ని వేదయత్॥ ౬౯

తా. ఈప్రకారము సాంబమూర్తిపలికి తనవీర్యమును అగ్నిహోత్రుని యందు విడిచెను. ఆయగ్నిహోత్రుడు దుర్భరమైన యారేతస్సును తనహృదయమందు ధరించి తపింపబడుచుండినవాడై ప్రాణముతో విడువబడితినని తలచి యాభారమును పోగొట్టుకొనుట యెట్లగునోయని మనస్సున విచారించి దేవతుల యొద్దకువెళ్ళి జరిగిన వృత్తాంతమునంతయు వారలతో జెప్పెను.

శ్లో॥ దేవా వహ్నేరితం శ్రుత్వా హర్షశోకౌ సమీయయుః।
స్థితవీర్య మితిహ్లాదం కథం తు ప్రసవోభవేత్॥
ఇతి దుఃఖం తదా చాసీ ద్వహ్నేః కుక్షౌ తు శాంభవం।
సమృధే తేజసో క్షిప్రం దశ మాసా గతా స్తదా॥ ౨౧

తా. ఇట్లు అగ్నిహోత్రునిచే జెప్పబడిన మాటలువిని దేవతలు సంతోషమును దుఃఖమును పొందిరి. ఎందువలననగా వీర్యము సంభవించుటచే సంతోషమును ఈవీర్య మెట్లు పిండమై పుత్రుడుగా జనియించు నెట్లోయని దుఃఖమును పొందిరి. ఇట్లుయగ్నిహోత్రుని గర్భమందుంచబడిన శాంభమూర్తి వీర్యము వృద్ధిపొందుచుండగా పదిమాసములు శీఘ్రముగానే గడచెను.

శ్లో॥ నాపశ్య త్ప్రసవోపాయం బహుదుఃఖపరాయణః।
దేవా న్వై శరణం ప్రాప గర్భమోచనహేతవే॥ ౨౨

తా. ఆయగ్నిహోత్రుడు ఎన్నిదినములకును ప్రసవించకుండుటచే విశేషదుఃఖముగలవాడై యాగర్భ ప్రసవమునకు తగిన యుపాయమును తెలిసికొనుటకు దేవతలను శరణు పొందెను.

శ్లో॥ తే దేవా వహ్నినా సాకం ప్రాపు ర్గంగాం యశస్వినీం।
గంగాం స్తోత్రేణ తే స్తుత్వా ప్రార్థయామాసు రంజసా॥ ౨౩

తా. ఆదేవతలు అగ్నిహోత్రునితోగూడి లోకప్రసిద్ధి గలిగిన గంగానది యొద్దకు వెళ్ళియామె ననేకవిధములగు స్తోత్రముల జేసిరి.

శ్లో॥ త్వం మాతా సర్వదేవానాం త్వ మేవ జగతాం పతిః।
దేవతార్థం తు త్వం భద్రే ధత్స్వ తేజ స్తు శాంభవం॥ ౨౪

తా. ఓగంగాదేవీ! సమస్తదేవతులకు నీవే తల్లివి. మూడు లోకములకునీవు యధిపతివి. కావున దేవతుల యుపయోగము కొఱకు యగ్నిహోత్రునియందున్నదు శాంభమూర్తి సంబంధమైన వీర్యమును నీవు ధరియింపుము.

శ్లో॥ త ద్వహ్ని ర్వర్ధతే గర్భే న స్త్రీత్వా త్ప్రసవోస్యచ।
తస్మా ద్దేహం చ న స్పర్శ్యా త్సముద్ధర దయాంకురు॥

తా. అగ్నిహోత్రునియందుగర్భమువృద్ధిపొందుచున్నది కానియతనుపురుషుడగుట చేప్రసవించుట సంభవించదు. కాబట్టి యావీర్యమును నీవు ధరియించిమాయందుదయ యుంచి యగ్నిహోత్రుని మమ్ములను రక్షింపుము.

శ్లో॥ ఇత్యేవం ప్రార్థితా దేవీ తథా స్త్వితి వచో బ్రవీత్।
దేవా స్తువహ్నయే ప్రాహు ర్మంత్రం గర్భవిమోచనం॥ ౨౬

తా. ఈ ప్రకారము యా గంగాదేవి దేవతలచే ప్రార్థింపబడి యాలాగే చేయుదునని యొప్పుకొనెను అనంతరము దేవతలు అగ్నిహోత్రునకు గర్భము వదలి పోవునట్టి మంత్రముపదేశించిరి.

శ్లో॥ తన్మంత్రా ద్గర్భ మాకృష్య వ్యసృజ ద్ధవ్యవాహనః।
గంగాయాం శాంభవం తేజో భాస్వల్లోకసుదుస్సహం॥

తా. వారు యుపదేశించిన మంత్రమువలన గర్భమందున్నట్టియు లోకములలో సహింపశక్యము కావట్టియు ప్రకాశించునట్టి సాంబమూర్తి తేజస్సును తీసి గంగానదియందుంచెను.

శ్లో॥ సా చోఢ్వా కతిచి న్మాసా న్న శశాక తతఃపరం।
నిర్జలా తత్ప్రభావేన స్ఫుటదిక్త్రికళేబరా॥ ౨౮
బహుదుఃఖాతురా దేవీ పాతివ్రత్యప్రభావతః।
ఉజ్జహార స్వోదరస్థం గర్భం లోకైకపావనీ॥ ౨౯

తా. ఆ గంగానదియును కొన్నిమాసములా గర్భమును భరియించి యటుపిమ్మట భరించలేనిదై యా తేజస్సుయొక్క వేడిమిచే నింకిపోయిన జలముగలదియై జలములేని శరీరముగలది యాగుచు లోకమును పవిత్రమును జేయు యానది విశేషదుఃఖమును పొంది తన పాతివ్రత్య మహిమచే తన గర్భమందుండు పిండమును బయటకు తీసెను.

శ్లో॥ శరకాండే తు చిక్షేప దహ్యమానం సమంతతః।
శరకాండై స్తు సంభేదో షోఢా భిన్నో బభూవ హ॥ ౩౦

తా. అంతటను తపించుచున్న సాంబమూర్తి రేతస్సును రెల్లుపొదయందుంచగా రెల్లుదంట్లచే నా రేతస్సు యారు విభాగములుగా నేర్పడెను.

శ్లో॥ షట్కృత్తికా స్సమాజగ్ము ర్బ్రహ్మణా చోదితా స్తథా।
శరకాండే వినిర్భిన్నం షోఢా సంధాయ శాంభవం॥ ౩౧
షణ్ముఖం పురుషం కృత్వా త్వేకదేహ మితి స్ఫుటం॥
కృత్తికా విధినా జప్త్వా స్తం తథా చక్రిరే దృఢం॥ ౩౨

తా. అనంతరము బ్రహ్మచే ప్రేరేపింపబడినవారై షట్కృత్తిక లచ్చటికిక్ష

చ్చి రెల్లుపొదయందు యారువిధములుగా నేర్పడియున్న యా సాంబమూర్తి రేతస్సు
ను యారు ముఖములను యొక్క దేహమునుగల పురుషునిగా దృఢమైన ప్రయత్నము
తో బ్రహ్మయొక్క యాజ్ఞానుసారముగా షట్కృత్తికలు చేసిరి.

శ్లో॥ తద్దేహం పురుషాకారం షణ్ముఖం శరకాండగం।
అరక్ష్యమాణ మేవాసీ చ్ఛరకాండేషు వైచిరం॥ ౮౩

తా. ఆరుముఖములు గలిగి పురుషాకారమైన యా దేహము రెల్లుపొదయందుం
చబడి బహుకాలమువరకు నెవరిచేతను రక్షింపబడనిదై యుండెను.

శ్లో॥ ఏకదా వృషభారూఢౌ పార్వతీపరమేశ్వరౌ।
శ్రీశైలం గంతుమనసా తత్స్థలం పరిజగ్మతుః ౮౪

తా. ఇట్లు కొంతకాలము గడువగా నొకప్పుడు పార్వతీపరమేశ్వరులు వృష
భవాహనము నెక్కి శ్రీశైలమును గరించి వెళ్ళుచు నాప్రదేశమునకువెళ్లిరి.

శ్లో॥ తదా సీ త్పార్వతీ దేవీ సద్యస్స్నుతపయోధరా।
విస్మితావచనం రుద్రం స్నుతౌ కస్మా త్పయోధరౌ॥ ౮౫
కారణం బ్రూహి విశ్వాత్మ న్నిత్యుక్త స్తు హరో బ్రవీత్।
శృణు దేవి ప్రవక్ష్యామి పుత్రోద్ధో వర్తతే తవ॥ ౮౬

తా. అప్పుడు పార్వతీదేవి కుచములవలన క్షీరములు స్రవించగా నాశ్చర్యము
నుపొంది యా పార్వతి స్తనములు స్రవించుటకు కారణమేమని సాంబమూర్తి నడుగగా
ప్రపంచమునంతయు వ్యాపించినయుండు సాంబమూర్తి యోదేవీ! వినుమని యిట్లు చె
ప్పెను. నీకుమారుడు యీ దిగువప్రదేశమునం దుండెను.

శ్లో॥ త్వయి వీర్య మనుత్సృష్టం ప్రాగే వాగా ద్ధవిర్వహః।
తం దృష్ట్వా వ్రీడితా త్వం వై ప్రవిష్టా చ స్థలాంతరం॥ ౮౭

తా. అది యే తీరుననగా. పూర్వమందు నీతో నేను సంభోగించుచుండగా
నీయందు వీర్యమును విడువకపూర్వమే యచ్చటికి నగ్నిహోత్రుడు వచ్చెను. అప్పు
డు నీవాయగ్నిహోత్రుని జూచి సిగ్గుపడి మరియొక చోటునకువెళ్లి దాగితివి.

శ్లో॥ మయా కోపా ద్వహ్నిముఖే విసృష్టం వీర్య ముల్బణం।
దేవానాం చ ప్రసాదేన గంగాయాం విసృజ ద్విభుః॥ ౮౮

తా. అప్పుడు నేనుయగ్నిహోత్రునియందుకోపముగలవాడనైదుస్సహమగునావీ
ర్యమును ఆతని ముఖమునందు విడువగా నతండు కొంతకాలము భరియించి పిమ్మట దే
వతుల యనుగ్రహమువలన గంగానదియందు విడిచెను.

శ్లో॥ గంగా చ దహ్యమానా సా చిక్షేప చ శరాంతరే।
తత్రిషోఢా ప్రభిన్నం తు మాతృభి శ్చ దృఢీకృతం॥ ౭౯

తా. ఆ గంగానదియు వీర్యతాపముచే తపింపబడి రెల్లుపొదయం దుంచగా నావీర్యము ఆరు విభాగములు కాబడెను. అప్పుడు షట్కృత్తికలు వచ్చి యా యా రుపిండములను దృఢముగా నుండునట్లు కూర్చిరి.

శ్లో॥ పురుషాకృతి మాపేదే తం దృష్ట్వా తే స్తనా స్స్రుతాః॥
పాలయేయం మహావీర్యం విష్ణునా సమవిక్రమం॥ ౮౦

తా. ఆపిండములు ఒక్క దేహము గలిగి పురుషాకారమును పొందెను. ఆపురుషునిజూచుట చేనీ స్తనములు స్రవించుచున్నవి, కాబట్టి నా వీర్యమువలన సంభవించి నట్టియీ విష్ణునితో సమానమైన పరాక్రమముగల యీపిల్లవానిని నీవు రక్షించువుము.

శ్లో॥ అయ మేవౌరసః పుత్రి స్తవ భాతి వినిశ్చితం।
తస్మా ద్గృహాణ శీఘ్రం త్వం తేనఖ్యాతి రతీవ తే॥ ౮౧

తా. నీవు కన్నకుమారుడు యితడనే నాకు నిశ్చయముగా తోచుచున్నది. కాబట్టి శీఘ్రముగా నీపిల్లవానిని తీసికొనివెళ్ళి పోషించితివేని యితనివలన నీకు విశేషమైన ప్రసిద్ధిరాగలదు

శ్లో॥ ఇత్యాజ్ఞప్తా శంభునా సా త మాదాయా ర్భకం ద్రుతం।
అంక మారోప్య తం దేవీ పాయయామాస సా స్తనౌ॥ ౮౨

తా. ఈప్రకారము సాంబమూర్తిచే నాజ్ఞాపింపబడి యాపార్వతీదేవి శీఘ్రముగా నాపిల్లవానిని తీసికొని తొడలయందునిడుకొని స్తన్యపానముజేయించెను.

శ్లో॥ దేవేన మోహితా దేవీ పుత్రస్నేహపరా భవత్।
పునః కైలాస మగమ త్ప్రభుణా సహ శాంకరీ॥ ౮౩

తా. ఈప్రకారము సాంబమూర్తిచే భ్రమనుపొందింపబడి పార్వతీదేవి పుత్రవాత్సల్యముగలదియగుచు సాంబమూర్తితోకూడ తిరిగి కైలాసమునకు నేగెను.

శ్లో॥ పుత్రం లాలయతీ దేవీ సంతోషం పరమం యయౌ।
ఏవం కుమారజననం వర్ణితం తే మయా ద్భుతం॥

తా. అనంతరమా పార్వతీదేవి యాకుమారుని పెంచుచు విశేషమైన సంతోషమును పొందెను ఓ రాజా! ఈప్రకారమాశ్చర్యకరమైన కుమారస్వామి జననము నీకు జెప్పితిని.

శ్లో॥ య ఇదం శృణుయా న్నిత్యం కుమారజననం శుభం।
పుత్రపౌత్రాభివృద్ధిం తు లభతే నాత్ర సంశయః॥

తా. శుభములనొసంగు యీకుమారస్వామి జననచరిత్రము నెవ్వడు వినుచున్నాడో అట్టివాడు ఇహలోకమునందు పుత్రులు పౌత్రులు మొదలగు అభివృద్ధిని పొందగలడు సందేహము లేదు.

శ్లో॥ మహద్దుఃఖం తు జననే మారస్యాప్రియతో భవత్।
ప్రీత్యా శుశ్రిత వైశాఖధర్మో వ్యప్రీతిమో భవేత్॥ ౯౬

తా. తపోనిష్ఠాగరిష్ఠుడైయున్న సాంబమూర్తికి తిరిగి వివాహమగుట అయుక్తమైనందునను యుక్తి అయుక్తమైన కార్యమును జేసికొనుటకు భ్రమను కలిగించినందుకు మన్మథుడు కారణుడైనందునను సత్పురుషులకు నప్రియమును జేసినందువలనను మన్మథుడు తిరిగి జన్మించినప్పుడు విశేషమైన దుఃఖమును పొందెను. వైశాఖమాస ధర్మమైతే భగవంతునకును సత్పురులకు నిష్టమైనందున నిత్యము వినుచుండిన యెడల విశేషమైనఫలము నిచ్చునదియగును.

శ్లో॥ తస్మాద్వైశాఖధర్మో హి సర్వాఘౌఘవినాశనః।
అవైధవ్యప్రదః పుణ్యః సర్వసంపద్విధాయకః॥ ౯౭

తా. భగవంతునకు ప్రీతికరమగుటవలన వైశాఖధర్మము సమస్తపాపములను పోగొట్టునదియు చిరకాలము సువాసినీత్వము కలిగించునదియు పుణ్యాకరమైనదియు సమస్తసంపత్తుల నిచ్చునదియు నగును.

శ్లో॥ అనంగోపి హి సాంగత్వం యత్ప్రభావా త్సమాప్తవాన్।
అస్నాత్వా చా ప్యదత్వా చ వైశాఖో యస్య వైగతః॥
అపి ధర్మకృతో వాపి భవే దుఃఖపరంపరా।
సర్వధర్మయుతస్యాపి యద్యేకో య మనుష్ఠితః॥ ౯౮

తా. మన్మథుడు శరీరములేనివాడైనను యేవైశాఖమాస ధర్మనుహత్తుచే శరీరసహితుడై యుండెనో, అట్టి వైశాఖమాసములో నెవడు స్నానముజేయకుండునో, ఎవడు ధర్మము జేయకుండునో అట్టివాడు సమస్తధర్మములను జేసినప్పటికి దుఃఖములనే పొందుచుండును, సర్వధర్మములను జేయక నొక్క వైశాఖధర్మము నే జేసిన యెడల సమస్తధర్మములను జేసినవాడగును.

ఇతి శ్రీస్కాందపురాణే వైశాఖమాహాత్మ్యే నారదాంబరీషసంవాదే
పుత్రోత్పత్తికథనం నామ నవమోధ్యాయః॥

సమాప్తః॥

మైథిలఉవాచ॥ శ్లో॥ యత్కామపత్నీచరిత మశూన్యశయనవ్రతం।
దేవోపదిష్టం తస్యాస్య విధానం బ్రూహిభూసుర॥ ౧

తా. మిథిలాధిపతియగు హేమాంగుడు పలుకుచున్నాడు. ఓబ్రాహ్మణుడా! దేవతులచే నుపదేశింపబడినదియు మన్మథునిభార్యయగు రతీదేవిచే నాచరింపబడిన ఆశూన్యశయన వ్రతమనునది యేదికలదో దానివిధినంతయు జెప్పుము.

శ్లో॥ కిం దానం కో విధి స్తస్య పూజనం కిం ఫలం తథా।
ఏత దాచక్ష్వ భూదేవ శ్రోతుం కౌతూహలం హి మే॥ ౨

తా. ఓబ్రాహ్మణుడా! ఏమిదాన మియ్యవలయును, ఎట్లు పూజింపవలయును ఈవ్రతమాచరించిన నేమిఫలముకలుగును, దీనిని సవిస్తారముగా జెప్పితివేని వినుటకు నపేక్షగలిగియుంటిని.

శ్రుతదేవఉవాచ॥ శ్లో॥ శృణు భూయః ప్రవక్ష్యామి వ్రతం పాపప్రణాశనం। అశూన్యశయనం నామ రమాయై హరిణోదితం॥ 3

తా. ఈప్రకారము హేమాంగుడడుగగా శ్రుతదేవుడు చెప్పుచున్నాడు. ఓరాజా! పాపములను పోగొట్టునదియు లక్ష్మీదేవికి విష్ణుమూర్తిచే జెప్పబడినదియు నగు అశూన్యశయన వ్రతమును చెప్పుచున్నాను వినుము.

శ్లో॥ యేన చీర్ణేన దేవేశో జీమూతాభః ప్రసీదతి।
లక్ష్మీభర్తా జగన్నాథః సమస్తాఘౌఘనాశనః॥ ౪

తా. దేవతులకందరికు నధిపతియు మేఘముయొక్క కాంతివంటి కాంతిగలవాడును సమస్తపాప సమూహములను పోగొట్టువాడును ప్రపంచమున కధిపతియు లక్ష్మీదేవికి పెనిమిటియునగు విష్ణుమూర్తియే వ్రతమాచరించిన యనుగ్రహించునో అట్టి వ్రతమును జెప్పుచున్నాను.

శ్లో॥ అకృత్వా య స్త్విదం రాజన్ వ్రతం పాతకనాశనం।
గార్హస్థ్య మనువర్తేత తస్యేదం నిష్ఫలం భవేత్॥ ౫

తా. ఓరాజా! పాపములను పోగొట్టు యీవ్రతమునుజేయక నెవడు గృహస్థాశ్రమ ధర్మమంతయు జేయుచుండునో వానిధర్మములన్నియు నిష్ఫలములే యగుచుండును.

శ్లో॥ శ్రావణే శుక్లపక్షే తు ద్వితీయాయాం మహీపతే।
అశూన్యశయనాఖ్యం తద్గ్రాహ్యం వ్రత మనుత్తమం॥ ౬

తా. ఓరాజా! అశూన్యశయనమనెడు శ్రేష్ఠమైన వ్రతమును శ్రావణశుక్ల విదియ దినంబున జేయవలయును.

శ్లో॥ చాతుర్మాస్యే తు సంప్రాప్తే హావిష్యాశీ భవేన్నరః।
చతుర్భిః పారణం మాసై స్సమ్యఙ్నిష్పాద్యతే ప్రభో॥ ౭

తా. ఓప్రభువా! ఈవ్రతమును జేయునట్టిపురుషుడు చాతుర్మాస్యలయందు పాయసమునే భుజియింపుచు నాలుగుమాసములయిన పిమ్మట పారణను బాగుగా జేయవలయును.

శ్లో॥ లక్ష్మీయుక్తో జగన్నాథః పూజనీయో జనార్దనః।
పారణే దివసే ప్రాప్తే భక్ష్యం చైవ చతుర్విధం॥ ౮

తా. పారణను జేయుదినమునందు లక్ష్మితోగూడినవాడును మూడులోకములకు నధిపతియునగు విష్ణుమూర్తిని పూజించి నాలుగువిధములగు భక్ష్యములను నివేదన జేయవలయును.

శ్లో॥ ఉపాయనం చ దాతవ్యం బ్రాహ్మణాయ కుటుంబినే।
సౌవర్ణీం రాజతీం వాపి మూర్తిం కుర్యా న్మనోరమాం॥ ౯
పీతాంబరధరాం దివ్యాం వనమాలావిభూషితాం।
శుక్లపుష్పై స్సుగంధై శ్చ పూజయే త్పురుషోత్తమం॥ ౧౦

తా. అనంతరము కుటుంబవంతుండైన బ్రాహ్మణునకు వాయనమియ్యవలయును. బంగారముతోగాని వెండితోగాని శ్రేష్ఠంబగునదియు సుందరముగా నుండునదియునగు ప్రతిమను జేయించి దానికి పట్టువస్త్రమును జుట్టి తులసిమాలికలు మొదలగువానిచే నలంకరించి యాప్రతిమయందు విష్ణుమూర్తి నావాహనముజేసి తెల్లని పుష్పములు పరిమళగంధములు మొదలగువానిచే పూజజేయవలయును.

శ్లో॥ శయ్యాదానై ర్వస్త్రదానై ర్విప్రాణాం భోజనై స్తథా।
దంపత్యో ర్భోజనై శ్చైవ దక్షిణాభిః ప్రపూజయేత్॥ ౧౧

తా. శయ్యాదానములు వస్త్రదానములు బ్రాహ్మణులకు భోజనము పెట్టుట దంపతులకు భోజనము పెట్టుట దక్షిణల నిచ్చుట మొదలగువానిచే బ్రాహ్మణులను పూజింపవలయును.

శ్లో॥ ఏవం తు చతురో మాసా న్పూజయిత్వా జనార్దనం।
మార్గశీర్షాదిమాసేషు పూజయే త్పూర్వవ ద్ధరిం॥

తా. ఈప్రకారము శ్రావణము మొదలు నాలుగు మాసముల పర్యంతము విష్ణుమూర్తిని పూజించి పిమ్మట మార్గశీర్షము మొదలు నాలుగు మాసములయందును పూర్వమువలెనే విష్ణుమూర్తిని పూజింపవలయును.

శ్లో॥ రక్తవర్ణం హరిం ధ్యాయే ద్రుక్మిణీసహితం తథా।
చైత్రాదిచతురో మాసా నేవం సంపూజయే త్తతః॥ ౧౩

తా. అనంతరము చైత్రము మొదలు నాలుగు మాసముల పర్యంతము ఎఱ్ఱని వర్ణము గలిగినట్టియు రుక్మిణీదేవితో గూడినట్టియు విష్ణుమూర్తిని పూర్వమువలెనే పూజింపవలయును,

శ్లో॥ భూమ్యా సహా స్థితం దేవ మర్చయే ద్భక్తిపూర్వకం।
సనందనాద్యై ర్మునిభి స్తూయమాన మకల్మషం॥ ౧౪

తా. భూదేవితోగూడ నుండునట్టియు సనందనాది మునులచే స్తోత్రముచేయబడునట్టియు పాపరహితుడైనట్టియు విష్ణుమూర్తిని భక్తిపూర్వకముగా పూజింపవలయును.

శ్లో॥ ఆషాఢస్య చ మాసస్య ద్వితీయాయాం సమాపయేత్।
అష్టాక్షరేణ మంత్రేణ జుహుయా దనలే శుభే॥ ౧౫

తా. ఈప్రకారము పూజింపుచువచ్చి ఆషాఢశుద్ధ విదియయందు సమాప్తిని పొందించవలయును. శోభస్కరమైన యగ్నిహోత్రమునందు అష్టాక్షరీమంత్రమును పఠియింపుచు హోమమును జేయావలెను.

శ్లో॥ మార్గశీర్షాదిమాసానాం పారణే భూమిపాలక।
జుహుయా ద్విష్ణుగాయత్ర్యా చైత్రాదీనాం నిబోధయ॥
పౌరుషేణ చ మంత్రేణ జుహుయా దనలే శుభే।
పంచామృతం పాయసం చ హ్యపూపం ఘృతపాచితం॥ ౧౭

తా. ఓ రాజా! మార్గశీర్షము మొదలగు నాలుగు మాసములయందును పూజించి పిమ్మట విష్ణుగాయత్రీమంత్రముచేతహోమము జేసిపారణజేయవలయును. చైత్రము మొదలగు నాలుగు మాసములయందున పురుషసూక్త మంత్రములచే శుభకరమగు నగ్ని

హోత్రమునందు హోమమును జేయవలయును పంచామృతములను పరమాన్నమును నేతితో వండబడిన బూరెలను నివేదనజేయవలయును.

శ్లో॥ ఏవం క్రమేణ ద్రవ్యాణి ప్రతిమా స్తు నిబోధయ।
స్నానా త్తు ప్రథమం దద్యా ల్లక్ష్మీనారాయణస్య చ॥
సౌవర్ణం మధ్యమే దద్యా త్కృష్ణస్య పరమాత్మనః।
రాజతీం త్వంతిమే దద్యా ద్వరాహస్య మహాత్మనః ౧౯

తా. ఈప్రకారము శ్రావణము మొదలగు నాలుగు మాసములవరకు పూజించుటయు హోమములను జేయుటయు భక్ష్యాదులను నివేదనజేయుటయు జేయుచుండవలెను. ఇక ప్రతిమల విషయమును చెప్పుచున్నాను తెలిసికొనుము. లక్ష్మీనారాయణ విగ్రహములుగల ప్రతిమను పూజకుపూర్వమునందే దానమియ్యవలయును పరమాత్మయైన కృష్ణుని విగ్రహముగల ప్రతిమను పూజామధ్యయం దియ్యవలయును మహానుభావుడైన వరాహమూర్తి విగ్రహముగల వెండిప్రతిమను పూజఆయినపిమ్మట నియ్యవలయును.

శ్లో॥ బ్రాహ్మణా న్భోజయే త్పశ్చా న్నామభిః కేశవాదిభిః।
వస్త్రయుగ్మై రలంకారై ర్యథావిత్తాను సారతః॥
అర్చయిత్వా తతో దద్యా దపూపాన్ ఘృతపాచితాన్।
ఉపాయనార్థే విప్రేభ్యో ద్వాదశేభ్యో నివేదయేత్॥ ౨౦

తా. కేశవనామము మొదలు పండ్రెండు నామముల నుద్దేశించి పండ్రెండుగురు బ్రాహ్మణులనియమించి తనయొక్క శక్తిననుసరించి యొక్కొక్కనికి రెండువస్త్రములు లచోచితమగు అలంకారములనిచ్చి పూజించి నేతితోవండబడిన పండ్రెండుబూరెలు వంతున యాపండ్రెండుగురికి నిచ్చి యనంతరము వారిని భుజింపజేయవలయును.

శ్లో॥ ఆచార్యాయ తతో దద్యా త్ప్రతిమాం పూర్వకల్పితాం।
శయ్యాం సంకల్పితాం పూర్ణాం సర్వాలంకారభూషితాం॥ ౨౨
తస్యా మభ్యర్చ్య విధివ ల్లక్ష్మీనారాయణం పరం।
కాంస్యపాత్రేణ సహిత మపూపై ర్బహుభి స్తథా॥ ౨౩
వస్త్రాలంకారసహితాం దక్షిణాభి స్తథైవ చ।

బ్రాహ్మణాయ విశిష్టాయ వైష్ణవాయ కుటుంబినే॥ ౨౫
దాతవ్యా విధివత్పూజ్యాన్ బ్రాహ్మణాం శ్చాపి భోజయేత్॥

తా. అనంతరము శయ్యతో గూడినదియు చక్కగా నిర్మింపబడినదియు నంతటను సమస్తాభరణములచేత నలంకరింపబడినదియు పూర్వమునందు జేయబడిన ప్రతిమయందు యథాశాస్త్రముగా లక్ష్మీనారాయణుల నావాహనముజేసి యాప్రతిమను కంచుపళ్లెరమునం దుంచి విష్ణుభక్తిగలవాడును కుటుంబవంతుడునగు బ్రాహ్మణుని వస్త్రాద్యలంకారములచే బూజించి దక్షిణనిచ్చి యాప్రతిమను ఆచార్యుండగు నాబ్రాహ్మణునకిచ్చి భక్ష్యాదులతో నాబ్రాహ్మణునకును మరియు నితరులైన పూజ్యులగు బ్రాహ్మణులకును భోజనము పెట్టవలయును.

శ్లో॥ దానమంత్రః॥ లక్ష్మ్యా అశూన్యశయనం యథా తవ జనార్దన।
శయ్యా మమాప్యశూన్యా స్యా ద్దానేనానేన కేశవ॥
ఏవం సంప్రార్థ్య దేవేశం స్వయం భోజన మాచరేత్॥ ౨౬

తా. దానమిచ్చునప్పుడు చెప్పవలసినమంత్రము. ఓవిష్ణుమూర్తి? నీశయ్యలక్ష్మితో గూడి యుండుటచే నెప్పుడైనను శూన్యము కానిదై యెట్లుండునో, ఆతీరుగానే నాశయ్యకూడా యెల్లప్పుడు శూన్యము కానిదై యుండుగాక, (అనగా నేనుండుపర్యంతము నాభార్యకూడ జీవించియుండవలెననుట) అను యర్థముగల లక్ష్మ్యా అను శ్లోకమును జదివి భగవంతుని ప్రార్థించి దానమిచ్చి తాను భుజింపవలయును.

శ్లో॥ పురుషో వా సతీ వాపి విధవా వా సమాచరేత్।
అశూన్యశయనార్థం చ కర్తవ్యం వ్రత ముత్తమం॥ ౨౭

తా. శయ్యదంపతీవిశిష్టముగా నెప్పుడు నుండుటకుగాను పురుషుడు గాని సువాసినీ గాని విధవ గాని యెవరైనను శ్రేష్ఠంబగు అశూన్యశయనమనెడు వ్రతమును జేయవలయును.

శ్లో॥ ఏవం తవ మయాఖ్యాతం విస్తరా న్నృపసత్తమ।
సుప్రసన్నే జగన్నాథే భవేయు ర్వివిధాః ప్రజాః॥ ౨౮

తా. ఓరాజశ్రేష్ఠుడా! ఈప్రకారము సవిస్తారముగా నేను నీకు జెప్పితిని. ఆవిష్ణుమూర్తి యనుగ్రహము కలవాడయ్యేనేని సమస్తజనులు సంతోషింతురు.

శ్లో॥ తస్మిం స్తుష్టే తు దేవేశే దేవానా మపి దుర్లభాః।
తస్మా త్సర్వప్రయత్నేన వ్రత మేత త్సమాచరేత్॥ ౨౯

తా. సమస్తదేవతలకు నుపరిభువను భగవంతుడు సంతోషించినయెడల దేవతులకైనను పొందశక్యముగాని సంపదలను పొందుదురు. కాబట్టి సమస్తప్రయత్నముల చేత నతూన్యశయనమను యీవ్రతమును జేయవలయును.

శ్లో॥ అవశ్యం గంతుకామేన తద్విష్ణోః పరమం పదం।
ఏవ ముక్తంమయా సర్వం కి మన్య చ్ఛ్రోతు మర్హసి॥ 30

తా. ఓరాజా ! విష్ణుమూర్తియొక్క లోకమును ముఖ్యముగా పొందవలయునని కోరికగలవాడు యీవ్రతమును జేయవలయును. ఈప్రకారము వ్రతముయొక్క విధానము నంతయును జెప్పితిని మరియు నేదైనను వినవలయునని కోరికయున్నయెడల దాని నడుగుము.

శ్లో॥ ఇత్యుక్త స్తేన రాజర్షిః పున రప్యాహ తం మునిం।
వైశాఖే ఛత్రిదానస్య మాహాత్మ్యం విస్తరా ద్వద॥ 31

తా. ఈప్రకారము మునీశ్వరుడు చెప్పగా విని యారాజోత్తముడు తిరిగి యామునీశ్వరు నడుగుచున్నాడు ఓమునీశ్వరా ! వైశాఖమాసమున గొడుగును దానమిచ్చి నందువలన కలిగెడు మహాత్మ్యము సవిస్తారముగా జెప్పుము.

శ్లో॥ శృణ్వతో పి న తృప్తి ర్మే వైశాఖోక్తాన్ శుభావహాన్।
ఇతి తద్వచనం శ్రుత్వా యశస్యం పుణ్యవర్ధనం॥ 32
ప్రీత్యువాచ మహాభాగ శ్రుతదేవో మహాయశాః॥

తా. శుభములను కలుగజేయునట్టి వైశాఖమాస ధర్మములనెంత వినినను నాకు తనివిదీరలేదు. అని యీ ప్రకారముగా బలికిన యారాజుయొక్క కీర్తినొసంగునది యు పుణ్యమును వృద్ధిజేయునదియు నగు వాక్యమును విని మహానుభావుండును విశేష ప్రసిద్ధిగల యాశ్రుతదేవుండు తిరిగి చెప్పుచున్నాడు.

శ్రుతదేవఉవాచ॥ శ్లో॥ వైశాఖే ఘర్మతప్తానాం మానవానాం మహాత్మనాం॥ యేకుర్వం త్యాతపత్రాణి తేషాం పుణ్య మనంతకం।33
అత్రాప్యుదాహరంతీ మ మితిహాసం పురాతనం॥ 34

తా. శ్రుతదేవుడు చెప్పుచున్నాడు. వైశాఖమాసమునందు యెండచే బాధింపబడినట్టియు మహానుభావులగు మనుష్యులకు నెవడు గొడుగుల నిచ్చుచున్నాడో వాని పుణ్యమమితమై యుండును. ఇందునుగురించి పూర్వమందు జరిగిన యొక కథను చెప్పుచున్నాను.

శ్లో॥ వైశాఖధర్మ ముద్దిశ్య పురా కృతయుగే కృతం।
వంగదేశే పురాకశ్చి ద్ధేమకాంత ఇతి శ్రుతః॥ 35
కుశకేతో స్సుతో ధీమాన్ రాజా శస్త్రభృతాం వరః।
ఏకదా మృగయాసక్తో గహనం వన మావిశత్॥ 36

తా. వైశాఖమాస ధర్మమునుగురించి పూర్వము కృతయుగములో జరిగిన కథ యెట్లనగా కుశకేతుయొక్క కుమారుడును బుద్ధిమంతుడును ధనుర్ధరులలో శ్రేష్ఠుడు నగు హేమకాంతుడనెడు రాజు పూర్వమందు వంగదేశములో నుండెను. అతడు యొకప్పుడు వేటాడుటయందు దాసక్తిగలవాడై దట్టమైన యరణ్యమునకు వెళ్లెను.

శ్లో॥ తత్ర నానావిధాన్ హత్వా మృగాన్ క్రోడాదికాన్ బహూన్।
శ్రాంతో మధ్యాహ్న వేళాయాం మునీనా మాశ్రమం యయౌ।

తా. ఆ యరణ్యమునందు అడవిపందులు మొదలుగాగల యనేకమృగములను సంహరించి యలసినవాడై మధ్యాహ్నకాలమునందు మునీశ్వరులుండు ప్రదేశమునకు వెళ్లెను,

శ్లో॥ తదా శతర్చినో నామఋషయ శ్శంసితవ్రతాః।
సమాధిస్థా న జానంతి బాహ్యాకృత్యం చ కించన॥ 37

తా. ఆ యాశ్రమము శతర్చులను మునులసంబంధమైనది. అప్పుడా మునులు సమాధియందుండినవారై యింద్రియములని గ్రహించి బాహ్యాణకృత్యములగు నతిథిస త్కారాగి బాహ్యవ్యాపారము నేమియు నెఱుంగకయుండిరి,

శ్లో॥ తాన్ దృష్ట్వా నిశ్చలాన్ విప్రాన్ క్రుద్ధో నాంతుం మనోదధే।
భూపం నివారయామాస శిష్యాణా మయుతం తదా॥ 38

తా. సమాధియందుండి చలింపనివారలై తపస్సునుజేయుచున్న యామునులను జూచి యారాజుతనకు గౌరవము జేయలేదని కోపముగలవాడై వారిని చంపనిచ్ఛయించగా నప్పుడు వారిశిష్యులనేకమంది వచ్చి యారాజును నివారించి యిట్లుపలికిరి.

శ్లో॥ దుర్బుద్ధే శ్శృణు నో వాక్యం గురవ స్తు సమాధిగాః।
నో జానంతి బహిఃకృత్యం తస్మా త్క్రోధం న చార్హసి॥ 40

తా. దుష్టబుద్ధిగలవాడా ! మేము చెప్పునట్టి వాక్యమును వినుము. మా గురువులు సమాధియందుండినవారై యంతరంగమందు పరమాత్మను జూచుచు బాహ్యమందు నే

వ్యాపారమును జేయకుండిరి. కాబట్టి నీవిప్పుడు వారియందు కోపగించుటతగదు.

శ్లో॥ తత శ్శిష్యా నువాచేదం వచనం క్రోధవిహ్వలః।
యూయం కురుధ్వ మాతిథ్య మద్యశ్రాంతస్య మే ద్విజాః॥ ౪౧

తా. అని శిష్యులు పలుకగా ననంతరమా రాజు తీవ్రమైన కోపముగలవాడై యో బ్రాహ్మణులారా! వారికి వీలులేనియెడల నేను మార్గాయాసముచే మిక్కిలి యలసియుంటిని గాన మీరైనను భోజనాదికము నొసగుడని శిష్యులతో బలికెను.

శ్లో॥ ఏవ ముక్తాశ్చ భూపేన శిష్యా ఊచు స్తదా నృపం
నాజ్ఞప్తా గురుభి ర్భూప వయం భిక్షాశినః కథం॥

తా. ఈప్రకారము రాజు పలుకగా నారాజుతో శిష్యులు చెప్పుచున్నారు. ఓరాజా! మేము గురువులాజ్ఞను పొందినవారము కాము వారమూము భిక్షు బెట్టినయెడల దానిని తిని బ్రతుకుచున్నాము.

శ్లో॥ గురుతంత్రాః కథం కర్తు మాతిథ్యం న వయం క్షమాః।
ప్రత్యాఖ్యాతో నృప శ్శిష్యై స్తా న్హంతుం ధనురాదదే॥ ౪౩

తా. గురువుల యాజ్ఞలోనుండు మేము వారియనుమతిలేక నతిథిసత్కారము నెట్లు చేయగలమని శిష్యులుబదులు చెప్పగా నారాజు కోపించి వారిని చంపుటకు ధనస్సును గ్రహించి యిట్లుపలుకుచున్నాడు.

శ్లో॥ మృగదస్యుభయాదిభ్యో బహుధా రక్షితా మయా।
తే మా మేవో పశిక్షంతి మయా దత్తప్రతిగ్రహాః॥

తా. క్రూరమృగములు దొంగలు మొదలగువానివలన మీకు భయములేకుండా జేసితిని. అట్టిమీరు మావలన అగ్రహారాది సత్కారముల పొందియు మమ్మునే శాసింపదలచియున్నారు.

శ్లో॥ ఏ తే మాం న విజానంతి కృతఘ్నా భూరిమానినః।
ఘ్నతో పి మే న దోష స్స్యాదేతా నేవా తతాయినః॥ ౪౫

తా. మావలన విశేషబహుమతులనుపొంది గౌరవింపబడిన యీమునులు చేసిన యుపకారములను మరచినవారై నేను యిక్కడకువచ్చి యుండినను జూడరైరి. ఇట్టి దురాత్ములనుచంపినను నాకు దోషము సంభవింపనేరదు.

శ్లో॥ ఏవం వికృద్ధమనస శ్చరాన్ ముంచన్ శరాసనాత్।
ఆస్వాదుద్రితా నముద్రిత్య జఘ్నె శిష్యశతత్రయం॥ ౪౬

తా. ఈప్రకారము కోపముగలవాడై ధనస్సునందు బాణములను సంధించి విడుచుచుండగా వారి శిష్యసమూహము పారిపోయెను. అంతట నారాజు వారివెంటనంటి తరిమివారిలో మూడువందల శిష్యులను సంహరించెను.

శ్లో॥ దుద్రువు ర్భయత స్సర్వే విహాయా శ్రమ మంజసా।
విద్రావితేషు శిష్యేషు బలా దాశ్రమసంస్థితాః॥ ౮౭
సంభారాన్ జగృహు శ్శీఘ్రం సైనికాః పాపబుద్ధయః।
యథేష్టం భోజనం చక్రు స్సర్వే వైతే నానుమోదితాః॥ ౮౮

తా. మిగిలిన శిష్యులు భయమునుపొంది శీఘ్రముగా నాయాశ్రమమును విడిచి పారిపోయిరి. అంతటవారు పారిపోగానే దుష్టస్వభావముగల యాతని సైనికులారాజు యిష్టానుసారముగ నా యాశ్రమమునందుండిన పదార్థములనంతయును తీసికొని శీఘ్రముగా స్వేచ్ఛగా భుజియించిరి.

శ్లో॥ తత స్సేనావృతో రాజా పురీ మాగా ద్దినాత్యయే।
కుశకేతు స్తత శ్శ్రుత్వా తనయస్య విచేష్టితం॥ ౮౯
పురా న్నిర్యాతయామాస గర్హయన్ గర్హయన్ సుతం॥
రాజ్యానర్హం కుమాహీనం స్వదేశా దపిభూమిప॥ ౯౦

తా. ఓరాజా! అనంతరమారాజు సేనతోగూడుకొని సాయంకాలమునందు నింటికివచ్చెను. పిమ్మట నాతనితండ్రియగు కుశకేతుడు యడవిలో తనకుమారుడు చేసిన క్రూరకృత్యమునువిని కుమారుని మిక్కిలి నిందించి యెంతమాత్రమును యోగ్యతలేని యిట్టి దుర్మార్గుడు రాజ్యము నేలుటకు తగడని తనదేశమునుండి వెడల గొట్టెను.

శ్లో॥ పిత్రా త్యక్త స్తతో రాజా హేమకాంతో తివిహ్వలః।
వనం వివేశ గహనం హత్యాభి శ్చ సుపీడితః॥ ౯౧

తా. ఇట్లు హేమకాంతుడనెడు రాజుతండ్రిచే వెడలగొట్టబడి మిక్కిలి విచారముగలవాడగుచు ననంతరమొక దట్టమైనయడవిని బ్రవేశించి బ్రహ్మహత్యలచే పీడింపబడుచుండెను.

శ్లో॥ బహుకాల మువాసీ చ్చ గహ్వరే నిర్జనే వనే।
ఆహారం కల్పయామాస వ్యాధధర్మ ముపాశ్రితః॥ ౯౨

తా. ఇట్లు యారాజు పర్వతగుహాతో సమానమైనది గనుకనే దట్టముగా నుండునట్టి యా యడవిలో తిరుగుచు కిరాతుల వ్యాపారము నవలంబించి మాంసాదికము నాహారముగా జేసికొనుచు చాలాకాలము గడపెను.

శ్లో॥ న క్వాపి స్థితి మాపేదే హత్యయా భిద్రుతో భృశం।
అష్టావింశతివర్షాణి గతాన్యస్య దురాత్మనః॥ ౧౩

తా. ఈ దురాత్ముండిట్లు బ్రహ్మహత్యచే పీడింపబడుచు నొక్కచోటునను నిలుకడలేక తిరుగుచుండగా నిరువదియెనిమిది సంవత్సరములు గడచెను.

శ్లో॥ తీర్థయాత్రాప్రసంగేన త్రితో నామ మహామునిః।
తస్మిన్నరణ్యే వైశాఖే రవౌ మధ్యందినే గతే॥ ౧౪
గచ్ఛన్నాతపవిక్లాంత స్తృష్ణయా చాతిపీడితః।
క్వచిద్వృక్షవిహీనే తు ప్రదేశే మూర్ఛితోऽభవత్॥ ౧౫

తా. ఇట్లు కొంతకాలము గడచినపిమ్మట నొకప్పుడు త్రితుడను పేరుగల యొక మునిశ్రేష్ఠుడు పుణ్యక్షేత్రములను సేవించుటకుగాను బయలుదేరి యీ యరణ్యమార్గంబుననే వచ్చుచుండగా చెట్లులేని యొక యెడారిప్రదేశమునకు వచ్చునప్పటికి రెండు జాములాయెను. అప్పుడు వైశాఖమాసమగుటవలన నెండవేడిమిచే తపింపబడి యలసినవాడై దప్పికచే పీడింపబడి మూర్ఛనొందెను.

శ్లో॥ దైవా ద్దృష్ట్వా హేమకాంత స్త్రితం నామ మహామునిం।
తృష్ణార్తం మూర్ఛితం శ్రాంతం కృపాం చక్రే నృపాధమః ౧౬

తా. రాజాధముండైన యీ హేమకాంతుడు యెండవేడిమిచే తపింపబడి యలసి దప్పికచే మూర్ఛనొందియున్న త్రితుడనెడు మునిశ్రేష్ఠుని దైవవశమువలనజూచి యీమునీశ్వరునిం దయగలవాడయ్యెను.

శ్లో॥ బ్రహ్మఘ్న స్తదా ఛత్రం కృత్వా చాతపవారిణం।
మునే ర్జగ్రాహశిరసి హ్యలాబుస్థం జలం దదౌ॥ ౧౭

తా. అప్పుడు మోదుగాకులను తెచ్చి గొడుగుగా కట్టి యీమునీశ్వరుని ముఖమునకు నీడవచ్చునట్లుగా పట్టి తాపమును పోగొట్టి సొరకాయబుఱ్ఱయందుండిన జలము నిచ్చి దాహము తీర్చెను.

శ్లో॥ లబ్ధసంజ్ఞో భవ త్తేన హ్యుపచారేణ వై మునిః।
పత్రఛత్రం క్షత్రదత్తం గృహీత్వా గతవిక్లమః॥
గ్రామం కంచి చ్ఛనైః ప్రాప్య సుఖితో స బభూవ హ॥

తా. ఆరాజుచే జేయబడిన యుపచారముచే నా మునీశ్వరుండు మూర్ఛదెలసి మేల్కొని యీ రాజుచే నీయబడిన మోదుగాకుల గొడుగును వేసికొని యలసటపోగొట్టుకొని మెల్లగా నొక గ్రామముజేరి సౌఖ్యమును పొందెను.

శ్లో॥ తేన పుణ్యప్రభావేన బ్రహ్మహత్యా శతత్రయం।
వినష్ట మభవ త్తస్య క్షణా దేవ మహాత్మనః।
తతో విస్మయ మాపన్నో హేమకాంతో మహారథః॥ ౬౦

తా. ఆమునీశ్వరునకు గోదుగునిచ్చుటచే గలిగినపుణ్యమువలన- యా రాజుచే జేయబడిన మూడువందల బ్రహ్మహత్యలు నశింపబడినవి. యా రాజు పరిశుద్ధాంతరంగుడై యాశ్చర్యమును పొంది యిట్లు విచారించుచుండెను.

శ్లో॥ బహుధా పీడ్యమానస్య బ్రహ్మహత్యాః కథం గతాః।
కేనాపి నిష్కృతా హ్యేతాః క్వ గతాః కేన హేతునా॥ ౬౧
ఇత్యేవం చింతయామాస బ్రహ్మహత్యావిమోచనం।
ఏవం చాజ్ఞస్థితే రాజ్ఞి యమదూతా అథాగమన్॥ ౬౨
నేతు మేనం మహాత్మానం హేమకాంతం వనే స్థితం।
గదం తు జనయామాసుః ప్రాణా న్హర్తుం మహాత్మనః॥ ౬౩

తా. నేను బ్రహ్మహత్యలచే నిదివరకు బాధింపబడితిని. ఇప్పుడెట్లు నశించినవి? ఈబ్రహ్మహత్యలే కారణమున నశించినవో తెలియకుండెను. ఎట్టిప్రాయశ్చిత్తక్రియను జేసితినో యెరుగను. అని ఈప్రకారము ఆ రాజు తనకు బ్రహ్మహత్యానివృత్తికలిగినందుకు కారణము నెరుగనివాడై యాలోచించుచుండగా ననంతరము యమదూతలు వచ్చి వనమునందు నివసించియున్న మహానుభావుడైన యా హేమకాంతుని తమలోకమునకుతీసికొనివెళ్ళదలచినవారై యామహానుభావునకు ప్రాణములను తీసివేయునట్టిరోగమును పుట్టించిరి,

శ్లో॥ తదా ప్రాణవియోగార్తః పురుషాం స్త్రీన్ దదర్శహ।
యమదూతాన్ మహాఘోరా నూర్ధ్వకేశా న్భయం కరాన్॥ ౬౪

తా. అప్పుడా రాజు ప్రాణోత్క్రమణకాలమునందు భయంకరులును కేశములు పైకి నుండువారునగు ముగ్గురుయమదూతలను చూచెను.

శ్లో॥ చింతయానా స్స్వకర్మాణి తూష్ణీమాసన్ తదానృపః।
ఛత్రదానప్రభావేన జాతా విష్ణుస్మృతి ర్నృప॥ ౬౫

తా. ఓరాజా ! అప్పుడాయాను దూతలు వారు జేయదలచిన కృత్యము నాలోచించుచు నూరకుండిరి. అంతట పూర్వమందు గొడుగునిచ్చుట వలన గలిగిన పుణ్యవశముచే నా రాజునకు విష్ణుస్మరణ జేయుట సంభవించును.

శ్లో॥ తేన స్మృతో మహావిష్ణు ర్విష్వక్సేనం సమంత్రిణం।
ఉవాచ తూర్ణం త్వం యాహ్య యమదూతా న్నివారయ॥ ౬౬

తా. ఆరాజు విష్ణుమూర్తిని స్మరియింపగా నావిష్ణుమూర్తి తన మంత్రియగు విష్వక్సేనుని బిలిచియిట్లు చెప్పుచున్నాడు. నీవు శీఘ్రముగావెళ్ళి యమదూతలను వెళ్ళగొట్టుము.

శ్లో॥ వైశాఖధర్మనిరతం హేమకాంతం తు పాలయ।
నిష్పాప మేనం మద్భక్తం పిత్రే దేహి పురం గతః॥ ౬౭

తా. హేమకాంతుడు వైశాఖ మాసధర్మములయందాసక్తిగలవాడు గాన యాతనిని కాపాడుము. పాపరహితుండును నాకుభక్తుడునగు నాతనిని తీసికొని పట్టణమునకు వెళ్ళి యాతనితండ్రికి అప్పగించుము.

శ్లో॥ మదీరితేన వాక్యేన కుశకేతుం చ బోధయ।
సర్వధర్మోజ్ఝితో నాపి బ్రహ్మచర్యాది వర్జితః ౬౮
వైశాఖధర్మనిరతో మత్ప్రియ స్స్యా న్న సంశయః
కృతాగాశ్చాపి త్వత్పుత్రో మునిత్రాణపరాయణః ౬౯

తా. నేను నీతో జెప్పినరీతిగా కుశకేతునితో నిట్లు చెప్పుము. ఓరాజా నీతనయుడు సమస్త ధర్మములను విడిచినప్పటికిని బ్రహ్మచర్యము మొదలగు నిష్ఠలను జరుపనప్పటికిం వైశాఖ మాసధర్మములయందాసక్తిగలవాడై మూర్ఛజెందియున్న మునీశ్వరుని రక్షించెనుగాన యపరాధములను జేసిన వాడైనను నాకు ప్రియుమైన వానిగానెంచితిని సందేహములేదు.

శ్లో॥ వైశాఖే ఛత్రదానేన నిష్పాపో నాత్ర సంశయః।
తేన పుణ్యప్రభావేన శాంతో దాంత శ్చిరాయుషః ౭౦
శౌర్యౌదార్యగుణోపేత స్త్వ త్సమో యం గుణై రపి।
తస్మా దేనం రాజ్యభారే సంస్థాపయ మహాబలం॥ ౭౧

తా. వైశాఖ మాసములో గొడుగును దానమిచ్చుటచే పాపరహితుడై యుండెను. ఇందువిషయమై సందేహములేదు. ఆపుణ్యవిశేషముచే ఓర్పుగలవాడును ఇంద్రియ నిగ్రహముగలవాడు పూర్ణాయుర్దాయము గలవాడునై శౌర్యము ఔదార్యమును మొదలగు గుణములు గలిగి నీతోసమానుడై యుండెనుగానమహాబలముగల యితనినిరాజ్యమునందుంచి పట్టాభిషిక్తునిజేయువలయును.

శ్లో॥ విష్ణునైవం సమాజ్ఞప్తో మిత్యాదిశ్య నృపోత్తమం।
పితుర్వశే హేమకాంతం స్థాపయ్య యాహి చ మాం పునః॥ ౨౧

తా. ఈప్రకారము విష్ణుమూర్తి యాజ్ఞాపించెననియు రాజుతో జెప్పి యా హేమవంతుని తండ్రి స్వాధీనపరచి తిరిగి నా సన్నిధానమునకు రమ్ము.

శ్లో॥ ఇత్యాదిష్టో భగవతా విష్వక్సేనో మహాబలః।
హేమకాంతం సమాసాద్య యమదూతా న్నివార్య చ॥ ౨3
పాణినా స్వాంత మేనం హి సస్పర్శాం గేషు భూమిపం।
భగవద్భక్తసంస్పర్శా ద్గత వ్యాధిః క్షణా దభూత్॥ ౨౪

తా. ఈప్రకారము విష్ణుమూర్తిచే నాజ్ఞాపింపబడి బలవంతుండగు యా విష్వక్సేనుడు యా హేమకాంతునొద్దకు వెళ్లి యమభటులను వెళ్లగొట్టి బాధపడుచుండిన యా హేమకాంతుని శరీరావయములను తన హస్తముతో స్పృశింపగా భగవద్భక్తుని హస్తస్పర్శ గలుగుటవలన క్షణకాలములోనే యారాజునకుండు రోగము మానెను,

శ్లో॥ విష్వక్సేన స్తత స్తేన సహా తస్య పురీం యయౌ।
తం దృష్ట్వా విస్మితో భూత్వా కుశకేతు ర్మహాప్రభుః॥ ౨౫
ననామ శిరసా భక్త్యా దండవత్పతితో భువి।
గృహం ప్రవేశయామాస పార్షదం పరమాత్మనః॥ ౨౬

తా. అనంతరము విష్వక్సేనుడు యారాజుతోగూడ నాతని పట్టణమునకు వెళ్లగా ప్రభువగు కుశకేతుడు పాపనివృత్తిని పొంది వచ్చిన తనకుమారుని జూచి మిక్కిలి యాశ్చర్యమునుపొంది యా విష్వక్సేనునకు సాష్టాంగదండప్రణామముజేసి తనకుమారునితోగూడ భగవద్భక్తుడగు నావిష్వక్సేనుని గృహమునందు ప్రవేశపెట్టెను.

శ్లో॥ స్తుత్వా చ వివిధై స్తోత్రైః పూజయామాస వైభవైః।
తస్మై ప్రీతమనాః ప్రాహ విష్వక్సేనో మహాబలః॥ ౨౭

తా. ఆరాజు మహాబలుండగు విష్వక్సేనుని ననేకవిధముల స్తోత్రముజేసి తన భాగ్యము కొలదిపూజింపగా నావిష్వక్సేనుడా రాజుతో నిటుచెప్పెను.

శ్లో॥ హేమకాంతం సముద్దిశ్య యదుక్తం విష్ణునా పురా।
తచ్ఛ్రుత్వా కుశకేతు స్స్వ పుత్రం రాజ్యే నివేశ్య చ॥ ౨౮
విష్వక్సేనాభ్యనుజ్ఞాత స్సభార్యో వన మావిశత్॥

తా. విష్ణుమూర్తి విష్వక్సేనుతో జెప్పినరీతి నావిష్వక్సేనుడు చెప్పగా కుశకేతుడు విని సంతసించి తనకుమారుని రాజ్యమునందుంచి విష్వక్సేనుడనుజ్ఞనియ్యగా నాకుశకేతుడు భార్యతోగూడ వనమునకేగెను.

శ్లో॥ విష్వక్సేనో హేమకాంత మనుమంత్రాభిపూజితః।
శ్వేతద్వీపం యయౌ ధీమా న్విష్ణోఃపార్శ్వే మహామనాః॥ ౭౯

తా. మంచిస్వభావముగల యావిష్వక్సేనుడు హేమకాంతునిచే పూజింపబడి యనుజ్ఞగొని శ్వేతద్వీపమునకు వెళ్ళి విష్ణుసమీపమునం దుండెను.

శ్లో॥ హేమకాంత స్తతో రాజా వైశాఖోక్తాన్ శుభావహాన్
విష్ణుప్రీతికరాన్ ధర్మాన్ ప్రతివర్షం చకార హ॥ ౮౦

తా. అనంతరము హేమకాంతుడు శుభమును కలుగజేయునట్టియు విష్ణుమూర్తికి సంతోషకరమైనవియు వైశాఖ మాసములో జేయదగినవియునగు ధర్మములను ప్రతి సంవత్సరమున జేయుచుండెను.

శ్లో॥ బ్రహ్మణ్యో ధర్మమార్గస్థ శ్శాంతో దాంతో జితేంద్రియ॥ ౮౧
దయాళు స్సర్వభూతేషు సర్వయజ్ఞేషుదీక్షితః।
ప్రవృద్ధ స్సర్వసంపద్భిః పుత్రపౌత్రాదిభి ర్వృతః॥
భుక్త్వా భోగా న్సమస్తాం శ్చ విష్ణులోక మవాప్తవాన్॥ ౮౨

తా. బ్రహ్మజ్ఞానము గలవాడును ధర్మమార్గమునను సరించువాడును ఓర్పుగలవాడును అంతర్బాహ్యేంద్రియములని గ్రహించినవాడును సమస్తభూతములయందు దయగలవాడును సర్వయజ్ఞములను జేసినవాడును సమస్తైశ్వర్యములచే నధికుడైనవాడును పుత్రపౌత్రులు మొదలగువారితో గూడినవాడునై యాలోకంబున సమస్త సుఖముల ననుభవించి యనంతరము వైకుంఠమును పొందెను.

శ్లో॥ నేష్టే తు వైశాఖసమాం శ్చ ధర్మాన్
సుఖప్రియత్వా న్బహుపుణ్యహేతూన్
పాపేంధనాద్యగ్నినిభాం స్తులభ్యాన్
ధర్మాదిమోక్షాంతపు మర్థహేతూన్॥ ౮౩

తా. కాబట్టి ఆనాయాసముగా జేయదగినవియు విశేషపుణ్యము నొసగునవియు పాపములను సమిధల నుదహించుటవలన నగ్నితో సమానమైనవియు శీఘ్రముగా జేయదగినవియు ధర్మార్థకామమోక్షములను పురుషార్థములకు కారణమైనవియునగు ధర్మములు వైశాఖ మాసధర్మములకంటె నితరధర్మములు లేవని నాయభిప్రాయము.

ఇతి శ్రీస్కాందపురాణే వైశాఖమాహాత్మ్యే నారదాంబరీష
సంవాదే ఛత్రదానప్రశంసనే హేమకాంతస్య బ్ర
హ్మహత్యాదిపాపశమనం నామ దశమోధ్యాయః

మైథిలఉవాచ॥

శ్లో॥ వైశాఖధర్మా స్సులభాః పుణ్యరాశివిధాయకాః।
విష్ణుప్రీతికరా స్సద్యః పుమర్థానాం తు హేతవః॥ ౧
న ప్రఖ్యాతాః కథం లోకే శాశ్వతా శ్శ్రుతిచోదితాః

తా. హేమాంగుడు అడుగుచున్నాడు. ఓమునీశ్వరా! సులభముగా జేయదగినవియు విశేషపుణ్యములను కలిగించునవియు విష్ణుమూర్తికి ప్రియమైనవియు చేసిన తత్క్షణమునందే ధర్మార్థకామమోక్షముల నొసగునవియు చిరకాలమునుండు ఫలముల నిచ్చునవియు వేదములచే జెప్పబడునవియునగు వైశాఖ మాసధర్మములు లోకములో నెందువలన ప్రసిద్ధిజెందియుండ లేదు.

శ్లో॥ ప్రఖ్యాతా రాజసా ధర్మా స్తామసా అపి భూరిశః॥ ౨
దుర్ఘటా బహుయత్నా శ్చ బహుద్రవ్యవ్యయావహాః॥
కేచి న్మాఘం ప్రశంసంతి చాతుర్మాస్యా న్పరేజగుః। 3
వ్యతీపాతాదిధర్మాం శ్చ వర్ణయం తీహ భూరిశః।
ఏత ద్వివేకం విస్తార్య శ్రోతుకామాయ మే వద॥ ౪

తా. చేయశక్యముగానిదియు విశేషప్రయత్నముచే జేయతగినవియుమిక్కిలిద్రవ్యముఖర్చుజేయవలసినవియునగు రాజసధర్మములు తామసధర్మములు లోకములో విశేషముగా వ్యాపించియున్నవి. కొందఱు మాఘమాసమును పుణ్యకరమైనదిగాను మరికొందఱు చాతుర్మాస్యలను పుణ్యకరములైనవిగాను మరికొందఱు వ్యతీపాతాదిధర్మములను శ్రేష్ఠమైనవిగాను విశేషముగా వర్ణించుచున్నారు. కాబట్టి వీరిలోనే విశేష్ఠములైనవో వానిని విస్తరించి వినవలయునని కుతూహలముగలవాడనుగాన నాకు జెప్పవలయును.

శ్రుతదేవఉవాచ॥ శ్లో॥ శృణు భూప ప్రవక్ష్యామి న ప్రఖ్యాతా ఇమే కథం। ఇతరేషాం తు ధర్మాణాం కథం ఖ్యాతి శ్చ భూతలే॥ ౫

తా. శ్రుతదేవుడు చెప్పుచున్నాడు. ఓరాజా! తామసధర్మములు. రాజసధర్మములు లోకములో ప్రసిద్ధిజెందియున్న వనియును సాత్వికధర్మములు ప్రసిద్ధిజెందియుండలేదనియు నిందుకు కారణమేమనియు నడిగితివిగాన జెప్పెదవినుము.

శ్లో॥ రాజసా స్తామసా భూమా బహవః కాముకా జనాః।
ఇచ్ఛం త్యైహికభోగాం స్తే పుత్రపౌత్రాదిసంపదః॥ ౬

తా. జనులందరు యీలోకంబున విషయసుఖంబులను పుత్రపౌత్రాది సంపత్తులను గోరినవారలై విశేషముగా రాజసధర్మములను తామసధర్మములను జేయుచుందురు.

శ్లో॥ క్వచి త్కథంచన క్వాపి జనే ష్వేకో తికృచ్ఛ్రితః।
స్వర్గాయ యతతే లోకే తస్మా ద్యజ్ఞాది సత్క్రియాః॥ ౭
కురుతే తిప్రయత్నేన మోక్షం నో పాసతే నరః।
క్షుద్రాశా భూరికర్మాణో జనాః కామ్యా నుపాసతే॥ ౮

తా. మరియు వెయ్యింటిలో నొకడతి కష్టముగా విశేషమైన ప్రయత్నముజేసి యజ్ఞము మొదలగు సత్క్రియలనుజేసి స్వర్గమును పొందుటను యత్నించును కాని మనుష్యులు తుచ్ఛవిషయములనపేక్షించి విశేషకర్మములను జేయుచు నొకరైనను మోక్షమును గురించి ప్రయత్నముజేయరైరి,

శ్లో॥ ప్రఖ్యాతా రాజసా ధర్మా స్తామసా అపి వై నృప।
న ఖ్యాతా స్సాత్వికా ధర్మా హరిప్రీతికరా ఇమే॥ ౯

తా. ఓరాజా ! కబట్టి రాజసధర్మములు తామసధర్మములు ప్రబలియున్నవి విష్ణువునకు ప్రియకరమైన సాత్వికధర్మములు ప్రసిద్ధిని జెందియుండలేదు.

శ్లో॥ నిష్కామికా ఇమే ధర్మా ఐహికాముష్మికప్రదాః।
న జానంతి జనా మూఢా మోహితా దేవమాయయా॥ ౧౦

తా. మూఢులగు జనులు దేవమాయకు లోబడినవారలై ఇహలోక పరలోక సుఖముల నీయనట్టి యీసాత్వికధర్మములను తెలిసికొనలేరి.

శ్లో॥ యథా ధిపత్యే సంప్రాప్తే సర్వాః సిద్ధా మనోరథాః।
మోహానార్థ స్థలం ప్రాప్త మాధిపత్యం న హీయతే॥ ౧౧

తా. గొప్పయున్నత పదవిని పొందిననేని సమస్తకోరికలు సిద్ధించినరీతిగా మోహకరములగు నితరధర్మములను చేసిన యెడల సమస్తసంపత్తులు క్షీణింపక వృద్ధి పొందును.

శ్లో॥ కారణం చ ప్రవక్ష్యామి గోపనే భూతలేం జసా।
యద్వైశాఖోక్తధర్మాణాం సాత్వికానాం నృణా మిహ॥ ౧౨

తా. భూలోకములో సాత్వికధర్మములను వైశాఖ మాసధర్మములు యెందువలన ప్రసిద్ధిజెందక రహస్యముగానున్నవో కారణమును చెప్పుచున్నాను.

శ్లో॥ సార్వభౌమః పురా కాశ్యా మిక్ష్వాకుకులభూషణః।
కీర్తిమా నితి విఖ్యాతో నృగపుత్రో మహాయశాః॥ ౧౩

తా. పూర్వమందు కాశియందు యిక్ష్వాకువంశమునందు పుట్టి ప్రసిద్ధిజెందియుండినవాడును విశేషకీర్తిగలవాడును చక్రవర్తియు నృగమహారాజు పుత్రుడును. కీర్తిమంతుడను రాజుగలడు.

శ్లో॥ జితేంద్రియో జితక్రోధో బ్రహ్మణ్యో రాజసత్తమః।
ఏకదా మృగయాసక్తో వసిష్ఠాశ్రమ మాయయౌ॥ ౧౪

తా. ఇంద్రియములను జయించినవాడును క్రోధములేనివాడును జ్ఞానముగలవాడునగు నారాజోత్తము డొకప్పుడు వేటయందాసక్తిగలవాడై వసిష్ఠుని యాశ్రమమునకు వెళ్ళెను.

శ్లో॥ గచ్ఛన్మార్గే దదర్శా సౌ వైశాఖే ధర్మనిష్ఠురే।
భూయో భూయః కార్యమాణాన్ శిష్యై స్తస్య మహాత్మనః॥ ౧౫

తా. ఆరాజెధర్మములను జేయశక్యముగాని వైశాఖమాసములో మార్గమునందు వెళ్ళుచు వసిష్ఠమహాముని యొక్క శిష్యులచే ప్రతిప్రదేశమునందును జేయబడుచుండిన వైశాఖమాసధర్మములను జూచుచుండెను,

శ్లో॥ క్వచి త్ప్రపాం ప్రకుర్వంతి ఛాయామండప మేవ చ
తటప్రపాతం నిస్తీర్య వాపీం కుర్వంతి నిర్మలాం॥ ౧౬

తా. ఒక్కచోటను చలివేందప్రను మరియొకచోట నీడగానుండ మంటపమును ఒక్కచోట చెరువులను యొకచోట దిగుడు బావులను నేర్పరచిరి,

శ్లో॥ సూపవిష్టాన్ క్వచి ద్వృక్షే వ్యజనై ర్వీజయంతి చ।
క్వచి ద్దదు ర్హ్యేక్షుఖండాన్ క్వచి ద్గంధాన్ క్వచిత్ఫలం॥ ౧౭

తా. ఒకానొకచోట చెట్లనీడలయందు నాయాసముజెంది కూర్చుండినవారిని విసనకర్రలతో విసరుచుండిరి, ఒకచోట చెరుకుగడనిచ్చుచుండిరి. మరియొకచోటగంధములను యింకొకచోట ఫలములనిచ్చుచుండిరి.

శ్లో॥ మధ్యాహ్నే ఛత్రదానంచ సాయాహ్నే పానకస్య చ।
క్వచి ద్యచ్ఛంతి తాంబూలం నేత్రే కర్పూరలేపనం॥ ౧౮

తా. మధ్యాహ్న సమయంబున గొడుగులనిచ్చుటయు సాయంకాలమున పానకమునిచ్చుటయు నొకచోట తాంబూలంబుల నిచ్చుటయు నొకచోట కండ్లకు కర్పూరము బూయుటయు జేయుచుండిరి.

శ్లో॥ సుచ్ఛాయే చ వనే కేచి త్సుసంమృష్టాంగణేషు చ।
కేచి దాస్తరయం త్యస్మిన్ వాలుకానిహితాని చ॥ ౧౯

తా. కొందఱు నీడగలచెట్లక్రిందను కొందఱు చక్కగా బాగుచేయబడిన వాకిండ్లయందునను మరికొందఱు చల్లనిప్రదేశమునందుండు (యిసుకతిన్నెలయందునను) ఆసనములను పఱచి కూర్చుండబెట్టుచుండిరి.

శ్లో॥ కుర్వంత్యాందోళికాం కేచిద్వృక్షశాఖావలంబినీం।
కే యూయ మితి పప్రచ్ఛ వాసిష్ఠా ఇతి తే బ్రువన్॥ ౨౦

తా. ఓరాజా ఒకానొకచోటున చెట్లయందు నుయ్యాలలను గట్టి యూగించుచుండిరి ఈప్రకారము వైశాఖధర్మములను జేయుచున్న యామునులను జూచి మీరెవరని యా రాజడుగగా మేము వసిష్ఠమహాముని శిష్యులమని వారు తిరిగి పలికిరి.

శ్లో॥ కి మేత దితి పప్రచ్ఛ ధర్మా వైశాఖచోదితాః।
పురుషార్థ హేతవ ఇమే క్రియంతే స్మాభి రంజసా॥ ౨౧

తా. మీరుచేయు కార్యమెందుకొరకని రాజడుగగా ఇవి వైశాఖమాసధర్మములు ధర్మార్థకామమోక్షములకు కారణములైనవి కాబట్టి మేము జేయుచున్నాము.

శ్లో॥ వసిష్ఠ స్యాజ్ఞయా చేతి తే బ్రువ న్నృపసత్తమం।
ఏతదాచరణే పుంసాంకిం ఫలం కస్తు తుష్యతి॥ ౨౨
ఏత ద్విస్తార్య మే బ్రూత యూయం సమ్య గ్యథాశ్రుతం।
ఇతి రాజ్ఞా తు సంపృష్టాః ప్రత్యూచు స్తే మహీపతిం॥ ౨౩

తా. వసిష్ఠమునీశ్వరుని యాజ్ఞచే నిట్లు చేయుచున్నామని యా రాజశ్రేష్ఠునితో మునీశ్వరులు పలుకగా ఈ వైశాఖమాస ధర్మమును జేయుటవలన పురుషులకు నేమిఫలము కలుగును యేదేవత సంతోషించును యీ విషయమునంతయు మీకు తెలిసినంతవరకు నాకు జెప్పవలయునని తిరిగి రాజడుగగా యా మునీశ్వరులాతనితో నిట్లు చెప్పుచున్నారు.

శ్లో॥ గురో రాజ్ఞా క్రమేణైవ కుర్వతాం పథి సత్క్రియాః।
నాస్మాక మవకాశో త్ర గురుం పృచ్ఛ యథోచితః॥ ౨౪

తా. గురువుయొక్క యాజ్ఞానుసారముగా మార్గములో నిట్టి మంచికార్యముల ను చేయుచున్నాము. కాబట్టి యీ విషయమును జెప్పుటకు మాకు స్వతంత్రము లేదు మా గురువువద్దకు వెళ్లి మీయిష్టానుసారముగా మీరే యా మునీశ్వరుని తెలిసికొనుడు.

శ్లో॥ స వేత్తి తత్వతో నూనం ధర్మా నేతా న్మహాయశాః।
ఇతి శిష్యై ర్వసిష్ఠస్య ప్రోత్యుక్త స్తు ద్రుతం యయౌ॥ ౨౫

తా. మహానుభావుండగు యా మునీశ్వరుడే యీధర్మములను బాగుగా నెఱిగిన వాడు. అని వసిష్ఠమహాముని శిష్యులు చెప్పగా నా రాజు శీఘ్రముగా నా మునీశ్వరు నియొద్దకు వెళ్లెను,

శ్లో॥ వసిష్ఠస్యా శ్రమం పుణ్యాం విద్యాయోగోపబృంహితం।
సమాయాంతం నృపం వీక్ష్య వసిష్ఠఃప్రీతమానసః॥ ౨౬

తా. పుణ్యాకరమైనటువంటి విద్యలు యోగము మొదలగువానిచే నిండియుండిన వసిష్ఠమహామునియొక్క యాశ్రమములో వచ్చుచున్న యా రాజునుజూచి వసిష్ఠమహా ముని సంతోషించెను.

శ్లో॥ ఆతిథ్యం విధివచ్చక్రే సానుగస్య మహాత్మనః।
సూపవిష్టః కృతాతిథ్యః ప్రీతః ప్రపచ్ఛ తం గురుం॥ ౨౭

తా. అనంతరమందా మునీశ్వరుడు చతురంగ బలసమేతముగా వచ్చుచున్న యా రాజును కూర్చుండబెట్టి సంతోషముతోగూడినవాడై యతిథిసత్కారమును జేయ గా నా రాజు సంతసించి యా గురువుతో నిట్లు పలుకుచున్నాడు.

రాజోవాచ॥

శ్లో॥ మార్గే దృష్టం మహాశ్చర్యం త్వచ్ఛిష్యైశ్చ కృతం శుభం।
మయా పృష్టం చ తై ర్నోక్తం క్రియమాణం శుభావహం॥ ౨౮

తా. రాజు పలుకుచున్నాడు. ఓ మహానుభావా ! మీశిష్యులు చేయుచున్న గొప్పకార్యములనుజూచి శుభములనొసగు మీచే జేయబడిన యీకార్యము లెందునిమి త్తము జేయుచుండిరని వారిని యడుగగా వారు సమాధానము చెప్పలేదు.

శ్లో॥ నాస్మాక మవకాశో త్ర హ్యేతద్ధర్మప్రశంసనే।
కర్తవ్యా చ క్రియా స్మాభి ర్గురుణా యా చ చోదితా॥ ౨౯

గురుం గచ్ఛేతి తై రుక్త ఆగతోహం తవాంతికం।
మృగయా సక్తచిత్తేన శ్రాంతేనా తిథ్య మిచ్ఛతా॥ 30

తా. ఓమునీశ్వరా! నేను వేటాడుటయందు దానసక్తికలిగి యీ వనమునకు వచ్చి వేటాడి యలసి మీ శిష్యులచే జేయబడిన యాతిథ్యమును గ్రహించి యా ధర్మముల ను గురించి విచారించగా మేము వసిష్ఠమహాముని యాజ్ఞానుసారముగా ధర్మములను జేయువారమే కాని వాని మహాత్మ్యము చెప్పుటకు నధికారము మాకులేదు గాన మాగురువును తెలిసికొనుమని వారు చెప్పగా మీవద్దకు వచ్చితిని.

శ్లో॥ దృష్టం మార్గే త్విదం పుణ్యం తవ శిష్యై శ్చకారితం।
జిజ్ఞాసా సీ త్తత శ్శ్రోతుం ధర్మా నేతా న్మునీశ్వర॥ 30

తా. ఓమునీశ్వరా! మార్గములో మీశిష్యులచే జేయింపబడుచున్న యాధర్మములను జూచి యాశ్చర్యపడి వాని విధానము తెలిసికొన నిచ్ఛగించి యనంతరము మీవలన యీధర్మములను వినుటకొఱకు వచ్చితిని.

శ్లో॥ త్వ మాది రాదిమా౯ ధర్మా న్సమాచరసి వైయతః।
తా౯ ధర్మా౯ శ్రోతుకామాయ శిష్యాయ ప్రణతాయ చ॥ 32
శ్రద్ధధానాయ మే బ్రూహి విస్తరా న్మునిపుంగవ॥

తా. ఓ మునిశ్రేష్ఠుడా! నీవందరిలో మొదటివాడవు గాన మొదటినుండి యుండిన ధర్మముల నెరిగియుంటివి. అట్టి ధర్మములను వినుటకాసక్తిగలవాడను శిష్యుడను నమస్కరించినవాడను శ్రద్ధగలవాడనగు నాకు సవిస్తారముగా జెప్పుము.

శ్లో॥ ఇతీక్ష్వాకుకులీనేన రాజ్ఞా పృష్టో మహాయశాః॥ 33
మనసా తోష మాపేదే సమ్యక్పృష్టో ధునా మునా॥
అహో? వ్యవసితా బుద్ధీ రాజం స్తే ద్య సుశిక్షితా॥ 34

తా. ఈప్రకారమిక్ష్వాకు వంశసంభూతుడగు కీర్తిమంతునిచే నడుగబడినవాడై మహాతపశ్శాలియగు వసిష్ఠమహాముని యితడు మంచిప్రశ్న జేసినాడని తన మనస్సులో సంతసించి యిట్లుపలుకుచున్నాడు, ఓరాజా! నీవు మంచిజ్ఞానమును నేర్చుకొనుటవలన నీబుద్ధిధర్మముల వినుటయందాసక్తిగలిగి యున్నది, గాన యాశ్చర్యమైనది.

శ్లో॥ యస్మా ద్విష్ణుకథాయాంచ తద్ధర్మాచరణేపి చ।
మతి రాత్యంతికీ జాతా సుకృతం ఫలితం తవ॥ 35

తా. ఓరాజా! విష్ణుకథలను వినుటయందును విష్ణుధర్మములను జేయుటయందు నీబుద్ధియాసక్తిగలదై యున్నది గాన నీవు జేసిన పూర్వపుణ్యము ఫలించినది.

శ్లో॥ ఇతి సంభాష్య రాజానం జాతహర్ష స్తమబ్రవీత్।
శృణు భూప ప్రవక్ష్యామి యత్పృష్టో హం త్వయా ధునా॥ ౩౬

తా. ఈప్రకారము ఆరాజును గొనియాడి సంతసించి యారాజుతోనిట్లు పలుకుచున్నాడు ఓరాజా! నీవిప్పుడు దేనినడిగితివో దానిని జెప్పెదను వినుము.

శ్లో॥ యస్య శ్రవణమాత్రేణ ముచ్యతే సర్వకిల్బిషైః।
సర్వధర్మాన్ పరిత్యజ్య నతేన్ తేఽవిషయాత్మకః॥ ౩౭

తా. ఏధర్మములను వినుటవలన సమస్తపాపములను యితరసమస్తధర్మములను విడిచి విషయవృత్తులకు లోబడకయుండునో, అట్టివైశాఖధర్మములను చెప్పెదను.

శ్లో॥ వైశాఖస్నానసిరత స్స ప్రియో మధువిద్విషః॥

తా. వైశాఖమాసములో ప్రాతఃకాలంబున స్నానముజేయువాడు విష్ణుమూర్తికి ప్రియుడైనవాడగును.

శ్లో॥ సాంగాన్ ధర్మా ననుష్ఠాయ వైశాఖో యేన నాదృతః।
స్నానదానార్చనైః పుణ్యై స్తస్య దూరతరో హరిః॥

తా. సమస్తధర్మములను జేయుచు వైశాఖమాసమునందుమాత్రము స్నానము దానము పూజమొదలగు పుణ్యకార్యముల నెవడు చేయకుండునో వాడు విష్ణుమూర్తికి ప్రియుడైనవాడు కాడు.

శ్లో॥ అస్నాత్వా చా ప్యదత్వా చ వైశాఖో యేన నీయతే॥ ౩౯
కర్మణా స తు చండాలో నాత్ర కార్యా విచారణా॥

తా. ఎవడు వైశాఖమాసములో స్నానముచేయకయు దానముల నియ్యకయు వెళ్ళబుచ్చునోవాడు చేసిన కర్మవలన చండాలుడై పుట్టును. ఇందు విషయమైసందేహము లేదు.

శ్లో॥ వైశాఖోక్తై ర్మహాధర్మై ర్యేన చారాధితో హరిః॥ ౪౦
తైశ్చ తోషం సమాయాతి ప్రదదాతి సమీహితం॥
లక్ష్మీభర్తా జగన్నాథో వ్యాశేషాఘౌఘనాశనః॥ ౪౧

తా. వైశాఖమాసములో చేయవలసిన మహాధర్మములను చేసి యెవడు విష్ణుమూ

ర్తిని సేవించునో వానియొక్క ధర్మములచే ప్రపంచమునకు నధిపతియగు విష్ణుమూర్తి సంతోషించి వాని సమస్త పాపరాసులను నశింపజేసివానికోరికల నిచ్చుచున్నాడు.

శ్లో॥ ధర్మై స్సూక్ష్మతత్త్వై శ్చ ప్రీణాతి న ప్రయాసై ర్ధనై రపి।
భక్త్యా సంపూజితో విష్ణుః ప్రదదాతి సమీహితం॥ ౪౨

తా. సూక్ష్మములగు నితరధర్మములచేతను గాని కష్టమైనకార్యములచేతను గాని ధనములచేతను గాని విష్ణుమూర్తి సంతోషింపడు. భక్తిగలిగి పూజించిన యెడల విష్ణుమూర్తి కోరినకోరికలనిచ్చుచున్నాడు.

శ్లో॥ తస్మా ద్రాజ న్సదా భక్తిః కర్తవ్యా మధువిద్విషః।
జలేనాపి జగన్నాథః పూజితః క్లేశహా హరిః॥ ౪౩

తా. ఓరాజా! ఆకారణమువలన యెల్లప్పుడు విష్ణుమూర్తియొక్క భక్తినే గోరవలయును. భక్తియుండి విష్ణుమూర్తిని జలముతో పూజించినను సమస్తకష్టముల ను పోగొట్టును.

శ్లో॥ పరితోషం వ్రజ త్యాశు తృషార్త స్సలిలై ర్యథా।
మహ దప్యల్పదం కర్మ తథా హ్యల్పాది భూరిదం॥

తా. భక్తితో పూజించిన యెడల దప్పిగొనవానికి జలమునిచ్చినట్లుగానే విష్ణుమూర్తి శీఘ్రముగా సంతోషించును. భక్తిగలిగిన కర్మకొంచెమైనను విశేషఫలమునిచ్చును. భక్తిలేని కర్మగొప్పదైనను కొంచెము ఫలము నేయిచ్చును.

శ్లో॥ కర్మణో భూరిహేతుత్వే న హేతూ మహదల్పకే।
కిం తు కర్మస్వరూపం చ గహనా కర్మణో గతిః॥ ౪౫

తా. కర్మవిశేషఫలము నిచ్చుటకు చిన్నకర్మయనియు పెద్దకర్మయనియు కారణముగా జెప్పగూడదు. ఫలములభేదములు కర్మననుసరించి యున్నవి. కర్మను సంపూర్ణముగా దెలిసికొనుట శక్యముకాదు.

శ్లో॥ వైశాఖోక్తా ఇమే ధర్మా స్స్వల్పాయాసకృతా అపి।
బహువ్యయవిహీనా శ్చ విష్ణోః ప్రీతికరా శ్శుభాః॥ ౪౬

తా. వైశాఖమాసములో జేయుటకు జెప్పబడిన యీధర్మములు సులభముగా జేయవలెగినవైనను విశేషద్రవ్యఖర్చులేనివైనను విష్ణువునకు సంతోషకరములై శుభముల నొసంగును.

శ్లో॥ తస్మా త్త్వ మపి భూపాల వైశాఖోక్తా న్సమాచర।
త్వద్రాష్ట్రే యే జనా స్సర్వైః కారయేమాన్ శుభావహాన్॥ ౪౭

తా. ఓ రాజా! శుభములను కలిగించునట్టి యీ వైశాఖమాసధర్మములను నీవును చేయుము నీ రాజ్యమునందుండువారిచేతను చేయింపుము.

శ్లో॥ న కరోతి చ యోధర్మాన్ వైశాఖోక్తా న్నరాధమః।
బహుధా శిక్ష్యమాణోపి స దండ్య స్తవ భూపతే॥ ౪౮

తా. ఏమనుష్యుడు అనేకవిధములుగా బోధింపబడినను వివేక జ్ఞానములేనివాడై వైశాఖమాసధర్మములను జేయడో యట్టివానిని నీవు శిక్షింపవలయును.

శ్లో॥ ఇత్యావశ్యకతాం సమ్య క్ఛాస్త్రై ర్వ్యుత్పాద్య తస్యచ।
పశ్చా ద్వైశాఖనిర్దిష్టాన్ ధర్మా న్ప్రోవాచ సర్వశః॥ ౪౯

తా. ఈప్రకారము వైశాఖమాసధర్మము ముఖ్యముగా జేయవలయునని శాస్త్రములచే ప్రతిపాదనజేసి యనంతరము వైశాఖమాసములో జేయవలసిన సమస్తధర్మలను చెప్పెను.

శ్లో॥ శ్రుత్వా తా న్సకలాన్ ధర్మాన్ గురుం సంపూజ్యభక్తితః।
స రాజా గృహ మాపన్న స్సర్వాన్ ధర్మాం శ్చకార హ॥ ౫౦

తా. ఆరాజు వసిష్ఠమహాముని చెప్పిన సమస్తధర్మములను విని గురువును భక్తితో పూజించి యింటికివెళ్లి సమస్తధర్మములను జేసెను.

శ్లో॥ భక్తిమాన్ కేశవే రాజన్ దేవదేవే నిరంజనే।
నాన్యం పశ్యతి దేవేశా త్పద్మనాభా న్మహీంపతిః॥ ౫౧

తా. ఓరాజా! ఆకీర్తిమంతుడు దేవతలకు దేవుండును విషయరహితుండునగు విష్ణుమూర్తి యందుభక్తిగలవాడైదేవదేవుండగు నా విష్ణునికంటెమఱియొకరినిధ్యానించకయుండెను.

శ్లో॥ భేరీ ముద్ఘాహ్య మాతంగే స్వరాష్ట్రే ఘోషయ ద్భటైః।
అష్టవర్షాధికో మర్త్యో హ్యాశీతి ర్న హి పూర్యతే॥ ౫౨
ప్రాత ర్న స్నాతి మేషస్థే సూర్యే సర్వోపి యో జనః।
స మే దండ్య శ్చ వధ్య శ్చ నిర్వాస్యో విషయా ద్ధ్రువం॥ ౫౩

తా. ఆ రాజు యేనుగునెక్కి భేరీని మ్రోయించుచు నిట్లు చాటించెను. నా రాజ్యములో యెనిమిది సంవత్సరములకంటె నధికమైన వయస్సుగలవాడును యెనుబదిసంవత్సరములకంటె తక్కువగానున్నవాడు నెవడైనను సూర్యుడు మేషరాశియందుండగా అనగా వైశాఖమాసములో ప్రాతఃకాలంబున స్నానముజేయనివాడు శిక్షింపతగినవాడును వధింపతగినవాడు నగును లేక వానిని పట్టణమునుండి వెడలగొట్టింతును నిశ్చయము.

శ్లో॥ పితా వా యది వా పుత్రో భార్యా వాథ సుహృజ్జనః।
వైశాఖధర్మహీనశ్చేన్నిగ్రాహ్యో దస్యువన్మయా॥ ౧౪

తా. తండ్రిగాని తనయుడుగాని భార్యగాని స్నేహితుడుగాని యెవరైనను వైశాఖమాసములో ధర్మములను జేయనివానిని దొంగవానివలెనే శిక్షింతును.

శ్లో॥ దాతవ్యం విప్రముఖ్యేభ్యః స్నాత్వా ప్రాతర్జలే శుభే।
ప్రపాదానాదిధర్మాంశ్చ కురుధ్వం శక్తితో నఘాః॥ ౧౫

తా. ప్రాతఃకాలంబున లేచి శ్రేష్ఠమైన జలములో స్నానముజేసి బ్రాహ్మణోత్తములకు దానములియ్యవలయును. ఓ పుణ్యాత్ములారా! నూతులు చలివేంద్రము మొదలగు ధర్మములను మీశక్తి ననుసరించి జేయుడు.

శ్లో॥ విప్రం చ ధర్మవక్తారం గ్రామేగ్రామే న్యవేశయత్।
పంచానా మపిగ్రామాణా మేకరోదధికారిణం॥ ౧౬
దండార్థం త్యక్తధర్మాణాం దశవాజీనిషేవితం।
ఏవం ప్రవృత్త స్సర్వత్ర సార్వభౌమస్య శాసనాత్॥ ౧౭

తా. వైశాఖమాసధర్మములను బోధించునట్టి బ్రాహ్మణుని ప్రతిగ్రామంబున కాపురముంచెను. ధర్మములను విడిచినవారలను శిక్షించుటకొఱకు పది గుఱ్ఱములనిచ్చి అయిదుగ్రామములకు నొక యధికారి నేర్పరచెను. ఈ ప్రకారము ఆరాజుశాసనము అంతటను వ్యాపింపజేసెను.

శ్లో॥ ప్రవృద్ధో ధర్మవృక్షోయం సర్వదేశేషు విస్తరాత్।
యే కేచి న్నిధనం యాంతి భూపాలవిషయే నరాః॥ ౧౮
ప్రయాతా శ్చ నృపశ్రేష్ఠ తే యాంతి హరిమందిరం।
ఆవశ్యం వైష్ణవో లోకః ప్రాప్యతే మానవై ర్మృతం॥ ౧౯

తా. ఆరాజుయొక్క దేశమంతటను ధర్మమనెడు వృక్షము స్థాపింపబడెను ఆ రాజుయొక్క దేశములో పురుషులుగాని స్త్రీలుగాని యెవరైనను మృతి నొందినవారు విష్ణులోకమును పొందుచున్నారు. ఓ రాజా! మనుష్యులందరును శీఘ్రముగానే వైకుంఠమును పొందుచున్నారు.

శ్లో॥ వ్యాజేనాపి సకృ త్స్నాతః ప్రాత ర్మేషగతే రవౌ।
సర్వపాపవినిర్ముక్తో యాంతి విష్ణోః పరంపదం॥ ౬౦

తా. సూర్యుడు మేషరాశియందుండగా ప్రాతఃకాలంబున యేమిషచేతనైనను స్నానముజేసినయెడల అట్టివాడు సమస్తపాపములను విడిచినవాడై విష్ణులోకమును పొందును.

శ్లో॥ న ప్రాప్నోతి యమం ధర్మో సకృ ద్వైశాఖస్నానతః।
వై లేఖ్య మగమ ద్రాజా రవిసూను స్తదా నృప। ౬౧

తా. ఓరాజా! అప్పుడు వైశాఖమాసములో ప్రాతఃకాలస్నానము నందరు జేయుటచే నొక్కరైనను యమలోకమునకు వెళ్ళకుండుటచే నాయమధర్మరాజునకు లెక్కవ్రాయుట మానవలసి వచ్చెను.

శ్లో॥ లేఖ్యకర్మణి విశ్రాంత శ్చిత్రగుప్తో భవే త్తదా।
మార్జితాని చ లేఖ్యాని పురా పాపోద్భవాని చ॥ ౬౨

తా. వ్రాయతగిన లెక్కలు లేకుండుటచే చిత్రగుప్తుడూరకుండెను. మరియునిప్పుడు చేసినపుణ్యవశమున పూర్వమందు వ్రాయబడిన పాపములన్నియు తుడిచి వేయబడెను.

శ్లో॥ గచ్ఛద్భి ర్వైష్ణవై ర్లోకం స్వకర్మస్థై ర్జనై స్తు తత్క్షణాత్।
శూన్యా స్తు నరకా స్సర్వే పాపప్రాణి వివర్జితాః॥ ౬౩

తా. తమకర్మములను జేయుచు పుణ్యముగలవారగుటచే శీఘ్రముగా విష్ణులోకమునుగురించి సర్వజనులు వెళ్ళుటవలనను యమలోకమునకు జీవులు వెళ్ళకుండుటవలనను నరకములన్నియు శూన్యములైయున్నవి.

శ్లో॥ భగ్నయానో భవన్మార్గో వైశాఖస్యప్రభావతః।
సర్వేపి విమలాకారా జనా యాంతి హరేః పదం॥ ౬౪

తా. యమలోకమునకునుండు మార్గము నడచువారు లేక శూన్యమైయున్నది. వైశాఖమహాత్మ్యమువలన విష్ణుభక్తులందరును నిర్మలస్వరూపముగలవారలై జనులందరు వైకుంఠమును పొందుచున్నారు.

శ్లో॥ ఉపాకసాం తు యే లోకా శ్శూన్యా స్సర్వే తథా భవన్।
శూన్యే త్రివిష్టపే జాతే శూన్యేషు నరకేషు చ॥ ౬౫
నారదోధర్మరాజానం గత్వాచేదమువాచహ

తా. దేవతలలోకములన్నియు శూన్యముగానున్నవి, ఇట్లు స్వర్గము నరకములు శూన్యమైనవైయుండగా నంతట నారదుడు యమలోకమునకువెళ్ళి యమధర్మరాజుతో నిట్లు పలుకుచున్నాడు.

శ్లో॥ నాక్రంద శ్శ్రూయతే రాజన్ ప్రాక్పృతో నరకే యథా॥ ౬౬
తథా న క్రియతే లేఖ్యం కించి ద్దుష్కృత కర్మణాం॥
చిత్రగుప్తో ముని రివ స్థితో యం మునిసంస్థితః॥ ౬౭

తా. ఓయమధర్మరాజా! పూర్వమందు నరకమునందు రోదనధ్వనులు వినబడినట్లుగా నిప్పుడు రోదనధ్వనులెందువలనవినబడుటలేదు? మరియుజీవులపుణ్యపాపములను వ్రాయునట్టి చిత్రగుప్తుడును పాపాత్ముల పాపములలెక్కలేమియు వ్రాయక మునీశ్వరులతోగూడి యెందువలన మౌనము నవలంబించియుండెను?

శ్లో॥ కారణం బ్రూహి రాజేంద్ర న యాంతి తవ మందిరం।
మనుష్యాః పాపకర్మాణో మాయాదంభవివర్జితాః॥ ౬౮

తా. ఓయమధర్మరాజా! మనుష్యులు విశేషపాపకార్యములను జేయుచుమాయకపటము మొదలగు దుర్గుణములధికముగానుండు వారలుగదా. అట్టివారు నీస్థానమునకు రాకుండుటకు కారణమేమైయుండునో చెప్పుము.

శ్లో॥ ఏవ ముక్తే తు వచనే నారదేన మహాత్మనా।
ప్రాహ వైవస్వతో రాజా కించి ద్దైన్యసమన్వితః॥ ౬౯

తా. ఈ ప్రకారము నారదుడడుగగా యమధర్మరాజు కొంచెము దీనమైనముఖముగలవాడై నారదునితోనిట్లు చెప్పుచున్నాడు.

శ్లో॥ యోఽయం నారద భూపాలః పృథివ్యాం సాంప్రతం స్థితః।
సోఽతిభక్తో హృషీకేశే పురాణపురుషోత్తమే॥ ౭౦

తా. ఓ నారదా ! ఇప్పుడు భూలోకములోనుండు నట్టిరాజు దేవతలకందఱికిని ప్రభువగు విష్ణుమూర్తియందు విశేషభక్తిగలవాడు.

శ్లో॥ ప్రబోధయతి వైశాఖధర్మాం భేరీస్వనేన చ।
అష్టవర్షాధికో మర్త్యో హ్యశీతి ర్న హి పూర్యతే॥ ౨౦

తా. ఎనిమిది సంవత్సరములకుపైగానుండువాడును యెనుబది సంవత్సరములకు లోపుగానుండువాడును వైశాఖధర్మమును జేయవలయునని భేరీని మ్రోగింపుచు నా రాజు తన దేశమునందంతటను చాటింపుజేయించెను.

శ్లో॥ యోవై హ్యకృతవైశాఖ స్స మే దండ్యో న సంశయః।
తద్భయా ద్ధి జనా స్సర్వే నోల్లంఘంతి కదాచన॥ ౨౧

తా. ఎవడు వైశాఖ ధర్మమునుజేయకుండునో వానిని వధింతును. సంశయము లేదనెను. కాబట్టి ఆ రాజుయొక్క భయమువలన జనులందరు నా రాజు వాజ్ఞనొకప్పుడైన నతిక్రమించకుండిరి.

శ్లో॥ గచ్ఛంతి వైష్ణవం ధామ కర్మణా తేన నారద
వైశాఖసేవనా ల్లోకా యాస్యంతి హరిమందిరం॥ ౨౩

తా. ఓ నారదా ! అట్టిపుణ్యకర్మమువలన విష్ణులోకమును పొందుచున్నారు. కాబట్టి వైశాఖ మాసధర్మమాచరించుటచే జనులందరు వైకుంఠమును పొందగరు.

శ్లో॥ తేన రాజ్ఞా మునిశ్రేష్ఠ మార్గో లుప్తో మమాధునా।
కృతా హి నరకా శ్శూన్యా లోకా శ్చాపి దివౌకసాం॥ ౨౪

తా. ఓమునీశ్వరా ! ఆకారణమువలన నాలోకమునకు వచ్చునట్టి మార్గము శూన్యమైనది. నరకములును పాపులులేక శూన్యముగానుండెను. యజ్ఞాదిపుణ్యకర్మములచే పొందతగిన యితరమైన దేవేంద్రాదులలోకములును శూన్యముగానుండినవి. అనగాసమస్తకర్మములను విడిచి యొక్క విష్ణుభక్తినే గలిగియున్నారు.

శ్లో॥ విశాంతో లేఖకో లేఖే లిఖితం మార్జితం జనైః।
వైశాఖమాసధర్మస్య మాహాత్మ్యం త్వీదృశం మునే॥ ౨౫

తా. ఓమునీశ్వరుడా ! లేఖరియగు చిత్రగుప్తుడు వ్రాయదగిన విషయములేకుండుటచే నూరకుండెను. మరియు జనులు పుణ్యములను జేయుటచే నింతకుపూర్వము వ్రాయబడిన పాపములన్నియు తుడిచివేయబడెను. కాబట్టి వైశాఖ మాసధర్మమిట్టు వంటి మహాత్మ్య గలిగియున్నది

శ్లో॥ బ్రహ్మహత్యాదిపాపాని విముక్తాని జనై ర్ద్విజ।
కృత్వా వైశాఖకృత్యాని యాంతి విష్ణోః పరంపదం॥ ౭౬

తా. ఓబ్రాహ్మణుడా! మనుష్యులు వైశాఖ మాసధర్మములను జేయుటవలన బ్రహ్మహత్య మొదలగు సమస్తపాపములను విడచి విష్ణుమూర్తియొక్క శ్రేష్ఠమగు లోకమును పొందుచున్నారు.

శ్లో॥ సోఽహం కాష్ఠసమోజాతో న కశ్చి న్మమ గోచరః।
యుద్ధం కృత్వా తు తం హన్మి సర్వథా ద్య మహాబలం॥ ౭౭

తా, ఓమునీశ్వరా! ఈ నేనుయేపనియును లేనివాడనై యేమియునుతోచనివాడనై కొయ్యవలెనుంటిని. కాబట్టి యాతండు మహాబలముగలవాడైనను సమస్తవిధములచేతను వానిని చంపవలయునని కొంటిని.

శ్లో॥ అకృత్వా స్వామికార్యం తు నిర్వ్యాపారో యది స్థితః।
తస్య విత్తం సమశ్నాతి స యాతి నరకం ధ్రువం॥ ౭౮

తా. ఎవడు తనయజమానుని ద్రవ్యమనుభవించుచు వానికార్యమునుజేయక నూరకుండునో, అట్టివాడు నరకమును పొందును. నిశ్చయము.

శ్లో॥ యది దైవా దవధ్యోఽహం తదా బ్రహ్మాణ మేత్య చ।
నివేద్య తస్మై తత్సర్వం పశ్చా త్స్వస్థితి ర్ధ్రువం॥ ౭౯

తా. ఆరాజు దైవయోగమువలన మరణమునొందడేని యనంతరము సత్యలోకమునకు వెళ్ళి బ్రహ్మతో నీవృత్తాంతమునంతయు జెప్పి యటుపిమ్మట వాలోకమునకువచ్చి సుఖముగానుందును. అప్పటికి నాయందేమియు లోపముండదు.

శ్లో॥ ఇత్యుక్త్వా ద్విజ మామంత్ర్య సానుగః ప్రియయా భువం।
స కాలో మహిషారూఢో దండ ముద్యమ్య భీషణం॥ ౮౦
మృత్యురోగజ్వరాద్యై శ్చ పార్శ్వదై శ్చ మహాత్మకైః।
పంచాశత్కోటిసంఖ్యాకై ర్యమదూతై ర్వృత స్తతః॥ ౮౧
స తూర్ణం తస్య రాజర్షేః రురోధ సకలాం పురీం।
శంఖం దధ్మౌ మహాఘోరం సర్వలోకభయంకరం॥ ౮౨

తా ఈప్రకారము మునీశ్వరునితో బలికియాతునినిపంపించి యాయముధర్మరాజు భయంకరమగు దండమును ధరించి మహిషవాహనము నెక్కి మృత్యువురోగము జ్వరము మొదలగు క్రూరులగు నేబదికోట్ల సైనికులతోగూడి శీఘ్రముగా భూలోకము

నకుపెళ్ళి యారాజశ్రేష్ఠుని పట్టణమంతయు ముట్టడించి లోకమంతయు భయపడునట్లుగా మిక్కిలి గొప్పదియగు తనశంఖమును పూరించెను.

శ్లో॥ తచ్ఛ్రుత్వా స తు రాజర్షి ర్జ్ఞాత్వా వైవస్వతం యమం।
ససజ్జీకృతసర్వస్వః పత్తనా న్నిర్యయౌ రుషా॥ ౬౩

తా. ఇట్లు చేయబడినశంఖధ్వనిని యారాజశ్రేష్ఠుండువిని సూర్యసుతుండగు యమునిగా నెఱింగి సైన్యమునంతయు నాయత్తపరచుకొని కోపముగలవాడై పట్టణమునుండి బయలువెడలెను.

శ్లో॥ తయో ర్యుద్ధ మభూ త్తత్ర భీషణం రోమహర్షణం।
మృత్యుం కాలం తథా రోగం యమం దూతపతిం తథా॥ ౬౪
జిత్వా క్షణేన రాజర్షి ర్ద్రావయామాస రోషతః॥

తా. అప్పు డుభయసేనలకు యుద్ధమాయెను. ఆసమయంబున భయంకరుడును ఆశ్చర్యకరుడునగు మృత్యుదేవతను కాలుని రోగుని యమదూతలను ఆరాజు క్షణకాలములో జయించి మిక్కిలి కోపమున వలంబించి పాఱిపోవునట్లుగా చేసెను.

శ్లో॥ తతః క్రుద్ధో యమో రాజా స్వయ మభ్యేత్య తం రుషా
యుయోధ బహుభి ర్బాణై స్సింహనాదంచకార హ॥

తా. అనంతరము యమధర్మరాజు కోపముగలవాడై వచ్చి యారాజు నొప్పునట్లు యనేకబాణములచేసి సింహధ్వనిని జేసెను.

శ్లో॥ చకర్త రాజా తస్యాపి కార్ముకం విశిఖై స్త్రిభిః ౬౬
పున శ్చర్మాసి మాదాయ యమో హంతు మథాగమత్॥

తా. ఆరాజు మూడుబాణముల చేసి యాయమునిధనుస్సును ఖండించెను। అయమధర్మరాజు తిరిగి చర్మముగల మఱియొక ఖడ్గమునుతీసికొని యారాజును చంపుటకు వచ్చెను.

శ్లో॥ తం దృష్ట్వా తు నృపః క్రుద్ధః పునశ్ఛిత్వా సిచర్మణీ।
నిచఖాన లలాటే చ శరం కాలోరగప్రభం॥
యమ స్తేనా హతః క్రుద్ధ స్తతో దండ ముపాదదే॥ ౬౭

తా. ఆ యమధర్మరాజుని జూచి రాజు కోపించి తిరిగి ఖడ్గమును వరను తెగగొట్టి కాలసర్పముతో సమానమగు బాణమును ముఖమునందు వేసెనుగా నాయమధర్మరాజు కోపించి యానంతరము తనకు ముఖ్యాయుధమైన దండమును తీసికొనెను.

శ్లో॥ బ్రహ్మాస్త్రేణ చ సంమంత్ర్య దండం తస్మై ముమోచ హ।
హాహాకారో మహానాసీ జ్జనానాం పశ్యతాం తదా॥ ౮౯

తా. బ్రహ్మాస్త్రమంత్రమును పఠించి దండము నా రాజుమీదికి విడువగా నంతట జనులందరు జూచుచు మిక్కిలి ఘోరమైనకార్యము ప్రాప్తమైనదని యాశ్చర్యపడిరి.

శ్లో॥ తదా విష్ణు స్స్వభక్తస్య రక్షార్థాయై ప్రహిణో దరిం।
విష్ణుముక్తం తదా చక్రం శీఘ్ర మాగత్య తద్రణే॥
యమదండేన సంయుధ్య తద్బ్రహ్మాస్త్రం నివార్య చ।
యమం హంతు మథారేభే సహస్రారం మహాద్భుతం॥ ౯౧

తా. అప్పుడు విష్ణుమూర్తి తన భక్తుని రక్షించుటకొరకు చక్రమును పంపించగా నాచక్రము శీఘ్రముగా యుద్ధభూమికివచ్చి బ్రహ్మాస్త్రమంత్రముచే సభిమంత్రింపబడిన యాదండముతో యుద్ధముజేసి యాదండము నోడించి వెయ్యి అంచులుగలదియు మిక్కిలి యాశ్చర్యకరమగు నాచక్రము యమధర్మరాజును చంపుటకు ప్రయత్నించెను.

శ్లో॥ దేవభక్త స్తతో భీత స్తదా సౌ చక్ర మంజసా।
సహస్రార నమ స్తే స్తు విష్ణుపాణి విభూషణ॥ ౯౨
త్వం సర్వలోకరక్షార్థాయై హరిణా చ ధృతం పురా।
త్వాం యాచే ద్య యమం త్రాతుం విష్ణుభక్తం మహాబలం॥ ౯౩

తా. అనంతరము విష్ణుభక్తుడగు నట్టి యారాజు భయపడి శీఘ్రముగా నాచక్రము నిట్లు ప్రార్థించెను. వెయ్యి అంచులు గలుగునట్టియు విష్ణుమూర్తిచేతికి నలంకారమైనట్టి యోచక్రమా! నీకునమస్కారము. పూర్వమందు విష్ణుమూర్తి సమస్తలోకములను రక్షించుటకొఱకు నిన్ను తన హస్తమునందు ధరియించెను. అట్టి నిన్నిప్పుడు మిక్కిలి బలముగలవాడును విష్ణుమూర్తి భక్తుండునగు యమధర్మరాజును రక్షించుటకొఱకు యాచించుచున్నాను.

నృణాం దేవద్రోహిణాం కాల స్త్వ మేవ హి న చా పరః।
తస్మా దేనం యమం రక్ష కృపాం కురు జగత్పతే॥ ౯౪

తా. ప్రపంచమునకు నధిపతివగు నోచక్రమా! దేవతలకు నపకారముజేయు నట్టి మనుష్యులను శిక్షించుటకు యముడవు నీవేకాని మఱియొకడు లేడు. కాబట్టి యీ యమునియందు దయయుంచి రక్షింపుము.

శ్లో॥ నృపేణైవం స్తుతం చక్రిం యమం హిత్వా నృపాంతికం।
పున ర్యయౌ మహారాజ దేవానాం పశ్యతాం దివి॥ ౯౫

తా. ఓరాజా ఈప్రకారము రాజుస్తుతింపగా నాచక్రియుయముని విడచియాకా శంబున దేవతలందరు చూచుచుండగా నా రాజువద్దకు తిరిగివెళ్ళెను.

శ్లో॥ తతో యమో తినిర్విణ్ణో బ్రహ్మణ స్సదనం యయౌ।
స దదర్శ సమాసీనం మూర్తామూర్తజనై ర్వృతం॥ ౯౬

తా. అనంతరము యముడు మిక్కిలి వ్యసనభయములు గలవాడై బ్రహ్మలోకమునకు వెళ్లి యచ్చట శరీరసహితులగు వారితోడను శరీరరహితులగు వారితోడను గూడి చుట్టుకొనబడి కూర్చుండియున్న బ్రహ్మను చూచెను.

శ్లో॥ దేవాశ్రియం జగద్బీజం సర్వలోకపితామహం।
ఉపాస్యమానం విబుధై ర్లోకపాలై ర్దిగీశ్వరైః ౯౭
ఇతిహాసపురాణాద్యై ర్వేదై ర్విగ్రహసంస్థితైః।
మూర్తిమద్భి స్సముద్రై శ్చ నదీభి శ్చ సరోవరైః॥ ౯౮
దేహవద్భి స్తథా వృక్షై రశ్వత్థాద్యై రశేషితైః॥
వాపీకూపతటాకై శ్చ మూర్తిమద్భి శ్చ పర్వతైః॥ ౯౯
అహోరాత్రై స్తథా పక్షై ర్మాసై స్సంవత్సరై స్తథా।
కలాకాష్ఠానిమేషై శ్చ ఋతుభి శ్చాయనై ర్యుగైః॥ ౧౦౦
సంకల్పై శ్చ వికల్పై శ్చ నిమేషోన్మేషణై స్తథా।
ఋక్షై ర్యోగై శ్చ కరణైః పూర్ణిమా స్యిందుసంక్షయైః॥ ౧౦౧
సుఖై ర్దుఃఖై ర్భయై శ్చైవ లాభాలాభై ర్జయాజయైః।
సత్వేన రజసా చైవ తమసా చ సమన్వితం॥ ౧౦౨
శాంతమూఢాతిఘోరై శ్చ వికారైః ప్రాకృతై రపి।
వాయునా దేవదేవేన శ్లేష్మపిత్తాదిభి ర్వృతం॥ ౧౦౩

తా. మరియు బ్రహ్మ యెటువంటివాడనగా దేవతలకు నాధారమైనవాడును ప్రపంచమునకు కారణుడును లోకములన్నికంటెను పూర్వుడును అష్టదిక్పాలకుల చేతను యితరదేవతలచేతను సేవించబడువాడును శరీరసహితులుగా నున్నట్టి ఇతిహాస

ములు పురాణములు వేదములతోడను ఆకారమును ధరియించిన సముద్రములు నదులు సరస్సులతోడను ఆరీతిగానే యాకారమును ధరియించిన రావి మొదలగు సమస్తవృక్షములతోడను. శరీరమును ధరియించినదిగుడు బావులు నూతులు చెరువులు పర్వతములు పగళ్లు రాత్రులు పక్షములు మాసములు సంవత్సరములు కళలు కాష్ఠలు నిమేషములు ఋతువులు అయనములు యుగములు సంకల్పములు వికల్పములు నిమేషములు రెప్పపాట్లు నక్షత్రములు యోగములు కరణములు పూర్ణిమలు అమావాస్యలు సుఖములు దుఃఖములు భయములు లాభములు నష్టములు జయములు అపజయములు సత్వము రజస్సుతమము మొదలగువాని గూడియుండిన వాడును దేహవంతంబులగు శాంతము మూఢత ఘోరము వికారము ప్రకృతి సంబంధములగు గుణములు దేవతుల కందరకు నాధారుండగు వాయువును శ్లేష్మము శైత్యము మొదలగు గుణములతోడను గూడియుండిన బ్రహ్మను చూచెనని పూర్వముతో నన్వయించుకొనవలయును.

శ్లో॥ తేషాం మధ్యే విశత్సూరి స్సవ్రీడా చ వధూర్యథా।
విలోకయన్ ధరాపృష్ఠం మ్లానవక్త్రం వ్యదర్శయత్॥ ౧౦౪

తా. ఈ ప్రకారము సకల పరివారముతోడను గూడియున్న బ్రహ్మయొక్క సభామధ్యభాగంబునకు సిగ్గుగల యాడుదివలెనే యముడు నేలవంకనే జూచుచు వెళ్లి కూర్చుండగా నట్టి దీనముఖముతో నున్న యముని చూచెను.

శ్లో॥ సంప్రవిష్టం యమం దృష్ట్వా సకాశస్థం సహానుగం।
విస్మితా స్తే మిథః ప్రోచుః కిమర్థం భాస్కరి స్త్వహ॥ ౧౦౫
సంప్రాప్తో లోకకర్తార మిష్టం దేవపితామహం।
నిర్వ్యాపారో క్షణ మపి యోయం నాస్తే రవే స్సుతః॥ ౧౦౬

తా. సమీపమందు అనుచర సహితముగా సభను ప్రవేశించుచున్న యముని జూచి ఆ సభయందుండినవారు తమలో దామిట్లు చెప్పుకొన సాగిరి. యముడు లోకమును సృజించునట్టియు సమస్త ప్రాణులకు పూజ్యుడైనట్టి బ్రహ్మవద్దకు నెందునిమిత్తము వచ్చియున్నాడు. ఈ యముడు వ్యాపారము లేక యొక క్షణకాలంబైన నూరకుండువాడు కాడు.

శ్లో॥ సోయ మభ్యాగతః కస్మాత్కశ్చిత్ క్షేమం దివౌకసాం।
ఆశ్చర్యాతిశయో యశ్చ సమ్మార్జితపట స్త్వయం॥

తా. అట్టి యీ యముడు దేవతులకు క్షేమము నిమిత్తమై వచ్చెనో లేక మరి యేకారణమై యుండునో తెలియదు. మరియు నితనియొద్దనుండు పాపములనురద్దుచే యబడిన పటమును జూడగా మిక్కిలి యాశ్చర్యముగా నున్నది.

శ్లో॥ లేఖక స్తమనుప్రాప్తో దైన్యేన మహతాన్వితః।
న కదాచి త్పటో హ్యస్య మార్జితో ధర్మభీరుణా॥ ౧౦౮

తా. యముని వద్ద లేఖరియైన చిత్రగుప్తుడును విచారయుక్తమైన ముఖముగల వాడై యాయమునితో గూడ వచ్చుచున్నాడు. ధర్మమును గురించి భయపడువాడు గాన యెన్నడును వ్రాసిన పద్దులను తుడుపు పెట్టి యుండలేదు.

శ్లో॥ య న్న దృష్టం శ్రుతం వాపి తదిహాద్య ప్రపద్యతే।
ఏవ ముచ్చరతాం తేషాం భూతానాం భూతశాసనః॥ ౧౦౯
నిష్పపాతా గ్రతో భూమౌ బ్రహ్మణో రవినందనః।
కృంతమూలో యథా శాఖీ త్రాహి త్రాహీ తి వై రుదన్॥ ౧౧౦

తా. అట్లు తుడుపు పెట్టుటచూచియును వినియును యుండలేదు. అది యిప్పుడు సంభవించినది. అని యీ ప్రకారము అక్కడనుండు దేవతులందరు చెప్పికొనుచుండ గా భూతములకు శిక్షకుడైన యమధర్మరాజు నన్ను రక్షింపు రక్షింపు మనియేడ్చుచు మొదలు కొట్టబడిన వృక్షమువలెనే బ్రహ్మదేవుని ముందరను సాష్టాంగముగా పడెను.

శ్లో॥ పరిభూతో స్మి దేవేశ సంమార్జితపటః కృతః।
త్వయినాథే న విఫలంపశ్యామి కమలాసన॥ ౧౧౧

తా. దేవతులకు నధిపతియగునో బ్రహ్మా! నేను యొక మనుష్యమాత్రునిచే తిరస్కరింపబడితిని. మరియును పుణ్యపాపములు లిఖియించిన పత్రములును రద్దు చేయబడెను. నీవు ప్రభునై యుండగానే నెప్పుడును వ్యాపార శూన్యుడనై యుండలేదు.

శ్లో॥ ఏవ ముక్త్వా హి నిశ్చేష్టో బభూవ నృపసత్తమ।
తతః కోలాహల శ్శబ్ద స్సభాయాం సమజాయత॥

తా. ఓ రాజా! ఈ ప్రకారము యమధర్మరాజు పలికి నిశ్చేష్టుడై యుండెను. అంతట సభలో బహుజన ధ్వనిపుట్టి యిట్లు చెప్పుకొనుచుండిరి.

శ్లో॥ యో హి రోదయ తే మర్త్యాం త్సర్వాం త్స్థావరజంగమాన్।
సో వై రోదతి దుఃఖార్తః కస్మా ద్వైవస్వతో యమః॥ ౧౧౩

తా. ఏ యముడు సమస్త మనుష్యులను కదలుచుండిన జీవులను కదలకుండునట్టి పర్వతాదులను దుఃఖింపజేయుచుండునో అట్టి సూర్యతనయుండగు యముడు విచారముగలవాడై యెందువలన యేడ్చుచుండెనో తెలియదు.

శ్లో॥ జనసంతాపకర్తా య స్సో చిరా ద్యాత్యశోభనం।
న హి దుష్కృతకర్తా హి నరః ప్రాప్నోతి శోభనం॥ ౧౧౪

తా. ఎవడు జనులను పీడించునో వాడు శీఘ్రముగానే చెడుగును పొందును. దుర్మార్గపు కార్యములను జేయువాడెప్పుడును మేలును పొందడు.

శ్లో॥ తతో నివారయామాస వాయు స్తేషాం వచ స్తదా।
లోకానాం సమవేతానాం మతం జ్ఞాత్వా స వేధసః ౧౧౫
నివార్య లోకా న్మార్తాండం శనై రుత్థాపయ న్మరుత్।
భుజాభ్యాం సాలపీనాభ్యాం లోకసూత్రి ఉదారధీః॥

తా. ఈ ప్రకారము సభలో మాట్లాడుచుండువారి మాటలను వాయువు నివారించి సమస్తమైన వారితోడను గూడియున్న బ్రహ్మదేవుని యభిప్రాయమును తెలిసికొని సమస్త ప్రాణులకు నాధారమైనవాడును గొప్ప స్వభావము గలవాడునగు వాయువు అక్కడ నుండువారిని తొలగించి యేపిచెట్లువలెనే దృఢమైన తన భుజములతో నాయమధర్మరాజును మెల్లగా లేవదీసి కూర్చుండబెట్టెను.

శ్లో॥ విహ్వలం తం పరాయత్త మాసనే సన్నివేశయత్॥
ఆసనస్థ మువాచేదం వ్యోమసూనూ రవే స్సుతం॥ ౧౧౬

తా. ఈ ప్రకారము వాయుదేవుడు స్వస్థచిత్తములేనివాడును స్వాతంత్ర్యము లేనివాడు యమధర్మరాజును ఆసనమందు గూర్చుండబెట్టి యిట్లుపలుకుచున్నాడు.

శ్లో॥ కేన త్వ మభిభూతోసి కేన స్థానా న్నివారితః।
కేనాయం మార్జితో దేవ పటో లేఖపట స్తవ॥ ౧౧౭

తా. ఓ యమధర్మరాజా! నీవు యెవనిచే తిరస్కరింపబడితివి? ఎవడు నీస్థానమునుండి నిన్ను వెడలగొట్టెను. పుణ్యపాపములను లిఖియించిన పత్రములను ఎవరిచే తుడిచివేయబడినవి.

శ్లో॥ బ్రూహి సర్వ మశేషేణ కుశకేతో స్త్వ మగ్రతః।
యః ప్రభు స్త్రాత సర్వేషాం స తే కర్తా మమాపి చ॥ ౧౧౮
అపమృత్యతి మార్తండే దుఃఖం హృదయసంస్థితం॥

తా. ఓ యమధర్మరాజా ! ఈ కుశకేతు మహారాజుముందు నీవు జరిగిన వృత్తాంతము నంతయును మిగులులేకుండునట్లుగా జెప్పుము. అనంతరము నీకు నాకు మరియు సమస్తమైన వారికిని ప్రభువగు బ్రహ్మదేవుండు నీమనస్సునందుండు దుఃఖమును పోగొట్టగలడు.

శ్లో॥ స ఏవ ముక్త శ్శ్వసనేన సత్యా మాదిత్యసూను ర్వచనం బభాషే
విలోక్య వక్త్రం కుశకేతుసూనో స్సగద్గదం చేద మహాతిదీనం॥ ౧౨౦

తా. ఈ ప్రకారము వాయువు పలుకగా సూర్యతనయుడగు యముడు కుశకేతు మహారాజు యొక్క తనయుని ముఖముజూచి మిక్కిలి దీనుడై తొట్రుపాటుతో నిట్లు యథార్థముగా పలుకుచున్నాడు.

ఇతి శ్రీస్కాందపురాణే వైశాఖమాహాత్మ్యే నారదాంబరీషసంవాదే కీర్తిమద్విజయవర్ణనం నామ ఏకాదశోధ్యాయః॥

---

## ద్వాదశోధ్యాయః

### యమ ఉవాచ

శ్లో॥ శృణు మే వచనం శంభో లోపితో హం పితామహ।
మరణా దధికం మన్యే మత్పదస్య చ ఖండనం॥

తా. యముడు చెప్పుచున్నాడు. ఓ వాయువా ! ఓబ్రహ్మ ! నేజెప్పునట్టి వాక్యమును వినుడు. నాయుద్యోగమునుండి తొలగింపబడితిని. కాబట్టి నాయుద్యోగము పోవుట మరణముకంటె నధికముగా దలచుచున్నాను.

శ్లో॥ నియోగీ న నియోగం హి కరోతి కమలాసన।
ప్రభో ర్విత్తం సమశ్నాతి స భవే త్కాష్ఠకీటకః॥ ౨

తా. అధికారమునందు నియమించబడినవాడు తన వ్యాపారమును జేయకుండినేని ఓబ్రహ్మ ! వాడు ప్రభువు యొక్క విత్తమును అక్రమముగా ననుభవించుటయేగాక కొయ్య పురుగు మొదలగు జన్మములెత్తును.

శ్లో॥ యో శ్నాతి లోభా ద్విత్తాని ప్రజ్ఞావాం శ్చ మహీయతే।
స తిర్యగ్యోనినరకౌ యాతి కల్పశతత్రయం॥ 3

తా. ఎవడు మిక్కిలి తెలివిగలిగి ధనమందు వాళచే తన యధికారమును జేయుక స్వామి ద్రవ్యము ననుభవించునో వాడు మూడు వందల కల్పములవరకు నరకమును మృగాది జన్మమును పొందుచున్నాడు.

శ్లో॥ నిస్పృహో నాచరే ద్య స్తు నియోగం పద్మసంభవ।
భుక్త్వా తు నరకా౯ ఘోరా౯ స పుమా న్వాయసోభవేత్॥ ౪

ఓ బ్రహ్మ! ఎవడు నియమింపబడి తుదకు వాళలేక తన వ్యాపారమునుజేయకుండునో. వాడు మిక్కిలి కష్టమైన నరకముల ననుభవించి తుదకు కాకి జన్మము గలవాడై యుండును.

శ్లో॥ ఆత్మకార్యపరో యః స్తు స్వామికార్యం విలుంపతి।
భవే ద్వేశ్మని పాపాత్మా ఆఖుః కల్పశతత్రియం॥ ౫

తా. ఎవడు తనకార్యము మాత్రమును జేసికొని యజమానుని కార్యమునకు భంగముకలిగించునో. అట్టి వాడు పాప స్వభావముగలవాడగుటచే మూడు వందల కల్పముల పర్యంతముయెలుకగా తన గృహమునందు పుట్టు చుండును.

శ్లో॥ నియోగీ యో తు భూత్వా వై తిష్ఠ న్నిత్యం స్వవేశ్మని।
శక్త స్తు కార్యకరణే మార్జారో జాయతే నరః॥ ౬

తా. ఎవడు అధికారమందు నియమింపబడినవాడై కార్యమును జేయుటయందు సమర్థుడై యుండియు జేయక నిత్యము తన గృహమునందే యుండునో. అట్టివాడు పిల్లిగా జనియించును.

శ్లో॥ సోహం దేవ తవా దేశా త్ప్రజా ధర్మేణ సాధయే।
పుణ్యేన పుణ్యకర్తారం పాపం పాపేన కర్మణా॥ ౭

తా. ఓ బ్రహ్మ! అట్టి నేను మీయాజ్ఞానుసారముగా పుణ్యమును విచారించి పుణ్యాత్ముని పాపమును విచారించి పాపాత్ముని పరిశీలించి ప్రజలను ధర్మమార్గానుసారముగా పాలించుచుంటిని.

శ్లో॥ సమ్య గ్విచార్య మునిభి ర్ధర్మశాస్త్రవిశారదైః ప్రభో।
కల్పాదౌ వర్తమానస్య యాతనాయతనం మమ॥ ౮

తా. ఓ స్వామీ! ధర్మశాస్త్రమును బాగుగా తెలిసిన మునీశ్వరులతోగూడ చక్కగా నాలోచించి ప్రళయముల నాద్యంతములయందు నున్నట్టి యాతనముల ననుభవింప జేయుచుందును.

శ్లో॥ కర్తుం నియోగ మేవం హి త్వదీయో నైవ శక్నుయాం।
రాజ్ఞా కీర్తిమతా భగ్నో నియోగ స్తవ నేక్షితః॥ ౯

తా. నీయాజ్ఞాను సారము ప్రవర్తింపదలచినట్టి నేను నీ వేర్పరచిన యధికారమును జేయుటకు సమర్థుఁడను గాను. నీవిచ్చిన యధికారము కీర్తిమంతుఁడను రాజుచే తీసివేయ బడినది. అది నీవు విచారింపకుంటివి.

శ్లో॥ రాజా సో ద్య జగన్నాథ పృథివీం సాగరాంబరాం।
వైశాఖధర్మసహితాం పాలయ న్వర్తతే క్వచిత్॥ ౧౦

తా, ఓ ప్రభువా! ఇప్పుడా రాజు చతుస్సముద్ర పర్యంతముండు నట్టి భూమి యందంతటను వైశాఖ మాసధర్మమును వ్యాపింపజేసి పరిపాలించుచుండెను.

శ్లో॥ విహాయ సర్వధర్మాం శ్చ విహాయ పితృపూజనం।
విహాయా గ్నిసపర్యాం తు తీర్థయాత్రాదిసత్క్రియాః॥ ౧౧
యోగసాంఖ్యా వుభౌ త్యక్త్వా త్యక్త్వా ప్రాణనిరోధనం।
త్యక్త్వా హోమం తు స్వాధ్యాయం కృత్వా పాపాని భూరిశః॥ ౧౨
ప్రయాంతి వైష్ణవం లోకం కృత్వా వైశాఖసత్క్రియాః।
మనుజాః పితృభి స్సార్థం తథైవ చ పితామహైః॥ ౧౩

తా. అది యేలాగుననగా సమస్త ధర్మములను పితృపూజ పెద్దలపూజ తీర్థయాత్ర మొదలగు సత్కార్యములు యోగము సాంఖ్యములనెడు రెండు ధర్మములు ప్రాణాయామము హోమము స్వాధ్యాయము మొదలగు ధర్మములను విడచియు ననేక పాపకార్యములను జేసియు వైశాఖ మాసధర్మ కార్యములను జేసి మనుష్యులు తండ్రులు తాతలతో గూడ విష్ణులోకమును పొందిరి,

శ్లో॥ తేషా మతీతపితరః పితౄణాం పితర స్తథా। తథా
మాతామహా యాంతి తేషాం వై జనకాదయః॥ ౧౪

తా. తాత తండ్రులు వారి తండ్రులు ఆ ప్రకారముగానే మాతామహులు వారి తండ్రులును వైకుంఠమును పొందిరి.

శ్లో॥ తేషా మపి చ నేతారో జనిత్రీణాం హి పూర్వజాః।
ఏత ద్దుఃఖం పున ర్దేవ మమ మ స్తకభేదనం॥ ౧౫

తా. వారి యజమానులు తల్లి సోదరులు మొదలగువారును పొందిరి. ఓస్వామీ! ఈ దుఃఖమును విచారింపగా నా శిరస్సును పగుల గొట్టినట్లుగానే యున్నది.

శ్లో॥ ప్రియాయాః పితరో యాంతి మార్జయిత్వా లిపిం మమ
పితౄణాం బీజజో యస్తు ధాత్యాః కుక్షౌ ధృత్రో విభో॥

తా. ఓస్వామీ? భార్యాసంబంధులగువారును పాపములచే లిఖించిన పత్రమును తుడిచి వైకుంఠమును పొందుచున్నారు. తండ్రుల బీజమువలన మపమాతలయందు జనియించిన వారైనను వారుజేసిన వైశాఖధర్మమువలన నుత్తమలోకమును పొందుచున్నారు.

శ్లో॥ య దేకేన కృతం కర్మ త దేకే నైవ భుజ్యతే।
తన్నిరస్య కృతం సర్వం జానం స్త్వేకః కులే తు యః॥ ౧౭
తారయే త్తా వుభౌ పక్షౌ మద్వింశో సర్వలం విభో॥

తా. పుణ్యమునుగాని పాపమునుగాని యెవడు చేసినవాడే యనుభవించును. అట్టిమార్గము నిరసింపబడెను. ఈవృత్తాంతము నంతయును నెతింగిన యెవడైనను కులమునందొకడు వైశాఖమాస ధర్మమును జేసిన ఉభయ వంశములందును బుట్టినయిరువదియారుతరములవారిని తరింపజేయుటకు సమర్థుడై యున్నాడు.

శ్లో॥ ప్రియాయా శ్చాపి వై తాత సర్వే వైకుంఠసంభవాః॥ ౧౮
తేపి సర్వే జగన్నాథ యాంతి విష్ణోః పరం పదం।
న మే ప్రయోజనం దేవ నియోగే నేదృశేన వై॥ ౧౯

తా. ఓతండ్రీ! ఓజగత్ప్రభువా! భార్యాసంబంధము గలవారందరుకూడ విష్ణులోకమును పొందుచున్నారు కాబట్టి యోస్వామీ! మీరిచ్చిన యీయుద్యోగముతో నాకుపనిలేదు.

శ్లో॥ వైశాఖధర్మనిరత స్సమాం త్యక్త్వా వ్రజే ద్ధరిం।
త్రిస్సప్తకుల ముద్దిశ్య త్యక్తపాపో త్రిశోభనః॥ ౨౦

తా. వైశాఖమాసధర్మముల యందాసక్తిగలవాడు పాపములన్నిటిని పోగొట్టుకొని మిక్కిలి మేలుగలవాడై నన్ను విడచి యిరువదియొక్కతరముల వారితోగూడ విష్ణులోకమును పొందుచున్నాడు.

శ్లో॥ స త్యక్త్వా మమ మార్గం హి ప్రయాతి హరిమందిరం।
న యజ్ఞై స్తాదృశై ర్దేవగతిం ప్రాప్నోతి మానవః॥ ౨౧

తా. వైశాఖమాస ధర్మమును జేసినవాడు నామార్గమును విడచి విష్ణులోకమును పొందుచున్నాడు. మనుష్యుడనేక యజ్ఞములను జేసినను వైకుంఠమును పొందింపజేయు నటువంటి దారిని మరియొకదానిని పొందనేరడు.

శ్లో॥ సర్వతీర్థై ర్న దానాద్యై ర్న తపోభి శ్చ న వ్రతైః।
అపి వా సకలై ర్ధర్మై ర్యుక్తో నాప్నోతి తాం గతిం॥ ౨౨

తా. సమస్త తీర్థములతోడను దానములతోడను తపస్సులతోడను వ్రతములతోడను మరియును సమస్తమైన ధర్మములతోడను కూడినవాడైనను వైశాఖమాసధర్మములతో సరియైన మార్గమును పొందనేరడు.

శ్లో॥ ప్రయాగపాతా ద్రణమధ్యపాతా ద్భృగో శ్చ పాతా న్మరణా
చ్చ కాశ్యాం। న తాం గతిం యాంతి జనా శ్చ సర్వే।
వైశాఖనిష్ఠేన చ యా ప్రపద్యతే॥ ౨౩

తా. మనుష్యులు ప్రయాగలో పడుటవలనను యుద్ధములో మృతినొందుటవలనను భృగుప్రస్రవణములో పడుటవలనను కాశీక్షేత్రములో మృతి నొందుటవలనను వైశాఖమాస ధర్మములవల పొందునట్టి సుగతిని పొందనేరడు.

శ్లో॥ ప్రాత స్స్నాత్వా దేవపూజాం చ కృత్వా శ్రుత్వా కథాం
మాసమహాత్మ్యసంజ్ఞాం। ధర్మాన్ కృత్వా చోచితా న్వైష్ణవాం
శ్చ స వై భవే ద్విష్ణులోకైకనాథః ౨౪

తా. ప్రాతఃకాలంబున స్నానముజేసి దేవతాపూజను జేసి వైశాఖమాహాత్మ్యమను కథను విని మరియు తనకు జేయతగిన విష్ణుసంబంధమగు ధర్మములను జేసినట్టివాడు విష్ణులోక సామ్రాజ్యమనుభవింప గలవాడగును.

శ్లో॥ అప్రమాణా మహాం మన్యే లోకం విష్ణో ర్జగత్పతేః।
యో న పూర్యేత కాలోత్థై స్సర్వతః కమలాసన॥ ౨౫

తా. మహాత్ములుగ యుండినవారైనను నాప్రేతస్థానమునుగూర్చి రాక వైశాఖమాహాత్మ్యముచే భగవంతుండగు విష్ణులోకమును పొందుచున్నారు గాన విష్ణులోకమును అప్రమాణమైనదానిగ తలచుచున్నాను.

శ్లో॥ మాధవానస ధేనేహ సమస్తేన పితామహ।
వికర్మస్థా ఽ వికర్మస్థా శ్శుచయో ఽ శుచయ స్తథా॥ ౨౬
కృత్వా వైశాఖధర్మాన్ లోకా యాంతి స్వరాజ్ఞయా।

తా. ఓస్వామీ! మంచి కర్మములను జేసినవారు గాని జేయనివారు గాని పరిశుద్ధులు గాని అపరిశుద్ధులు గాని యీవ్యర్థమున సమస్తజనులు రాజుయొక్క యాజ్ఞచే వైశాఖమాసధర్మములను జేసి విష్ణులోకమునకు వెళ్ళి యచ్చటనిండియున్నారు.

శ్లో॥ యే౽స్మాకం హి మహాశ్చత్రు ర్భవతాం చ విశేషతః॥ ౨౭
నిగ్రాహ్యో జగతాంనాథ భవతా సౌ మహీపతిః॥

తా. ఓజగత్ప్రభువా! మాకు నెవరు విరోధులుగానుండిరో అట్టివారు మీకైనను మిక్కిలి శత్రువులే కాబట్టి యీ రాజును ముఖ్యముగా శిక్షింపవలయును.

శ్లో॥ హిత్వా హి సకలా న్ధర్మాం స్త్యక్త్వా వైశాఖస్నానతః॥ ౨౮
అసంస్కృతజనా యాంతి వైకుంఠం హరిమందిరం॥

తా. ఉపనయనాది సంస్కారములు జేయబడనివారైనను సమస్త ధర్మములను విడచి యొక్కపర్యాయమైనను వైశాఖ స్నానముజేయుటవలన విష్ణులోకమగు వైకుంఠమును పొందుచున్నారు.

శ్లో॥ అస్మాభి స్తు కృతో పేక్షో విష్ణుపాదైకసంశ్రయం॥ ౨౯
సమస్తం నేష్యతే లోకం పార్థివో నాత్ర సంశయః॥

తా. ఆకీర్తిమంతుడను రాజు విష్ణుపాదధ్యానము నాశ్రయించిమనమూరకుండుటచే లోకమునంతయు వైకుంఠములకే పంపించుచున్నాడు. ఈవిషయమై సందేహము లేదు.

శ్లో॥ ఏష దండః పటో హ్యేష స్తవ పద్భ్యాం నివేశితః।
లోకపాలత్వ మతులం మార్జితం తేన భూభుజా।
కి మపత్యేన జాతేన మాతుః క్లేశకరేణ వై॥ 30

తా. ఓస్వామీ! ఇదిగో నాదండము. ఇదిగో పాపపుణ్యములను వ్రాయుపుస్తకము. ఇక నాకు వీనితోనేమి పనియున్నది. ఇదిగో నీపాదములయందుంచితిని. ఆకీర్తిమంతుండను రాజు నాయధికారమును తీసివేసినాడు. ఇట్టిసంతానము కలుగుట తల్లికి కష్టముకొఱకే గాని యేమిప్రయోజనమున్నది.

శ్లో॥ యో న తాపయతే శత్రుం జ్యేష్ఠమాసీవ భాస్కరః।
వృథా సుతా హి యువతి ర్జాతా వేద కుపుత్రిణీ॥ 3౧
న తస్య స్స్ఫురతే కీర్తి ర్మనస్యేవ శతహ్రదా।
యః పితు ర్నోద్ధరే త్పాపా ద్విద్యయా వా బలేన వా॥ 33

తా. ఎవడు జ్యేష్ఠమాసములో సూర్యుడు ప్రకాశించినట్లుగా శత్రువునుబాధింపడో వాడు వ్యర్థమైనవాడు. అనుపయోగుడైన తనయుని గనిన యువతి వ్యర్థమైన పుత్రుడు కలదియనియే తెలిసికొనవలయును. మేఘమునందుపుట్టిన మెఱుపు

యొక్క కాంతి స్థిరముగా నుండనట్లు అట్టియువతియొక్క కీర్తియు ప్రకాశింపనేరదు. విద్యవలనగాని బలమువలనగాని కుమారుడు తండ్రిదోషములను పోగొట్టువాడుకాడో అట్టివాడును వ్యర్థుడైనవాడనియే తెలిసికొనవలయును.

శ్లో॥ మాతు ర్జఠరజో రోగ స్స ప్రసూతో ధరాతలే।
ధర్మే చార్థే చ కామే చ యః ప్రతీపో భవే త్సుతః॥ 34
మాతృహో చ్యుచ్యతే సద్భి స్స పుత్రః పురుషాధమః॥

తా. కీర్తిలేనివాడు భూమిలో తల్లిగర్భమందుండిన రోగమే పురుషాకారముగా పుట్టినదని తలపవలయును. ఏకుమారుడు ధర్మము అర్థము కామము అనుపురుషార్థములను సాధింపక వ్యతిరేకముగా నుండునో ఆట్టిహీనుడు మాతృహత్యమొదలగు పాపములను జేసినవాడనియే పెద్దలు చెప్పుదురు.

శ్లో॥ తన్మాతా నృపపత్నీ చ లోకవిఖ్యాతసత్క్రియా॥ 35
ఏకైకవీరసూ ర్లోకే విరించేనా త్ర సంశయః।
యథా వై కీర్తిమా న్జాతో మల్లిపే ర్మార్జనాయ వై॥ 36

తా. ఆకీర్తిమంతుడు దుస్సాధ్యమైన నాయొక్క వ్రాతనుగూడ తుడిచివేయించెనుగాన ఓబ్రహ్మ! అతనియొక్క తల్లి యేలోకములో వీరమాతయనియు క్షత్రియునిభార్యయనియు లోకప్రసిద్ధికెక్కిన సత్కార్యములు కలదియనియు చెప్పవలయుగాని అట్టికీర్తికి సితరులర్హులుకారు.

శ్లో॥ నేదం వ్యవసితం దేవ కేనచి త్క్షత్రిజేన హి।
పురాణేషు జగన్నాథ న శ్రుతం పటమార్జనం॥ 37

తా. ఓస్వామీ! పూర్వమందేరాజునైననిట్టికార్యము జేయుటకు ప్రయత్నమైనను జేయబడలేదు. ఇప్పుడిట్టికార్యము సంభవించినది. ఓప్రభువా! లెక్కలనుతుడుపుపెట్టించుట యిదివరకెన్నడు నేపురాణములయందును వినియుండలేదు.

శ్లో॥ సోహం న జానామి జగత్పతీశ బుతే క్షితీశం హరితత్పరం తం।
ప్రచోదయంతం పటహం సుఘోషం విలోపనార్థం మమ వేశ్మమార్గం॥ 38

తా. జగత్సృష్టికర్తయగు ప్రభువగు నోబ్రహ్మ! హరియందాసక్తిగలవాడునుగా దుష్కర మొదలగు వాద్యములను మ్రోయించజేసి వైశాఖ మాసధర్మములను చాటింపు

చేయించిన కీర్తిమంతుడును రాజుగాక మరియొకరు నాలోకములకు జీవులను రానియ్యక నాలోకమార్గమును శూన్యమైన దానిగాజేసినవారు లేరని నేనూహించుచున్నాను.

ఇతి శ్రీస్కాందపురాణే వైశాఖమాహాత్మ్యే నారదాంబరీషసంవాదే యమదుఃఖనిరూపణం నామ ద్వాదశోధ్యాయః॥

---

## అథత్రయోదశోధ్యాయః

### బ్రహ్మోవాచ.

శ్లో॥ కిమాశ్చర్యం త్వయా దృష్టం కిమర్థం ఖిద్యతే భవాన్ ।
సద్గణేషు కృత స్తాప స్సతాపో మరణాంతికః॥ ౧

తా. బ్రహ్మచెప్పుచున్నాడు. ఓ యమధర్మరాజా! ఇదియేమి యాశ్చర్యము. నీవెందునిమిత్తము దుఃఖించెదవు సత్పురుషులకు నపకారముజేసినయెడల నది యామరణాంతముండును.

శ్లో॥ యస్యోచ్చారణమాత్రేణ ప్రాప్యతే పరమం పదం ।
న గచ్ఛంతి హరే ర్లోకం కథం భూపస్య శాసనాత్॥ ౨

తా. ఏభగవంతుని నామమును స్మరియించినమాత్రముననే యుత్తమమగు వైకుంఠమును పొందుదురో అట్టిభగవంతునకు ప్రియకరమగు వైశాఖధర్మములను జేయవలయునని రాజు యాజ్ఞాపించుటచే నాధర్మములనుజేసి విష్ణులోకమును పొందుట కేమియాశ్చర్యమున్నది.

శ్లో॥ ఏకోపి గోవిందకృత ప్రణామ శ్శతాశ్వమేధావభృథేన తుల్యః!
యజ్ఞస్య కర్తా పున రేతి జన్మ హరేః ప్రణామో న పునర్భవాయ॥ 3

తా. విష్ణుమూర్తికి నొకనమస్కారము జేసినను నూరుయజ్ఞములనుజేసి యవభృథస్నానములజేసిన ఫలము నిచ్చును. యజ్ఞమును జేసినవాడు తిరిగి జనియించును. విష్ణుమూర్తికి జేయబడిన నమస్కారమయితే తిరిగి జన్మకలుగనియ్యదు.

శ్లో॥ కురుక్షేత్రేణ కిం తస్య సరస్వత్యా చ కిం తథా ।
జిహ్వాగ్రే వర్తతే యస్య హరి రిత్యక్షరద్వయం॥ ౪

తా. ఎవనియొక్క నాలుకచే హరినామస్మరణ జేయబడుచుండునో అట్టివానికి కురుక్షేత్రము సరస్వతీతీర్థము మొదలగు స్థలములకు వెళ్లుటచే నేమిప్రయోజనమున్నది

శ్లో॥ బ్రాహ్మణ శ్శ్వపచీం భుఞ్జ విశేషేణ రజస్వలాం।
స యాతి మరణే విష్ణుం స్మర న్నాప్నోతి తత్పదం॥ ౫

తా. బ్రాహ్మణుడు చండాలస్త్రీతోగాని రజస్వలాస్త్రీతోగాని సంభోగించిన వాడైనను మరణకాలమునందు విష్ణుస్మరణను జేసినయెడల వైకుంఠమును పొందుచున్నాడు.

శ్లో॥ అభక్ష్యభక్షణా జ్జాతం విహాయా ఘస్య సంచయం।
ప్రియాతి విష్ణుసాయుజ్యం యతో విష్ణుప్రియా స్మృతిః॥ ౬

తా. విష్ణుధ్యానము విష్ణుమూర్తికి ప్రియమైన దగుటచే తినరాని పదార్థములను తినుటచే గలిగిన దోషములనైనను పోగొట్టుకొని విష్ణుసమీపమున నుండగలడు.

శ్లో॥ ఏవం విష్ణుప్రియోమాసో వైశాఖో నామ వై యమ।
యద్ధర్మం శ్రవణా దేవ ముచ్యతే సర్వకిల్బిషైః ౭

తా. ఓయమధర్మరాజా! వైశాఖమాస ధర్మములను వినుటవలననే సమస్త పాపములు నశించుచున్నవి కాబట్టి వైశాఖమాసము విష్ణువునకు ప్రీతియయినది.

శ్లో॥ యాతీతి కిము వక్తవ్యం తస్యా నుష్ఠానతత్పరః।
యస్మిం త్సంగీయతే మోహి ప్రీయతే పురుషోత్తమః॥ ౮

తా. ఏవైశాఖ ధర్మములను జేయుటయందు దాసక్తిగలిగిన యెడల విష్ణుమూర్తిసంతోషించునో అట్టివైశాఖమాస ధర్మములను జేసినయెడల విష్ణులోకమును పొందుననిచెప్పవలసిన దేమియున్నది.

శ్లో॥ కథం న యాతి చ గతిం తస్యా నుష్ఠానతత్పరః।
అస్మాకం జగతాం నాథో జనితా పురుషోత్తమః॥ ౯

తా. విష్ణుమూర్తిమనల నందరిని పుట్టించి జగత్ప్రభువై యుండెను గాన యాతనిని సేవించినవాడు యెట్లుయాతని లోకమును పొందడు? అనగా పొందును.

శ్లో॥ తస్యేష్టాన్ మాధవే మాసి ధర్మా నేతాన్ కరోత్యయం।
తస్య విష్ణుః ప్రసన్నాత్మా సహాయే సర్వదా స్థితః ౧౦

తా. ఎవడు విష్ణుప్రీతికరమైన ధర్మములను వైశాఖమాసములో జేయుచుండునో అట్టివానికి విష్ణుమూర్తి యనుగ్రహించి యెల్లప్పుడు సహాయుడుగా నుండును.

శ్లో॥ న తస్య భూపతే స్సారే ప్రతిభా మమ శక్తితో॥
న వాసుదేవభక్తానా మశుభం విద్యతే క్వచిత్ ॥

తా. ఓయముడా! ఆరాజును శిక్షించుటయందు సమర్థత [illegible] భక్తిగలవారికెవ్వడెను పరాజయము కలుగనేరదు.

శ్లో॥ జన్మమృత్యుజరావ్యాధిభయం నాప్యుపజాయతే

తా. మరియు పుట్టుక మరణము ముదిమిరోగము మొదలగు[illegible] న్నడును కలుగదు.

శ్లో॥ నియోగీ స్వామికార్యేషు యావచ్ఛక్తి స్సమీహతే॥
తావతా సత్కృతార్థ స్స్యాన్నరకా నైవ గచ్ఛ

తా. యజమాని నియోక్త కార్యములయందు నియమింపబడిన వా[illegible] మైనంతవరకు జేయుటకు ప్రయత్నింపవలయును. అంతమాత్రమున [illegible] నవాడగును. నరకములను పొందడు.

శ్లో॥ కార్యే శక్తివినిష్క్రాంతే స్వామినే చ నివేదయేత్ ॥
అనృణ స్తావతా భృత్యో నియోగీ సుఖ మశ్నుతే।
తస్మాన్నివేదితార్థస్య న ఋణం న చ పాతకం॥

తా. సాధ్యమైనంతవరకు ప్రయత్నముజేసి తుదకు కార్యమును జే సమర్థత లేకుండినప్పుడు తనయజమానునితో జెప్పిన యెడల నియోగి ఋణవిముక్తుడై సుఖమును పొందును. కాబట్టి కార్యమును జేయుటకు శక్తి లే సంభవించినప్పుడు యజమానునితో జెప్పిన వానికి ఋణము లేదు పాపము

శ్లో॥ యత్నే కృతే స్వకర్తవ్యే నాపరాధో స్తి దేహినః ।
తస్మాదవశ్యకార్యేస్మిన్నావశోచితు మర్హసి॥

తా. ప్రతివానికిని తానుజేయతగిన కార్యమునందు ప్రయత్నము జే లేకుండుటచే నుపేక్షజేసిన యెడల దోషములేదు. కాబట్టి యోధర్మరాజ ముగాని కార్యము విషయమై విచారపడ గూడదు.

శ్లో॥ ఇతుక్తో బ్రహ్మణా సాక్షః పున రత్యాతఖిన్నధీః ।
ఉవాచ దీనయా వాచా గళద్బాష్పాకులేక్షణః॥

తా. ఈప్రకారము బ్రహ్మదేవుడు పలుకగా నాయమధర్మరాజు [illegible] విచారముగలవాడై కన్నులనుండి బాష్పములను విడచుచు దీనస్వరమున పలుకుచున్నాడు.

శ్లో॥ ప్రాప్తం తాత మయా సర్వం త్వదంఘ్రిభజనేన హి।
నాహం యాస్యే పునః కర్తుం నియోగం పద్మసంభవ॥ ౧౭

తా. ఓతాతా! నీపాదసేవ జేయుటచే నేను సమస్తమును పొందితిని ఓపద్మసంభవా! తిరిగి ఆయుద్యోగమును జేయుటకు వెళ్లను.

శ్లో॥ ప్రశాసతి మహావీర్యే భూపేస్మిన్ భూమిమండలే।
చాలయిత్వా స్వధర్మాంశ్చ త మేకం భూపతిం విభో॥ ౧౮
కృతకృత్యో స్మి తనయో గయాయాం పిండదో యథా।
కృపాళో తదిదం కార్యం సాధయస్వ మమా వ్యయం॥ ౧౯

తా. ఓస్వామీ! భూలోకములో ఆకీర్తిమంతు డీరీతి మహాపరాక్రమముతో రాజ్యము సేయుచుండగా యధికారమును జేయునొల్లను. ఇక నేమియనగా ఆరాజును వైశాఖమాస ధర్మముల వలన భ్రష్టునిగాజేసిన యెడల గయలోపిండమును వేసిన తనయుడువలెనే కార్యమును నెరవేర్చిన వాడనగుదును. ఓ దయాస్వభావముగలవాడా! నాయుద్యోగమునకు భంగముకాని యీకార్యమును నీవు చేయవలయును.

శ్లో॥ విజ్వర స్తు తతో భూయ శ్శాసనం తే కరోమ్యహం।
శ్రుత్వా బ్రహ్మ యమే నోక్తం పున శ్చింతా పరాయణః॥ ౨౦
త మువాచ పున ర్బ్రహ్మ సాంత్వయన్ బహుధా యమం॥

తా. నేచెప్పినట్లుచేసితివేని నేను శత్రుభయములేనివాడనై నీయాజ్ఞననుసరించి నాయుద్యోగమును జేయుదును. అనియమధర్మరాజు చెప్పినమాటలనువిని బ్రహ్మదేవుడు కొంతవరకు విచారించి అనేక విధములుగా నాయమధర్మరాజును బ్రతిమాలుచు నిట్లు చెప్పెను.

శ్లో॥ బ్రహ్మోవాచ॥ న నిగ్రాహ్యా త్వయా రాజా విష్ణుధర్మప
రాయణః॥ ౨౧॥ యది చాలయసే కోపా ద్గచ్ఛామో హ్యంతికం
హరేః। నివేద్య సకలం తస్మై కుర్మః పశ్చా త్తదీరితం॥ ౨౨

తా. బ్రహ్మచెప్పుచున్నాడు. ఆరాజువిష్ణుభక్తియందు శ్రద్ధగలవాడగుటచే నీచేశిక్షింపబడడు. లేక నీవు ఆయనమీద కోపముండి ధర్మభ్రష్టునిగా జేయవలయునని దలచితివేని మనము విష్ణులోకమునకువెళ్లి యీజరిగిన వృత్తాంతమునంతయు నాభగవంతునితో జెప్పి యనంతరమాయన యెట్లుచెప్పునో యాతీరున జేయుదము.

శ్లో॥ స ఏవ కర్తా లోకస్య ధర్మస్య పరిపాలకః।
స చ దండధరో స్మాకం శాస్తా కర్తా నియామకః॥ ౨౩

తా. ఆవిష్ణుమూర్తియే లోకమును సృజియించువాడు. ఆయనే ధర్మమును కాపాడువాడు ఆయనేదండమును ధరియించి మనలను శిక్షకుడుగాను కర్తగాను నియామించువాడుగా నుండెను.

శ్లో॥ న తదుక్తేస్తి ప్రత్యుక్తి రస్మాకం విహితా నృప।
న రాజోక్తే స్తు ప్రత్యుక్తి ర్దృశ్యతే క్వాపి భూతలే॥

తా. ఓయమధర్మరాజా! ఆభగవంతుడు చెప్పినమాటకు మారుమాటచెప్పనున మనసమర్థులముకాము, ఆయన భర్తయైనందున ఆరాజుయొక్క మాటకైనను తిరిగి సమాధానము చెప్పువారి నీభూమియందు దెచ్చటను గానము.

శ్లో॥ ఇత్యాశ్వాస్య యమం తేన సాకం క్షీరాంబుధిం యయౌ।
బ్రహ్మా తుష్టావ చిన్మాత్రం నిర్గుణం పరమేశ్వరం॥ ౨౫
సాంఖ్యయోగై రద్వితీయ మేకం తం పురుషోత్తమం।
ఆవిరాసీ త్తదా విష్ణుః బ్రహ్మణా సంస్తుతో హరిః॥ ౨౬

తా. ఈప్రకారము యమునితో మంచిమాటలు చెప్పి బ్రహ్మదేవుడా యమునితోగూడ పాలసముద్రమునకువెళ్ళియచ్చట ప్రకాశస్వరూపుడునుగుణరహితుడునుసాంఖ్యులుయోగులతోటిగూడికొని యున్నవాడును తనతోసమానముగు మరియొకడు లేనివాడును సమస్తమైన వారిలోనుత్తమమైనవాడు నొక్కడునగు నాపరమేశ్వరుని స్తోత్రము జేయగా నావిష్ణుమూర్తి యాబ్రహ్మదేవునికి ప్రత్యక్షమాయెను.

శ్లో॥ ప్రణామం చక్రతు స్తస్మై యమో బ్రహ్మ చ సత్వరం।
తా వువాచ మహావిష్ణు ర్మేఘగంభీరయా గిరా॥ ౨౭

తా. అప్పుడు బ్రహ్మదేవుండును యమధర్మరాజును శీఘ్రముగా నావిష్ణుమూర్తికి నమస్కారము జేయగా శ్రీమహావిష్ణువు గర్జితముతో సమానమైన ధ్వనికలుగు నట్లుగా వారిరువురితోడనిట్లుపలుకుచున్నాడు.

శ్లో॥ కస్మాద్యువా మిహాయాతౌ కిం దుఃఖం దనుజై రభూత్।
మ్లానం యమముఖం కస్మాత్కేన వా నతకంధరః॥ ౨౮

తా. మీరు యిచటికేమికారణమున వచ్చితిరి? రాక్షసులవలన కష్టము సంభవించినదాయేమి? యమధర్మరాజుయొక్క ముఖముకూడ వాడియున్నది యేమి కారణము? ఎందవలన ముఖము వంచుకొనియుండెను.

శ్లో॥ ఏత ద్వదస్వ మే బ్రహ్మ న్నిత్యుక్తః ప్రాహ కంజజః॥
త్వద్దానవర్యే భూపాలే భూమిం శాసతి వై నరాః
వైశాఖధర్మనిరతా యాంతి తే పద మవ్యయం।
తతో యమపురీ శూన్యా తేన చాతీవ దుఃఖితః॥ ౩౦

తా. ఓబ్రహ్మా! ఈవృత్తాంతము నంతయు జెప్పుమని విష్ణుమూర్తియడుగగా బ్రహ్మ చెప్పుచున్నాడు. ఓస్వామీ! నీవరబలముచే నధికమైనవాడై కీర్తిమంతుడనురాజుభూమినిపరిపాలన జేయుచుండగా జనులందరు వైశాఖధర్మములను జేసి శాశ్వతమైన నీస్థానమును జేరుటవలన యమపట్టణము శూన్యముగానున్నది. అందువలన నితడుమిక్కిలి దుఃఖించుచున్నాడు.

శ్లో॥ తేన యుద్ధం చకారా సౌ హంతుం దండ మథాదదే।
త్వచ్చక్రేణ పరాభూతో యయా వద్య మమాంతికం॥ ౩౧

తా. ఇతడారాజుతో యుద్ధముజేసి యాతనిని సంహరించుటకు దండమును గ్రహింపగా నప్పుడు నీచేబంపబడిన చక్రముచే నోడింపబడి యనంతరము నాసమీపమునకు వచ్చెను.

శ్లో॥ న చ శక్తా వయం దండం త్వద్భక్తానాం మహాత్మనాం।
తస్మా త్త్వా మేవ శరణం వయం ప్రాప్తా మహావిభో॥ ౩౨

తా. ఓస్వామీ ! మహానుభావులగు నీభక్తులను దండించుటకు మేముసమర్థులముకాము. కాబట్టి నిన్నే మేము శరణను పొందితిమి.

శ్లో॥ తస్మా ద్భూపం దండయిత్వా పాలయైనం యమం స్వకం।
ఇత్యుక్తః ప్రహసన్ ప్రాహ బ్రహ్మాణం యమ మేవచ॥ ౩౩

తా. ఆ కారణమువలన ఆరాజును దండించి నీకు భృత్యుడైన యముని రక్షింపుమని బ్రహ్మ పలుకగా విని విష్ణుమూర్తి చిరునవ్వు నవ్వి బ్రహ్మతోడను యమునితోడనిట్లు పలుకుచున్నాడు.

శ్లో॥ లక్ష్మీం వాపి పరిత్యక్ష్యే ప్రాణాన్ దేహ మథాపివా।
శ్రీవత్సం కౌస్తుభం మాలాం వైజయంతీ మథా పివా॥
శ్వేతద్వీపం చ వైకుంఠం క్షీరసాగర మేవచ।
శేషం చ గరుడం చైవ న భక్తం త్యక్తు ముత్సహే॥ ౩౪

తా. లక్ష్మీదేవి ప్రాణములు దేహము శ్రీవత్సము కౌస్తుభము వైజయంతియను మాలిక శ్వేతద్వీపము వైకుంఠము పాలసముద్రము ఆదిశేషువు గరుత్మంతుడు ఈ మొదలగు వానిలో దేనినైనను విడిచి పెడుదునుగాని భక్తుని విడుమటను మాత్రము నేనంగీకరింపను.

శ్లో॥ విసృజ్య సకలాన్ భోగాన్ మదర్థే త్యక్తజీవితాన్ ।
మదాత్మకాన్మహాభాగాన్ కథం తాం స్త్యక్తు ముత్సహే॥ ౩౬

తా. సమస్త సుఖములను విడిచి నా నిమిత్తమై ప్రాణములనైనను విడుచుటయందాసక్తిగలవారును నా స్వరూపులును మహానుభావులునగు నా భక్తులనెట్లు విడువగలను.

శ్లో॥ తస్మాత్త్వద్దుఃఖశమనే హ్యుపాయం కల్పయామ్యహం।
తస్య చాయు ర్మయా దత్త మయుతం భూపతే ర్భువి॥ ౩౭

తా. ఆ కారణము వలన నీదుఃఖము పోవుటకు మరియొక యుపాయమును నాలోచింతును. ఆ రాజునకు పదివేలు సంవత్సరములు భూలోకములో నుండునట్లు ఆయుర్దాయము నే నిచ్చితిని.

శ్లో॥ గతా న్యష్టౌ సహస్రాణి తతేదానీం నరాంతక ।
ఆయుశ్శేషే తేన నీతే మత్సాయుజ్యం గతేపి చ॥ ౩౮
భవిష్యతి తతో రాజా వేనోనామ దురాత్మవాన్ ।
స లుంపతి మహాధర్మాం త్సర్వా నేతాం చ్ఛ్రుతీరితాన్॥ ౩౯

తా. ఓ యమధర్మరాజా ఆ వెయ్యి సంవత్సరములలో నెనిమిదివేల సంవత్సరములు గడచినవి- మిగిలిన ఆయుర్దాయముకూడ గడచిన పిమ్మట ఆరాజు నా యొద్దకు వచ్చును. అనంతరమున వేనుడను రాజు పుట్టి దుష్టప్రవర్తనగలవాడై వేదములయందును ప్రసిద్ధికెక్కియుండిన యీగొప్ప ధర్మములను నశింపజేయును.

శ్లో॥ తదా వైశాఖధర్మా శ్చ విచ్ఛిన్నా స్స్యు ర్న సంశయః।
స్వకృతేనైవ పాపేన వేనో దగ్ధో భవిష్యతి॥ ౪౦

తా. అప్పుడు వైశాఖ ధర్మములు కూడ నశించును, సందేహములేదు. ఆ వేనుడనురాజు తాను జేసికొనిన పాపములచే నశించును.

శ్లో॥ పశ్చా దహం పృథు ర్భూత్వా పున ర్ధర్మాన్ ప్రవర్తయే।
తదా జనేషు ప్రఖ్యాతా న్వైశాఖోక్తా న్కరో మ్యహం॥ ౪౧

తా. అనంతరమున నేను పృధుడను రాజునై తిరిగి ధర్మములను ప్రవర్తింప జేయుదును. అప్పుడు నశింపగా మిగిలినవియు జనులచే ప్రసిద్ధికెక్కియున్న వైశాఖ ధర్మములను నేను జేసెదను.

శ్లో॥ మద్భక్తో మద్గతప్రాణో య స్తు విన్యస్తసంగ్రహః।
ఏక స్సహస్రే భవితా తస్య ప్రఖ్యాతయేదిమాః॥ ౪౨

తా. నాయందు భక్తిగలవాడును నాయందునే ప్రాణములనుంచినవాడును సమస్త వైభవమును పరిత్యజించిన వాడును యెవడైనను వెయ్యింటిలో నొక్కడుండె నేని వానిచే ఆ మిగిలిన ధర్మములు జేయబడుచుండును.

శ్లో॥ కశ్చి దేవ హి జానాతు ధర్మా నేతాన్ క్షితౌ మమ।
తత స్తే భవితా కార్యం మా విషీద నరాంతక॥ ౪౩

తా. ఓ యమధర్మరాజా! అప్పుడు భూలోకములో నా సంబంధమగు ధర్మములను ఒకానొకడే యెరుంగుగాని అందరికిని తెలియదు. కాబట్టి నీ కార్యమప్పుడు సానుకూలమగును దుఃఖింపవలదు.

శ్లో॥ దాపయిష్యామి తే భాగం మాసే స్మిన్ మాధవే పిచ।
నరై స్సర్వై శ్చ వైశాఖధర్మనిష్ఠై ర్మహాత్మభిః॥ ౪౪

తా. ఈ వైశాఖ మాసములో వైశాఖ ధర్మములనుజేయు సమస్త మహానుభావులచేత నీకు కొంత భాగము నిప్పించెదను.

శ్లో॥ భూపేనా పిచ కాలస్య ఖేదం శమయితేన చ।
వీర్యశుల్కం తు తే భాగం శత్రో ర్భుక్ష్వ బలాధికాత్॥ ౪౫

తా. పరాక్రమాతిశయముచే తీసికొనబడిన నీభాగమును తిరిగి నీ దుఃఖమును శాంతింపజేసి యారాజుచే నీకిప్పించెదను. బలాధికుడైన శత్రువనుభవించుట సిద్ధము.

శ్లో॥ గృహ్ణన్ గృహ్ణం త్స్వకం భాగం న భాగీ దుఃఖ మర్హతి॥

తా. తమయొక్క భాగమునమభవించెడు వారికి విచారముండుటలేదుగదా. కాబట్టి నీభాగమును నీవుపొంది విచారమును మానుము.

శ్లో॥ త్వ ముద్దిశ్య న కుర్వంతి ప్రత్యహం యే నరా భువి॥ ౪౬
స్నానం చార్ఘ్యం సోదకుంభం దధ్యన్నం చాంతిమే దినే।
వైశాఖే సకలం కర్మ తేషాం చ విఫలం భవేత్॥ ౪౭

తా. వైశాఖమాసములో ప్రతిదినమందు స్నానము అర్ఘ్యము జలసహితమైన కలశము చివరదినమందు పెరుగుతో గూడిన యన్నము నేజనులు నీకు నివ్వకుందురో వారిచే వైశాఖమాసములో జేయబడిన కర్మములన్నియు నష్ఫలములేయగును.

శ్లో॥ తస్మాత్క్రోధం త్యజ నృపే భాగదే మత్పరాయణే।
యే కే చాపి న కుర్వంతి లోకే తే భాగదా నరాః॥ ౪౮
వైశాఖోక్తే మహాధర్మే తేషాం విఘ్నం సమాకురు॥

తా. ఆకారణము వలన నాకుభక్తుడును నీకు భాగమునిచ్చువాడునగు రాజుయందుకోపమును విడువుము. ఎవరైనను కొందరు లోకములో నీకు భాగము నివ్వకుందురేని వారుచేయుచుండెడి వైశాఖధర్మములకు విఘ్నమునుకలిగింపుము.

శ్లో॥ మామేవ యే యజంతీహ త్వాం హిత్వా ధర్మపాలకం॥ ౪౯
మదాజ్ఞయా మహాభాగ తదా దండం చ త్వం కురు॥

తా. న్యాయాన్యాయములను పరిశీలించునట్టి నిన్నువిడచి నన్నుమాత్రమే యెవరుపూజింతురో ఓయమధర్మరాజా! అప్పుడు నాయాజ్ఞానుసారముగా వారిని శిక్షింపుము.

శ్లో॥ నృపాద్భాగం దాపయితుం సునందం ప్రేషయామి చ॥ ౫౦
మచ్ఛాసనాత్స వై గత్వా భాగం తే దాపయిష్యతి॥

తా. రాజు నీకు భాగము నిచ్చుకొఱకు సునందుని పంపెదను. ఆతడువెళ్లి నా యాజ్ఞానుసారముగా నీకు భాగము నిప్పించగలడు.

శ్లో॥ ఇత్యుక్త్వైవం యమే స్వస్య సన్నిధౌ గరుడాసనః॥ ౫౧
సునందం ప్రేషయామాస నృపం బోధయితుం విభుః॥
సోపి గత్వా బోధయిత్వా పార్శ్వం చ పునరాగమత్॥ ౫౨

తా. ఈప్రకారము విష్ణుమూర్తిచెప్పి యముడు తనవద్దనుండగానే యారాజుతో నీవృత్తాంతము నంతయు జెప్పి యమునకు భాగమిచ్చునట్లు జేయుటకు సునందుని పంపగా నతఁడు వెళ్లి యాప్రకారమే చెప్పి తిరిగి విష్ణుసన్నిధానమునకు వచ్చెను.

శ్లో॥ ఇత్యాశ్వాస్య యమం విష్ణుస్తత్రైవాంతరధీయత।
యమం స్వయం శాసయిత్వా త మనుజ్ఞాప్య వై విధిః॥ ౫౩
అతివిస్మయమాపన్నో యయౌ ధామ సహానుగైః॥
యమోపి స్వపురీం ప్రాయాత్కించిత్సంహృష్టమానసః॥ ౫౪

తా. ఈప్రకారము విష్ణుమూర్తి యముని సమాధానపరచి యచ్చటనే యంతర్ధానమాయెను. అనంతరమందు బ్రహ్మదేవుండాశ్చర్యము కలవాడై యమునకు బోధింప దగిన విషయములను బోధించి యాతనితో జెప్పి తన భృత్యులతో గూడ సత్యలోకమునకు వెళ్లెను. యముడును కొంచెము సంతోషముగలవాడై తనలోకమును గూర్చి వెళ్లెను.

శ్లో॥ పశ్చా ద్విష్ణో ర్నిదేశేన సునందపరిబోధితాః।
భాగదా స్సకలా లోకా యే వైశాఖపరాయణాః॥ ౫౫

తా. అనంతరమందు విష్ణుమూర్తి యాజ్ఞానుసారముగా సునందునిచే బోధింపబడి వైశాఖమాస ధర్మముల యందాసక్తిగల వారందరును యమునికి భాగమిచ్చుచుండిరి.

శ్లో॥ ధర్మరాజం పురస్కృత్య యే న కుర్వంతి మానవాః।
తేషాం హి స్వయ మాదత్తే పుణ్యం వైశాఖసంభవం॥ ౫౬

తా. ఏమనుష్యులు ధర్మమును జేయునప్పుడు యమధర్మరాజును గురించి జేయక నితర ధర్మములను జేయుచుందురో అట్టివారి వైశాఖసంబంధమగు పుణ్యమంతయు యముడు తానేతీసికొనును.

శ్లో॥ కుర్యాచ్చ ప్రత్యహం స్నానం దద్యా దర్ఘ్యం యమాయ వై।
వైశాఖే సకలం పుణ్య మన్యథా విఫలం భవేత్॥ ౫౭

తా. వైశాఖ మాసములో ప్రతిదినమందును స్నానముజేసి యమునకుగూడ నర్ఘ్యమియ్యవలయును. అట్లుజేయనిపక్షమున జేసినపుణ్యమంతయు వ్యర్థమగును.

శ్లో॥ సోదకుంభం చ దధ్యన్నం పౌర్ణమాస్యాం చ మాధవే।
ధర్మరాజం సముద్దిశ్య దాతవ్యం ప్రథమం జనైః॥

తా. వైశాఖమాసములో పూర్ణిమయందు ముందుగాజలసహితమైన కలశమును పెరుగు కలిసిన యన్నమును యమధర్మరాజు నుద్దేశించి యియ్యవలయును.

శ్లో॥ పశ్చా త్పితౄం త్సముద్దిశ్య గురు ముద్దిశ్య వై నరః।
మధుసూదన ముద్దిశ్య పశ్చా దేవం జనార్దనం॥ ౫౯
శీతలోదకదధ్యన్నం తాంబూలం చ సదక్షిణం।
సఫలంకాంస్యపాత్రస్థం బ్రాహ్మణాయ నివేదయేత్॥ ౬౦

తా. అనంతరమున పితృదేవతలను అటుపిమ్మట గురువును పూజింపవలయును. అనంతరమున మధురాక్షసుని సంహారించిన విష్ణుమూర్తి నుద్దేశించి చల్లని యుదక

ముమ పెరుగు కలిసిన యన్నమును తాంబూలమును దక్షిణసహితమైన ఫలములను కంచుపాత్రియందుంచి బ్రాహ్మణునకు నియ్యవలయును.

శ్లో॥ దద్యాచ్చ ప్రతిమాం దివ్యాం మధుసూదనదేవతాం।
మాసధర్మప్రవక్త్రే చ దద్యాద్విప్రాయ సీదతే॥ ౬౧

తా. బాగుగా ప్రకాశించునదియు విష్ణుమూర్తి విగ్రహముగల ప్రతిమను వైశాఖ మాసపురాణము జెప్పునట్టి బ్రాహ్మణునకిచ్చిన యెడల అభగవంతుఁడు యను గ్రహము కలవాడగును.

శ్లో॥ తమేన ధర్మవక్తారం పూజయేద్విభవైస్స్వకైః।
ఇత్యాదిష్ట స్సునందేన తథా రాజా చకార హ॥ ౬౨

తా. అట్టి వైశాఖ ధర్మములను జెప్పువారిని తనకుండు వైశ్వర్యముల కొలదియును పూజించవలయును. ఇట్లు సునందునిచే యాజ్ఞాపింపబడిన రీతిగా ఆకీర్తిమంతుండను రాజు చేయుచుండెను.

శ్లో॥ స నీత్వా చాయుష శ్శేషం భుక్త్వా భోగాన్యథేప్సితాన్।
పుత్రపౌత్రాదిభి ర్యుక్తో జగామ హరిమందిరం॥ ౬౩

తా. ఆకీర్తిమంతుడిట్లు ధర్మములను చేయుచు న్యాయముగా రాజ్యమును పాలించి పుత్త్రులు పౌత్రులు మొదలగు వారితో గూడ తమకిష్టమైన సౌఖ్యముల నన్నింటి ననుభవించి మిగిలిన యాయుర్దాయమును కూడ వెళ్లబుచ్చి యనంతరమున సకుటుంబముగా వైకుంఠమునకు వెళ్ళెను.

శ్లో॥ వైకుంఠస్థే నృపే తస్మిన్వేనో రాజాధమో భవత్।
సర్వే ధర్మాశ్చ వైశాఖధర్మా అపి విశేషతః॥ ౬౪
దురాత్మనా చ తేనైవ లుప్తా ఏతే బభూవిరే।
న ప్రఖ్యాతా పునర్భూమా భూరిశో మోక్షహేతవః॥ ౬౫

తా. కీర్తిమంతుడు వైకుంఠమునకు వెళ్ళిన పిమ్మట వేనుడను రాజాధముడు రాజ్యముజేయుచు సమస్త ధర్మములను వానిలో ముఖ్యముగా వైశాఖ ధర్మములను దురాగ్రహపు స్వభావముకలవాడై నశింపజేయుగా నదిమొదలు భూమిలో తరుచుగా మోక్షమునకు కారణమైన ధర్మమే లేకుండెను.

శ్లో॥ యః కశ్చిన్నైవ జానాతి వైశాఖోక్తాన్నిమాన్శుభాన్।
బహుజన్మార్జితే పుణ్యే పరిపక్వే ఉపాగతే॥ ౬౬
వైశాఖోక్తేషు ధర్మేషు మతి రాత్యంతికీ భవేత్॥

తా. ఒకానొకడైనను శుభములనొసగునట్టి వైశాఖమాస ధర్మములను ఆకాలంబున నెఱుంగకుండెను. కాబట్టి యనేక జన్మముల యందుజేయబడిన పుణ్యము పరిపక్వమైనగాని వైశాఖమాసధర్మములయందు శ్రద్ధగలవాడు కానేరడు.

మైథిల ఉవాచ॥

శ్లో॥ పూర్వమన్వంతరస్థో హి వేనోరాజా దురాత్మవాన్॥ ౬౭
అయం వైవస్వతస్థో హి రాజా చేక్ష్వాకునందనః।
ఇతి శ్రుతం మయా పూర్వ మిదానీం చోచ్యతే త్వయా॥ ౬౮
అథ వైకుంఠగః పశ్చా ద్వేనో రాజా భవిష్యతి।
ఇత్యేవం సంశయం ఛింధి శ్రుత దేవమహామతే॥ ౬౯

తా. గొప్పబుద్ధిగల యోశ్రుతదేవుడా! పూర్వమన్వంతరమందైన వేనుడు దురాత్ముడనియును ఈవేనుడైతే ఇక్ష్వాకువంశంబున బుట్టినవాడు వైవస్వత మన్వంతరమునయుండిన వాడనియును పూర్వము నేను వింటిని ఇప్పుడు మీరుకీర్తిమంతుండను రాజు వైకుంఠమునకేగినపిమ్మట వేను రాజు కాగలడని చెప్పితిరి ఇచ్చటనాకు సందేహముకలిగినది కాబట్టి అదియేలాగునో విమర్శించి చెప్పుమని శ్రుతదేవు నడిగెను.

శ్రుతదేవ ఉవాచ శ్లో॥ పురాణేషు చ వైషమ్యం యుగకల్పవ్యవస్థయా। న చాప్రామాణ్యశంకా తే కథాయా వ్యత్యయే క్వచిత్॥ ౭౦

తా. శ్రుతదేవుడు చెప్పుచున్నాడు. యుగములు కల్పములు మొదలగు భేదములచే పురాణములయందు కథలకు వ్యత్యయ ముండినప్పటికిని అట్టికథలకు ప్రమాణము లేదని చెప్పుటకు వీలులేదు.

శ్లో॥ గతే దైనందినే కల్పే యథైషా శాశ్వతీ శుభా।
మార్కండేయేన మే ప్రోక్తా సా చోక్తా తవ భూపతే॥ ౭౧

తా. ఓరాజా! నిత్యకల్పములు వెళ్ళుచుండగా ఈచరిత్రము లెట్లుజరుగుచుండెనో అట్లు మార్కండేయుడు నాకుచెప్పెను గాన అదే ప్రకారము నీకును చెప్పితిని.

శ్లో॥ తస్మాన్న ఖ్యాతిమాన్ యాతి ధర్మో వైశాఖసంభవః।
కశ్చిదేవ హి జానాతి విరక్తో విష్ణుతత్పరః॥ ౭౨

తా. ఆకారణమువలన వైశాఖమాసధర్మము ఆకాలములో ప్రసిద్ధికెక్కియుండలేదు. ఆకాలములో సంసారమునందు విరాగము కలవాడై వైశాఖధర్మములను ఒకానొకడే తెలిసికొని యుండెడివాడు.

ఇతి శ్రీస్కందపురాణే వైశాఖమాహాత్మ్యే నారదాంబరీషసంవాదే యమదుఃఖసాంత్వనం నామ త్రియోదశోధ్యాయః

## అథచతుర్దశోధ్యాయః

శ్రుతదేవఉవాచ॥

శ్లో॥ యః ప్రాత స్స్నాతి వైశాఖే మేషసంస్థే దివాకరే॥
మధుసూదన మభ్యర్చ్య కథాం శ్రుత్వా హరే రిమాం॥ ౧
స తు పాపవినిర్ముక్తో యాతి విష్ణోః పరంపదం॥

తా. శ్రుతదేవుడు చెప్పుచున్నాడు. వైశాఖమాసములో సూర్యుడు మేషము నందుండగా ఎవడు ప్రాతఃకాలంబున స్నానముజేసి విష్ణుమూర్తిని పూజించి విష్ణుమూర్తియొక్క కథను వినునో. వాడు సమస్తపాపముల వలన విడువబడి విష్ణువుయొక్క యుత్తమమైన లోకమును పొందగలడు.

శ్లో॥ వాచ్యమానాం కథాం హిత్వా యో న్యాం సేవేత మూఢధీః॥ ౨
రౌరవం నరకం ప్రాప్య పైశాచీం యోని మాప్నుయాత్॥

తా. విష్ణుకథను చెప్పుచుండగా దానిని వినక ఏమూఢుడు మరియొక వ్యాపారమును జేయుచుండునో వాడు రౌరవమను నరకమును పొంది పిమ్మట పిశాచజన్మ మెత్తును.

శ్లో॥ అత్రాప్యుదాహరంతీ మ మితిహాసం పురాతనం॥ 3
పాపఘ్నం పావనం ధర్మ్యం సద్యో వంద్యం పురాతనం॥

తా. దీనిని గురించి పూర్వమున జరిగినదియు పాపములను పోగొట్టునదియు పవిత్రమైనదియు ధర్మస్వరూపమైనదియు శీఘ్రముగా నమస్కరింప తగినదియు నగు నొకయితిహాసమును జెప్పెదను.

శ్లో॥ పురా గోదావరీతీరే క్షేత్రే బ్రహ్మేశ్వరే శుభే॥ ౪
దుర్వాసశిష్యౌ పరమహంసౌ బ్రహ్మైకనిష్ఠితౌ॥
సర్వదా పనిషద్విద్యా నిష్ఠితౌ నిరపేక్షితౌ॥ ౫
భిక్షామాత్రాశినౌ పుణ్యౌ భృగుహావాసినౌ శుభౌ
సత్యనిష్ఠతపోనిష్ఠా వితి ఖ్యాతౌ జగత్త్రయే॥ ౬

తా. పూర్వమందు గోదావరీ నదీతీరంబున శుభముల నొసగు బ్రహ్మేశ్వరమను క్షేత్రము కలదు. అచ్చట సర్వసంగ పరిత్యాగులును బ్రహ్మధ్యానమందాసక్తి గలవారును ఎల్లప్పుడు వేదాంత విద్యావిచారణజేయుచుండువారును కోరిక రహితులును భిక్ష

మెత్తుకొని జీవించువారును పుణ్యాలును మూడులోకములయందు ప్రసిద్ధి కెక్కినవారు ను సత్యనిష్ఠతపోనిష్ఠులను పేరుగల యిద్దరు మునులు భృగుప్రస్రవణమను స్థలమున నుండిరి.

శ్లో॥ తయో ర్మధ్యే సత్యనిష్ఠ స్సదా విష్ణుకథాపరః॥
శ్రోతౄణా మప్యభావే చ వ్యాఖ్యాతౄణాం తథా నృప॥ ౭
తదా కర్మకలాం నిత్యాం కరోత్యద్ధా మునీశ్వరః॥
శ్రోతా చే దస్తి యః కశ్చి త్తస్మై వ్యాఖ్యా త్యహర్నిశం॥ ౮

తా. ఓరాజా వారిద్దరిలో సత్యనిష్ఠుడను మునీశ్వరుడు యెల్లప్పుడు విష్ణుకథల ను వినుటయందు దాసక్తిగలవాడునై వినువారును చెప్పువారును లేనుండి యప్పటికిని తా ను విష్ణుకథలయందు దాసక్తిగలవాడై విష్ణు సంబంధములగు కర్మముల నన్నియు జేయు చుండెను. మరియు నెవ్వడైనను వినువాడు సంభవించినప్పుడు రాత్రింబవలు విష్ణు కధ లను విస్తరించి చెప్పుచుండును.

శ్లో॥ యది వ్యాఖ్యాతికశ్చి ద్వా పుణ్యాం విష్ణుకథాం శుభాం॥
తదా సంకుచ్య కర్మాణి శృణోతి శ్రవణే రతః॥ ౯

తా. పవిత్రమగు నదియు శుభముల నొసగునదియు నగు విష్ణు కథను యెవడైన ను జెప్పుట సంభవించినప్పుడు తన పను లన్నియు నాపుకొని వినుచుండును.

శ్లో॥ అతిదూరస్థతీర్థాని దేవతాయతనాని చ॥
హిత్వా కథావిరోధీని తథా కర్మాణి భూరిశః॥ ౧౦
శృణోతి చ కథాం దివ్యాం శ్రోతృభ్యో వక్తి వై స్వయం॥
వినాకథాం న జానాతి సేవ్య మన్యం నరేశ్వర॥ ౧౧

తా. ఓరాజా! మిక్కిలి దూరమందుండు తీర్థములను దేవాలయములను యితర విరుద్ధ కథలను యితరమగు కర్మములను విడచి శ్రేష్ఠమైన విష్ణుకథలనే వినుచుండును వినెడు వారుండు సమయమును తాను జెప్పుచుండును. మరియు నా మునీశ్వరునకు విష్ణుకథలయందు దాసక్తిగాక మరి దేనియందును పేక్షలేకుండెను.

శ్లో॥ వ్యాఖ్యాతి చ గృహే స్వస్వ వక్తారో గాద్యుపద్రుతః॥
కూపస్నానపరో భూత్వా శృణో త్యేవ కథాం మునిః॥

తా. తనకు ధర్మములను జెప్పునట్టి వానికి రోగము మొదలగు కష్టములు సంభవించినప్పుడు తానొక్కడే కూపోదకస్నానము జేసి విష్ణుకథను వినుచుండును.

శ్లో॥ కథాయాశ్చ విరామే తు స్వకృత్యం సాధయేత్పరం॥
కథాం వై శృణ్వతః పుంసో జన్మబంధో న విద్యతే॥ ౧౩

తా. కథనుజెప్పి చాలించినపిమ్మట తనకార్యములను సాధించుకొనును. కాబట్టి విష్ణుకథలను వినునట్టిమనుష్యునకు జనియించడమనుబంధము నశించును.

శ్లో॥ సత్వశుద్ధిస్తతో విష్ణావనురక్తిశ్చ జాయతే॥
రతిశ్చ జాయతే విష్ణౌ సౌహృదం చైవ సాధుషు॥ ౧౪
నిరంజంనిర్గుణం బ్రహ్మ సద్యో హృద్య వరుధ్యతే॥
జ్ఞానహీనస్య వై పుంసః కర్మ వై నిష్ఫలం భవేత్॥ ౧౫

తా. విష్ణుకథలను వినుటవలన చిత్తశుద్ధిగలుగును. అందువలన విష్ణుభక్తియందాసక్తికలుగును. అందువలన సత్పురుషులయందు ప్రేమకలుగును. దానివలన సర్వకళంకరహితమైనదియు గుణరహితమైనది యగు పరబ్రహ్మము తన హృదయమునందు ప్రకాశించును. జ్ఞానములేనివాని కర్మము వ్యర్థమగును.

శ్లో॥ బహుధా చరితం వాపి యథైవాంధకదర్పణం॥
కర్మాణి క్రియమాణాని బహుధా శోచితాత్మభిః॥ ౧౬
సత్వశుద్ధ్యై భవంత్యేవ సత్వశుద్ధ్యా శ్రుతింవ్రజేత్॥
శ్రుతేస్తు జ్ఞాన మాసాద్య జ్ఞానాద్ధ్యానాయ కల్పతే॥ ౧౭

తా. దుష్టస్వభావముగలవారిచేననేకవిధములయినకర్మములు చేయబడినను గ్రుడ్డివాడు అద్దమును చూచినట్లుగానే యుండును. కాబట్టి చిత్తశుద్ధి కలుగునట్లు ప్రయత్నింపవలయును చిత్తశుద్ధివలన విష్ణుకథాశ్రవణము కలుగును. ఆశ్రవణమువలన జ్ఞానము కలుగును. ఆజ్ఞానమువలన భగవద్ధ్యానము సంభవించును.

శ్లో॥ బహుధా శ్రవణం ధ్యానం మననం శ్రుతిచోదితం॥
యత్ర విష్ణుకథా నాస్తి యత్ర సాధుజనా న హి॥ ౧౮
సాక్షాద్గంగాతటం వాపి త్యాజ్య మేవ న సంశయః॥

తా. అనేకవిధములుగా విష్ణుకథలనువినుట ధ్యానముజేయుట వేదములయందు చెప్పినరీతిగా విచారణమును జేయుట కలుగును. మరియు నెచ్చటవిష్ణుకథలుండవో సత్పురుషులుగాని యెచ్చటనుండరో ఆప్రదేశము గంగాతీరమైనను విడువవలయును.

శ్లో॥ యద్దేశే తులసీ నాస్తి వైష్ణవం ధామ వా శుభం॥ ౧౯
యత్ర విష్ణుకథా నాస్తి మృత స్తత్ర తమో వ్రజేత్॥

తా. ఏ ప్రదేశమందు తులసీవనముండదో విష్ణుని యాలయముగాని యుండదో ఎచ్చటను విష్ణుకథాశ్రవణముండదో అక్కడ మృతినొందినవాడు తమస్సు ననుసరించి నరకమును పొందును.

శ్లో॥ యద్గ్రామే వైష్ణవం ధామ నాస్తి కృష్ణమృగో పివా॥ ౨౦
యత్ర విష్ణుకథా నాస్తి సాధవో వా తదాశ్రయాః॥
మృత స్తత్ర పుమాన్ క్షిప్రం శ్వానయోనిశతం వ్రజేత్॥ ౨౧

తా. ఏగ్రామములో విష్ణుని యాలయముగాని ఇఱ్ఱిగాని విష్ణుకథాశ్రవణముగాని సత్పురుషులు గాని యుండరో అక్కడ మృతినొందినవాడు శీఘ్రముగా ననేక జన్మములయందును కుక్కగా బుట్టుచుండును.

శ్లో॥ విచార్యో పనిషద్విద్యా మితి నిశ్చిత్య వై మునిః॥
సదా విష్ణుకథాసక్తో విష్ణుస్మృతిపరాయణః॥ ౨౨
న కించి దధికం జాతు మన్యతే శ్రవణాత్పరం॥

తా. ఈ సత్యనిష్ఠుడను మునీశ్వరుడు వేదాంతవిద్యనే విచారణ జేయవలయునని నిశ్చయించుకొని యెల్లప్పుడు విష్ణుకథలను వినుటయందును విష్ణుస్మరణము జేయుటయందు నాసక్తికలవాడై విష్ణుకథాశ్రవణముకంటె నితరమగు దేనినైన నధికముగా నొకప్పుడు తలచియుండలేదు.

శ్లో॥ ఇతరస్తు తపోనిష్ఠః కర్మనిష్ఠో దురాగ్రహీ॥ ౨౩
న వ్యాఖ్యాతి స్వయం వాపి న శృణోతి చ సత్కథాం॥
వాచ్యమానాం కథాం హిత్వా తీర్థస్నానాయ గచ్ఛతి॥ ౨౪

తా. తపోనిష్ఠుడను రెండవ మునీశ్వరుం డేరీతి ప్రవర్తించుచుండెననగా. కర్మములయందు నాసక్తి కలవాడై అహంకారము కలవాడగుచు తాను విష్ణుకథలను చెప్పుట లేదు. ఇతరులు చెప్పినను వినుటలేదు మరియు నెవరైనను చెప్పుచుండగా కథను వినక తీర్థస్నానము మొదలగువానికి నేగును.

శ్లో॥ తీర్థే పి చ ప్రవృత్తాయాం కథాయాం భూమిపాలక॥
కర్మలోపభయా ద్దూరం యాతి చాంచల్యశంకితః॥ ౨౫

తా. ఓ రాజా! అతీర్థస్నానము జేయు స్థలమునందును కూడ కథను చెప్పచుండిరేని యా కథను వినినయెడల తన చిత్తము చలించి కర్మములకు లోపము కలుగుననెడు భయముచే నచ్చటనుండి దూరముగా మఱియొక ప్రదేశమునకు వెళ్లెను.

శ్లో॥ వ్రజంతి గృహకృత్యార్థం సంగమాత్త్వరితో జనాః॥
న శ్రోతారో న వక్తార స్తస్య పార్శ్వే తు కర్మిణః॥

తా. ఆయన పార్శ్వమందుండెడి కర్మఠులందరు ఆ క్షేత్రంబున ప్రాతఃకాలంబున స్నానాదికర్మములను జేయుచు సంగవకాలము పర్యంతముండి పిదప నింటికి వెళ్లి గృహకృత్యముల జేయుట యందాసక్తి కలవారై యుందురేకాని విష్ణుకథలను వినెడువారుగాగాని చెప్పునట్టి వారుగాగాని యుండరైరి.

శ్లో॥ దురాత్మన స్తు దుర్బుద్ధేః కాల ఏవ క్షయం గతః॥
జిహ్వాం శ్రుతిం చ న క్వాప్యస్య ప్రాప్తా హి కథా విభో॥ ౨౭

తా. ఓస్వామీ! ఈప్రకారము కాలము గడచిపోవుచుండెనుగాని యొకదినమందైనను దుష్టస్వభావముగల యాదురాత్ముడు విష్ణుకథను నాలుకతో స్మరియించిగాని చెవులతో వినిగాని యెఱుగడు.

శ్లో॥ అశ్రోతృత్వా దవక్తృత్వా ద్దుర్బుద్ధిత్వా ద్దురాగ్రహాత్॥
పశ్చాత్పంచత్వ మాసాద్య సద్యో ధర్మేణ వై మునిః॥ ౨౮
పిశాచో భూచ్ఛమీవృక్షే ఛిన్నకర్ణాహ్వయో బలః॥
నిరాశ్రయో నిరాహార శ్శుష్కకంఠో ష్టతాలుకః॥ ౨౯

తా. తపోనిష్ఠుడను యామునిశ్రేష్ఠుండు విష్ణుకథలను వినకుండుటవలనను చెప్పకుండుటవలనను దుష్టస్వభావము కలుగుటవలనను అహంకారము కలుగుటవలనను కొంతకాలమునకు మృతినొంది విస్మృత విష్ణుకథాశ్రవణములేని యధర్మముచే పిశాచస్వరూపమై చెవులులేనివాడు గనుక నే ఛిన్నకర్ణుడను పేరుగలవాడై బలములేనివాడై ఆధారము లేనివాడై ఆహారము లేనివాడై యెండినటువంటి కంఠము ఓష్ఠములు తాలువులు గలవాడై యొకానొక జమ్మిచెట్టుయందు నివసించియుండెను.

శ్లో॥ ఏవం వై క్లిశ్యమానస్య సమా అప్యయుతం గతాః॥
నాపశ్య త్స్వస్య త్రాతారం నిరాహారో తిదుఃఖితః॥ 30

తా. ఈప్రకారము ఆహారములేక మిక్కిలిదుఃఖించుచుండగా పదివేలు సంవత్సరములు గడచినవి. ఒక్కడైన నితని రక్షించువారు లేరు.

శ్లో॥ స్వకృతం చింతయాన శ్చ మత్తో న్మత్త ఇవాభ్రమత్॥
క్షుధయా పర్యటన్ వాపి నివృత్తిం నాపమూఢధీః॥ 3౦

తా. మూఢుడైన యాతండు తన పూర్వజన్మసంచితమును గురించి విచారపడుచు ఆకలిచే పీడింపబడుచు మదించినవానివలెను పిచ్చిపట్టినవానివలెను తిరుగుచు నెప్పటికిని నివృత్తిని పొందకుండెను.

శ్లో॥ కృశానుసదృశో వాయు రంగం స్పృష్ట్వా కృతాత్మనః॥
కాలాగ్నితుల్యా ఆప శ్చ ఫలపుష్పాదికం విషం॥ 3౧

తా. వాయువు యితని శరీరమును స్పృశింపగా నగ్నితో సమానముగాను ఉదకములు ప్రళయకాలాగ్నితో సమానముగా ఫలములు పుష్పములు విషముతో సమానముగానుండెను.

శ్లో॥ న క్వాపి సుఖ మాపేదే కర్మతో దీనధీ రయం॥
ఏవం వ్యవసితే తస్మి న్నరణ్యే జనవర్జితే॥ 33
కథయా రహితే క్షేత్రే స్వాశ్రమే సాధువర్జితే॥
దైవా ద్దాయా త్సత్యనిష్ఠ స్తదా వైదిశసీం పురీం॥

తా. కర్మములయందు వాసక్తిగలవాడును దీనుడునగు ఆ పిశాచము ఒకప్పుడైనను సుఖమును పొందుటలేదు. ఇట్లుండగా మనుష్యసంచారము లేనిదియు విష్ణుకథాశ్రవణము లేనిదియు సత్పురుషులు లేనిదియు తనకాధారమైన యీయరణ్యంబునకు వైదిశ సమను పట్టణమునకు నొకప్పుడు సత్యనిష్ఠుడు వెళ్ళుచు దైవవశమున నామార్గంబుగా వచ్చుచుండెను.

శ్లో॥ గచ్ఛన్మార్గే దదర్శా సౌ ఛిన్నకర్ణం బహువ్యథం॥
దృష్ట్వా త్మానం ద్రావయంతం రుదంతం క్షుధయాతురం॥ 3౪
మాభైషీ తి సమాభాష్య కో సీత్యాహ మునీశ్వరః॥

తా. ఇట్లు ఆ సత్యనిష్ఠుడు వచ్చుచు మార్గములో మిక్కిలి బాధపడుచున్నవాడును ఆకలిచే పీడింపబడువాడును ! తనని జూచి ! యేడ్చుచున్నవాడునగు అఛిన్నకర్ణుని జూచి నీవు భయపడకుము నీవెవరవని యడిగెను.

శ్లో॥ దశేదృశీ చ కస్మా త్తే న తే దుఃఖ మతః పరం॥ 3౫
ఇత్యాశ్వస్తో మునా ఛిన్నకర్ణః ప్రాంజలి ర్విహ్వలః॥
తపోనిష్ఠో యతి రహం శిష్యో దుర్వాససః ప్రభో॥ 3౬

తా. ఇటువంటి యవస్థ నీకేల సంభవించెను. ఇకముందు నీదుఃఖము తొలగిపోవును. అని యీ ప్రకారము సత్యనిష్ఠుడు ఓదార్చగా. అప్పుడు ఛిన్నకర్ణుడు మిక్కిలి దీనుడై యిట్లు చెప్పుచున్నాడు. ఓస్వామీ ! నేను పూర్వమందు తపోనిష్ఠుడను పేరుగల యతీశ్వరుడను. దూర్వాసుని శిష్యుడను.

శ్లో॥ బ్రహ్మేశ్వరక్షేత్రవాసీ కర్మనిష్ఠో దురాగ్రహీ॥

కర్మలోపభయా న్మోహా న్మయా దుర్బుద్ధినా మునే॥ ౩౮

సాధుభి ర్వాచ్యమానాపి నాదృతా విష్ణుసత్కథా॥

న వ్యాఖ్యాతా చ శ్రోతృభ్యో కథా కర్మనికృన్తనీ॥ ౩౯

తా. బ్రహ్మేశ్వరమను క్షేత్రమందు నివసించువాడను కర్మములయందాసక్తిగలవాడను. పనికిమాలిన పట్టుదల గలవాడను. ఓమునీశ్వరా ! ఇట్టి దుర్బుద్ధిగల నేను జ్ఞానములేకుండుటచే కర్మములకు లోపము సంభవించునను. భావముచే సత్పురుషులు విష్ణుకథలను చెప్పుచుండినను ఆదరముగలిగి విననైతి. మరియు వినెడువారు సంభవించినప్పుడు సమస్త కర్మములను నశింపజేసి ముక్తినిచ్చునట్టి విష్ణుకథను జెప్పనైతిని.

శ్లో॥ తేన కర్మవిపాకేన మహతా హం మృతిం గతః॥

ఛిన్నకర్ణో భవ న్నామ్నా పిశాచో దుఃఖవిహ్వలః॥ ౪౦

తా. అటువంటి గొప్పపాప విశేషముచే నేను మృతినొందిన పిమ్మట ఛిన్నకర్ణుడను పేరుగలవాడను విచారము గలవాడవగు పిశాచమైతిని

శ్లో॥ న పశ్యామి చ త్రాతారం దుఃఖా దస్మా త్కథంచన॥

తవ దృష్టిపథం యాతో దిష్ట్యా హం గతకల్మషః॥ ౪౧

తా. ఇటువంటి దుఃఖమునుండి నన్ను యెట్టుగానైనను తప్పించువానిని గానైతిని. ఇప్పుడు దైవయోగముచే మీరగపడితిరి. మీదర్శనము వలన నాపాపము లన్నియు నశించెను.

శ్లో॥ అద్య మే దేవతా స్తుష్టా గురవ స్సాధవ శ్చ యే॥

హరి శ్చ మే ప్రసన్నో౽భూ ద్యత స్తే దర్శనం మమ॥ ౪౨

తా. మీదర్శనము నాకు దొరకుట వలన నా యిల వేల్పులు గురువులు సత్పురుషులు అందరును సంతోషించిరి. విష్ణుమూర్తియు నాయందు అనుగ్రహము కలవాడాయెను.

శ్లో॥ పపాత పాదయో స్తస్య త్రాహి త్రాహీతి వై రుదన్॥

తా. ఈ ప్రకారము తపోనిష్ఠుడు పలికి యేడ్చుచు నన్ను రక్షింపు రక్షింపుమ ని యామునీశ్వరుని పాదములను పట్టుకొనుచు భూమియందు పడెను.

శ్లో॥ తత స్తు కృపయా విప్ర స్సత్యనిష్ఠో మునీశ్వరః॥ ౪౩

దోర్భ్యా ముత్థాపయామాస తం దృఢాభ్యాం మహాయశాః॥

తా. విశేషకీర్తిగల యాసత్య నిష్ఠుడను మునీశ్వరుడు దయాస్వభావముకలవాడై యాఛిన్న కర్ణుని దృఢములగు తన భుజములతో లేవదీసి కూర్చుండ బెట్టెను.

శ్లో॥ తత స్త్వప ఉపస్పృశ్య దదౌ తస్మై త్వనుత్తమం॥ ౪౪

వైశాఖమాస మాహాత్మ్యశ్రవణస్య ముహూర్తజం॥

తా. అనంతరము జలమును స్పృశించి వైశాఖమాస మాహాత్మ్యమును విని సంపాదించిన పుణ్యములో తాను రెండు గడియలకాలము వినినందు వలన గలిగిన శ్రేష్ఠమగు పుణ్యము నాఛిన్న కర్ణునకు దానమిచ్చెను.

శ్లో॥ తేన పుణ్యప్రభావేన సద్యో ధ్వస్తాఖిలాశుభః॥ ౪౫

పిశాచ దేహా న్నిర్ముక్తో దివ్యదేహధరో భవత్॥

తా. ఆమునీశ్వరుండిచ్చిన పుణ్య విశేషముచే నతని సమస్తపాపములు శీఘ్రము గా నశింపగా పిశాచదేహమును వదలి శ్రేష్ఠమగు శరీరమును ఆఛిన్నకర్ణుడుపొందెను.

శ్లో॥ దివ్యం విమాన మారుహ్య తం ప్రణమ్య మహామునిం॥ ౪౬

ఆమంత్ర్య చ పరిక్రమ్య యయౌ విష్ణోః పరం పదం॥

తా. ఆ తపోనిష్ఠుడు సత్యనిష్ఠుడగు మునీశ్వరునకు ప్రదక్షిణము గాతిరిగి నమ స్కారముజేసి యనుజ్ఞతీసికొని శ్రేష్ఠంబగు విమానము నెక్కి వైకుంఠమునకు వెళ్లెను.

శ్లో॥ సత్యనిష్ఠ స్తతో ధీమాన్ యయౌ పైఠీనసీం పురీం॥ ౪౭

మాహాత్మ్య శ్రవణస్యైవం చింతయానః పునః పునః॥

తా. అనంతరమున బుద్ధిశాలియగు నాసత్య నిష్ఠుడు వైశాఖమాహాత్మ్యమును వినుటవలన నిటువంటి విశేషఫలము సంభవించెనుగదా యని మాటిమాటికి నాలోచించుచు పైఠీనసమను పట్టణమునకు వెళ్లెను.

శ్రుతదేవ ఉవాచ॥

శ్లో॥ యత్ర విష్ణుకథా పుణ్యా శుభా లోకమలాపహా॥ ౪౮

తత్ర సర్వాణి తీర్థాని క్షేత్రాణి వివిధాని చ॥

తా. శ్రుతదేవుడు చెప్పుచున్నాడు. పుణ్యకరమైనదియు శుభముల నొసగునదియు మనుష్యుల పాపములను పోగొట్టునదియునగు విష్ణుకథ నెచ్చటను చెప్పుకొనుచుందురో అచ్చటను సమస్తమైన తీర్థములు సమస్తమైన క్షేత్రములుండును.

శ్లో॥ యత్ర ప్రవహతే పుణ్యా శుభా విష్ణుకథాపగా॥
తద్దేశవాసినాం ముక్తిః కరసంస్థాపనం జగుః॥ ౪౦

తా. పుణ్యకరమైనదియు శుభముల నొసగునదియునగు విష్ణుకథయనెడునదియే దేశంబున ప్రవహించుచుండునో ఆదేశమునందు నివసించువారికి హస్తమునందుండు నట్టిఫలమువలెనే మోక్షము సులభముగా పొందనగునని పెద్దలు చెప్పిరి.

ఇతి శ్రీస్కాందపురాణే వైశాఖమాహాత్మ్యే నారదాంబరీష
సంవాదే కథాప్రశంసాయాం పిశాచముక్తిర్నామ
చతుర్దశోఽధ్యాయః.

అథ పంచదశోఽధ్యాయః

శ్రుతదేవ ఉవాచ॥

శ్లో॥ భూయశ్శృణుష్వ భూపాల మాహాత్మ్యం పాపనాశనం॥
వైశాఖస్య చ మాసస్య వల్లభస్య మధుద్విషః॥ ౧

తా. శ్రుతదేవుడు చెప్పుచున్నాడు. ఓ రాజా! పాపములను పోగొట్టు వైశాఖమాసము యొక్క మాహాత్మ్యమును భగవంతుండగు విష్ణుమూర్తి యొక్క మహత్తును తిరిగి చెప్పుచున్నాను వినుము.

శ్లో॥ పురా పాంచాలదేశే తు రాజా పురుయశా భవత్॥
తనయో భూరియశసః పుణ్యశీలస్య ధీమతః॥ ౨

తా. పూర్వమందు పాంచాల దేశమునందు విశేషకీర్తి గలవాడు గనుకనే పురుయశుడను పేరుగల యొక రాజుండెను. అతనికి బుద్ధిమంతుండగు పుణ్యశీలుడను తనయుడుండెను.

శ్లో॥ పితర్యుపరతే భూప రాజ్యస్థో ధర్మలాలసః॥
శౌర్యౌదార్యగుణోపేతో ధనుర్విద్యావిశారదః॥ 3
శశాస పృథివీం సర్వాం స్వధర్మేణ మహామతిః॥

తా. ఓరాజా! ఆపుణ్యశీలుడు తండ్రి మృతినొందగానే రాజ్యపరిపాలనయం దుంచబడినవాడై శౌర్యము ఔదార్యము మొదలగు గుణములగలిగి ధనుర్విద్యయందు నేర్పుగలవాడై ధర్మములయందాసక్తి గలవాడగుచు మిక్కిలి యోచనగలవాడగుచు ధర్మమార్గముగా సమస్తభూమిని పరిపాలనజేయుచుండెను.

శ్లో॥ పూర్వజన్మజలాదానా ద్దోషేణ మహతా వృతః॥ ౪

సంవర్ధాని మహాపా సా కాలేన కియతా నఘ॥

తా. దోషరహితుడవగు నోరాజా! ఆ పుణ్యశీలుడు పూర్వజన్మంబున జలదానము చేయనందున మిక్కిలి పాపముగలవాడాయెను. అందుచే కొంతకాలము గడువగా నా రాజుయొక్క ఐశ్వర్యమంతయు నశించెను.

శ్లో॥ హయా గజా మృతిం యాతా మహాద్రోగేణ పీడితాః॥ ౫

దుర్భిక్షమతులం చాసీ న్నిర్మానుష్యవిధాయకం॥

రాజ్యం కోశం తదా చాసీ ద్గజభుక్తకపిత్థవత్॥ ౬

తా. ఏనుగులు గుఱ్ఱములు పెద్దరోగములు సంభవించుటవలన మృతినొందినవి. మనుష్యులందరు నశించిపోవునట్టి గొప్ప కఱవు సంభవించెను. రాజ్యమంతయు నష్టమాయెను. కొట్లలోనుండు ధనమంతయు ఖర్చుపెట్టబడకనే యేనుగుచే మింగబడిన వెలగపండు వలెనే నశించెను.

శ్లో॥ బలహీనం నృపం జ్ఞాత్వా కోశరాష్ట్రవివర్జితం॥

తం జేతు మేష సమయ ఇతి నిశ్చితమానసాః॥ ౭

ఆజగ్ము శ్శతశో భూప రిపవ స్తస్య భూపతేః॥

జగ్ము ర్యుద్ధేన తం భూపం పాంచాలవిషయాధిపం॥

తా. ఓరాజా! చతురంగబలము ధనము మొదలగునవి నశించుటచే పుణ్యశీలుడు దుర్బలుడైయుండెను గాన యాతనిని జయించుటకిదే సమయమని యా రాజుయొక్క శత్రువులందరు నిశ్చయముజేసికొని యా పుణ్యశీలునిమీదికి దండెత్తివచ్చి యుద్ధముజేసి పాంచాలదేశమున క్షితిపతియగు నా రాజును పట్టుకొనిరి.

శ్లో॥ పరాజిత స్తతో రాజా వివేశ గిరిగహ్వరే॥

శిఖిన్యా భార్యయా సాకం ధాత్రాదిగుణసంయుతః ౮

అజ్ఞాతపద్ధతి స్స్వస్మై ర్బహుదుఃఖసమాకులః॥

త్రిపంచాశత్సమా స్తత్రైవ నీతా స్తేన వినీయతా॥ ౧౦

తా. అనంతరమున నా రాజు యోడిపోయి శిఖిని యను తన భార్యతోఁగూడి పర్వతగుహాయందు ప్రవేశించి యోర్పుగలవాఁడై తనయునికి నెవరికిని దెలియకుండునట్లు రహస్య ప్రదేశంబున నుండి మిక్కిలి వ్యాకులపడుచు నేబదిమూఁడు సంవత్సరములను వెళ్ళబుచ్చెను.

శ్లో॥ చింతయామాస భూపాలః కి మేత దితి భూరిశః॥
కర్మణా జన్మనా శుద్ధో మాతాపితృహితే రతః॥ ౧౧

తా. ఇట్లుః ఆ రాజు దుఃఖపడుచు నీ రీతి విచారించెను. ఇటువంటి యవస్థ నా కేందుకు సంభవించెను. నేను కర్మముచేతను పుట్టుకచేతను పరిశుద్ధమైనవాఁడను తల్లిదండ్రుల పోషించుటయందాసక్తిగలవాఁడను.

శ్లో॥ గురుభక్త స్సదాదక్షో బ్రహ్మణ్యో ధర్మతత్పరః॥
దయావాం త్సర్వభూతేషు దేవభక్తో జితేంద్రియః॥ ౧౨

తా. గురువులయందు భక్తిగలవాఁడను. మంచికార్యములను జేయుటయందు సమర్థతగలవాఁడను. బ్రహ్మజ్ఞానము గలవాఁడను ధర్మమునందాసక్తి గలవాఁడను. సర్వభూతములయందు దయగలవాఁడను దేవభక్తి గలవాఁడను. ఇంద్రియముల జయించినవాఁడను.

శ్లో॥ న భ్రాతా మే న పుత్రో మే న చ మే సుహృదో హితాః॥
దయాపౌరుషవిఖ్యాతాః కులీనస్యాపి మే కుతః॥ ౧౩

తా. నా సోదరులు పుత్రులు స్నేహితులు మొదలగు వారందరును దయయు పౌరుషము మొదలగు గుణములు కలిగి ప్రసిద్ధిపొందిరి గాని అధర్మవంతులు గాలేదు. అట్టి సద్వంశమందు పుట్టిన నాకిట్టి కష్టమేల సంభవించెను. తాత్పర్య మింకొక విధము గానైనను చెప్పదగును.

తా. నేను న్యాయము ననుసరించి సోదరుడనియు పుత్రుడనియు స్నేహితుడనియు ఆప్తుడనియు భేదము నెంచకుంటిని. మరియు దయ పౌరుషము మొదలగు సుగుణములచే ప్రసిద్ధినొందితిని. ఇట్టి సద్వంశంబునబుట్టిన నాకు కష్టమేలసంభవించెను.

శ్లో॥ కేన వా కర్మణా చాప్తం దారిద్ర్యం భూరిదుఃఖదం॥
కేన వా సజయో మే ద్య కేన వా వనవాసితా॥ ౧౪

తా. విశేషదుఃఖమును పొందుచున్న యీదారిద్ర్యము ఏదుష్కృతముచే పొందబడెను ? ఏకారణమువలన యోడిపోతిని. ఏహేతుచే అడవిలోఁ గాపురము జేయవలసెను.

శ్లో॥ ఇతి చింతాకులో రాజా గురూ సస్మార ఖిన్నధీః॥
యాజోపయాజకౌ నామ సర్వజ్ఞౌ మునిసత్తమౌ॥ ౧౫

తా. ఈప్రకారమా రాజు చింతించుచు దిగులుజెందినమనస్సుగలవాడై సమస్తము తెలిసినవారును మునిశ్రేష్ఠులును యాజ ఉపయాజకులను పేరుగల గురువులను తలచెను.

శ్లో॥ ఆజగ్మతు ర్మునీంద్రౌ తౌ రాజ్ఞా హూతౌ మహామతీ॥
తౌ దృష్ట్వా సహసోత్థాయ రాజా పాంచాలవల్లభః ౧౬
ననామ శిరసా భక్త్యా ప్రవాసేనాతిపీడితః॥
రాజచిహ్నవిహీన శ్చ కేనా ప్యజ్ఞానపద్ధతిః॥ ౧౭
తూష్ణీం తస్థౌ ముహూర్తం హి పతిత్వాభువి పాదయోః॥

తా. అప్పుడు రాజు స్మరింపగానే యామునీశ్వరులిరువురువచ్చిరి. అంతట బుద్ధిశాలియగు నారాజు వారిదువురనుజూచి శీఘ్రముగా లేచి భక్తితో సాష్టాంగదండప్రణామముజేసి వనవాసముచే మిక్కిలి దుఃఖించుచున్నవాడును ప్రభుచిహ్నములను విసర్జించినవాడును ఇతరులకు తెలియబడక రహస్యముగా నుండువాడునగు ఆరాజు ఆ మునీశ్వరుల పాదములమీదపడి రెండుగడియలకాల మూరకుండెను.

శ్లో॥ దోర్భ్యా ముత్థాపిత స్తాభ్యాం పరిమృష్టాశ్రులోచనః॥ ౧౮
విధివ త్పూజయామాస వన్యై రేవా ర్హణై శ్శుభైః॥

తా. అనంతరము వారిరువురచే లేవదీవబడి కన్నీళ్లను తుడువగా నారాజుయా మునీశ్వరులను శుభకరము. లైనవియు వడవియందు సంభవించినవియునగు తగిన పుష్పాదులచే యథావిధిగా పూజించెను.

శ్లో॥ సూపవిష్టౌ తు తౌ విప్రౌ పప్రచ్ఛా నతకంధరః॥
బ్రాహ్మణౌ వదతం దుఃఖకారణం చ క్షితీశతుః॥
కర్మణా జన్మశుద్ధస్య పితృదేవప్రియస్య చ॥ ౨౦
పాపభీరోః కృపాళో శ్చ గురుభక్తస్య మే కుతః॥
దారిద్ర్యం కోశహాని శ్చ రిపుభి శ్చ పరాభవః॥ ౨౧
కస్మా దరణ్యవాస శ్చ కుత ఏకాకితా మమ॥

తా. అనంతరము యామునీశ్వరులిరువురు సుఖముగా గూర్చున్నపిమ్మట నా రాజునమస్కరించినవాడై యిట్లు పలుకుచున్నాడు. ఓబ్రాహ్మణులారా! నేనుభూమిని పాలించువాడను జన్మముచేతను కర్మముచేతను పరిశుద్ధమైనవాడను పితృదేవతులయందు ప్రియముగలవాడను పాపమునుగురించి భయపడువాడను దయగలవాడను గురువులయందు భక్తిగలవాడనగు నాకిట్టి దుఃఖమేల సంభవించెను. ధనముపోయి దరిద్రము శత్రువులచే జయింపబడుట యేల కలిగెను. ఏకారణమువలన నరణ్యనివాసము నొంటరిగా నుండుటసంభవించెనో చెప్పవలయును.

శ్లో॥ న పుత్రో న చ మే భ్రాతా న హితా సుహృద శ్చమే ౧౨
దుర్భిక్షం వా కత శ్చాసీ ద్దేశే మత్పాలితే నఘా।
ఏత ద్విస్తార్య మే బ్రూతాం కారణం మునిపుంగవౌ॥

తా. కుమారుడనియు సోదరుడనియు స్నేహితుడనియు ఆప్తుడనియు నేను పక్షపాత మవలంబించియుండలేదు కాబట్టి యో మునీశ్వరులారా! ఈరీతి పక్షపాతరహితముగా రాజ్యమును పాలించిన నా దేశములో దుర్భిక్షమే కారణమున సంభవించెనో? దీనినంతయు సవిస్తరముగా నాకుజెప్పుమని యారాజడిగెను.

శ్లో॥ ఇత్యుక్తౌ తౌ మునిశ్రేష్ఠౌ భూపేనా త్యంతదుఃఖితౌ।
ప్రత్యూచతు ర్మహాత్మానౌ కించి ద్ధ్యానపరాయణౌ॥ ౧౪

తా. మిక్కిలి దుఃఖించుచున్న యారాజిట్లు మహానుభావులగు నా యిరువురు మునులతో బలుకగా నా మునులు కొంచెముసేపు యోగమునవలంబించి దివ్యదృష్టిచే గనుగొని యిట్లు చెప్పుచున్నారు.

యాజోపయాజావూచతుః॥

శ్లో॥ శృణుభూప ప్రవక్ష్యావ స్తవ దుఃఖస్య కారణం।
పురా భూప? మహాపాపీ వ్యాధ స్త్వం దశజన్మసు॥ ౧౫

తా. యాజోపయాజులు చెప్పుచున్నారు. ఓరాజా! నీదుఃఖమునకు కారణమును చెప్పుచున్నాము వినుము. పూర్వజన్మములలో పది జన్మములవరకును నీవు మహాపాపముజేయుచు బోయకలవాడవై జన్మించితివి.

శ్లో॥ నిష్ఠుర స్సర్వలోకానాం సదా హింసాపరాయణః।
ధర్మలేశకరః క్వాపి న దమో న చ వైశమః॥ ౧౬

తా. సమస్తమనుష్యులకు కఠినముగా నగపడువాడవును ఎల్లప్పుడు హింస జే

యుటయందే యాసక్తిగలవాడవునై యుంటివి. ఎప్పుడును కొంచెము ధర్మమైనను జే యకుంటివి. ఇంద్రియనిగ్రహము శాంతి మొదలగు గుణములేమియు నీయందులేవు.

శ్లో॥ న జిహ్వా వక్తి నామాని విష్ణో ర్వాపి కథంచన।
చేత స్స్మరతి గోవిందచరణాంబురుహద్వయం॥ ౨౭

తా. నీనాలుక యెప్పుడును అతికష్టముగానైనను విష్ణునామములను పలుకుట లేదు. చిత్తము విష్ణుపాదపద్మధ్యానమును చేసియుండలేదు.

శ్లో॥ న ప్రణామః కృతః క్వాపి శిరసా పరమాత్మనే।
నవజన్మార్జితే భూప? గతా న్యేవం దురాత్మనః ౨౮

తా. ఆ పరమాత్మునకు నొకప్పుడైనను నమస్కారమును చేయవైతివి. ఓరాజా! ఈ ప్రకారము దుష్టస్వభావముచే పాపమును జేయుచు తొమ్మిది జన్మములను వెళ్లబుచ్చితివి.

శ్లో॥ దశమే జన్మని ప్రాప్తే వ్యాధ స్త్వం సహ్యభూధరే।
నిష్ఠుర స్సర్వలోకానాం నరాణాం త్వం నరాంతకః ౨౯

తా. పదియవ జన్మంబున సహ్యమను పర్వతమందు యెరుకలవాడవై జన్మించి నీవు క్రూరుడవై సమస్త మనుష్యులను సమస్త లోకములను బాధపెట్టితివి.

శ్లో॥ దయాహీన శ్శస్త్రజీవీ సదా హింసాపరాయణః।
నిర్గుణ స్సకళత్ర స్త్వం మార్గపీడాకర శ్చరః॥ ౩౦

తా. దయలేనివాడవు ఆయుధములచేత జీవించువాడవు యెల్లప్పుడు హింసజేయువాడవు సుగుణములు లేనివాడవునై నీవు భార్యతోగూడా యుండి మార్గమున వచ్చువారిని బాధించుచు నిట్లు మూర్ఖుడవై యుంటివి.

శ్లో॥ ప్రజానాం గౌడదేశానాం రాక్షసో మానుషాశనః।
ఏవం చాబ్దా న్యతీతాని నైజం హిత మజానతః॥ ౩౧

తా. ఇట్లు గౌడదేశము నందుండిన సమస్త మనుష్యులకు మనుష్యులను భక్షించునట్టి రాక్షసుడవుగా నుంటివి. ఇట్లు క్రూరవృత్తి నవలంబించి నీకు మేలు గలుగునట్టి యుపాయము నెరుగకుండి కొన్ని సంవత్సరములను వెళ్లబుచ్చితివి.

శ్లో॥ బాలాపత్యమృగాణాం చ పక్షిణాం చ వధా త్తవ।
దయాహీనస్య దుర్బుద్ధే జన్మన్యస్మి న్నపుత్రతా॥ ౩౨

తా. బాలులను మృగములను పక్షులను దుర్మార్గపు స్వభావము గలిగి దయలేనివాడవై హింసించుటవలన నీకు ఈ జన్మంబున సంతానము లేకుండెను.

శ్లో॥ విశ్వాసఘాతుకత్వేన భ్రాతరో నైవ సోదరాః।
మార్గపీడాకరత్వేన సుహృజ్జనవివర్జితః॥ 33

తా. నిన్ను నమ్మియున్నవారిని హింసచేయుటచే సోదరులు తోబుట్టువులు లేరు. మార్గస్థులను బాధించుటచే స్నేహితులును లేకుండిరి.

శ్లో॥ సాధూనాంచతిరస్కారా చ్ఛతృభి స్తే పరాజయః।
కదా ప్యదత్తదోషేణ దారిద్ర్యం పతితం గృహే॥ 34

తా. సజ్జనులను నిరాకరించుటచే శతృవులచే నోడింపబడితివి. ఎప్పుడును దానము జేయకుండుట దోషముచే నీ గృహమునందు దరిద్రము సంభవించినది.

శ్లో॥ సదై వోద్వేగకారిత్వా త్ప్రవాస స్తే దురాసదః।
సర్వేషా మప్రియత్వా చ్చ దుఃఖ మత్యంతదుస్సహం॥ 35

తా. ఇతరులకు నెల్లప్పుడు పీడ నొనరించుటచే సాధ్యముగాని వనవాసము సంభవించెను. అందరికిని అయిష్టము నే జేయుటచే మిక్కిలి దుఃఖము సంభవించెను.

శ్లో॥ నిరాహారో యతః పూర్వం సదా క్రూరేణ కర్మణా।
తస్మా ద్రాజ్యాపహార స్తే జన్మ న్యస్మి న్మహామతే॥ 36

తా. విశేషబుద్ధి గలవాడా! పూర్వమున మనుష్యులను భుజియించుటచే నాహారము లేనివాడవైతివి, ఎల్లప్పుడు క్రూరకృత్యములనే జేయుచుండుటచే నీ జన్మంబున నీ రాజ్యము శతృవులచే హరింపబడెను.

శ్లో॥ అథ తే సత్కులీనత్వే హేతూం శ్చాపి బ్రవీమ్యహం॥

తా. ఇకను నీవు మంచి వంశంబున బుట్టుటకు కారణములను చెప్పుచున్నాను.

శ్లో॥ యదా భూ ర్గౌడదేశీయో హ్యంతిమే వ్యాధజన్మని॥ 37
స్వకర్మనిరతే క్రూరవిపినే కంటకావిలే।
తిష్ఠ త్యేవం దయాహీనే సర్వభూతాంతకే కుధీ॥ 38
వైశ్యా వాజగ్మతుర్దైవా ద్ధనాఢ్యౌ ధర్మపీడితౌ।
ముని శ్చ కర్షణో నామ వేదవేదాంగపారగః॥ 39
జటాచీరధరః పుణ్యః కమండులుపరిగ్రహః

తా. చివర జన్మంబున గౌడదేశములో నెరుకులవాడవై జనియించి ముండ్లతో వ్యాపింపబడియున్న యా కారడవిలో దయలేక సర్వభూతములను హింసించుచు నా

గ్రామమునందు బాటసారులను బాధించుచు నిట్లు క్రూరవృత్తిచే జీవించుచుండగా దైవ యోగముచే ధనవంతులును ధర్మరహితులును అగు నిద్దరు కోమట్లును వేదములను శాస్త్రములను జదవినవాడును జడలను నారచీరలను ధరించినవాడును పుణ్యశీలుడును కమండలమును ధరించిన వాడునగు కర్షణుడను మునీశ్వరుడును ఆ యడవిమార్గములో నడచుచుండిరి.

శ్లో॥ తాన్ దృష్ట్వా ధను రాదాయ మార్గం రుధ్వా వ్యవస్థితః॥
అనుద్రుత్య శరీ వైశ్యౌ బాణైశ్ఛిన్నశరీరకౌ।
తయో రేకం చ త్వం హత్వా గృహీత్వా ఖిలతత్పణం॥ ౪౧
అపరం హంతు ముద్యుక్తే స దుద్రావ భయా ద్రుతం।
పణం గుల్మే వినిక్షిప్య భీతః ప్రాణపరీప్సకః॥ ౪౨

తా. అప్పుడు వ్యాధుడవగు నీవు ఆ ముగ్గురను జూచి మార్గము నడ్డగించి వారివెంబడి వెళ్లి ఆ వైశ్యులలో నొకరిని చంపి యాతనివద్ద నుండు ధనమును తీసికొని రెండవవానిని చంపుటకు వెళ్లగా నతడును భయమునుపొంది తనవద్దనుండిన ధనమునొక పొదలో నుంచి ప్రాణములను కాపాడుకొనుటకు శీఘ్రముగా పారిపోయెను.

శ్లో॥ కర్షణో పి ముని శ్శీఘ్రం వ్యాధాన్మృతివిశంకితః।
ఆతపే ధావమాన స్సన్ తృషాఘర్మపరిపీడితః॥ ౪౩
మూర్ఛా మాప గలస్వేద స్సంజ్ఞామాత్రావశేషితః।
విహాయైనం దుద్రువే చ వైశ్యో జీవనతత్పరః॥ ౪౪

తా. కర్షణుడను మునీశ్వరుడును కిరాతుడు చంపునని భయముచే పాటిపోవుచుండెను. ఇట్లు ఆకోమటియును మునీశ్వరుడును వెళ్ళుచుండగా నామునీశ్వరుడు యెండలో పరుగెత్తి వెళ్ళుటచే నెండవేడిమిచే నలసి దాహముకలవాడై మూర్ఛను పొంది చెమటకారుచుండ కొంచెము యూపిరితో నుండెను. ఆకోమటియు తన ప్రాణములను రక్షించుకొనదలచి యామునీశ్వరుని విడచి వెళ్ళెను.

శ్లో॥ త్వం తా వనుద్రుతౌ దృష్ట్వా మూర్ఛితంభువి భూసురం।
పణం కుత్ర వినిక్షిప్తం కియ ద్దూరం గతో వణిక్॥ ౪౫
ఇతి పృష్టుం ద్విజం శాంత మజ్జీవయితు ముద్యతః।
ఫూత్కృత్వా కర్ణయో స్తస్య నాగరం స్మృతికారణం॥ ౪౬
పల్వలస్థోదకే నైవ క్రిముకర్దమసంయుజా।

నేత్రే సంమృజ్య శాంతస్య పర్ణై స్సంవీజ్య తన్ముఖే॥ ౮౭
ససంజ్ఞం చ మునిం కృత్వా త్వ మాత్థ స్వస్థమానసః॥

తా. నీవు వారిని వెంబడింపగా వారిలో నలసి భూమిమీద మూర్ఛబడియున్న బ్రాహ్మణునిజూచి కోమటి యెచ్చటికి వెళ్లినదియు ధనమెచ్చటనుంచినదియు తెలుసుకొనే నిమిత్తము మూర్ఛనొందిన యాబ్రాహ్మణుని బ్రతికింపదలచి తెలివి వచ్చుటకు చెవులలో ఊది చిన్న చిన్న గోతులలో బురదపురుగులతో మిళితమైయున్న జలములదెచ్చి నేత్రముల తుడిచి ఆకులతో చల్లని గాలిముఖమునందు తగులునట్లుగా వీచి యాబ్రాహ్మణుని మూర్ఛదేలిపి స్థిరచిత్తముగలవాడవై యాతనితో నిట్లు పలికితివి.

శ్లో॥ మా శంకా తే మునే కార్యా మత్త శ్శస్త్రభృతో వనే॥ ౮౮
నిష్కించన స్సఖి లోకే కుత స్తే భయ ముల్బణం॥
భిన్నపాత్రేణ చీర్ణేన న మే కించి ద్భవిష్యతి॥ ౮౯

తా. ఓబ్రాహ్మణుడా! నేను ఆయుధములుగల వాడననియు చంపెదననియు నీవు భయపడవద్దు. లోకములో డబ్బులేని వానికేమియు భయములేదు. కాబట్టి దరిద్రుడవగు నీ కేమి భయమున్నది. నీవద్దనుండు పాత్రకూడ పగిలి శిథిలమైయున్నది.

శ్లో॥ ఏతావ ద్వద మే విద్వ న్వణిక్కుత్ర పలాయితః।
కుత్ర గుల్మే ధనం క్షిప్తం తేన శీఘ్రం పలాయతా॥ ౯౦
అన్యథా త్వాం వధిష్యామి యది మిథ్యా వదిష్యసి॥

తా. ఓవిద్వాంసుడా, ఆకోమటి యెచ్చటికి వెళ్ళెను? అతడు పారిపోవుచు యేపొదలలో ధనము పారవైచెను? దీని నంతయు యథార్థముగా జెప్పుము నీవు మరియొక యుద్దేశ్యముచే నబద్ధము జెప్పితివేని నిన్ను చంపెదను.

కర్షణఉవాచ॥

శ్లో॥ ధనం గుల్మే వినిక్షిప్తం మార్గా దస్మా త్పలాయితః॥
ఇతి ప్రాహ భయా త్సోఽపి పృష్టః ప్రాణపరీప్సయా॥

తా. ఈప్రకారము నీవడుగగా ధనము ఈపొదలోనుంచబడెననియు ఆకోమటి ఈమార్గముగా వెళ్ళెననియు నాబ్రాహ్మణుడు నీవు చంపెదవనెడు ప్రాణభయమువలన జెప్పెను.

శ్లో॥ గచ్ఛ విప్ర సుఖం మార్గం మత్తో భీతిం విహాయ చ॥ ౯౧

ఇతోవిదూరే సలిలం తటాకే వర్తతే శుభం।
తత్పీత్వా సలిలం పుణ్యం గచ్ఛ గ్రామం గతశ్రమః॥ ౫౩

తా. ఇట్లు ఆబ్రాహ్మణుడు చెప్పగాఁ విని నీవిట్లు పలికితివి. ఓ బ్రాహ్మణుడా నావలన నీకేమియు భయములేదు నీవు సుఖముగా నింటికిపొమ్ము. ఇచ్చటకు సమీపములో మంచిజలముగల యొకచెఱువుకలదు. ఆచెఱువులో నుండు స్వచ్ఛమైన జలమును త్రాగి ఆయాసమును పోగొట్టుకొని నీగ్రామమునకు వెళ్ళుము.

శ్లో॥ అథ నైవాగమిష్యంతి రాజకీయాః పథా జనాః।
మత్పదాన్వేషణే సక్తాః శ్రుత్వా రావం వణిక్పతేః॥ ౫౪
తృషార్త మనుగంతుం మే న శక్యం త్వాం తతో ద్విజ॥

తా. ఓ బ్రాహ్మణుడా! నీకాయాసపడియుండుటచే నిన్ను కొంతదరకు పంపించెదననుకొంటినిగాని యదివీలుకాదు. ఏలనగా ఈకోమటియొక్క ఆర్తధ్వని విని రాజభటులు నన్ను పట్టుకొనదలచి నన్ను వెదుకుటకై యిప్పుడేవత్తురు అందువలన సాధ్యముకాదు.

శ్లో॥ ఏజయానేన పర్ణేన ఘర్మః కించి ద్గమిష్యతి।
తస్మైదత్వా పలాశం చ త్వమాగా ద్విపినం పునః॥

తా. ఈయాకులతో నీవు విసరుకొనినయెడల ఆయాసముతగ్గునని కొన్ని యాకుల నాబ్రాహ్మణునకిచ్చి నీవు తిరిగి వనములోనికివెళ్ళితివి.

శ్లో॥ తేన పుణ్యప్రభావేన వైశాఖే ఘర్మఘర్ఘరే॥ ౫౬
స్వకార్యార్థం కృతే నాపి మునే స్త్రాణాయ పద్ధతౌ।
జన్మాసీత్తే మహాపుణ్యే రాజవంశే త్వివిస్తృతే॥ ౫౭

తా. ఎండవేడిమిచే దుస్సహమైన వైశాఖమాసములో నీ యుపయోగముకొఱకు ఆ మునీశ్వరునకు నుపచారము జేసినప్పటికిని ఆ మునీశ్వరుడు బ్రతుకుట కలిగినది. ఆ విశేషపుణ్యముచే నిక్కలి పుణ్యకరమైన గొప్ప రాజవంశంబున నీవు జన్మించితివి.

శ్లో॥ యదీచ్ఛసి సుఖం రాజ్యం ధనధాన్యాదిసంపదః।
స్వర్గాపవర్గ మథవా సాయుజ్యం వా హరేః పదం॥ ౫౮
కురు వైశాఖధర్మాంస్త్వం సర్వసౌఖ్య మవాప్స్యసి॥

తా. ఓరాజా! సుఖముగాని రాజ్యముగాని ధనము ధాన్యము మొదలగు సంపత్తులను స్వర్గమునుగాని విష్ణుసాయుజ్యమునుగాని మోక్షమునుగాని నీవు దేనినికోరినను వైశాఖధర్మములను జేసితివేని సమస్తసౌఖ్యములను పొందగలవు.

శ్లో॥ మాసో యం మాధవో నామ తృతీయా చాక్షయాహ్వయా॥ గిరి
గాం చ సకృత్ప్రసూతాఖ్యాం దేహి విప్రాయ సీదతే।
తేన తే శోకపూర్తి స్స్యా చ్ఛయ్యాం దేహి సుఖం భవేత్॥ ౬౦

తా. వైశాఖమాసములో అక్షయ తృతీయయందు అది వరకు ప్రసవించిన ఆవును బ్రాహ్మణునకు దానమిచ్చిన యెడల నీదుఃఖము నశించును శయ్యను దానమిచ్చిన సుఖమొకలుగును,

శ్లో॥ కురు చ్ఛత్రప్రదానం చ సామ్రాజ్యం తే భవిష్యతి।
స్నానం కురు యథాన్యాయం తద్దై వార్చయ మాధవం॥ ౬౧

తా. గొడుగును దానమిచ్చిన యెడల నీకు సామ్రాజ్యము సంభవించును. ప్రాతఃకాలంబున యథావిధిగా స్నానముజేసినను ఆ ప్రకారముగా విష్ణుమూర్తిని పూజించినను ముక్తికలుగును.

శ్లో॥ దేహి త్వం ప్రతిమాం దివ్యాం కృత్వా తేన జయో భవేత్।
ఆత్మతుల్యగుణా న్పుత్రా న్యది కామయసే నృప॥ ౬౨

తా. ఓరాజా! జయమును నీతో సమానులగు పుత్రులను కోరితివేని శ్రేష్ఠముగు విష్ణు ప్రతిమను దానము చేయ వలెను.

శ్లో॥ సర్వభూతహితార్థాయ ప్రపాదానం చ త్వం కురు।
వైశాఖోక్తా నిమాన్ ధర్మాం త్సమ్య గాచర భూమిప॥ ౬౩

తా ఓరాజా! చలివేంద్రను స్థాపించుము. మరియు సమస్త భూతములకు నుపయోగమగునట్టి యీవైశాఖ ధర్మముల నన్నియు బాగుగా జేయుము

శ్లో॥ తేన తే సకలా లోకా వశం యాంతి న సంశయః।
నిష్కామకేన చిత్తేన యది ధర్మా న్కరిష్యసి॥ ౬౪

తా. ఫలములను గోరక ధర్మములనుజేసితి వేని యీపుణ్యవశమున సమస్తలోకములు నీస్వాధీనముగును. సందేహములేదు.

శ్లో॥ వైశాఖే పుణ్యమాసే స్మిన్ ప్రీతయే మధుఘాతినః।
ప్రత్యక్షో భవితా విష్ణు స్తవ నిర్మలచేతసః॥ ౬౫

తా. పుణ్యమగు వైశాఖమాసములో పరిశుద్ధాంతఃకరణము కలిగి విష్ణుమూర్తి ప్రీతికొఱకు ధర్మములను జేసితివేని యా విష్ణుమూర్తి ప్రత్యక్షమగును.

శ్లో॥ యేన చాచరితాః పుంసా ధర్మా హ్యేతే శుభావహాః।
తేషాం చ హ్యక్షయా లోకాః పురాణే కవయో విదుః॥ ౬౬

తా. ఎవరు శుభముల నొసగు వైశాఖ ధర్మములను చేయుదురో వారికి శాశ్వతమగు పుణ్యలోకములు సంభవించునని విద్వాంసులు పురాణముల యందు చెప్పియుండిరి.

శ్లో॥ ఏత త్సర్వం తవ ప్రోక్తం యథా దృష్టం యథా శ్రుతం।
ఇతి రాజాన మామంత్ర్య బ్రాహ్మణౌ చ పురోధసౌ॥ ౬౭
యాజోపయాజకౌ నామ జగ్మతు స్తౌ యథాగతౌ।

తా, ఓ రాజా! మేము చూచినట్టియు వినినట్టియు సమస్త వైశాఖ ధర్మములను నీకు జెప్పితిమని పలికి యా రాజునకు పురోహితులును బ్రాహ్మణులు నగు యాజోపయాజకులు ఆరాజుతో చెప్పి వారి నివాసమునకు వెళ్లిరి.

శ్లో॥ తతో రాజా మహావీర్యః పురోధోభ్యాం చ బోధితః॥ ౬౮
వైశాఖధర్మాం త్సకలాం శ్చకార శ్రద్ధయాన్వితః
యథోపదిష్టం చ తథా మధుసూదన మర్చయత్॥ ౬౯

తా ఆరాజు పురోహితులచే బోధింపబడిన పిమ్మట నా రాజు మిక్కిలి బలముగలవాడై శ్రద్ధగలిగి ఆ మునీశ్వరులు చెప్పినరీతిగా విష్ణుమూర్తిని పూజించుచు సమస్తమైన వైశాఖ ధర్మములను జేసెను.

శ్లో॥ తతో లబ్ధప్రభావ స్సన్ బంధుభి స్సకలై ర్వృతః।
పాంచాలనగరీం ప్రాప హతశేషబలాన్వితః॥ ౭౦

తా. అనంతరమా రాజు వైశాఖధర్మ మహిమచే విశేషమగు సామర్థ్యమును పొంది సమస్త బంధువులతోడను గూడి పూర్వము తనకు మిగిలిన సేనలతో గూడి తిరిగి పాంచాల పట్టణమునకు వెళ్లెను.

శ్లో॥ తత స్తు శత్రవో భూప ఉపశ్రుత్య చ భూపతేః।
ప్రవేశం చ పురస్యాథ పున రాజగ్ము రుద్ధతాః॥ ౭౧

తా. ఓ రాజా! ఈ రాజు తిరిగి యుద్ధము చేయుటకు పాంచాలపట్టణమునకు వచ్చినాడని విని యా రాజులందరు యుద్ధ సన్నాహులై వచ్చిరి.

శ్లో॥ తదా పాంచాలభూపేన నృపాణా మభవ ద్రణం।
జిగ్యే సర్వా న్మహాబాహుః సేక ఏవ మహారథః॥ ౭౨

తా. అప్పుడు పాంచాల రాజునకును ఇతర రాజులకును యుద్ధము జరిగెను అప్పుడు మహారథికుడగు నాతడొక్కడే యా రాజులనందరిని జయించెను.

శ్లో॥ పలాయితేషు భూపేషు నానాదేశపథిష్వపి।
రాజ్ఞా కోశం గజానశ్వాన్ స్వయం జగ్రాహ వీర్యవాన్॥

తా. అప్పుడు రాజులందరు నోడిపోయి యనేక మార్గములగా పారిపోయిరి పిమ్మట నా రాజు బలము గలవాడైనందున ధన గృహములను ఏనుగులను గుఱ్ఱములను తన స్వాధీనము చేసికొనియెను.

శ్లో॥ అశ్వానాం నిర్బుదం చైవ గజానాం చ త్రికోటికం।
రథానా మర్బుదం చైవ దీర్ఘగ్రీవాయుతం తథా॥ ౭౪
రాసభానాం త్రిలక్షాణి ప్రాపయామాస తాం పురీం॥

తా. అనేక గుఱ్ఱములు మూడుకోట్ల యేనుగులు అర్బుదము రథములు పదివేల ఒంటెలు మూడు లక్షలు గాడిదెలు ఆ పట్టణములో వ్యాపించియుండెను.

శ్లో॥ వైశాఖధర్మమహాత్మ్యాత్ క్షణాత్సర్వే చ భూభృతః॥ ౭౫
కరదా భగ్నసంకల్పాః పాదాక్రాంతా బభూవిరే॥

తా. వైశాఖధర్మప్రభావముచే శత్రురాజులందరును తమ సంకల్పములన్నియును వ్యర్థమైనందున ఆక్షణకాలములోనే పాదాక్రాంతులై పన్నుల నిచ్చువారైరి.

శ్లో॥ సుభిక్ష మతులం చాసీత్పాంచాలవిషయేషు చ। ౭౬
ఏకచ్ఛత్ర మభూ ద్రాజ్యం ప్రసాదా న్మధుఘాతినః॥

తా. విష్ణుమూర్తియొక్క అనుగ్రహమువలన పాంచాలదేశములయందు మిక్కిలి సుభిక్షముగా నుండెను. మరియు చతుస్సముద్ర పర్యంతము రాజ్యము నేలెను.

శ్లో॥ పుత్రాః పంచాపి తస్యాస న్శౌర్యౌదార్యగుణాన్వితాః॥ ౭౭
ధృష్టకీర్తి ర్ధృష్టకేతు ర్ధృష్టద్యుమ్న స్తథా పరే।
విజయ శ్చిత్రకేతు శ్చ మయూరధ్వజసన్నిభాః॥ ౭౮

తా. పరాక్రమము ఔదార్యము మొదలగు గుణములతో గూడినవారును కుమారస్వామితో సమానమైనవారును ధృష్టకీర్తి, ధృష్టకేతువు, ధృష్టద్యుమ్నుడు, విజయుడు, చిత్రకేతువు, అను పేరుగల అయిదుగురు తనయులు ఆరాజునకు కలిగిరి.

శ్లో॥ అనురక్తాః ప్రజా శ్చాసన్ ధర్మేణ ప్రతిపాలితాః।
వైశాఖస్య ప్రతాపేన ప్రత్యయ స్తత్ క్షణా దభూత్॥

తా. ధర్మముగా పరిపాలనజేయుటచే ప్రజలందరు ననురాగము కలవారైరి. కాబట్టి క్షణకాలములోనే యటువంటి ప్రభావము కలుగుటచే వైశాఖ ధర్మములయందు మిక్కిలి నమ్మకము కలిగెను.

శ్లో॥ పున శ్చకార తా న్ధర్మా న్పాంచాలనగరీశ్వరః।
అకాముకేన చిత్తేన ప్రీతయే మధుఘాతినః॥ ౮౦

తా విష్ణుమూర్తి యొక్క ప్రీతికొఱకు ఆ పాంచాల దేశపురాజు ఫలమున పేక్షింపని మనస్సుకలవాడై తిరిగి యా వైశాఖధర్మములను జేయుచుండెను.

శ్లో॥ ధర్మేణా నేన సంతుష్టో భగవాన్మధుసూదనః।
అక్షయాయాం తృతీయాయాం ప్రత్యక్ష స్సమజాయత॥ ౮౧

తా. ఈప్రకారమా రాజుచే జేయబడిన వైశాఖధర్మమువలన సంతోషించినవాడై షడ్గుణైశ్వర్య సంపన్నుండగు విష్ణుమూర్తి వైశాఖశుద్ధ తృతీయయగు అక్షయ తృతీయయందు ప్రత్యక్షమాయెను.

శ్లో॥ తం దృష్ట్వా విస్మిత శ్చా భూత్ పరమాత్మాన మచ్యుతం।
నారాయణం చతుర్బాహుం శంఖచక్రగదాధరం॥ ౮౨
పీతాంబరధరం దేవం వనమాలావిభూషితం।
సలక్ష్మీకం సానుగం చ గరుడోపరిసంస్థితం॥ ౮౩

తా. పరమాత్మ స్వరూపుడును నాశన రహితుడైన వాడును నాలుగు చేతులు గలవాడును శంఖముచక్రము గద మొదలగు ఆయుధములను ధరించిన వాడును పట్టుబట్టలను ధరించినవాడును ప్రకాశించు వాడును తులసీ మాలికను ధరించినవాడును లక్ష్మితోడను భృత్యులతోడను గూడియున్న వాడును గరుడ వాహనము నెక్కినవాడు నగు విష్ణుమూర్తిని జూచి యాశ్చర్యమును పొందెను.

శ్లో॥ నిరీక్ష్య మస్సహం తేజ స్సద్యో మీలితలోచనః।
ఉత్పతంత్సంపతన్ హర్షా న్నృత్యన్మత్త ఇవా భ్రమత్॥ ౮౪

తా. ఇట్లు ప్రత్యక్షమైన యానారాయణమూర్తి యొక్క విశేషమైన తేజస్సును జూడ లేక అప్పుడే కన్నులను మూసికొని యిట్టి గొప్పభాగ్యము దొరకెనని సం

తోషముచే మదించినవాని వలెను పిచ్చి పట్టినవానివలెను ఎగిరి గంతులు వేయుచు తిరుగుచుండెను.

శ్లో॥ పులకాంకితసర్వాంగో గళద్బాష్పాకులేక్షణః।
తుష్టావ పరయా భక్త్యా ప్రాంజలిః ప్రణతో భువి॥ రాగి

తా. సమస్త అవయవములయందు పులకాంకురములగలవాడై కండ్లవెంట నానంద బాష్పము లొలుకుచుండ విశేషమగు భక్తితోగూడి భూమియందుపడి సాష్టాంగ దండ ప్రణామము జేసెను.

ఇతి శ్రీ స్కాందపురాణే వైశాఖమాహాత్మ్యే నారదాంబరీష సంవాదే పాంచాలదేశాధిపతే ర్ద్వయప్రాప్తిదరిద్రనాశనం నామ పంచదశోధ్యాయః

## అథ షోడశోధ్యాయః

శ్రుతదేవఉవాచ॥

శ్లో॥ తద్దర్శనాహ్లాదపరిప్లుతాశయ
స్సద్య స్సముత్థాయ ననామమూర్ధ్నా॥
చిరం సుభాష్పాకులలోచనై రముం
విశ్వాత్మదేవం జగతా మధీశం॥ ౧

తా. శ్రుతదేవుడు చెప్పుచున్నాడు. ఆ భగవంతుని దర్శనముచే సంతోష చిత్తుండై ఆనంద బాష్పపూరితమైన నేత్రములచే నా భగవంతుని జూచుచు ప్రపంచము నందు ఆత్మ స్వరూపముగా నిండియున్న వాడును ప్రపంచమున కధిపతియునగు భగవంతునకు సాష్టాంగ దండప్రణామము జేసెను.

శ్లో॥ దధార పాదా వవనిజ్య తజ్జలం యత్పాదజా బ్రహ్మజగత్పునాతి,
సమర్చయామాస మహావిభూతిభి ర్మహార్హవస్త్రాభరణానులేపనైః॥

తా. ఏ భగవంతుని పాదముల వలన జనియించిన గంగ బ్రహ్మను జగత్తును పవిత్రముజేయునో అట్టి భగవంతుని పాదములను ప్రక్షాళనముజేసి యా తీర్థమును తన దేహము నందంతటను జల్లుకొని విశేష విలువగల వస్త్రములు ఆభరణములు గంధములు పుష్పములు మొదలగు వానిచే పూజించెను.

శ్లో॥ సృగ్ధూపదీపామృత భక్షణాదిభి స్త్వగ్గాత్రవిత్తాత్మసమర్పణేన। తు
ష్టావ విష్ణుం పురుషంపురాణం నారాయణంనిర్గుణ మద్వితీయం॥ 3

తా. సమస్త ప్రపంచమును వ్యాపించినవాడును ప్రాచీన పురుషుండును గుణర హితుడును తనతో సమానమైనవాడు లేనివాడు నగు నారాయణుని స్తోత్రముజేసెను.

శ్లో॥ నిరంజనం విశ్వసృజా మధీశం పరాత్పరం పద్మభవాదివందితం।
యన్మాయయా తత్వవిదుత్తమా జనా విమోహితా విశ్వసృజా
మధీశ్వరం॥ ४

తా. సంబంధ రహితుడును ప్రపంచ సృష్టికర్తలకు నధిపతి యైనవాడును జీవు నికంటె పరమైనవాడును బ్రహ్మాది మొదలగు వారిచేతను నమస్కరింప బడువాడును జ్ఞానముచే నధికులైయుండు వారినైనను తన మాయచే మోహింపజేయువాడు నగు భగ వంతుని స్తుతించెను.

శ్లో॥ ముహ్యంతి మాయాచరితేషు మూఢా
గుణేషు చిత్రం భగవద్విచేష్టితం।
అనీహఏతద్బహుధైక ఆత్మనా
సృజత్యవత్యత్తిసజ్జతేప్యథ ॥ ౫

తా. మూఢులు భగవంతునియొక్క మాయవలన గలుగు కార్యములచే మోహ పడుచుందురు. భగవంతుని చేష్టలన్నియు చిత్రముగా నుండును. భగవంతుడు తనకే మియు కోరిక లేకయే తానే అనేకవిధములుగా ఈ ప్రపంచమును సృజించును పో షించును నశింపుజేయును.

శ్లో॥ సమస్తదేవాసుర సౌఖ్యదుఃఖ ప్రాప్త్యైభవాన్పూర్ణమనోరథోపి।
తత్రాపి కాలే స్వజనాభిగుప్త్యై బిభర్షి సత్వం ఖలు సిగ్రిహాయ॥
తమోగుణం రాక్షసబంధనాయ రజోగుణం నిర్గుణవిశ్వమూర్తే।
దిష్ట్యా త్వదంఘ్రిం ప్రణతాఘనాశనం తీర్థాస్పదం హృది ధృతం
సువిపక్వయోగైః॥

తా. గుణరహితుడవును ప్రపంచ స్వరూపుడవు నగు ఓ భగవంతుడా! నీవు సిద్ధించిన సమస్తకోరికలు గలవాడవైనను సమస్తదేవతలను సుఖపెట్టుట కొరకును రాక్షసులను హింసించుటకొఱకు నవతారము లెత్తుచు సత్వగుణమును పొంది నీ భక్తు

లను పోషింపుచు తమోగుణము ననుసరించి దుష్టులను శిక్షించుచు రజోగుణము నవలంబించి రాక్షసులను బంధింపుచుండుదువు. కాబట్టి నీకు నమస్కరించు వారియొక్క పాపములను నశింపజేయు నదియు గంగాది సమస్త తీర్థములకు స్థానమైనదియు నగు నీ పాదమును నా పూర్వజన్మ సుకృతము ఫలించినదగుటచే దైవవశమున నా హృదయమందు నిల్పి ధ్యానము జేయగలుగుట సంభవించెను.

శ్లో॥ ఉత్సిక్తభక్త్యుపహృతాశయజీవభావాః
ప్రాపుర్గతిం తవ పదస్మృతిమాత్రతో యే।
భవాఖ్యకాలోరగపాశబంధః
పునః పునర్జన్మజరాదిదుఃఖైః॥ ౮
భ్రమామి యోనిష్వహ మాఖుభక్షువ
త్ప్రవృద్ధవర్ష్మా స్తవ పాదవిస్మృతిః।
నూనం న దత్తం న చ తే కథాశ్రుతా
న సాధవో జాతు మయాపి సేవితాః॥ ౯

తా. విశేషమైన భక్తికలిగి తాను జీవుడ ననెడు భేదము నశింపజేసి నీ పదస్మరణ జేసినవారు నీలోకమును పొందుదురు. నేను నీ పాదస్మరణ జేయనివాడనై సంసారమనెడు గొప్ప సర్పముచే జుట్టుకొనబడి జన్మము ముదిమి మృత్యువు మొదలగువాని పొందుచు ననేక యోనులయందు బుట్టుచు ఎలుకలను తిని శరీరము పెంచుకొనిన పిల్లివలెనే తిరుగుచుంటిని గాని యొక దానమునైన నియ్యనైతిని నీకథను విననైతిని సత్పురుషుల నొకప్పుడును సేవించనైతిని.

శ్లో॥ తేనారిభి ర్ధ్వస్తపరార్ధ్యలక్ష్మీ
ర్వనం ప్రవిష్ట స్స్వగురూ హ్యహాంస్మరన్।
స్మృతౌ చ తౌ మాం సముపేత్య దుఃఖా
త్సంబోధయాంచక్రతురార్తబంధూ॥ ౧౦

తా. నిన్ను స్మరింపని కారణమున విశేషమగు రాజ్యము శత్రులచే హరింపబడగా వనమును ప్రవేశించి కొంతకాలముండి పిమ్మట గురువులను స్మరించితిని. అంతట ఆపద్బాంధవులగువారు నా వద్దకు వచ్చి దుఃఖమును పోగొట్టిరి.

శ్లో॥ వైశాఖధర్మై శ్శ్రుతిచోదితై శ్శుభై
స్స్వర్గాపవర్గాదిపుమర్థహేతుభిః।

తదోఽర్ధతో హం కృతవాం త్సమస్తా
ఇచ్ఛభావహా న్మాధవమాసధర్మాౕ ౧౧

తా. శ్రుతులయందు చెప్పబడినవియు శుభముల నొసగునవియు మోక్షము స్వర్గము మొదలగు పురుషార్థములకు కారణము లైనవియు నగు వైశాఖ ధర్మములను ఆ మునులు బోధింపగా శుభకరంబులగునట్టి వైశాఖమాస ధర్మముల నన్నియు జేసితిని.

శ్లో॥ తస్మా దభూ న్మే పరమప్రసాద
స్తేనాఖిలా స్సంపద ఊర్జితాఇమాః।
వాగ్ని ర్న సూర్యో న చ చంద్రతారకా
న భూ ర్జలం ఖం శ్వసనో థ వాఙ్మనః॥ ౧౨
ఉపాసితా స్తే పిహారం త్యయం చిరా
ద్విపశ్చితో ఘ్నంతి ముహూర్తసేవయా।
యస్మన్యసే త్వాం భవితా పి భూరిశ
స్త్వత్క్షేమణాం స్త్వత్పదన్యస్తచిత్తాః॥ ౧౩

తా. ఆ కారణమువలన గొప్పది యగు నీ యనుగ్రహము కలిగెను. అందువలన యీ సమస్త సంపత్తులు పొందబడినవి. అగ్నియు సూర్యుడు చంద్రుడు నక్షత్రములు భూమి జలము ఆకాశము వాయువు వాక్కు మనస్సు మొదలగు వానిని నే సేవించలేదు. అలాగున వానిని స్మరించిన యెడల చాలకాలము గడచిన పిమ్మట నా యగ్నిహోత్రాదులును నశించునవియే. కాబట్టి విద్వాంసులు ఒక్క క్షణకాలమైనను నిన్ను సేవించి తరించినవార లగుదురు. ఈ పణత్రయమును వదలి నీ పాదపద్మముల యందు ధ్యానము గలవారికి నీ వేది యివ్వదలచితివో అది యంతయు సంభవించును.

శ్లో॥ నమ స్స్వతంత్రాయ విచిత్రకర్మణే
నమః పరస్మై సదనుగ్రహాయ।
త్వన్మాయయా మోహితో హం గుణేషు
దారార్థరూపేషు భ్రమామ్య నర్థదృక్॥

తా. స్వతంత్రుడవును ఆశ్చర్యకరమైన కార్యములను జేయువాడవును సత్పురుషులయం దనుగ్రహము కలవాడవును పరమ పురుషుడవగు నీకొఱకు నమస్కారము. నీ మాయచే మోహింపబడినవాడనై నేను అనుపయోగ విషయము

లయందు వాంఛగలిగి త్రిగుణస్వరూపములగు భార్యాపుత్రధనాదులయందు ప్రేమగలిగి వర్తింపుచుంటిని.

శ్లో॥ త్వత్పాదపద్మం సతిమూలనాశనం సమస్తపాపాపహరం సునిర్మలం।
సుఖేచ్ఛయా సర్వనిదాన భూతై స్సుతాత్మదారై ర్మమతాభియుక్తః॥ న క్వాపి నిద్రాం లభతే న శర్మ ప్రవృద్ధతర్షః పున రేవ తస్మిన్। లబ్ధ్వా దురాపం నరదేవజన్మత్వం యత్నత స్సర్వపుమర్థహేతుః॥ ౧౬

తా. ఓ స్వామీ! అజ్ఞానమును నశింపుజేయునదియు సమస్త పాపములను పోగొట్టునదియు కలుష రహితమైన నీ పాదపద్మముల సేవ యుండగా దానిని విడచి సుఖమునందు అపేక్షచే అనర్థములకు కారణములగు దారాపుత్రాదుల యందు మిక్కిలి ప్రేమగలవాడై విశేషమగు సంతోషమును పొందుచు తాను పొందశక్యము గాని బ్రాహ్మణ జన్మమెత్తియు సమస్త విధములను పురుషార్థములకు కారణుడవైన నిన్ను సేవింపక యాదారాదులనే ప్రేమించి యొకప్పుడైనను నిద్రను గాని సుఖమును గాని పొందకుండును.

శ్లో॥ పదారవిందం న భజామి దేవ సంమూఢచేతావిషయేషు లాలసః।
కరోమి కర్మాణి సునిశ్చిత స్సన్ ప్రవృద్ధతర్షా త్తదపేక్షయా దరన్॥ ౧౭

తా. అజ్ఞానము గలవాడనై విషయములయందు ఆసక్తిగలిగి నీ పాదపద్మముల సేవింపనైతిని. ఓ స్వామీ! ఆ విషయములయందు అపేక్షచే నేమియు నివ్వాక కర్మములను చేయుచు మిక్కిలి సంతోషము గలవాడనై యుంటిని.

శ్లో॥ పున శ్శుభాయా మహ మద్య భూయా
మిత్యేవ చింతాశతలోలమానసః।
తదైవ జీవస్య భవే త్కృపావిభో
దురంతశక్తే స్తవ విశ్వమూర్తేః॥ ౧౮

తా. ఓ స్వామీ! ఇప్పుడు చేయదలయుననియు తిరిగి చేయవలయుననియు ననియెడు సంకల్పములతో గూడియుండును గాని జేయకుండును. ఎప్పుడు జేయునో అప్పుడే అశక్యమైన శక్తిగల వాడవును ప్రపంచ స్వరూపుడవు నగు నీయొక్క దయ జీవునియందు కలుగును.

శ్లో॥ సమాగమ స్స్యా స్మహతాం హి పుంసాం
భవాంబుధి ర్యేనహి గోష్పదాయతే।
సత్సంగమో దేవ యదైవ భూయా
త్త్వాత్మీశ దేవే త్వయి జాయతే మతిః॥

తా. ఓ స్వామీ! సత్కర్మములను జేయుటవలన సంసారసాగరమును గోష్పద మునువలెనే చులకన దాటగలిగిన సత్పురుషుల సహవాసము సంభవించును. ఓ స్వామీ! సత్సహవాసము కలుగుటవలన దేవుండవగు నీయందు భక్తి కలుగును.

శ్లో॥ సమస్తరాజ్యోపగమం హి మన్యే
హ్యనుగ్రహం తే మయి జాతమంజసా।
యధార్థ్యతే బ్రహ్మసురాసురాద్యై
ర్నివృత్తతృష్ణై రపి హంసయూథైః॥

తా. బ్రహ్మ సమస్త దేవతలు రాక్షసులు మొదలగు వారిచేతను కోరికలన్నియు వశించిన పరమహంసులగు జ్ఞానులచేతను ఎటువంటి నీ యనుగ్రహము కోరబడునో అట్టి నీ యనుగ్రహము నాయందు శీఘ్రముగా కలిగెను. దానినే సమస్త రాజ్య సుఖములను పొందినట్లు తలంచుచున్నాను.

శ్లో॥ ఇత స్స్మరా మ్యచ్యుత మేవ సాదరం
భవాపహం పాదసరోరుహం విభో।
అకించనప్రార్థ్య మమందభాగ్యదం
న కామయేఽ న్య త్తవ పాదపద్మాత్॥ ౨౧

తా. ఓసామీ! నాశన రహితమైనదియు సంసారమును పోగొట్టునదియు ఐశ్వర్యము లేనివారలచేతనే స్మరింపబడుచున్నదియు విశేషమగు నైశ్వర్యమునిచ్చునదియు నగు నీపాదపద్మమునే ఇంతటనుండి స్మరించుచున్నాను. నీపాదపద్మము కంటె యొకదానిని నే కోరుటలేదు.

శ్లో॥ అతో న రాజ్యం న సుతాదికోశం
దేహేన శశ్వత్పతతా రజోభువా।
భజామి నిత్యం తదుపాసితవ్యం
పాదారవిందం మునిభి ర్విచింత్య॥ ౨౨

తా. మృత్తిక వలన కలిగిన ఘటమువలెనే యీదేహము రెప్పుడు నశించు స్వభావము కలది గనుక రాజ్యమును గాని పుత్రులను భార్యను గాని ధనమును గాని కోరను. ఇక నేమియనగా ? శాశ్వతమైనదియు సేవించ తగినదియు మునీశ్వరులచే ధ్యానముజేయబడు చున్నదియునగు ఆ ప్రసిద్ధమైన నీపాద పద్మమును సేవించుమన్నాను.

శ్లో॥ ప్రసీద దేవేశ జగన్నివాస
స్మృతి ర్యథాస్యా త్తవ పాదపద్మే।
సక్తి స్సదా గచ్ఛతు దారకోశ
పుత్రాత్మదిష్వేషు గుణేషు మేప్రభో॥ ౨౩

తా. దేవతులకు నధిపతియు జగత్తులకు నాధారభూతుండవగునో భగవంతుడా ! అనుగ్రహింపుము. నీపాదపద్మములయందు భక్తికలుగునట్లుజేయుము. త్రిగుణవికారములగు భార్యా పుత్రులు ధనము స్వకీయవస్తువులు మొదలగు వానియందాసక్తి పోవునటులజేయుము.

శ్లో॥ భూయా న్మనః కృష్ణపదారవిందయో
ర్వచాంసి తే దివ్యకథానువర్ణనే।
నేత్రే మమ స్యా త్తవ విగ్రహేక్షణే
శ్రోత్రే కథాయాం రసనా త్వదర్పితా॥ ౨౪

తా. ఓస్వామీ ! నామనస్సు విష్ణుమూర్తి వగు నీపాదపద్మముల ధ్యానమునందును నావాక్కులు శ్రేష్ఠమగు నీకథలను వర్ణించుటయందును నేత్రములు నీశరీరమును జూచుటయందును చెవులు నీకథలను వినుటయందు నుండుగాక. నాలుక నీయందే సమర్పింప బడినది.

శ్లో॥ ఘ్రాణం చ త్వత్పాదసరోజసౌరభే
త్వద్భక్తగంధాదివిలేపనే త్వక్।
స్యాతాం చ హస్తౌ తవ మందిరే విభో
సంమార్జనాద్యామమ నిత్య మేవ॥ ౨౫

తా. ముక్కు నీపాదపద్మములయందుండు పరిమళమును వాసన చూచుట యందును శరీరము నీభక్తుల గంధము మొదలగు వానిచే పూయబడుటయందును ఓస్వామీ ! నీయాలయమునందు నిత్యమును ఊడ్చుట మొదలగు పనులయందు నాహస్తములు ప్రవర్తించుగాక.

శ్లో॥ పాదౌ విభోః క్షేత్రకథానుసర్పణే
మూర్ధా చ మే స్యాత్త్వవందనే నిశం।
కామశ్చమే స్యాత్త్వ సత్కథాయాం
బుద్ధిశ్చ మే స్యాత్త్వచింతనే నిశం॥ ౨౬

తా. పాదములు ప్రభువగు నీయొక్క కథలను వినుట కొఱకు క్షేత్రములయం దు తిరుగుట కొఱకు శిరస్సు యెల్లప్పుడు నీకు సాష్టాంగ దండప్రణామము జేయుట కును ప్రవర్తించుగాక. నా కోరిక నీ మంచి కథలను వినుటయందే యుండుగాక. బుద్ధి నిన్ను స్మరించుటయందే యుండునుగాక.

శ్లో॥ దినాని మే స్యుస్తవ సత్కథోదయై
రుద్గీయమానై ర్మునిభి ర్గృహాగతైః।
హీనప్రసంగై స్తవ మే న భూయాత్
క్షణం నిమేషార్ధ మథాపివిష్ణోః॥ ౨౭

తా. నీ సత్కథలచేతను స్తోత్రముజేయు తగినవారును గృహమునకు నతిథులుగా వచ్చిన మునీశ్వరుల పూజించుటచేతను నే జీవించెడు దినములు గడచుగాక. విష్ణుమూర్తి చరిత్రములేని కథలచే నొక్క నిమిషముగాని యర నిమిషముగాని ప్రవర్తింపకుండు నటుల్ల అనుగ్రహింపుము. అనగా యెల్లప్పుడు విష్ణుస్మరణ మాత్రమే యుండవలె ననుట.

శ్లో॥ న పారమేష్ఠ్యం న చ సార్వభౌమం
న చాపవర్గం స్పృహయామివిష్ణో।
త్వత్పాదసేవాం చ సదైవ కామయే
ప్రార్థ్యాం శ్రియా బ్రహ్మభవాదిభి స్సురైః॥ ౨౮

తా. ఓవిష్ణుమూర్తి! బ్రహ్మపదమును గోరను చతుస్సముద్ర పర్యంత రాజ్య మును గోరను స్వర్గాది లోకముక్తిని గోరను, ఇక నేమి కోరెదననగా లక్ష్మీదేవి బ్రహ్మసాంబమూర్తి ఇంద్రుడు మొదలగు సమస్త దేవతలచేతను గోరబడు నీపాదసేవ ను మాత్రమే నేనెల్లప్పుడు గోరుచున్నాను.

శ్లో॥ ఇతి రాజ్ఞాస్తుతో విష్ణుః ప్రసన్నః కమలేక్షణః।
మేఘగంభీరయా వాచా త మువాచ క్షితీశ్వరం॥

తా. పద్మములవంటి నేత్రములు గల విష్ణుమూర్తి యీ ప్రకారము ఆరాజు చే స్తుతింపబడి యనుగ్రహముకలవాడై మేఘధ్వనులవలె నే గంభీరములగు వాక్కుల చే నిట్లు ఆరాజుతో పలికెను.

శ్రీ భగవానువాచ॥

శ్లో॥ జానే త్వాం దాసవర్యం మే నిష్కాముక మకల్మషం।
అథాపి తే ప్రదాస్యామి వరం దైవతదుర్లభం॥ ౩౦

తా. భగవంతుడు చెప్పుచున్నాడు. ఓరాజా! కోరిక రహితుడవును దోషరహితుడవగు నిన్ను నాకు ముఖ్యమైన దానునిగా నెతింగితిని. మరియు దేవతలకైనను పొంద శక్యముగాని వరమును నీకు నిచ్చెదను.

శ్లో॥ ఆయుష్యం చాయుతం దివ్యం సంపద శ్చ నరేశ్వర।
భక్తిర్మయి దృఢా భూయా దంతే సాయుజ్య మేవ చ॥

తా. ఓరాజా! పదివేల దివ్య సంవత్సరములు నీకు ఆయుర్దాయమును సంపత్తులును నాయందు చలింపనిభక్తియునుండి జన్మాంతరంబున నా సాయుజ్యమును పొందగలవు.

శ్లో॥ త్వయా కృతేన స్తోత్రేణ మాం స్తువంతి చ యే భువి।
తేషాం తుష్టః ప్రదాస్యామి భుక్తిం ముక్తిం న సంశయః॥ ౩౧

తా. ఓరాజా! నీచే జేయబడిన యీస్తోత్రముచే నెవరు యీ భూమిలో నన్ను స్తుతింతురో నేను సంతోషించి అటువంటి వారికి ఇహలోకమున నైశ్వర్యమును జన్మాంతమందు ముక్తినిచ్చెదను.

శ్లో॥ తృతీయై షా క్షయా నామ భువి ఖ్యాతా భవిష్యతి।
యస్యాం తవ ప్రసన్నో హం భుక్తిముక్తి ఫలప్రదః॥

తా. ఏదినమందు నీకు ప్రత్యక్షమై నేను భుక్తిని ముక్తిని ఫలముల నిచ్చితినో ఆదినము అక్షయ తదియ యని భూమిలో ప్రసిద్ధికెంది యుండును.

శ్లో॥ యే కుర్వంతి నరా మూఢా స్స్నానదానాదికాః క్రియాః।
వ్యాజేనాపి స్వభావా ద్వా యాంతి మత్పద మవ్యయం॥

తా. ఏమూఢులైనను కపటముచే గాని లేక స్వతస్సిద్ధముగా గాని వైశాఖ మాసములో స్నానము దానము మొదలగు క్రియలను చేయుదురో వారు నాశన రహితమైన స్థానమును జేరుదురు.

శ్లో॥ యే చాక్షయతృతీయాయాం పిత్రూ నుద్దిశ్య మానవాః।
శ్రాద్ధం కుర్వంతి తేషాం వై త దానంత్యాయ కల్పతే॥

తా. ఏ మనుష్యులు అక్షయ తదియయందు పితృదేవతలను గురించి శ్రాద్ధము ను జేయుచున్నారో వారు చేసిన శ్రాద్ధము విశేషఫలమునొసగును.

శ్లో॥ న చానయా తిథి ర్లోకే సమా వా నాధికా భువి।
అస్యాం కృతం స్వల్ప మపి తదక్షయ్యఫలం భవేత్॥ ३౬

తా. లోకములో అక్షయతదియ తో సమానమైన తిథిగాని అధికమైన తిథిగాని లేదు. ఈ అక్షయతదియయందు చేయబడిన ధర్మము స్వల్పమైనను శాశ్వతమైన ఫల మునిచ్చుచున్నది.

శ్లో॥ యో గాం దద్యా న్నృపశ్రేష్ఠ బ్రాహ్మణాయ కుటుంబినే।
సర్వసంపత్ప్రవర్షాఖ్యా భుక్తిముక్తీః కరే స్థితా॥ ३౭

తా. ఓరాజోత్తమా !. కుటుంబవంతుడగు బ్రాహ్మణునకు నెవడు గోదానము జేయుచున్నాడో అట్టివానికి సమస్తసంపత్తులను సంభవించి, భుక్తియు, ముక్తియు హస్తమందుండు నట్లుగా సులభమై యుండును.

శ్లో॥ యో హి దద్యా దనడుహం సర్వపాపవినాశనం।
కాలమృత్యువిముక్త స్స దీర్ఘాయుష్య మవాప్నుయాత్ ३౮

తా. ఎవడు సమస్త పాపములను పోగొట్టు నట్టు వృషభదానమును జేయుచు న్నాడో అట్టివాడు మృత్యుభయము లేనివాడై దీర్ఘా యుష్యమును పొందును.

శ్లో॥ వైశాఖమాసే యో ధర్మాన్ కురుతే మత్ప్రియావహాన్।
తేషాం మృత్యుజరా జన్మభయం పాపం హరామ్యహం॥

తా. ఎవడు వైశాఖ మాసములో నాకు ప్రియకరమైన ధర్మములను జేయుచు న్నాడో అట్టివారికి మృత్యువు ముదిమి జన్మము భయము పాపము మొదలగు వానిని నే పోగొట్టు చున్నాను.

శ్లో॥ యథా వైశాఖధర్మై స్తు తుష్ట స్స్యాం సకలై రపి।
మాసధర్మై ర్న తుష్ట స్స్యాం మాసో మే మాధవః ప్రియః॥

తా. వైశాఖ మాసము నాకు ప్రియమైనది కాబట్టి వైశాఖ మాసములో జేయ బడిన సమస్త ధర్మములచేతనే సంతోషించి నట్లుగా నితర మాసముల యందు చేయబ డిన ధర్మములచే నేను సంతోషించను.

శ్లో॥ సర్వధర్మోజ్ఝితా వాపి బ్రహ్మచర్యవివర్జితాః।
వైశాఖమాసనిరతా యాంతి మత్పద మవ్యయం॥ ౪౧

తా. సమస్త ధర్మములను విడిచినవారైనను బ్రహ్మచర్యము విడిచిన వారైనను వైశాఖమాస ధర్మములను జేయుటయందాసక్తి గలవారు నాశన రహితమగు నా స్థానమును పొందుదురు.

శ్లో॥ యద్దురాపం తపోభి శ్చ సాంఖ్యయోగై ర్మఖై రపి।
తద్ధామ పరమం యాంతి వైశాఖనిరతా నరాః॥ ౪౨

తా. సాంఖ్యులు మొదలగువారు తపస్సులచేతను యోగములచేతను యజ్ఞములచేతను యేస్థానమును పొందలేరో, అటువంటి యుత్తమ స్థానమును వైశాఖమాస ధర్మములను జేయువారు పొందుదురు.

శ్లో॥ అపి పాపసహస్రం వా మాసో యం హరతే నఘ।
ప్రాయశ్చిత్తవిహీనం వా మత్పాదస్మరణం యథా॥ ౪౩

తా. ఓ దోషరహితుడా! ఈ వైశాఖమాసము వెయ్యి దోషములైనను హరించును. ప్రాయశ్చిత్తము జేయకున్నను నా పాదస్మరణము జేసిన సమస్త పాపములు నశించినరీతిగానే నశించును.

శ్లో॥ గురూపదిష్టః కాంతారే వైశాఖే నిరతో భవాన్।
మామారాధ్య జగన్నాథం తేనాప్త మఖిలం నృప॥ ౪౪

తా. ఓ రాజా! గురువు ఉపదేశము జేసినరీతిగా అడవియందుండినవాడవై వైశాఖమాసధర్మముల యందాసక్తి గలవాడవై ప్రపంచమున కధిపతినగు నన్ను సేవించితివేని సమస్తమును పొందగలవు.

శ్లో॥ ధర్మేణా నేన సంప్రీతః ప్రత్యక్షో హం భవామి తే।
భుక్త్వా భోగా న్యథాకామాన్ దేవై రపి సుదుర్లభాన్॥ ౪౫

తా. ఓ రాజా! నీవు చేసిన ధర్మములచే సంతోషించినవాడనై నీకు ప్రత్యక్షమైతిని. కాబట్టి దేవతలకైనను పొందశక్యముగాని యీ సమస్త భోగములను నీ యిష్టానుసార మనుభవించి జన్మాంతంబున నా లోకమును పొందగలవు.

శ్లో॥ ఇతి తస్మై వరం దత్వా దేవదేవో జనార్దనః।
పశ్యతా మేవ సర్వేషాం తత్రై వాంతరధీయత॥ ౪౬

తా. దేవతలకు దేవుండగు విష్ణుమూర్తి యీ ప్రకారము పలికి యా రాజునకు కోరిన వరములనిచ్చి వారందరు చూచుచుండగా నదృశ్యుండాయెను.

శ్లో॥ తతో భూపాలవర్యో సౌ బభూవాత్యంతవిస్మితః।
హృష్టపుష్టతను ర్యద్వ లబ్ధనష్టధనో యథా॥ ౮౭

తా. ఓ రాజా! అనంతరమా రాజు మిక్కిలి యాశ్చర్యము గలవాడై సంతోషముతో గూడినట్టియు బలసినట్టియు శరీరము గలవాడై దొరకబడిన ధనము పోయిన వాడువలెనే యాశ్చర్యముపడెను.

శ్లో॥ తత శ్శశాస తత్పృథ్వీం తచ్చిత్త స్తత్పరాయణః।
మహద్భి ర్బోధితో నిత్యం గురుభి శ్చ నిరంతరం॥ ౮౮

తా. అనంతరమా రాజు ఆ భగవంతునియందు చిత్తము గలవాడై ఆయననే నిత్యముస్మరింపుచు నెల్లప్పుడు మహానుభావులచేతను గురువులచేతను బోధింపబడుచు భూమినిపరిపాలించుచుండెను.

శ్లో॥ నాన్యం ప్రియ తమం మేనే వాసుదేవ మృతే నృపః।
యత్సంపర్కా త్ప్రియా ఆస న్దారామాత్యసుతాదయః॥

తా. ఆరాజు విష్ణుమూర్తిని గాక మరియొకరిని ప్రియుడైన వానిగా దలచ లేదు. భార్య పుత్త్రుడు మంత్రి మొదలగు వారిని కూడ విష్ణుమూర్తి యొక్క అనుగ్రహము వలన నేప్రియులైన వానిగా తలచును.

శ్లో॥ సర్వా న్ధర్మాం శ్చకారా సౌ వైశాఖోక్తా న్నృపః పునః।
తేన పుణ్యప్రభావేన పుత్రపౌత్రాదిభి ర్వృతః॥ ౯౦

తా. ఆరాజు వైశాఖ మాసములో జేయదగిన సమస్త ధర్మములను మాటిమాటికి జేయుచుండెను. ఆరాజు ఆపుణ్య విశేషము చేతనే పుత్రుడు పౌత్రుడు మొదలగు సమస్త సంపత్తులతో గూడుకొనెను.

శ్లో॥ భుక్త్వా మనోరథాం త్సర్వా న్దేవానా మపి దుర్లభా న్।
అంతే జగామ సాయుజ్యం విష్ణో ర్దేవస్య చక్రిణః॥ ౯౧

తా. ఆరజు దేవతలకైనను పొందశక్యముగాని సమస్త కోరికలననుభవించి జన్మాంతమందు చక్రమును ధరించిన వాడును దేవుడునగు విష్ణుమూర్తి యొక్క సాయుజ్యమును పొందెను.

శ్లో॥ య ఇదం పరమాఖ్యానం శృణ్వంతి శ్రావయంతి చ।
తే సర్వేపాపనిర్ముక్తా యాంతి విష్ణోః పరం పదం॥ ౯౨

తా. ఉత్తమమైన యీ చరిత్రము నెవరు వినుచున్నారో యితరులకు వినుపించుచున్నారో వారందరు సమస్త పాపముల వలనను విడువబడి విష్ణుమూర్తియొక్క యుత్తమమగు లోకమును పొందుదురు.

ఇతి శ్రీ స్కాందపురాణే వైశాఖమాహాత్మ్యే నారదాంబరీష
సంవాదే పాంచాలాధిపతే స్సాయుజ్యప్రాప్తి ర్నామ
షోడశోధ్యాయః

## అథసప్తదశోధ్యాయః

శ్రుతకీర్తిరువాచ॥

శ్లో॥ వైశాఖధర్మా నఖిలా నిహాముత్రఫలప్రదాన్।
భూయోపి శృణ్వత శ్చాసీ త్తృప్తి ర్నా ద్యాపి మానద॥ ౧

తా. కీర్తినిచ్చువాడా ! ఐహికాముష్మిక ఫలముల నిచ్చునట్టి వైశాఖమాస ధర్మముల నన్నియును నాటి మాటికి వినినప్పటికి నింతవరకు తృప్తికాలేదు.

శ్లో॥ యత్ర చా కైతవో ధర్మో యత్ర విష్ణుకథా శ్శుభాః।
తచ్ఛాస్త్రం శృణ్వతో నైవ తృప్తిః కర్ణరసాయనం॥ ౨

తా. యేదికపటము లేని ధర్మమో దేనియందు విష్ణుకధలను చెప్పబడునో శ్రవణానందకరమైన యట్టిశాస్త్రము నెంతవినినను తృప్తికలుగదు.

శ్లో॥ పూర్వజన్మకృతం పుణ్యం దిష్ట్యా పాక ముపాగతం।
ఆతిథ్యవ్యపదేశేన యద్భవాన్ గృహ మాగతః॥ 3

తా. ఓ బ్రాహ్మణుడా! అతిథివనెడు యుద్దేశ్యముచే నీవు నా గృహమునకు వచ్చినకారణమున నేను పూర్వజన్మంబున చేసిన పుణ్యము దైవయోగమున పరిపక్వమొందిసిద్ధించినది.

శ్లో॥ వచోమృతం ముఖాంభోజనిస్సృతం పరమాద్భుతం।
పీత్వా తృప్తః పారమేష్ఠ్యం మోక్షం వా చ న కామయే॥ ౪

తా. నీ ముఖపద్మము వలన పుట్టుచున్నదియును మిక్కిలి యాశ్చర్యకరమైన నీ వాక్కులనెడు యమృతమును పానముజేసి తృప్తిజెందినవాడనై బ్రహ్మలోకమునుగాని మోక్షమునుగాని కోరను.

శ్లో॥ తస్మాత్తా నేవ ధర్మా న్మే భుక్తిముక్తిప్రదాయకాన్।
విష్ణుప్రీతికరాన్ దివ్యాన్ భూయో విస్తరతో వద॥ ౫

తా. ఆ కారణము వలన యిహలోక పరలోక సుఖముల నిచ్చునవియును విష్ణు

మూర్తికి సంతోషకరములగు నవియు శ్రేష్ఠములగు నా వైశాఖ ధర్మములనే తిరిగి స విస్తరముగా నాకు జెప్పవలయును.

శ్లో॥ ఇత్యుక్తస్తు పునా రాజ్ఞా శ్రుతదేవో మహాయశాః।
సంహృష్టాత్మా శుభాన్ ధర్మా న్నృప వ్యాహర్తు మారభే॥

తా. ఈ ప్రకారము శ్రుతకీర్తి మహారాజు తిరిగి యడుగగా విశేషకీర్తిగల శ్రుతదేవుడు సంతుష్టాంతరంగుడై శుభముల నొసగునట్టి వైశాఖమాస ధర్మములను తిరిగి చెప్పుట ప్రారంభించెను.

శ్రుతదేవఉవాచ॥

శ్లో॥ శ్రుణు రాజ న్ప్రవక్ష్యామి కథాం పాపప్రణాశనీం।
వైశాఖధర్మవిషయాం భావితాం మునిభి ర్ముహుః॥ ౭

తా. శ్రుతదేవుడు చెప్పుచున్నాడు. ఓ రాజా! పాపములను పోగొట్టునది యు మునీశ్వరులచే నెల్లప్పుడు గౌరవింపబడునదియు వైశాఖమాస ధర్మముల గురించి న యొక కథను జెప్పెదను వినుము.

శ్లో॥ పంపాతీరే ద్విజః కశ్చి చ్ఛంఖో నామ మహాయశాః।
గురౌ సింహగతే చాగా న్నదీం గోదావరీం శుభాం॥ ౮

తా. పూర్వకాలంబున గొప్ప కీర్తి గలవాడును శంఖుడనెడు పేరుగల యొక బ్రాహ్మణుడు పంపానదీ తీరమందు నివసించుచుండెను. ఆయన యొకప్పుడు సింహ రాశియందు బృహస్పతి ప్రవేశింపగా పుణ్యకరమైన గోదావరీ నదికి వచ్చెను.

శ్లో॥ తీర్త్వా భీమరథీం పుణ్యాం కాంతారే కంటకాచలే।
నిర్జలే నిర్జనే ఘోరే వైశాఖాతపకర్శితః॥ ౯
వృక్షే చో పవివేశా సౌ మధ్యాహ్నే సమయే ద్విజః॥

తా. ఆ బ్రాహ్మణుడు పుణ్యంబగు భీమరథీనదిని దాటి ముండ్లు రాళ్ళుగలది యు జలము మనుష్యులు లేనిదియునగు నడవిలో వెళ్లుచు వైశాఖ మాసముకాబట్టి మ ధ్యాహ్నకాలమందు విశేషము తీక్ష్ణముగానుండిన యెండవేడిమిచే తపింపబడి యొక చెట్టుక్రింద విశ్రమించెను.

శ్లో॥ తదా కశ్చి ద్దురాచారో వ్యాధ శ్చాపధర శ్శరః॥ ౧౦
నిర్ఘృణ స్సర్వభూతేషు కాలాంతక ఇవాపరః।
తం కుండలధరం విప్రం దీక్షితం భాస్కరోపమం॥ ౧౧

దృష్ట్వా బధ్వా స జగ్రాహ కుండలాదిక ముగ్రధీః।
ఉపానహౌ చ ఛత్రం చ కక్షపాలం కమండలుం॥ ౧౨

తా. ఆ సమయంబున, దుష్ట ప్రవర్తనగలవాడును విల్లును చేబూనినవాడును మూఢుడును సర్వప్రాణుల యందును దయలేనివాడును రెండవయముడువలెనే యుండిన యొక కిరాతుడు యాచెట్టువద్దకు వచ్చి మకరకుండలములను ధరించినవాడును యజ్ఞాదులను జేసినవాడును సూర్యునివలెనే ప్రకాశింపుచున్న యాబ్రాహ్మణునిజూచి కట్టి క్రూరబుద్ధి గలవాడై యాబ్రాహ్మణుని మకరకుండలములను పాదుకలను గొడుగును కమండలమును చంకయందుండు మూటనుతీసి కొనెను.

శ్లో॥ పశ్చాద్విసృజ్య తం విప్రం గచ్ఛేత్యాహ విమూఢధీః॥

తా. మిక్కిలి మూఢుడగు యాకిరాతుడు ఇట్లు దొంగిలించి యనంతరము ఆ బ్రాహ్మణుని విడిచిపెట్టి వెళ్ళుమని పలికెను.

శ్లో॥ తత స్స గచ్ఛ న్పథి శర్కరావిలే
సూర్యాంశుతప్తే జలవర్జితే ఖరే॥
సంతప్తపాద స్తృణఛాదితే స్థలే
క్వచి చ్ఛచారో పయనూర్ధ్వరేతాః ॥ ౧౩
స వై దురితం సంపద న్ప్యాపి తిష్ఠ
హాహేతివాచీ స జగామతూర్ణం॥ ౧౪

తా. అనంతరమా బ్రాహ్మణుడు రాళ్ళతోనిండియున్నదియు సూర్యకిరణములచే కాలుచున్నదియు జలములేనిదియు కఠినమగు యామార్గంబున నడచుచు కాళ్ళు కాలిన సమయంబున గడ్డిచే నావరింపబడిన ప్రదేశమందు పాదముల బెట్టుకొనుచు శీఘ్రముగా నడచుచు నొకానొకచోట నిలుచుండియును ఎంతకష్టముసంభవించెనని పలుకుచును ప్రాణముల బిగపట్టుకొని వెళ్ళుచుండెను.

శ్లో॥ దృష్ట్వా మునిం ఖిద్యమానం పృథివ్యాం మధ్యంగతే పూష్ణి దయాం బభూవ। వ్యాధస్య ధర్మవిముఖస్య చ పాపబుద్ధేః తస్మై దదామీతి చ పాదరక్షామ్॥ ౧౫

తా. ఈ ప్రకారము పగలు రెండు జాముల సమయంబున కఠినమార్గము గల నేలను నడచుచు దుఃఖించుచున్న యా బ్రాహ్మణుని జూచి ధర్మము చేయని వాడైనను పాపబుద్ధి గలవాడైనను యా కిరాతుడు యా బ్రాహ్మణుని పాదుకల తిరిగి ఇయ్యవలయునని దయ కలిగెను.

శ్లో॥ చౌర్యే ణైవ స్వధర్మేణ యద్గృహీతం వనాంతరే।
తదీయమేన తత్సర్వం వ్యాధానాం ధర్మనిర్ణయః॥ ౧౬

తా. అరణ్యములో తమ కులవృత్తియగు దొంగతనముచే సంపాదింపబడిన ద్రవ్యమంతయు దొంగతనము చేసినవాని హక్కుగలదే యని కిరాతుల ధర్మములయందు నిర్ధారణ జేయబడియున్నది.

శ్లో॥ తస్మా దుపానహౌ దాస్యే ముహు ర్దుఃఖాపనుత్తయే।
తేన శ్రేయో భవే ద్యచ్చ తద్భవే న్మమ పాపినః॥ ౧౭

తా. ఆకారణము వలన యీ పాదుకలను మాటిమాటికి దుఃఖించుచున్న యీ బ్రాహ్మణుని బాధ పోవుటకు నిచ్చెదను. నేను పాపాత్ముడనై యుంటిని గనుక అందువలన యేదైనను కొంత పుణ్యము లభించును.

శ్లో॥ జీర్ణే చోపానహౌ దివ్యే వర్తేతే మమ పాదయోః।
న వాభ్యా మస్తి మే కృత్యం తస్మా త్తే నై దదా మ్యహం॥ ౧౮

తా. నా కాళ్లకు ప్రాతవియు గట్టివియు నగు చెప్పులు గలవు. ఈ చెప్పులతో నాకేమియు పనిలేదు. కాబట్టి ఆ చెప్పులను ఆతనకిచ్చెదను.

శ్లో॥ ఇతి నిశ్చిత్య మనసి తూర్ణం గత్వా దదౌ చ తే।
శర్కరాతప్త పాదాయ ద్విజవర్యాయ సీదతే॥ ౧౯

తా. ఈ ప్రకారము మనస్సుయందు నిశ్చయము జేసికొని యెండవేడిమిచే కాళ్లు గాలుటచేతను రాళ్ళుగుచ్చుకొనుటచేతను బాధపడుచుండిన యీ బ్రాహ్మణునకు శీఘ్రముగా వెళ్లి చెప్పుల నిచ్చెను.

శ్లో॥ ఉపానహౌ గృహీత్వా తే నిర్వృతిం పరమాం యయౌ।
సుఖీభవే తి తం వ్యాధ మాశీర్భి రభినంద్య చ॥ ౨౦
నూనం సుపక్వపుణ్యో యం వైశాఖే దత్తవా నయం।
వ్యాధస్యా పి చ దుర్బుద్ధేః ప్రీయో విష్ణుః ప్రసీదతి॥ ౨౧

తా. ఆ బ్రాహ్మణుడా చెప్పులను ధరియించి మిక్కిలి సుఖమును పొంది నీవు చిరకాలము జీవింపుమని దీవించి ఇట్లు పొగడుచున్నాడు. వైశాఖమాసములో ఈ చెప్పుల నిచ్చుటవలన నితని పుణ్యము పరిపక్వమైనది. ఇట్టి పుణ్యవంతుడు గావున యీ కిరాతుడు మొదట దుర్బుద్ధిగలవాడై నప్పటికి విష్ణుమూర్తి ప్రసన్నుడగును.

శ్లో॥ సర్వస్యాప్త్యా చ భూయో౽పి యత్సుఖం తదభూన్మమ।
తత్రో౽భిశ్రుత్య తద్వాక్యం కి మేత దితి విస్మితః॥ ౨౨
వ్యాజహార పున ర్విప్రం బ్రహ్మిష్ఠం బ్రహ్మవాదినం।
త్వదీయం తుమయా దత్తం కథం పుణ్యం భవే న్మమ॥ ౨౩

తా. ఇప్పుడు చెప్పులను తొడిగికొనుట వలన సమస్త సుఖములను పొందినట్లుగా సుఖించితిని. ఇట్లు ఆబ్రాహ్మణుడు పలికిన వాక్యమును విని బ్రహ్మజ్ఞానముగలవాడును బ్రహ్మనిష్ఠుయును గల యాబ్రాహ్మణునితో కిరాతుడిట్లు పలుకుచున్నాడు. ఓ బ్రాహ్మణుడా ! ఇదియేమి నీవు పలికినమాట మిక్కిలి యాశ్చర్యముగా నున్నది. నీవస్తువులనే నీకిచ్చినందు వలన నాకు పుణ్యమెట్లు గలుగును.

శ్లో॥ ప్రశంససి చ వైశాఖం హరిస్తుష్టో భవేదితి।
ఏత దాచక్ష్వ మే బ్రహ్మన్ కో వైశాఖ స్తు కో హరిః॥ ౨౪
కో ధర్మః కిం ఫలం తస్య శుశ్రూషో ర్మే దయానిధే।
ఇతి వ్యాధవచ శ్శ్రుత్వా శంఖ స్తుష్టమనా౽భూత్॥

తా. వైశాఖములో ధర్మములను జేసిన యెడల విష్ణుమూర్తి సంతోషించునని ప్రశంస జేయుచున్నావు. వైశాఖ మాస మేమిటి? హరియెవరు? ధర్మమేమిటి? అలా చేసినందువలన గలుగు ఫలమేమిటి ? దయామయుండవగు నో బ్రాహ్మణుడా ! నీకు శుశ్రూష చేసెదను. గావున నేనడిగిన ప్రశ్నములకు విశదముగా నుత్తరముల జెప్పుమని విధేయుడై యడుగగా నాకిరాతుని వాక్యమును కర్ణములనివిని సంతుష్టాంతరంగుడాయెను.

శ్లో॥ ప్రశంసన్ స చ వైశాఖం పునర్విస్మితమానసః।
ఇదానీం దత్తవాన్ పాదత్రాణే మే లుబ్ధక శ్శ్వరః॥ ౨౬

తా. ఆబ్రాహ్మణుడు తిరిగి వైశాఖ ధర్మములను ప్రశంస జేయుచు నాశ్చర్యమును పొంది యిట్లు పలుకుచున్నాడు. కిరాతుడు మూర్ఖుడైనను నాప్రాణములను కాపాడునట్టి పాదరక్షల నిచ్చినాడు.

శ్లో॥ య ద్దుర్బుద్ధే శ్చ వైషమ్యం జాతం చిత్రమహో బత।
సర్వేషా మేవ ధర్మాణాం ఫలం జన్మాంత రేషు చ॥ ౨౭
వైశాఖమాస ధర్మాణాం ఫలం సద్యః క్షణం నృణాం॥

తా. ఈకిరాతునికి మొదటినుండి దుష్టబుద్ధియే స్వభావమైనను ఇప్పుడు ఆబుద్ధి

యంతయు మారిపోయి మంచిబుద్ధి గలిగినది. ఎంత యాశ్చర్యము. సమస్త ధర్మముల యొక్క ఫలములు మఱియొక జన్మంబున కలుగును. వైశాఖమాస ధర్మముయొక్క ఫలమైతే ఆ జన్మమునందే మనుష్యులకు శీఘ్రముగా గలుగును.

శ్లో॥ పాపాచారస్య దుర్బుద్ధే ర్వ్యాధస్యా పి దురాత్మనః॥ ౨౮
దైవా దుపానహో ర్దానా త్సత్త్వశుద్ధి రభూ దహో॥

తా. పాపవర్తన గలవాడును దుష్టబుద్ధి గలవాడునగు కిరాతుడు దైవయోగమువలన పాదుకలను ఇచ్చుటవలన చిత్తశుద్ధి గలిగి మంచి గుణమేర్పడినది.

శ్లో॥ యద్యద్విష్ణోః ప్రియం కర్మ య త్తత్సంతోషకారకం॥ ౨౯
తదేవ ధర్మ మిత్యాహు ర్మన్వాద్యా ధర్మవిత్తమాః।
ధర్మా మాధవమాసీయాః ప్రియా విష్ణో రతీవ తే॥ ౩౦

తా. ఏధర్మము విష్ణుమూర్తికి సంతోషకరమైనదో ఏది సంతోష స్వభావముతో జేయబడునో దానినే ధర్మమని ధర్మములను తెలిసిన మనువు మొదలగువారు చెప్పిరి. మఱియు వైశాఖమాస సంబంధములగు ధర్మములన్నియు విష్ణుమూర్తికి మిక్కిలి ప్రియమైనవి.

శ్లో॥ ధర్మై ర్మాధవమాసీయై ర్యథా తుష్యతి కేశవః।
న తథా సర్వదానై శ్చ తపోభి శ్చ మహామఖైః॥ ౩౧

తా. వైశాఖమాస ధర్మములచే విష్ణుమూర్తి సంతోషించునట్లుగా నేదానములు చేసినను యేతపస్సులు చేసినను యేయజ్ఞములు చేసినను సంతోషింపడు.

శ్లో॥ నానేన సదృశో ధర్మ స్సర్వధర్మేషు విద్యతే॥

తా. దీనితో సమానమగు ధర్మము యేధర్మముకాదు.

శ్లో॥ మా గయాం యాంతు మా గంగాం మా ప్రయాగం తు పుష్కరం॥ మా కేదారం కురుక్షేత్రం మా ప్రభాసం శ్యమంతకం। మా గోదాం మా చ కృష్ణాం చ మా సేతుం మా మరుద్వృధం॥ ౩౩

తా. ఈ వైశాఖ ధర్మములను జేయువారికి గయ గంగానది ప్రయాగ పుష్కరము కేదారక్షేత్రము ప్రభాసతీర్థము శ్యమంతకము గోదావరి కృష్ణానది సేతువు మరుద్వృధము మొదలగు పుణ్యప్రదేశములకు వెళ్లనక్కఱలేదు.

శ్లో॥ వైశాఖధర్మమాహాత్మ్యం శంసంతీ చ కథాపగా।
తత్ర స్నాతస్య వై విష్ణు స్సద్యో హృద్య వరుధ్యతే॥ ౩౪

తా. వైశాఖమాస ధర్మమును చెప్పడమనెడు నదిలో స్నానము జేసినవారికి (అనగా కథను వినువారు) శీఘ్రముగా విష్ణుమూర్తి ప్రత్యక్షము వారి హృదయమున నివసించగలడు.

శ్లో॥ మాసే మాధవసంజ్ఞే స్మిన్ యత్స్వల్పే నైవ సాధ్యతే।
న తద్బహువ్యయై ర్దానై ర్న ధర్మై ర్నాపి వైమఖైః॥ ౩౫

తా. వైశాఖమాసములో కొంచెము ద్రవ్యమైనను వ్యయపరచి ధర్మము చేసి నందువలన గలిగిన ఫలమును ఇతరకాలములయందు విశేషధనమును ఖర్చుపెట్టి యనేక దానములు ధర్మములు యజ్ఞములు మొదలగు వానిని జేసినను పొందడు.

శ్లో॥ మాసో యం మాధవో నామ వ్యాధ పుణ్యవివర్ధనః।
తస్మి న్మహ్యం త్వయా దత్తే పాదుకే పాపనాశనే॥ ౩౬

తా. ఓ కిరాతుడా! ఈ వైశాఖమాసము పుణ్యమును వృద్ధిపొందించునది. అట్టి వైశాఖమాసమునందు నాకు పాదుకల నిచ్చుటచే నా బాధ తగ్గిపోయినది.

శ్లో॥ తేన తే పూర్వకాలీనం పుణ్యం పాక ముపాగతం।
తుష్ట స్తు భగవా న్ప్రియ శ్శ్రేయో వ్యాధ భవిష్యతి॥ ౩౭

తా. ఓ కిరాతుడా! నీవు పూర్వజన్మమునందు జేసిన పుణ్యము పరిపక్వము పొందినది. భగవంతుడు ముఖ్యముగా సంతోషించి శ్రేయస్సు నివ్వగలడు.

శ్లో॥ అన్యథా తే కథం భూయా ద్బుద్ధి రేతాదృశీ శుభా।
మునా వేవం బ్రువాణే చ మృత్యునా ప్రేరితో బలీ॥ ౩౮
సింహో వ్యాఘ్రవధార్థాయ ప్రాద్రవ త్క్రోధవిహ్వలః॥

తా. ముందు నీకు శుభము గలుగకుండెనేని యిటువంటి మంచిబుద్ధి కలుగ నేరదు. అని మునీశ్వరుడు పలుకుచుండగా నింతలో నాయరణ్యంబున నొకచోట సింహము మృత్యుదేవతచే ప్రేరేపింపబడి మిక్కిలి క్రోధముగలదియగుచు పెద్దపులినిజంపుటకు పరుగెత్తి వెళ్ళుచుండెను.

శ్లో॥ మధ్యే దృష్ట్వా చ మాతంగం దైవా ద్దేవేన కల్పితం॥ ౩౯
తం హంతు ముద్యతో గచ్ఛన్ పదా క్రాంతంవ్యవస్థితం॥
తయో ర్యుద్ధ మభూ ద్రాజన్ సింహమాతంగయో ర్వనే॥ ౪౦

తా. ఇట్లు పరుగెత్తుచుండగా దారిలో సిద్ధాంతముచే స్థితమగు నేనుగ దైవవశము వ నగపడగా దాని కాలుపట్టుకొని చంపుటకు సుయ్యత్నమై [illegible] చుండగా నప్పుడా సింహమునకును ఏనుగకును అవనములో గొప్ప యుద్ధము జరిగెను.

శ్లో॥ శ్రాంతౌ యుద్ధాచ్చ విరతౌ నిరీక్షంతౌ చ తస్థతుః।
వ్యాధ ముద్దిశ్యయ చ్చోక్తం మునినా చ మహాత్మనా॥ ౪౧
సమస్తపాతకధ్వంసి దైవాచ్ఛ్రావ తుశ్చ తౌ॥

తా. ఆ గజ సింహము లిట్లు యుద్ధముజేయుచు నలసి చాలించుచు ఇటు అటు చూచుచుండగ మహానుభావుండగు కణ్ణముని శ్వరుడు కిరాతునితో జెప్పుచున్నదియు సమస్త పాపములను పోగొట్టునదియు నైశాఖమాస ధర్మములను తలవని తలంపుగా నా గజ సింహములు వినుట సంభవించె.

శ్లో॥ తేనైవ మాసమాహాత్మ్యశ్రవణేనా మలాశయౌ॥ ౪౨
శాపాన్ముక్తౌ చ తౌ దేహౌ త్సద్యోయుక్తౌ దివం గతౌ॥
దివ్యరూపధరౌ దివ్యౌ దివ్యగంధానులేపనౌ॥ ౪౩
దివ్యం విమాన మారూఢౌ దివ్యనారీని షేవితౌ।
సద్యో వనతమూర్ధానౌ ప్రాంజలీ చోపతస్థతుః॥ ౪౪

ఆ గజ సింహములు రెండును కిరాతునితో మునీశ్వరుడు చెప్పుచున్న నైశాఖ మాసమాహాత్మ్యమును వినుటచేతనే పాపములు నశించుటచే శాపమునుండి విముక్తులై ఆ క్షణంబుననే శ్రేష్ఠమగు రూపమును ధరించినవారును దేవలోకమునందుండు గంధముచే బూయబడినవారును దేవతా విమానముల నెక్కినవారును దేవతా స్త్రీలచే సేవింపబడుచున్న దేవతా స్వరూపముగలవారై యాకాశ మార్గమునందున్న వారగలుగుచు దోసిలి పట్టుకొని నమస్కారము జేసిరి.

శ్లో॥ మునీంద్రో ధర్మవక్తా చ వ్యాధ ముద్దిశ్య నై పథి।
తౌ దృష్ట్వా విస్మితః ప్రాహ కౌ యువా మితి నిశ్చలః॥ ౪౪

తా. కిరాతునుద్దేశించి నైశాఖమాస ధర్మములను చెప్పుచున్న యా మునీశ్వరుడు యాకాశమార్గంబుననున్న యా దివ్య పురుషులను జూచి నిశ్చల స్వభావము గలవారై మీరెవరని యడిగెను.

శ్లో॥ దుర్యోనౌ తు కుతో జన్మ యువయో ర్వా కథం మృతిః।
అహేతు ర్విపినే చా స్మి న్పరస్పరవధోద్యతౌ॥ ౪-

ఏతత్సమస్తం విస్తార్య సమ్యగ్వదత మే నఘా।
ఇత్యుక్తౌ మునినా తేన [illegible] ప్రత్యూచతుః పు[illegible]॥ ౮౭

తా. మీకు గజ సిం[illegible] [illegible] సంభవించెను. ఈ యడవియందు మీకిద్ద రకు వ్యర్థముగా విరోధమెట్లు కలిగి[illegible]యొకని[illegible]కొకడు చంపుటకు నుద్యుక్తులై యుద్ధముజేసి యేక కాలమునందే మీకిద్దరికీ [illegible]ధంబున మృతిగలిగెను. [illegible] పరహితులగు నో దేవతలా రా! దీనినంతయు విశదముగా దెలియునట్లు చెప్పుమని మునీశ్వరుం డడుగగా వారిద్ద రు చెప్పుచున్నారు.

శ్లో॥ మతంగస్య మునేః పుత్రౌ దంతిలః కోహలో పరః
శాపదోషేణ తౌ జాతౌ నామ దంతిలకోహలౌ॥ ౮౮

తా. మతంగ మహాముని కి దంతిలుడనియును కోహలుడనియును యిద్దరు తనయులు కలి గిరి. ఆదంతిలకోహలు లిద్దరు శాపవశమున భూలోకమున దంతిలకోహల శబ్దంబులచే జెప్పబడుచున్నారు.

శ్లో॥ రూపయౌవనసంపన్నౌ సర్వవిద్యావిశారదౌ।
ఆవా ముద్దిశ్య ప్రోవాచ పితా ధర్మార్థకోవిదః॥ ౮౯

తా. సౌందర్యము యౌవనము గలవారమును సమస్త శాస్త్రములను జదివినవా రమునగు మమ్ము నుద్దేశించి సమస్త ధర్మముల యథార్థమును తెలిసికొనిన మునీశ్వరు డు ఇట్లు చెప్పెను.

శ్లో॥ మతంగో నామ బ్రహ్మర్షి స్సర్వధర్మవిదుత్తమః॥
వైశాఖే మాసి తనయౌ మధుసూదనవల్లభే॥ ౯౦
ప్రపాం కురుత మార్గే చ జనా న్వీజయతం క్షణం।
మార్గే ఛాయాం విధత్తాం చ భూత్యాన్నం శీతలాంబు [illegible]॥ ౯౧
కురుతం స్నాన[illegible] [illegible]పసి తథైవార్చయతం [illegible]విభుం।
కథాం చ శృణుతం నిత్యాం యయా బంధో నివర్తతే॥ ౯౨

తా. సమస్త ధర్మవేత్తలలో నగ్రగణ్యుడగు నట్టివాడును బ్రహ్మర్షియు నగు మతంగమహాముని యిట్లు చెప్పుచున్నా[illegible]. విష్ణుమూర్తికి ప్రియకరమగు వైశాఖమాస ములో దారియందు మంచినీళ్లు నిచ్చునట్లు చలివేంద్ర మొకదాని నేర్పరచుటయును శ్రమ చే నలసిన జనులకు వీచుటయును దారిలో నీడగానుండునట్లు పందిళ్లను నిర్మించుటయును విశేషముగా అన్నమును చల్లని మంచితీర్థము నిచ్చుటయును ప్రాతఃకాలంబున స్నానము

జేయుటయును సంసారబంధమును నివర్తిజేయునట్టి భగవంతుని పూజించుటయును వాతని కథను వినుటయును జేయుచుండవలయును

శ్లో॥ ఏవం చ బహుభి ర్వాక్యై ర్బోధితా వపి దుర్మతీ।
క్రుద్ధో భవం దంతిలో హం మత్తో హం కోమలాహ్వయః॥ ౧౩

తా, ఈప్రకారము ఆ మతంగమహాముని యనేకవిధములగు వాక్యములు చెప్పి బోధించినను దుష్టస్వభావముగల దంతిలకోమలులనే మేమిద్దరము కోపించి మదించి యుండి యాధర్మములను జేయుచుంటిమి.

శ్లో॥ క్రుద్ధ శ్చశాఠ నా సద్యః పితా ధర్మేషు లాలసః।
పుత్రిం చ ధర్మవిముఖిం భార్యాం చా ప్రియవాదినీం॥ ౧౪
అబ్రహ్మణ్యాం చ రాజానం త్యజే త్సద్యో న చే త్పతేత్॥

తా. మాతంగుడు; మా వైశాఖమాసములయందు దానస్నానాదులు వలన మేము జేయకుండుటచే ఆక్షణంబుననే కోపించి యిట్లనెను. ధర్మములను జేయని తనయుని, అయిష్టముగా మాట్లాడు భార్యను, దుష్టులను హింసించుటకూడ తగదని చెప్పునట్టి రాజు కొలువును, శీఘ్రముగా విడువవలయును, అలావిడువ కుండినయెడల నష్టము కలుగును.

శ్లో॥ దాక్షిణ్యా దర్థలోభా ద్వా సంసర్గం యే ప్రకుర్వతే॥ ౧౫
తే సర్వే నరకం యాంతి యావదింద్రా శ్చతుర్దశ॥

తా. పూర్వమందు జెప్పబడిన భార్యాపుత్రులను ప్రేమచే స్వీకరించినను ధనము నిచ్చునని యుద్దేశముచే రాజును విడువకున్నను అట్టివారు పదునాలుగింద్ర కల్పములగు పర్యంతము నరకమున నివసింతురు.

శ్లో॥ ఇతి జ్ఞాత్వా శశాపావాం మదక్రోధపరిప్లుతౌ॥ ౧౬
క్రుద్ధో హం దంతిలో భూయాం సింహః క్రోధపరిప్లుతః।
మత్త స్తు కోమలో భూయాం మత్తో మాతంగ యూథపః॥ ౧౭

తా. ఈప్రకారముగ ధర్మశాస్త్రమును తెలిసినవాడు గావున మాతండ్రి మదముచేతను క్రోధముచేత నిండియుండిన మమ్ముల శపించగా క్రోధస్వభావముగల దంతిలుడనగు నేను సింహమునైతిని. మదించియున్న కోమలుడనగు నేను మదించిన యేనుగనైతిని.

శ్లో॥ కృతానుతాపౌ పశ్చాత్తు ప్రార్థయామో విమోచనం।
ఆవాభ్యాం ప్రార్థితో భూయో విశాపం చ దదౌ పితా॥ ౫౮

తా. అనంతరము పశ్చాత్తాపము గలవారమై శాపవిముక్తిని ప్రార్థింపగా మాతండ్రి తిరిగి శాపము నిట్లు త్రిప్పివేసెను.

శ్లో॥ యువాం ప్రాప్య చ దుర్యోనిం కియత్కాలాంతరే పి చ।
సంగమో భవితా తత్ర పరస్పరవధైషిణౌ॥ ౫౯

తా. ఓపుత్రులారా! నా శాపప్రకారముగా మృగములగు గజసింహ జన్మముల నెత్తి కొంతకాలమరిగిన పిమ్మట ఆవనములో నొకప్పుడు కలసి మీరు యొకరితోనొకరు యుద్ధముజేసి యిద్దరు నేకకాలంబున మృతినొందుదురు.

శ్లో॥ తస్మిన్నేవం హి సమయే సంవాదం వ్యాధశంఖయోః।
వైశాఖధర్మవిషయో దైవాద్వాం శ్రవణస్య చ॥ ౬౦
గమిష్యతి క్షణాదేవ తస్మాన్ముక్తిర్భవిష్యతి॥

తా. మీరు యుద్ధముజేయు సమయములో శంఖుడను నట్టిమునీశ్వరుడు యొక కిరాతునకు వైశాఖమాస ధర్మములను జెప్పుచుండును. దైవయోగముచే ఆధర్మములను మీరు వినుటచే అప్పుడే మీకు ముక్తికలుగును.

శ్లో॥ శాపాన్ముక్తౌ పూర్వమేవ రూపమాస్థాయ పుత్రకౌ॥ ౬౧
మామేవ ప్రాప్య వసతం నాన్యథా మే వచో భవేత్॥

తా. ఓపుత్రులారా! అప్పుడు శాపవిమోచనము గలిగి మీపూర్వ స్వరూపమును పొంది నావద్దకు రాగలరు. కావున నేజెప్పిన ప్రకారము జరుగును గాని నావాక్యము వ్యర్థముగాదు.

శ్లో॥ ఇతి శప్తౌ చ గురుణా దుర్యోనిం ప్రాప్య దుర్మతీ॥ ౬౨
ప్రాప్య దైవాత్సంగతిం చ పరస్పరవధైషిణౌ।
సంవాదం యువయోర్దివ్యం శుభం తం శుశ్రువావహే॥ ౬౩
తేన సద్యో విముక్తిశ్చ క్షణాద్దేహా వయో రభూత్॥

తా. ఈప్రకారము మాతండ్రిచే శపింపబడి హీనజన్మములగు మృగజన్మముల నెత్తి దైవయోగమున కలసికొని యొకరినొకరు చంపనుద్యుక్తులమై యుద్ధము జేయుచుండ శ్రేష్ఠంబగు మీరిద్దరు చెప్పుకొనుచుండెడి (యీవైశాఖమహాత్మ్య)మును వింటిమి. గావున ఆక్షణకాలములోనే మా గజసింహ జన్మములకు విముక్తికలిగెను.

శ్లో॥ ఇతి సర్వం సమాఖ్యాయ ప్రణమ్య చ మునీశ్వరం॥ ౬౪

సమామంత్ర్య భ్యనుజ్ఞాతౌ జగ్మతుః పితు రంతికం॥

తా. ఈప్రకారము తమ వృత్తాంతమునంతయు మతంగకుమారులు శంఖమునితో జెప్పి నమస్కరించి ఆయనవలన ననుజ్ఞగొని వారి తండ్రిగారి సమీపమునకు వెళ్లిరి.

శ్లో॥ తదేవ సంప్రదృశ్యాహం ముని ర్వ్యాధం దయానిధిః॥ ౬౫

పశ్య వైశాఖమాహాత్మ్యశ్రవణస్య ఫలం మహత్।

ముహూర్తం శ్రవణా దేవ తయో ర్ముక్తిః కరే స్థితా॥ ౬౬

తా. దయాస్వభావముగల యామునీశ్వరుడు కిరాతునితో నిట్లు చెప్పచున్నాడు. ఓ కిరాతుడా! ఇదిగో వైశాఖమహాత్మ్య ఫలమును జూచితివా? వైశాఖమాస ధర్మములను యొక క్షణకాలము వినుటతోడనే ఆమునికుమారుల కిద్దరికిని మోక్షము శీఘ్రముగా లభించెను.

శ్లో॥ ఇతి బ్రువాణం మునిపుంగవం తం దయానిధిం నిస్పృహ మగ్ర్య బుద్ధిం విశుద్ధసత్వం సుకృతైకపాత్రం న్యస్తశస్త్రః పున రాహ వ్యాధః॥ ౬౭

తా. ఈప్రకారము మునీశ్వరుడు చెప్పగా నాకిరాతుడు విని చేతిలోనున్న బాణములను విసర్జించి మంచి స్వభావము గలవాడై దయకు సముద్రమువంటివాడును కోరికరహితుడును శ్రేష్ఠమగు బుద్ధిగలవాడును చిత్తశుద్ధి గలవాడును పుణ్యములకు స్థానభూతమైనవాడు నగు ఆమునిశ్రేష్ఠునితో తిరిగి చెప్పబోవుచున్నాడు.

ఇతి శ్రీస్కందపురాణే వైశాఖమాహాత్మ్యే నారదాంబరీష సంవాదే దంతిలకోహలముక్తిప్రాప్తి ర్నామ సప్తదశోధ్యాయః॥

## అథాష్టాదశోధ్యాయః

### వ్యాధఉవాచ॥

శ్లో॥ భవతాను గృహీతోస్మి మునే పాపోతిదుష్టధీః।

దయాళవో మహాంతోహి స్వభావా దేవసాధవః॥ ౧

తా. కిరాతుడు చెప్పచున్నాడు. ఓ మునీశ్వరా! పాపాత్ముడను మిక్కిలి దుష్టస్వభావము గలవాడనగు నేను మీచే ననుగ్రహింపబడితిని. అది యుక్తమేను.

మహానుభావులగు సత్పురుషులు స్వతస్సిద్ధముగానే సమస్తప్రాణులయందు దయాగలవారయ్యెదరు.

శ్లో॥ క్వవ్యాధశ్చా కులీనోహం క్వచవా మతిరీదృశీ।
కేవలం భవతామేవ మన్యే నుగ్రహ ముత్తమం॥ ౨

తా. ఓస్వామీ ! దుర్వృత్తులతో వ్యాధులుండెడు కిరాతుండనైన నేనెక్కడ. మోక్షమొసగునట్టి వైశాఖమాస ధర్మములయందు దాసక్తిగల బుద్ధియెక్కడ. ఇట్టి బుద్ధిగలుగుట శ్రేష్ఠంబగు మీ యనుగ్రహముగానే దలచుచున్నాను.

శ్లో॥ అధనః ధోశ్చశిష్యోస్మి కృపా పాత్రోస్మి మానద।
అనుగ్రాహ్యోస్మిపుత్రోస్మి కృపాం కురు దయానిధే॥ 3

తా. మానధనుండవగు నోసత్పురుషుడా ! నీకు శిష్యుడను. నీదయకు పాత్రుడను. నీకుమారునితో సమానమైనవాడను. నీచే ననుగ్రహింప దగినవాడను. కావున్ని యో దయాసముద్రుడా ! నాయందు దయ నుంచుము.

శ్లో॥ యథా మేపునర్భూయా దసన్మతిరనర్థదా।
సద్భిస్తు సంగతః క్వాపి నభూయో దుఃఖమశ్నుతే॥ ౪

తా. అనర్థములను గలుగజేయునట్టి అజ్ఞానబుద్ధి నాకు తిరిగి యెన్నటికి గలుగకుండునటుల యనుగ్రహింపుము, సత్పురుషుల సహవాసముగలవాడె న్నటికని తిరిగి దుఃఖమును పొందడు.

శ్లో॥ తస్మాద్బ్రూహియమాం ప్రహ్వా సూక్తై స్త్వైర్వ్య జహాప హైః।
యేన చాద్ధాతరిష్యంతి సంసారాబ్ధిం మహముక్తి వః॥ ౫

తా. మోక్షేచ్ఛగలవారు ఏట్టి వాక్యములచె బోధింపబడినవారై సంసారసాముద్రమును దాటగలరో, ఓ బ్రాహ్మణుడా ! పాపములను పోగొట్టునట్టి యా వాక్యములనుజెప్పి నన్ను బోధింపుము.

శ్లో॥ సాధూనాం సమచిత్తానాం తథా భూతదయావతాం।
నహీన స్తూత్తమః క్వాపి నాత్మీయోపి పరస్తథా॥ ౬

తా. సమస్తమైనవారియందు సమమగు స్వభావము గలవారును సమస్తప్రాణులయందు దయగల సత్పురుషులకు ఒకడు అధికుడనియును అల్పుడని యును భేదబుద్ధి యెన్నటికి నుండదు.

శ్లో॥ ఏకాగ్రేణ విచిన్వంతి చిత్తశుద్ధిం చ పృచ్ఛతి।
సర్వదోష యుతో వాపి సర్వధర్మో ఝ్ఝితోపి వా॥ ౭

కృతానుతాప శ్చ యదా యదా పృచ్ఛతి వై గురుం।
తదైవోదిశంత్యద్ధా జ్ఞానం సంసార మోచకం॥ ౮

తా॥ సత్పురుషులు శిష్యుని గుణము లెట్టులుండునో యని రహస్యముగా పరిశీలన చేయుచుందురు. చిత్తశుద్ధిని తెలిసికొనుచుందురు. మరియు సమస్తదోషములు కలవాడైనను సమస్తధర్మములను విడిచిపెట్టినవాడైనను తన దుష్టప్రవర్తనకు పశ్చాత్తాపము జెంది యెప్పుడు గురుప్రార్థింపబడునో జ్ఞానులగువారు అప్పుడే సంసారబంధమును వదలించునట్టి జ్ఞానము నుపదేశింపుచున్నారు.

శ్లో॥ యథా గంగా మనుష్యాణాం పాపనాశ స్వభావినీ।
తథా మంద సముద్ధార స్వభావా స్సాధవ స్స్మృతాః॥ ౯

తా॥ గంగానది సమస్తమనుష్యుల పాపములను నశింపజేయు స్వభావముగలదియగునట్లుగానే సత్పురుషులు మూఢుల జన్మమును తరింపజేయు స్వభావముగలవారుగా జెప్పబడిరి.

శ్లో॥ మావిచారయ మాం బోద్ధుం దయాళో భక్తవత్సల।
సుశ్రూషత్వా న్నతత్వాచ్చ శుద్ధత్వా త్తవసంగతేః॥ ౧౦

తా॥ దయా స్వభావము గలవాడవును భక్తులయందు ప్రేమగలవాడవునగునో స్వామీ! తమస్నేహముచే పరిశుద్ధుడైనవాడను మీకు శుశ్రూషజేయుచున్నవాడను మీకు నమస్కరించినవాడ నగుటచే ధర్మములను వినుటకు పాత్రుడనైతిని కాబట్టి నాకు నుపదేశము జేయుట యందు మీరు విచారించ నవసరములేదు.

శ్లో॥ ఇతి వ్యాధవచశ్శ్రుత్వా పునర్విస్మిత మానసః।
సాధు సాధ్వితి సంభావ్య ధర్మాన్ తా నువాచహ॥ ౧౧

ఇట్లు కిరాతుడు చిత్తశుద్ధిగలవాడై పలికిన మాటలను అకస్మాత్తుగ విని మునీశ్వరుడు మిక్కిలి యాశ్చర్యము జెంది బాగుగా పలికితివని యాడి తిరిగి ధర్మములను జెప్పుట ప్రారంభించెను.

శంఖ ఉవాచ॥

శ్లో॥ విష్ణుప్రీతికరాన్ దివ్యాన్ సంసారాబ్ధి విమోచకాన్।
శృణు ధర్మాంశ్చ వైశాఖే యది వ్యాధ శ మిచ్ఛసి॥ ౧౨

తా. కష్టజుడను రెండవ పేరుగల శంఖుడు చెప్పుచున్నాడు. ఓకిరాతుడా! నిత్య సుఖములను పొందగలవాడవని యిచ్చగలవాడవైతివేని విష్ణుమూర్తికి ప్రియమైనవియు సంసారసముద్రమును తరింపజేయునవియు శ్రేష్ఠమైన వైశాఖమాస ధర్మములను జేయుము.

శ్లో॥ ఆతపో బాధతే ఘోరో నాచ్ఛాయా నాంబు చాత్రిచ।
తస్మాత్స్థలాంతరం యామో యత్రచ్ఛాయా తువర్తతే॥

తా. ఇక్కడ తీక్ష్ణమైన యెండ బాధించుచున్నది ఇక్కడ చెట్లనీడగాని జలముగాని లేదు. గావున చెట్లనీడ యుండిన మరియొక ప్రదేశమునకు వెళ్లుదము.

శ్లో॥ తత్ర గత్వా జలం పీత్వా సుచ్ఛాయాం చ సమాశ్రితః।
తత్ర తే వర్ణయిష్యామి మాహాత్మ్యం పాపనాశనం॥ ౧౪
విష్ణోర్మాధవ మాసస్య యథా దృష్టం యథా శ్రుతం।
ఇత్యుక్తో మునినా తేన వ్యాధః ప్రాహ కృతాంజలిః॥ ౧౫

తా. అక్కడికి వెళ్లి జలపానముజేసి దట్టమైన నీడయందు విశ్రమించి నేను వినినట్టియు జూచినట్టియు సమస్త పాపములను పోగొట్టునట్టియు విష్ణుకథలను వైశాఖమాస ధర్మములను నక్కడ జెప్పెదను, అని యీ ప్రకారము మునీశ్వరుడు పలుకగా కిరాతుడు అంజలిజేసి యిట్లు పలుకుచున్నాడు.

శ్లో॥ ఇతో విదూరే సలిలం వర్తతే చ సరోవరే।
కపిత్థా స్తత్ర వై సంతి ఫలభారేణ పీడితాః॥ ౧౬
గచ్ఛావ స్తత్ర సంతుష్టి ర్భవితా నాత్ర సంశయః॥
వ్యాధేనైవం సమాదిష్ట స్తేన సాకం యయౌ మునిః॥ ౧౭

తా. ఇక్కడకు సమీపములో నొక సరస్సుగలదు దానిలో శుభ్రమైన జలము గలదు. ఆ సరస్సు యొక్కన పండ్లతో నిండియుండిన వెలగచెట్లు గలవు. అక్కడకు మనము వెళ్లిన యెడల సుఖముగానుండును. సందేహములేదు. అని కిరాతుడు చెప్పగా నామునీశ్వరుడు వానితో గలసి యాసరస్సు వద్దకు వెళ్లెను.

శ్లో॥ కియద్దూరం తతో గత్వా దదర్శాగ్రే సరోవరం।
బక కారండవాకీర్ణం చక్రవాకోపశోభితం॥ ౧౮
హంససారస క్రౌంచాద్యై స్సమంతా త్పరిశోభితం॥

తా. వారు అక్కడనుండి బయలుదేరి కొంతదూరము వెళ్ళగా ముందు యొక సరస్సును జూచిరి. ఆ సరస్సు యే తీరుగా నుండెననగా ? కొంగలు, కన్నెలేడులు, జక్కవలులు హంసలు బెగ్గురుపక్షులు ఒక్కకొంగలు మొదలగు పక్షులచే సంతటను వ్యాపింపబడి ప్రకాశింపబడు చున్నదియు, అగు సరస్సును జూచిరి. అని ముందున్న క్రియాపదముతో గూర్చుకొన వలయును. (ఇల్లి) ప్రతి శ్లోకంబున జెప్పికొన వలెను.

శ్లో॥ కీచ వంశక వాద్యైశ్చ కూజితం భ్రమరై రపి॥ ౧౯
సకరి కచ్ఛ పమీనాద్యై రగాహ్యం సుమనోహరం।
కుముదోత్పల కల్హార పుండరీకాదిభి ర్మహత్॥ ౨౦

తా. వెదుళ్ళు బొంగువెదుళ్ళు తుమ్మెదలు మొదలగు వానిచే ధ్వనిజేయబడుచున్నదియు మొసళ్ళు తాబేళ్ళు చేపలు మొదలగు జలజంతువులుగూడినదియు లోతుగా నుండినదియు మనోహరముగా నుండినదియు తెల్లగలువ నల్లగలువ యెఱ్ఱగలువ తెల్లపద్మము మొదలగు పుష్పములచే వ్యాపింపబడినదియు గొప్పదియునగు నా సరస్సునుజూచిరి

శ్లో॥ శతపత్త్రైః కోకనదై స్సమంతా త్పరిశోభితం।
పక్షిణాం చ కలారావై ర్మఖ రన్నయనోత్సవం॥ ౨౧

తా. నూరు రేకులుగల పద్మములచేతను యెఱ్ఱగలువలచేతను కన్నులకు జూచుటకు నింపుగానుండునట్లుగా నంతట వ్యాపించి ప్రకాశమును జెందియున్నదియు పక్షుల అవ్యక్త మధుర ధ్వనులచే ధ్వనిజేయబడుచున్నదియు, నగునా సరస్సును జూచిరి.

శ్లో॥ తటే కీచకగుల్మైశ్చ తథా వృక్షైశ్చ శోభితం।
వటైః కరంజై ర్లక్షైశ్చ చించిణీభి స్తథైవచ॥ ౨౨

తా. తీరమందంతట వెదుళ్ళ పొదలచేతను మఱియు నితరవృక్షముల చేతను మఱ్ఱి వృక్షములచేతను గానుగ వృక్షముల చేతను కడిమి వృక్షములచేతను చింతచెట్ల చేతను గూడియుండి ప్రకాశించినదియు.

శ్లో॥ నింబప్లక్షప్రియాళైశ్చ చంపకై ర్వకుళై శ్శుభైః।
పున్నాగై స్తుంబరై శ్చైవ కపిత్థామలకై రపి॥ ౨౩

తా. వేప జువ్వి మొరడు చంపకము పొగడపున్నాగము తుంబరము వెలగ ఉసిరిక మొదలగు శోభస్కరములగు వృక్షములతో వ్యాపించియున్నదియు,

శ్లో॥ నిప్పైవక్తైశ్చ జంబూభి స్సమంతా త్పరిశోభితం।
వన్యమాతంగ సారంగవరాహ మహిషాదిభిః॥ ౨౪

తా. పండిన నేరేడు వృక్షములచేత నంతటను వ్యాపింపబడి ప్రకాశించుచున్నదియు అడవి యేనుగులు లేళ్ళు అడవిపందులు అడవి దున్నలు మొదలగు జంతువులచే వ్యాపింపబడినదియు,

శ్లో॥ శశైశ్చ సల్లకైశ్చైవ గవయై రుపశోభితం।
ఖడ్గనాభిమృగాద్యైశ్చ వ్యాఘ్రైః సింహైర్వృకైరపి॥ ౨౫

తా. కుందేళ్ళు గోసమృగ... కస్తూరీ మృగములు పెద్దపులులు సింహములు తోడేళ్ళు మొదలగు మృగములచేత నిండియున్నదియు,

శ్లో॥ ఖరాంతకైశ్చ శరభైశ్చమరీభిస్సుమండితం।
శాఖాచ్ఛాఖాంతరం శీఘ్రం ప్లవమానైః ప్లవంగమైః॥

గాడిదెలను సంహరించుపక్షి మృగములును శరభమృగములు చమరీమృగములు యొక కొమ్మనుండి మరియొక కొమ్మ మీదికి దుముకుచుండెడి కోతులు మొదలగు మృగములచేతను అలంకరింపబడినదియు.

శ్లో॥ మార్జారైశ్చైవ భల్లూకై ర్భీషణం గురుభిస్తథా।
ఝిల్లీశబ్దైశ్చ కేంకారైః కీచకానాం రవైస్తథా॥

తా. పిల్లులు యెలుగు గొడ్డు తెల్లచారలు గల దున్నలు మొదలగు వానిచే భయంకరముగా నుండినదియు ఈల పురుగుల ధ్వనుల చేతను వెదుళ్ళ ధ్వనుల చేతను వ్యాపించినదియు,

శ్లో॥ ఘోరవాయువినిర్ఘాతదారుభగ్నైస్సమన్వితం।
ఏతాదృశం సరో దివ్యం వ్యాధేనైవ ప్రదర్శితం॥ ౨౮
దదర్శ మునిశార్దూల స్తృషయా బాధితో భృశం॥

తా. గొప్పగాలి వీచుటచే నచ్చటచ్చట విరిగిపడియున్న వృక్షములచే వ్యాపించియున్నదియునగు శ్రేష్ఠమైన సరస్సును కిరాతుడు చూపగా ఆమునీశ్వరుడు చూచెను. మరియు ఆకలిచే మిక్కిలి బాధింపబడుచుండెను.

శ్లో॥ స్నాత్వా మధ్యాహ్నవేళాయాం సరస్యస్మిన్మనోరమే॥ ౨౯
వాససీ పరిధాయాథ కృత్వా మాధ్యాహ్నికాః క్రియాః।
దేవపూజాం తతః కృత్వా భుక్త్వా ఫలమతీంద్రితః ౩౦
వ్యాధోపనీతం సుస్వాదు కపిత్థం శ్రీనుహారి చ।
సుఖోపవిష్టః పప్రచ్ఛ వ్యాధం ధర్మరతం పునః॥ ౩౧

తా. మనోహరమైన యీసరస్సులో మధ్యాహ్నకాలమందు స్నానముజేసి శుచి యగు వస్త్రములను ధరించి మాధ్యాహ్నిక సంధ్యావందనాదులను నెరవేర్చి యనంతరము దేవతార్చన జేసికొని రవిగలిగియు ఆయాసమును పోగొట్టుకొనియు కిరాతుడు తీసికొని వచ్చిన వెలగపండ్లను భుజించి స్వస్థతజెందిన మనస్సుగలవాడై సుఖముగా గూర్చుండి ధర్మములయందాసక్తిగల యాకిరాతుని తిరిగి యిట్లు అడుగుచున్నాడు.

శ్లో॥ కిం కర్తవ్యం మయా హ్యద్యం తవాద్య ధర్మతత్పర।
ధర్మాశ్చ బహవస్సంతి నానామార్గాః పృథగ్విధాః॥ ౩౨

తా. ధర్మమునందాసక్తిగల యో కిరాతుడా! యిప్పుడు ముందుగా నీకు శ్రోతాకర్షకముగు యేధర్మమును జెప్పవలయును. అనేక రీతులచే ననేక భేదములు జెందినవై ధర్మములనేకములుండి యున్నవి.

శ్లో॥ తత్ర వైశాఖమాసోక్తా స్సూక్ష్మా అపి మహార్ధదాః।
సర్వేషామేవ జంతూనామిహాముత్రఫలప్రదాః॥ ౩౩

ఆ ధర్మములలో వైశాఖమాసమును గురించి చెప్పబడిన ధర్మములు సూక్ష్మములైనను విశేషఫలము నిచ్చునట్టివై సమస్త ప్రాణులకు నిహలోక పరలోక సౌఖ్యముల నొసగుచున్నవి.

శ్లో॥ యస్త్వి ష్టవ్యో మనసి తే యచ్చాద్య తచ్చ పృచ్ఛతాం।
ఇత్యుక్తో మునినా తేన వ్యాధః ప్రాంజలి రబ్రవీత్॥

తా. నీమనస్సులో దేనిని తెలిసికొన వలయునని కోరిక గలదో దానినే ముందుగా నడుగుము. అని మునీశ్వరుడు పలుకగా కిరాతుడు దోసిలిపట్టి యిట్లు పలుకుచున్నాడు.

వ్యాధ ఉవాచ॥

శ్లో॥ కేన వా కర్మణా చాసీ ద్వ్యాధజన్మాతిమోహయం।
కేన వా చేదృశీ బుద్ధి స్సంగతి ర్వా మహాత్మనః॥ ౩౪
ఏతచ్ఛ్రోతుం మమా చక్ష్వ యది మాం మన్యసే ప్రభో।
ఇత్యుక్తః పున రప్యాహ శంఖో నామ మహామునిః॥ ౩౫
మేఘగంభీరయా వాచా స్మయమాన ముఖాంబుజః॥

తా. కిరాతుడు చెప్పుచున్నాడు. ఓ స్వామీ! కేవల మజ్ఞానముతో నిండియున్న యీ కిరాత జన్మము యేకర్మములను జేయుట వలన సంభవించినది? ఏ సుకృత

మునకు మంచి బుద్ధియు, మీబోంటి మహానుభావుల సహవాసము సంభవించెను ? నేను ధర్మశాస్త్రములను వినుటకు తగిన వాడనని మీరు తలంచిన యెడల దీని వంశయము సవిస్తరముగా జెప్పుమని యడుగగా శంఖుడనెడు యామునిశ్రేష్ఠుడు చిరునవ్వుగల ముఖముగలవాడై మేఘధ్వనులతో సమానమగు గంభీరవాక్యములచే నిట్లు తిరిగి పలుకుచున్నాడు.

శంఖఉవాచ॥

శ్లో॥ శాకలే నగరే పూర్వం ద్విజ స్త్వం వేదపారగః॥
స్తంభో నామ మహాతేజా స్తథా శ్రీవత్సగోత్రజః॥

తా. శంఖుడు చెప్పుచున్నాడు. ఓకిరాతుడా! నీవు పూర్వజన్మంబున వేదశాస్త్రములను జదివినట్టియు విశేష తేజస్సు గలిగినట్టియు శ్రీవత్సగోత్రమునందు బుట్టినట్టియు స్తంభుడను పేరుగల బ్రాహ్మణుడవు.

శ్లో॥ తవేష్టా గణికా కాచి దాసీ త్తత్సంగదోషతః॥ ౩౮
త్యక్త్వా నిత్యక్రియాం నిత్యం శూద్రవద్గృహ మాగతః॥

తా. అప్పుడు నీకు యొకభోగము చిన్నది యిష్టమై యుండెను. దానిసాంగత్యము వలన నీవు నిత్యము జేయవలసిన బ్రాహ్మణ కృత్యములను మానివేసి శూద్రుడవు వలెనే గృహమునందు వ్యవహరింపుచుంటివి.

శ్లో॥ శూన్యాచారస్య దుష్టస్య పరిత్యక్తక్రియస్య చ॥ ౩౯
బ్రాహ్మణీ చ తదా చాసీ ద్భార్యా కాంతిమతీ తవ॥

తా. ఇట్లు ఆచార శూన్యుడవును దుర్మార్గుడవును బ్రాహ్మణ కృత్యములను విడిచి పెట్టియున్న నీకు కాంతి మతి యనెడు యొక బ్రాహ్మణ చిన్నది భార్యగా నుండెను.

శ్లో॥ సా త్వాం పర్యచరత్సుభ్రూ స్సవేశ్యం బ్రాహ్మణాధమం॥ ౪౦
ఉభయోః క్షాళయంతీ చ పాదౌ స్త్వత్ప్రియకారిణీ॥

తా. ఆచిన్నది ఇట్లు బ్రాహ్మణ హీనుడవుగా నుండిన నీకును నీవుంచుకొనిన వేశ్యకును శుశ్రూషజేయుచు నీయందుండిన ప్రేమవలన మీయుభయుల పాదములను ప్రక్షాళన జేయుచుండెను.

శ్లో॥ ఉభయో రప్యథ శ్చైతే ఉభయో ర్వచనే రతా॥ ౪౧
వేశ్యయా వార్యమాణా పి పాతివ్రత్యవ్రతస్థితా॥

తా. ఆ బ్రాహ్మణుడు భోగముది యిద్దరు పరుండెడి శయ్యాలకంటె క్రిందు
గా పండుకొనుచు వారిమాటలను వినుచు పతివ్రతయైనందున భోగముస్త్రీ వద్దని చెప్పి
నప్పటికిని యిద్దరికిని శుశ్రూష జేయుచుండెను.

శ్లో॥ ఏవం శుశ్రూషయంత్యా హి భర్తారం వేశ్యయా సహ॥ ౪౩
జగామ సుమహాన్కాలో దుఃఖితాయా మహీతలే॥

తా. ఈ ప్రకారము వేశ్యతో గూడియున్న పెనిమిటికి శుశ్రూషజేయుచు దుః
ఖించుచు నిట్లు చాలా కాలము వెళ్ళబుచ్చెను.

శ్లో॥ అపరస్మిన్దినే భర్తా మాహిష్యం మూలకాన్వితం।
అభక్షయ చ్ఛ్రాద్ధధర్మ్మాన్నిష్పావాం స్తిలమిశ్రితాన్॥
తదపథ్య మశిత్వా తు వమం చైవ విరేచయత్॥ ౪౪

తా. మఱియొకదినమునందు పెనిమిటివాడు శ్రాద్ధధర్మమును అవలంబించి గే
దెపెరుగు ముల్లంగి దుంపలు నువ్వులు కలసిన అనుములు మొదలగు వానిని భక్షించితివి.
అపథ్యపదార్థములను భక్షింపుటచే జీర్ణింపక డోకులు విరేచనము లాయెను.

శ్లో॥ అపథ్యా ద్దారుణో రోగో వ్యజాయత భగందరః।
స దహ్యమానో రోగేణ దివారాత్రిం తు భూరిశః॥ ౪౫

తా. అపథ్య దోషమువలన మర్మస్థానమందు మిక్కిలి బాధకరమైన భగందర
మనెడు రోగము సంభవింపగా వారోగముచే రాత్రింబవలు బాధపడుచుండెను.

శ్లో॥ యావ దాస్తే గృహే విత్తం తావ ద్వేశ్యా చ సంస్థితా।
గృహీత్వా తస్య సా విత్తం పశ్చా న్నైవ న మందిరే॥ ౪౬

తా. ఆ బ్రాహ్మణుని గృహమునందు యెంతవరకు ధనముండెనో అంతవరకు
భోగముదిన్నది యుండి ఆయన వద్దనుండు ధనము నంతయు సంగ్రహించి దరిద్రుండై
న పిమ్మట వా బ్రాహ్మణుని వద్దనుండక వెళ్ళిపోయెను.

శ్లో॥ అన్యస్య పార్శ్వ మాసాద్య గతా ఘోరా సునిర్ఘృణా।
తత స్సుదీనవచనో వ్యాధిబాధాసు పీడితః॥ ౪౭
ఉక్తవాన్ స రుద న్భార్యాం రుజా వ్యాకులమానసః॥

తా. ఆభోగము స్త్రీ యీ బ్రాహ్మణుని వద్ద ధనము నశింపగానే యెంతమా
త్రము దయలేనిదై మరియొక పురుషు నాశ్రయించి యుండెను. అనంతరము బ్రాహ్మ
ణుడు రోగబాధచే పీడింపబడుచు స్వస్థతలేని మనస్సు గలవాడగుచు యేడ్చుచు మి
క్కిలి దీన వాక్యములను భార్యతో నిట్లు పలుకుచున్నాడు.

శ్లో॥ పరిపాలయ మాం దేవి వేశ్యాసక్తం సునిష్ఠురం॥ ౪౮
న మయోపకృతం కించి త్త్వయి సుందరి పాపినా॥

తా, ఓ ప్రాణేశ్వరి ! వేశ్యాస్త్రీలయందు ఆసక్తిగల వాడను దుర్మార్గుడనగు నన్ను రక్షింపుము. ఓ సౌందర్యవరాలా ! నీవు నాకు అనేక విధములుగా శుశ్రూష జేసినను విశ్వాసముంచక పాపాత్ముడనై యుపకారమేమియును జేయనైతి.

శ్లో॥ కో భార్యాం ప్రణతాం పాపో నా నుమన్యేత గర్హితః॥ ౪౯
స షండో భవితా భద్రే దశజన్మసు పంచసు॥

తా. ఓ ప్రాణేశ్వరి ! పాపాత్ముండగు నెవ్వడు భార్య భక్తి శ్రద్ధలతో శుశ్రూషజేయు చున్నను దూషించుచు నవమానము జేయునో అట్టివాడు పదిహేను జన్మములు పర్యంతము నపుంసకుడై పుట్టుచుండును.

శ్లో॥ దివారాత్రిం మహాభాగే నిందిత స్సాధుభి ర్జనైః॥ ౫౦
పాపయోని మవాప్స్యామి త్వాం సాధ్వీ మవమన్య వై॥

తా. ఓ పూజ్యురాలా ! సత్పురుషులచే నెల్లప్పుడు నేను దూషింపబడితిని. పాపాత్ముండ నగుటవలనను పతివ్రతవగు నిన్ను పరాభవము జేయుటవలనను నేను హీనజన్మము నెత్తవలసివచ్చెను.

శ్లో॥ అహం క్రోధేన దగ్ధో స్మి తవా నునయ జేన వై॥ ౫౧
ఏవం బ్రువాణాం భర్తారం కృతాంజలిపుటా బ్రవీత్॥

తా. ఓ చిన్నదానా! నీవు నాకు ననేకభంగుల పరిచర్యజేసినను సంతోషింపక నిన్ను తిరస్కారము జేసినందువలన నీకు గలిగిన కోపాగ్నిచే నేదహింపబడితిని. అని దీనోక్తులు బలుకుచున్న పెనిమిటిని జూచి యా చిన్నది కృతాంజలియై యిట్లు బలుకుచున్నది.

శ్లో॥ న దైన్యం భవతా కార్యం న వ్రీడా కాంత మాం ప్రతి॥ ౫౨
న చాపి త్వయి మే క్రోధో యేన దగ్ధోసి వక్ష్యతి॥

తా. ఓ ప్రాణనాథా! నీవు దీనవచనములను పల్కగూడదు. నన్ను గురించి సిగ్గుపడగూడదు. నా క్రోధముచే దహింపబడుచున్నానని మీరు బల్కితిరి. అట్టి కోపమేమియును నాకు మీయందు లేదు.

శ్లో॥ పురాకృతాని పాపాని దుఃఖానీహ భవంతి హి॥ ౫౩
తాని యాంతు మతే సాధ్వీ పురుషో వా స ఉత్తమః॥

తా. పూర్వమందు జేసికొనబడిన పాపముచే దుఃఖములను కలిగించుచున్నవి గాన అట్టి దుఃఖములను యే పతివ్రతా శిరోమణి గాని యే పురుషుడు గాని సహించుచున్నారో వారే ధన్యాత్ములు.

శ్లో॥ యస్మయా పాపయా పాపం కృతం వై పూర్వజన్మని॥ ౧౪
తద్భుంజంత్యా న మే దుఃఖం న విషాదః కథంచన॥
ఇత్యేవ ముక్త్వా భర్తారం సా సుభ్రూ స్తం చ పాలయత్॥ ౧౫

తా. ఓస్వామీ! పాపాత్మురాలనగు నేను పూర్వజన్మంబున జేసికొనబడిన పాపముయొక్క ఫలముననుభవించుట వలన నేనిదముగానైనను దుఃఖము గాని విచారము గాని లేదు. ఈపతివ్రతా చిన్నది పెనిమిటితో బలికి ఆపెనిమిటిని సంరక్షించుచుండెను.

శ్లో॥ ఆనీయ జనకా ద్విత్తం బంధుభ్యో వరవర్ణినీ।
క్షీరోదవాసినం దేవం భర్తారం చైవ చింతయత్॥ ౧౬

తా. ఆచిన్నది తన తండ్రివద్ద నుండియు బంధువుల వద్దనుండియు ధనమును దెచ్చి పెనిమిటిని పోషించుచు తన పెనిమిటిని పాలసముద్రమునందు శయనించియుండు నారాయణమూర్తిని గా జూచుచుండెను.

శ్లో॥ శోధయంతీ దివారాత్రౌ పురీషం మూత్ర మేవ చ।
నఖేన కర్షతి భర్తుః కృమీన్ కష్టా చ్ఛనైశ్శనైః॥ ౧౭

తా. రాత్రింబవలును పెనిమిటియొక్క మూత్రపురీషములను తీసివేసి బాగుపరచుచు కురుపులయందు కలుగుచుండెడి పురుగులను గోళ్లతో మెల్లమెల్లగా నతికష్టముతో తీసివేసి సంరక్షణ జేయుచుండెను.

శ్లో॥ న సా స్వపితి రాత్రౌ తు న దివా వరవర్ణినీ।
భర్తు ర్దుఃఖేన సంతప్తా దుఃఖితే ద మహోచత॥ ౧౮

తా. ఆచిన్నది రాత్రిగాని పగలు గాని నిద్రించుటలేదు. పెనిమిటికి సంభవించిన దుఃఖముచే తాను దుఃఖపడుచు నిట్లు పలుకుచున్నది.

శ్లో॥ దేవా శ్చ పాంతు భర్తారం పితరో యే చ విశ్రుతా।
కుర్వంతు రోగహీనం మే భర్తారం గతకల్మషం॥ ౧౯

తా. దేవతలు ప్రసిద్ధిజెందియున్న పితృదేవతలును నా పెనిమిటిని రక్షింతురుగాక. నా పెనిమిటిని రోగము లేనివానిగాను పాపరహితునిగాను జేయుదురుగాక.

శ్లో॥ చండికాయై ప్రదాస్యామి రక్తమాంససముద్భవం।
సుష్టాన్నం మాహిషోపేతం భర్తు రారోగ్యహేతవే॥ ౬౦

తా. నా పెనిమిటి దేహమునం దారోగ్యముగా నుండుకొరకు రక్తము మాంసము గేదె పెరుగు మొదలగు పదార్థములతో గూడిన యన్నమును దుర్గాదేవికి సమర్పించెదను.

శ్లో॥ మోదకాన్ కారయిష్యామి విఘ్నేశాయ మహాత్మనే।
మందవారే కరిష్యామి చోపవాసాన్ ద్వితైవతు॥ ౬౧

తా. మహానుభావుండైన విఘ్నేశ్వరునకు కుడుములను నివేదనము జేసెదను. మంద శనివారములయందు నుపవాసము జేసెదను.

శ్లో॥ నోపభుంజామి మధురం నోపభుంజామి వై ఘృతం।
తైలాభ్యంగవిహీనాహం స్థాస్యే నైవాత్ర సంశయః॥

తా. ఆ యుపవాస దినమునందు మధురపదార్థము గాని నెయ్యి మొదలగు నే పదార్థముల ననుభవింపక శుష్కోపవాసము జేసెదను. మరియు నభ్యంగనము కేశాలంకారములను జేయకుందును. ఇందు విషయమై యేమియు సందేహములేదు. అని దీక్ష వహించియుండెను.

శ్లో॥ జీవతాం రోగహీనో యం భర్తా మే శరదాం శతం।
ఏవం హ వ్యాహరద్దేవీ వాసరే వాసరే గతే॥ ౬౩
తదా చాగాన్ముని కశ్చి న్మహాత్మా దేవలాహ్వయః।
వైశాఖే మాసి ధర్మాత్మా సాయాహ్నే తస్య వై గృహం॥ ౬౪

తా. నా పెనిమిటి రోగములేనివాడై నూరుసంవత్సరముల పర్యంతము జీవింపవలయును. అని యాచించ్చి దీక్షవహించి దేవతాప్రార్థన జేయుచుండగా కొంతకాలముగడువగా నప్పుడు మహానుభావుండును ధర్మస్వభావుండును దేవలుడను పేరుగల యొక మునీశ్వరుడు వైశాఖమాసములో సాయంకాలమునందు ఆమె గృహమునకు వచ్చెను.

శ్లో॥ తదా వైభార్యయా చోక్తం భిషగ్వై గృహమాగతః।
తేన వై రోగహాని స్స్యా త్తస్యా తిథ్యం కరోమ్యహం॥ ౬

తా. బ్రాహ్మణునకు నతిథిపూజ జేసినయెడల రోగము మానును. అను రోగము భార్య పిలువగా వైద్యుండగు ఆమునీశ్వరుడు గృహములోనికి వెళ్లెను.

శ్లో॥ జ్ఞాత్వా త్వాం ధర్మవిముఖం భిషగ్వ్యాజేన వంచితః।
పాదావనేజనం కృత్వా తజ్జలం మూర్ధ్ని సాక్షిపత్॥ ౬౬

తా॥ నీవెప్పుడు ధర్మము చేయనివాఁడవు గాన నాతని తెలిసికొని ఆమునీశ్వరుని గృహములోనికి బిలిచి యేదో యొక మిషబెట్టి పాదప్రక్షాళన జేసి యాజలమును పెనిమిటి శిరస్సున జల్లెను.

శ్లో॥ పానకం చ దదౌ తస్మై ఘర్మార్తాయ మహాత్మనే।
త్వయా నుమోదితా సాయం ఘర్మతాపనివారకం॥ ౬౭

తా॥ మహానుభావుఁడును యెండవేఁడిమిచే పీడింపబడిన యామునీశ్వరునకు గ్రీష్మతాపమును పోగొట్టునట్టి పానకమును నీచే ననుజ్ఞఁగొని సాయంకాలమందు అది న్నది యిచ్చెను.

శ్లో॥ స ప్రీతమనా తేనూర్క్యే మునిః ప్రాయా ద్యథాగతః।
అథ చాల్పేన కాలేన సన్నిపాతో భవ త్తవ॥ ౬౮

తా॥ తరువాత ఆబ్రాహ్మణుఁడు ప్రాతఃకాలంబున లేచి యింటికి వెళ్లెను అటుతర్వాత కొద్దికాలములోనే నీకు సంధివ్యాధి కలిగెను.

శ్లో॥ త్రికూటం నియమానాయాం భర్త్రాంగుళి మఖండయత్।
ఉభయో ర్దంతయో శ్లేష్మ ప్రవాహా సమపద్యత॥ ౬౯

తా॥ ఆరోగనివారణము కొఱకు గరళమును నోటిలో నుంచబోఁగా యామె యొక్క వ్రేలును పెనిమిటియగు నీవు కొరికితివి. రెండు దంతముల మధ్యను శ్లేష్మము శీఘ్రముగా పెరుగుచుండెను.

శ్లో॥ తత్ఖండ మంగుళిం వక్త్రే స్థితం భర్తు స్సుకోమలం।
ఖండయిత్వాం గుళిం భర్తా పంచత్వ మగత స్తదా॥ ౭౦

తా॥ అప్పుడు తన వ్రేలిని పెనిమిటి కొరకఁగా నామె పెనిమిటి నోటిలో యున్న తునుకను తనవ్రేళ్లతో బైటికి తీసెను. ఇట్లు పెనిమిటిభార్యయొక్క ఆవ్రేలిని కొఱికి వెంటనే మృతినొందెను.

శ్లో॥ శయ్యాయాం సుమనోజ్ఞాయాం స్మరం స్త్రాం పుంశ్చలీం శుభాం।
మృతం విజ్ఞాయ భర్తారం భార్యా కాంతిమతీ తవ॥ ౭౧
విక్రీత్వా చాపి వలయం గృహీత్వా చేంధనం బహు।

చక్రే చితిం తేన సాధ్వీ మధ్యే కృత్వా పతిం తదా॥ 22

అనగుహ్యా భుజాభ్యాం చ పాదౌ చాశ్లిష్య పాదయోః।

ముఖే ముఖం వినిక్షిప్య హృదయం హృదయే తథా॥ 23

జఘనే జఘనం దేవీ హ్యాత్మాంగం సన్నివేశ్య చ।

దాహయామాస కల్యాణీ భర్తృదేహం రుజాన్వితం॥ 24

ఆత్మనా సహ కల్యాణీ జ్వలితే జాతవేదసి॥

తా. మనోహరమైన శయ్యయందు పరుండి యెదుట నుంచుకొనిన భోగమునదాని తలచికొనుచు నీప్రాణములను విడువగా భార్యయగు కాంతిమతి పెనిమిటియగు నిన్ను మృతినొందినవానిగా దెలిసికొని తన చేతియందున్న కడియము నమ్మివేసి చాలా కట్టెలను కొని కాష్ఠమును పేర్పించి దానిమధ్యను పెనిమిటియగు నిన్ను పరుండబెట్టి నీభుజములతో భుజములు పాదములతో పాదములు ముఖముతో ముఖము హృదయముతో హృదయము కటిప్రదేశముతో కటిప్రదేశము కలసికొనునట్లుగా నీశరీరముపైని మంగళప్రదురాలగు యాకాంతిమతి తన శరీరమునుంచి మండుచున్న యగ్నిహోత్రియందు తన శరీరముతో గూడ రోగముచే పీడింపబడి మృతిజెందిన పెనిమిటియగు నీశరీరమును దహింపజేసెను.

శ్లో॥ విముచ్య దేహం సహసా జగామ పతిం సమాలింగ్య మురారి లోకం। పానీయదానేన చ మాధవే స్మిన్పాదావనేజాదపి యోగిగమ్యం॥ 25

తా. నీభార్యయగు కాంతిమతి నీశరీరమునందు తన శరీరమును కూడ జేర్చి దహింపజేసికొనుట వలనను వైశాఖమాసములో మంచితీర్థమును దానము జేయుటచేతను ఆబ్రాహ్మణుని పాదప్రక్షాళన జేయుటవలనను యోగీశ్వరులచే పొందతగిన విష్ణులోకమును పొందెను.

శ్లో॥ త్వమంతకాలే గణికా విచింతయా దేహం త్యక్త్వా సక్తసమస్త కిల్బిషః। జన్మ వ్యాధం ప్రాప్తవాన్ ఘోరరూపం హింసాసక్త స్సర్వదోద్వేగకారీ॥ 26

తా. నీవు మరణకాలంబున భోగముదానిని తలచుచు ప్రాణములను విడుటచే సమస్త పాపములను పొందినవాడనై శరీరముచాలించి క్రూరమగు కిరాతజన్మమునొంది ప్రాణులను వధించుచు నెల్లప్పుడు దుర్మార్గుడవుగా నుంటివి.

శ్లో॥ దత్తా త్వయా పానకస్యాపి దానే మాసే నుజ్ఞా మాధవే మానసవర్యే । వ్యాధో జాత స్తేన జాతా సుబుద్ధి ర్ధర్మాన్ ప్రష్టుం సర్వసౌఖ్యైకహేతూన్॥ ౨౭

తా. అన్నిమాసములలో శ్రేష్ఠమైన వైశాఖమాసములో నీభార్య పానకము నిచ్చుచుండగా ననుజ్ఞ నిచ్చితివి గాన యాపుణ్యవశముచే నీవు కిరాత జన్మమెత్తినను సమస్త సౌఖ్యముల నొసగునట్టి ధర్మములను తెలిసికొనవలయునను బుద్ధి కలిగినది.

శ్లో॥ ధృతం మూర్ధ్నా పాదశౌచావశిష్టం జలం మునే స్సర్వపాపాపహారి । తేనేయం తే సంగతి ర్మే వనే స్మి న్వయా భూయా త్సంపద స్సంతతి శ్చ॥ ౨౮

తా. పాపములను పోగొట్టునట్టి ఆ మునీశ్వరుని పాదప్రక్షాళనము జేసిన యుదకమును నీ శిరస్సున ధరించుటచే యీ అడవియందు నాతో సహవాసము కలిగెను. మరియు సంపత్తులు సంతతులు వృద్ధికాదగి యున్నవి.

శ్లో॥ ఇత్యేత త్సర్వ మాఖ్యాతం పూర్వజన్మని యత్కృతం।
కర్మ పుణ్యం పాపకం చ దృష్టం దివ్యేన చక్షుషా॥ ౨౯

తా. ఓకిరాతుడా ! ఈప్రకారముగా నీవు పూర్వజన్మమునందు జేయబడిన పుణ్యకర్మనుగాని పాపకర్మనుగాని దివ్యదృష్టిచే జూచి నీపూర్వజన్మమునందు జరుగబడిన వృత్తాంతమునంతయును జెప్పితిని.

శ్లో॥ గోప్యం నాతే ప్రవక్ష్యామి యద్భవాంచ్ఛ్రోతు మిచ్ఛతి।
జాతా తే చిత్తశుద్ధి ర్వై స్వస్తి భూయా న్మహామతే॥ ౩౦

తా. ఓకిరాతుడా! రహస్యముగానుండిన యేధర్మమునైనను నీవు వినవలయునని కోరికగానుండిన యెడల చెప్పెద నడుగుము మిక్కిలి బుద్ధిగలవాడా ; నీకు చిత్తశుద్ధి కలిగినది; నీకు శుభమగుగాక.

ఇతి వైశాఖమాహాత్మ్యే అష్టాదశోధ్యాయః

## అథపంచాశోధ్యాయః.

వ్యాధఉవాచ॥

శ్లో॥ విష్ణు ముద్దిశ్య కర్తవ్యా ధర్మాభాగవతా శ్శుభాః।
తత్రాపి మాధవీమా శ్చ ఇత్యుక్తం తు త్వయా పురా॥ ౧

తా. కిరాతుడు చెప్పుచున్నాడు. ఓబ్రాహ్మణుడా! విష్ణుని గురించి జేయదగిన ధర్మములను జెప్పుచు వానిలో శ్రేష్ఠమైనవియు భగవత్సంబంధమైనవియు శుభములనొసగు నవియునగు వైశాఖ ధర్మములను ముఖ్యముగా జేయవలయునని చెప్పితివి.

శ్లో॥ స విష్ణుః కీదృశో బ్రహ్మన్ కిం చ తస్య హి లక్షణం।
కిం మానం తస్య సద్భావే కైర్జ్ఞేయో భగవాన్విభుః॥ ౨

తా. ఓబ్రాహ్మణుడా! ఆవిష్ణుమూర్తి యెటువంటివాడు. ఆయనయొక్క లక్షణములు యేమిటివి. ఆయన ఉన్నాడని చెప్పుటకు ప్రమాణమేమి. ఆభగవంతుని యెటువంటివారు తెలిసికొనుచున్నారు.

శ్లో॥ కీదృశా వైష్ణవా ధర్మాః కేనా సౌ ప్రీయతే హరిః॥
ఏత దాచక్ష్వ మే బ్రహ్మన్ కింకరాయ మహామతే॥ 3

తా. విశేషబుద్ధిశాలివగునో బ్రాహ్మణుడా; విష్ణుసంబంధములగు ధర్మములేవి, ఏధర్మములచే విష్ణుమూర్తి సంతోషించును. దీనినంతయును మీకు శిష్యుడనగు నాకు జెప్పవలయును.

శ్లో॥ ఇతి పృష్ట స్తు వ్యాధేన పునః ప్రాహ స వై ద్విజః।
ప్రణమ్య జగతా మీశం నారాయణ మనామయం॥ ౪

తా. ఈ ప్రకారము కిరాతుడడుగగా నా బ్రాహ్మణుడు ప్రపంచమున కధిపతియు సర్వబాధారహితుడునగు విష్ణుమూర్తికి నమస్కరించి తిరిగి యిట్లు చెప్పుచున్నాడు.

శంఖఉవాచ॥

శ్లో॥ శృణు వ్యాధ ప్రవక్ష్యామి విష్ణురూప మకల్మషం।
యదచింత్యం విరించాద్యై ర్మునిభి ర్భావితాత్మభిః॥

తా. శంఖుడు చెప్పుచున్నాడు. ఓ కిరాతుడా! పాపరహితమైనదియు బ్రహ్మ మొదలగు దేవతలచేతను మహానుభావులగు మునీశ్వరుల చేతను విచారింప శక్యముగాని విష్ణుస్వరూపమును జెప్పెదను వినుము.

శ్లో॥ పూర్ణశక్తిః పూర్ణగుణో నిర్దిష్ట స్సకలేశ్వరః।
నిర్గుణో నిష్కలో నంత స్సచ్చిదానందవిగ్రహః॥ ౬

తా. విష్ణుమూర్తి సంపూర్ణమైన శక్తిగలవాడు సంపూర్ణమైన గుణములు గలవాడు. దోషరహితుడు. సమస్తమునకు నధిపతి. గుణరహితుడు. నిమేషాది శూన్యుడు. పరిమితిలేనివాడు సచ్చిదానంద స్వరూపుడునై యుండెను.

శ్లో॥ యదేత మఖిలం విశ్వం చరాచర మనీదృశం।
సాధీశం సాశ్రియం యచ్చ యద్వశం నియతం స్థితం॥ ౭

తా. సంచరించు చుండెడి మనుష్యాదులును సంచరింపని పర్వతాదులును గల యీ ప్రపంచ మేది గలదో ఆ ప్రపంచమంతయు నెప్పుడీరీతిగానే యుండెను. మరియు నీ ప్రపంచము అధిపతితో గూడినదియు నొకని యాధారము గలదియు నొకరిని యాశ్రయించి యున్నదియు నియతముగా నొకరి స్వాధీనములోనే యున్నదియునై యుండెను

శ్లో॥ అథ తే లక్షణం వచ్మి బ్రహ్మణః పరమాత్మనః।
ఉత్పత్తిస్థితిసంహారా హ్యావృత్తి ర్నియమ స్తథా॥
ప్రకాశో బంధమోక్షౌ చ వృత్తి ర్యస్మా ద్భవంత్యమీ।
స విష్ణు ర్బ్రహ్మసంజ్ఞో సౌ కవీనాం సమ్మతో విభుః॥

తా. పరమాత్ముడైన పరబ్రహ్మముయొక్క లక్షణములు చెప్పుచున్నాను. ప్రపంచము ఉత్పత్తియు నిలకడయు సంహారమును రాకపోకలును నియంతృత్వము ప్రకాశము బంధము మోక్షము మొదలగు కృత్తి యెవరివలన జరుగుచుండునో ప్రభువగు నట్టి విష్ణుమూర్తియే పరబ్రహ్మమని విద్వాంసుల యభిప్రాయమై యున్నది.

శ్లో॥ సాక్షా ద్బ్రహ్మేతి తం ప్రాహుః పశ్చా ద్బ్రహ్మాదికా నపి।
బ్రహ్మశబ్దం సోపపదం బ్రహ్మాదిషు విదో విదుః॥

తా. యథార్థజ్ఞానముగలవారు నారాయణమూర్తినే ప్రత్యక్షు పరబ్రహ్మమునుగా తెలిసికొనుచున్నారు చతుర్ముఖ బ్రహ్మ మొదలగు వారియందుకూడ బ్రహ్మశబ్దమును చెప్పుచుండిరి గాని వారియందు చెప్పబడిన బ్రహ్మశబ్దము రూఢియే గాని యౌగికము కాదు.

శ్లో॥ నాన్యేషాం బ్రహ్మతా క్వాపి తచ్ఛక్త్యైకాంతభాగినాం।
తదేత చ్ఛాస్త్రగమ్యం హి జన్మాద్యస్య మహా విభోః॥

తా. ఆ నారాయణమూర్తి యొక్క శక్తిలో లేశాంశము వలన గలిగిన చతుర్ముఖ బ్రహ్మ మొదలగు వారికి పరబ్రహ్మత్వ మెట్లు సిద్ధించును. కాబట్టి “జన్మాద్యస్యయతః” అను సూత్రమువలన నారాయణుడే సర్వభూత వ్యాపక పరబ్రహ్మమని వేదాంత శాస్త్రముచే నిర్ణయింపబడినది.

శ్లో॥ శాస్త్రం చ వేదా స్స్మృతయః పురాణం వై తదాత్మకం।
ఇతిహాసః పాంచరాత్రం భారతం చ మహామతే॥ ౧౨
ఏతైరేవ మహావిష్ణు ర్జ్ఞేయో నాన్యైః కథంచన।
నావేదవి దముం విష్ణుం మనుతే చ నరః క్వచిత్॥ ౧౩

తా. మంచిజ్ఞానము గలవాడా! శాస్త్రములు, వేదములు, స్మృతులు, పురాణము, ఇతిహాసములు, పాంచరాత్రాద్యాగమములు, భారతము, యీ మొదలగువాని చేతనే ఆవిష్ణుమూర్తిని తెలిసికొనవలయును గాని మరియొకదానిచే దెలియబడడు. కాబట్టి వేదవేత్త కానిపురుషు డెన్నటికిని ఆవిష్ణుమూర్తిని తెలిసికొనలేడు.

శ్లో॥ నేంద్రియై ర్నానుమానైశ్చ న తర్కైశ్శక్యతే విభుం।
జ్ఞాతుం నారాయణం దేవం వేదవేద్యం సనాతనం॥ ౧౪

తా. ప్రభువును ప్రకాశించువాడును వేదములచే దెలియదగినవాడును పురాణపురుషుండునగు నారాయణమూర్తిని తెలిసికొనుటకు శ్రోత్రాదీంద్రియములుగాని ప్రత్యక్షాది ప్రమాణములుగాని తర్కాది యుక్తులుగాని సమర్థములైనవి గావు.

శ్లో॥ అస్యైవ జన్మకర్మాణి గుణాన్ జ్ఞాత్వా యథామతి।
ముచ్యంతే జీవసంఘా శ్చ సదా తద్వశవర్తినః॥ ౧౫

తా. జీవసమూహములు ఆభగవంతుని అవతారాదులను కృత్యములను గుణములను తన బుద్ధికి తెలిసినకొలది యెరిగిన యెడల యెల్లప్పుడు ఆయన సన్నిధానముందుండి ముక్తిని పొందుచున్నవి.

శ్లో॥ క్రమా ద్విష్ణో శ్చ మాహాత్మ్యం యథా సాతిశయం భవేత్।
ఏకైకస్మిన్ స్థితా శక్తి ర్దేవర్షిపితృమానవైః॥ ౧౬

తా. అధికముగానుండు వట్టి విష్ణు చరితమును క్రమముగా తనకు తెలిసిన కొలది యెరుగవలయును. ఈయన సర్వశక్తియుతుడు. ఇతరులగు దేవతలు మునీశ్వరులు పితృదేవతలు మొదలగు వారు ఒక్కొక్క శక్తినే గలిగి యున్నారు.

శ్లో॥ ప్రత్యక్షేణా గమేనా పి తద్వైవా నుమయాపి।
ఆదౌ నరోత్తమం విన్ద్యా ద్బలే జ్ఞానే సుఖే తథా॥

తా. బలము జ్ఞానము సుఖము మొదలగు నవి గలుగుటచే ప్రత్యక్షము ఆగమము అను మానము మొదలగు ప్రమాణములచే ప్రాణుల నన్నింటిలో మనుష్యుని అధికుని గా తెలిసికొన వలయును.

శ్లో॥ తస్మా ద్భూపం శతగుణం విద్యాత్ జ్ఞానాదిభి స్త్వార్యవి
భూపా న్మనుష్యగంధర్వా న్విద్యా చ్ఛతగుణాధికాన్॥ ౧౮

తా. ఆ మనుష్యునికంటె జ్ఞానము మొదలగు వానితో గూడిన రాజు నధికునిగా చెప్పిరి వానికంటె మనుష్య గంధర్వులను నూరురెట్లు అధికులనుగా చెప్పిరి.

శ్లో॥ తత్త్వాభిమానినో దేవాం స్తేభ్యో విద్యా చ్ఛతాధికాన్।
తత్త్వాభిమానిదేవేభ్య స్సప్తైవ ఋషయ స్తథా॥

తా. ఆ మనుష్య గంధర్వులకంటె తత్త్వజ్ఞానముగల దేవతలను నూరురెట్లు అధికులనుగా చెప్పిరి. వేదాంతజ్ఞానముగల దేవతలకంటె సప్త మునులను నూరురెట్లు అధికులనుగా తెలిసికొన వలయును.

శ్లో॥ సప్తర్షిభ్యో వరో హ్యగ్ని రగ్నే స్సూర్యాదయ స్తథా।
సూర్యా ద్గురు గణోః ప్రాణః ప్రాణా దింద్రో మహాబలః॥ ౨౦

తా. సప్త ఋషీశ్వరులకంటె అగ్ని హోత్రుడును అగ్ని హోత్రుని కంటె సూర్యుడును సూర్యుని కంటె గురువును గురువుకంటె ప్రాణము ప్రాణము కంటె ఇంద్రుడును మిక్కిలి బలము గలవారుగా చెప్పబడిరి.

శ్లో॥ ఇంద్రా చ్చ గిరిజా దేవీ దేవ్యా శ్శంభు ర్జగద్గురుః।
శంభో ర్బుద్ధి ర్మహాదేవీ బుద్ధేః ప్రాణో బలాత్మకః॥ ౨౧

తా. ఇంద్రుని కంటె పార్వతీదేవియు పార్వతీదేవి కంటె జగద్గురువగు సాంబమూర్తియు ఆయన కంటె మిక్కిలి పరిశీలింపుముండెడి బుద్ధియు ఆబుద్ధి కంటె ప్రాణము నధిక శక్తులు కలవిగా చెప్పబడినవి.

శ్లో॥ న ప్రాణా త్పరమం కించి త్ప్రాణే సర్వం ప్రతిష్ఠితం।
ప్రాణా జ్జాత మిదం విశ్వం ప్రాణాత్మక మిదం జగత్॥ ౨౨

తా. ప్రాణముకంటె నధికమైన దేదియును లేదు. సమస్తము ప్రాణమునందే యున్నది, ఈ ప్రపంచమంతయు ప్రాణమువలననే కలిగినది ఈ ప్రపంచము ప్రాణయుక్తమై యున్నది.

శ్లో॥ ప్రాణే ప్రోత మిదం సర్వం ప్రాణాదేవ హి చేష్టతే।
సర్వాధార మిమం ప్రాహు స్సూత్రం నీలాంబుదప్రభం॥ ౨౩

తా. ఈ ప్రపంచమంతయు ప్రాణమునందె గూర్చబడినది. ప్రాణము వలననే వ్యాపారమును జేయుచున్నది కాబట్టి నీలమేఘముతో సమానకాంతిగల యీ నారాయణమూర్తిని సూత్రమని ఆధారమని దారము వలెనే ప్రపంచమున కంతయు నాధారమైనవానిగా జెప్పుచున్నారు.

శ్లో॥ లక్ష్మీకటాక్షమాత్రేణ ప్రాణస్యాస్య స్థితి ర్భవేత్॥

తా. లక్ష్మీదేవికి పెనిమిటియగు నారాయణమూర్తి యనుగ్రహముచే ప్రాణము నిలచి యుండును.

వ్యాధ ఉవాచ॥

శ్లో॥ సా లక్ష్మీ ర్దేవదేవస్య కృపా లేశైక భాజినీ॥ ౨౪
న విష్ణోః పరమం కించి న్న సమో వా కథంచన।
కథం జీవేష్వయా ప్రాణస్సూత్రనామాధికో భవత్॥ ౨౫

తా. ఆ లక్ష్మీదేవి దేవదేవుండగు విష్ణుమూర్తి యొక్క దయలో కొంచెము దయ పొందినది కాదా ఆనగా విష్ణుమూర్తి యొక్క దయకు పాత్రురాలు, విష్ణుమూర్తి కంటె నధికమైనవాడును సమానుడును లేడు. ఈ జీవులందు వ్యాపించియున్న ప్రాణము సూత్రము వలెనే ఏరీతి నధికమై యున్నది.

శ్లో॥ నిర్ణయో వా కథం హ్యస్య ప్రాణాధిక్యే కథం విభో।
ఏత దాచక్ష్వ మే బ్రహ్మన్ కథం ప్రాణా ద్విభుః పరః ౨౬

తా. ఓ స్వామీ! ఈ విష్ణుమూర్తికి ప్రాణముల కంటె నధికుడని నిర్ణయించబడుచున్నదో లేక విష్ణుకంటె ప్రాణములధికమైనవిగా నిర్ణయింపబడినవో ఓ బ్రాహ్మణుడా! దీని సంగతియు నాకు జెప్పుము.

శంఖ ఉవాచ॥

శ్లో॥ శృణు వ్యాధ ప్రవక్ష్యామి యత్పృష్టం నిర్ణయం త్వయా।
ప్రాణాధిక్యం సముద్దిశ్య జీవై శ్చ సకలై రపి॥ ౨౭

తా. ఓ కిరాతుడా! నీవు దేనిని గురించి ప్రశ్నజేసితివో అట్టి నిర్ణయము సమస్త జీవులచే విచారింపబడి యున్నది కాబట్టి అట్టి ప్రాణాధిక్యతను గురించి చెప్పుచున్నాను వినుము.

శ్లో॥ పురా నారాయణో దేవః పద్మస్రష్టా సనాతనః।
సృష్ట్వా బ్రహ్మాదికాన్ దేవా నిదం ప్రాహ జనార్దనః॥ 28

తా. పురాణపురుషుండగు నారాయణమూర్తి బ్రహ్మాండమును సృజియించుచు బ్రహ్మ మొదలగు దేవతలను సృజియించి ఆవిష్ణుమూర్తి వారితో నిట్లు పలికెను.

శ్లో॥ సామ్రాజ్యే హం స్థాపయేయం బ్రహ్మాణం వః పతిం ప్రభుం।
యో యుష్మాస్వధికో దేవో యౌవరాజ్యే సురేశ్వరాః॥ 29
తం స్థాపయత శీలాఢ్యం శౌర్యౌదార్యగుణాన్వితం।
ఇత్యుక్తా విభునా దేవా స్సర్వే శక్రపురోగమాః॥ 30
ఏవం వదిరే న్యోన్య మహం భూయో మహం త్వితి॥

తా. ఓ దేవతలారా ! మీయొక్క దేవతా సామ్రాజ్యమునకు బ్రహ్మదేవునధిపతిని జేయుచున్నాను. గావున మీలో మంచి స్వభావము శౌర్యము ఔదార్యము మొదలగు సుగుణము లెవనియం దుండునో వానికి యువరాజత్వ మిచ్చెదనన్న వానిని దెల్పుమనగా ఇంద్రుడు మొదలగు సమస్త దేవతలును నేను అధికుడను నేనధికుడనని యొకరితో నొకరు పోట్లాడుకొనిరి.

శ్లో॥ సర్వే వివదమానా శ్చ సూర్యం కేచి త్పరం విదుః॥
శుక్రం కేచి త్పరం కామం కేచి త్తూష్ణీం తు తస్థిరే।
తే నిర్ణయ మపశ్యంతః ప్రష్టుం నారాయణం యయుః॥ 32

తా. ఈప్రకారము వారు పోట్లాడుకొనుచు కొందఱు సూర్యుడధికుడనియు కొందఱు దేవేంద్రుడధికుడనియు చెప్పిరి మఱికొందఱు యూరకుండిరి. ఇట్లు ఆదేవతలు తమలో నెవరధికుడో నిర్ణయించుకొనలేక విష్ణుమూర్తి వద్దకు వెళ్ళిరి.

శ్లో॥ నమస్కృత్య పునః ప్రాహు స్సర్వే ప్రాంజలయో మరాః।
విచారితం మహావిష్ణో సర్వై రస్మాభి రంజసా॥ 33
అస్మాసు దేవ మధికం నైవ విద్మః కథంచన
త్వమేవ నిర్ణయం బ్రూహి దేవా స్సంశయినో ఇమే॥ 34

తా. సమస్తమైన దేవతలు తిరిగి విష్ణుమూర్తి వద్దకు వెళ్లి దోసిలిపట్టి నమస్కారముజేసి యిట్లు పలుకుచున్నారు. ఓవిష్ణు ! మేమందరము మీరు చెప్పగా శీఘ్రము

గా నాలోచించితిమిగాని మాలో నెవరధికులో తెలిసికొన జాలనైతిమి. ఈదేవతలందరు సందేహముగలవారలై యుండిరిగాన నీవేనిర్ణయింపుము.

శ్లో॥ ఇతి పృష్టో మరై స్సర్వైః ప్రహసన్నిద మబ్రవీత్॥

తా. ఈప్రకారము దేవతలందరడుగగా వాసిష్ఠమూర్తి చిరునవ్వుగలవాడై యిట్లు పలుకుచున్నాడు.

శ్లో॥ దేహా ద్యస్మా చ్చ వైరాజా ద్యస్మి న్నిష్క్రామతి హ్యయం॥ ౩౬
ప్రతివ్యతి ప్రవిష్టే తు యస్మి న్నైవ హ్యుత్థితో భవేత్।
స దేవో హ్యధికో నూనం నా పర స్తు కథంచన॥

తా. ఈస్థూలదేహము జాగరిదాసగరిగి యుండుటవల్లనే దేహమునుండి యే దేవత బయటికి వచ్చిన చేతనములేనిదై యీ దేహము పడిపోవునో తిరిగి యే దేవత యీశరీరమునందు ప్రవేశించిన చేతనము గలదియై వ్యాపారము జేయునో ఆ దేవతయే అధికుడైనవాడు. మరియొక దేవత అధికుడైనది కాదు.

శ్లో॥ ఇత్యుక్తా స్తే తత స్సర్వే తథా త్వితి వచో బ్రువన్।
నిశ్చక్రామ జయంతాహ్వః పాదా త్పూర్వం సురేశ్వరః॥

తా. ఇట్లు దేవతలందరితో వసిష్ఠమూర్తి పలుకగా వారు అలాగేనని యొప్పుకొనిరి. అనంతరము జయంతుడను దేవశ్రేష్ఠుడు పాదములను విడచి బయటికి వచ్చెను.

శ్లో॥ తదా పంగు మముం ప్రాహు ర్న దేహః పతిత స్తదా।
శృణ్వ న్పిబ న్వదన్ జిఘ్రన్ పశ్య న్నాస్తే చలన్నపి। ౩౮

తా. పాదములు పాదేంద్రియరహితములగుటవలన కుంటివాడైయుండెను గాని శరీరము పడిపోక వినుట త్రాగుట మాట్లాడుట వాసన జూచుట చూచుట కదలుట మొదలగు వ్యాపారములను జేయుచుండెను.

శ్లో॥ పశ్చాదుపస్థా ద్వినిష్క్రాంతో దక్షో నామ ప్రజాపతిః।
తదా షండ మముం ప్రాహు ర్న దేహః పతిత స్తదా॥ ౩౯
శృణ్వ న్పిబ న్వదన్ జిఘ్రన్ పశ్య న్నాస్తే చలన్నపి॥

తా. అనంతరము మర్మస్థానమునుండి దక్షుడను బ్రహ్మ బయటికి వెడలగా నపుంసకుండాయెను గాని శరీరము పడిపోలేదు. వినుట మొదలగు సమస్తవ్యాపారములను జేయుచునే యుండెను (వెనుకటి శ్లోకములో ఆ వ్యాపారములన్నియు చెప్పబ

డెను. గాన యీశ్లోకములో విభజన జెప్పక «మొదలగు» అనే పదము ప్రయోగింపబడె
ను. యికముందు శ్లోకము లన్నింటిలో నీరీతిగానే జెప్పబడును.)

శ్లో॥ పశ్చా ద్ధస్తౌ ద్వినిష్క్రాంత ఇంద్ర స్స్వామ మీశ్వరః॥
హస్తహీన మముం ప్రాహు ర్న దేహః పతిత స్తదా॥
శృణ్వ న్పిబ న్వదన్ జిఘ్రన్ పశ్య న్నాస్తే చల న్నపి॥ ౪౧

తా. అనంతరము సమస్త దేవతలకు నధిపతియగు దేవేంద్రుడు హస్తములనుం
డి బయలవెడలి రాగా నింద్రియహీనముగుటచే చేతుల వ్యాపారములేక నుంటిచేయి
వాడువలెనే యుండెను గాని దేహము పడనిదైయుండి వినుట మొదలగు సమస్త వ్యా
పారములను జేయుచునే యుండెను.

శ్లో॥ లోచనాభ్యాం వినిష్క్రాంత స్సూర్య స్తేజస్వినాం వరః
తదా కాణ మముం ప్రాహు ర్న దేహః పతిత స్తదా॥ ౪౨॥
శృణ్వ న్పిబ న్వదన్ జిఘ్రన్ పశ్య న్నాస్తే చల న్నపి॥

తా. అనంతరము ప్రకాశము గలవారలలో శ్రేష్ఠుండగు సూర్యుడు నేత్రము
లనుండి వెడలిరాగా నేత్రేంద్రియములేక గ్రుడ్డివాడై యుండెను గాని దేహము పడి
పోలేదు. వినుట మొదలగు సమస్త వ్యాపారముల జేయుచునే యుండెను.

శ్లో॥ ఘ్రాణా త్పశ్చా ద్వినిష్క్రాంతౌ నాసత్యౌ విశ్వభేషజౌ।
అఘ్రాణ మముం ప్రాహు ర్న దేహః పతిత స్తదా॥ ౪౩
శృణ్వ న్పిబ న్వదన్ జిఘ్రన్ పశ్య న్నాస్తే చల న్నపి॥

తా. అనంతరము దేవవైద్యులగు అశ్వినీదేవతలు నాసికనుండి వెడలిరాగా
ఘ్రాణేంద్రియము లేకపోవుటచే వాసన తెలియకుండెను గాని వినుట మొదలగు స
మస్త వ్యాపారములను జేయుచునే యుండును.

శ్లో॥ శ్రోత్రా ద్దిశో వినిష్క్రాంతా న దేహః పతిత స్తదా।
తతో ముం బధిరం ప్రాహు ర్న మృతేతి కథంచన॥ ౪౪
శృణ్వ న్పిబ న్వదన్ జిఘ్రన్ పశ్య న్నాస్తే చల న్నపి।

తా. చెవులనుండి దిక్కులు వెడలిపోగా శ్రోత్రేంద్రియము లేకపోవుటచే
చెవిటివాడై యుండెను గాని శరీరము పడిపోలేదు. వినుట మొదలగు సమస్త వ్యా
పారములను జేయుచునే యుండెను.

శ్లో॥ వరుణో రసనాయాస్తు వినిష్క్రాంత స్తతఃపరం।
తదా రసజ్ఞ మేవాహుర్న దేహః పతిత స్తదా॥ ౭౫
జీవ స్చల న్వద న్నాస్తే తథా జానన్ శ్వసన్నపి॥

తా. అటుపిమ్మట వరుణుడు నాలుకనుండి వెడలిపోగా రుచిని గుర్తెరుగకుండెను గాని శరీరము పడిపోలేదు. జీవించియు కదలుచును భక్షించుచు నిట్టూర్పులు విడుచుచు గుర్తెరుగుచునే యుండెను,

శ్లో॥ తతో వాచో వినిష్క్రాంతోవహ్ని ర్వాగీశ్వరో విభుః॥ ౭౬
తదా మూక మముం ప్రాహు ర్న దేహః పతిత స్తదా॥
జీవన్ చల న్వదన్నాస్తే తదాజానన్ శ్వసన్నపి॥ ౭౭

తా. అనంతరము వాగింద్రియమునకు నధిపతియగు అగ్నిహోత్రుడు వెడలిరాగా ఇంద్రియము లేకపోవుటచే మూగవాడైయుండెను గాని శరీరము పడిపోలేదు. జీవించుట మొదలగు సమస్త వ్యాపారములను కలదయగుచునే యుండెను.

శ్లో॥ పశ్చా దుద్రో వినిష్క్రాంతో మనసో బోధనాత్మకః।
తదా జడ మముం ప్రాహు ర్న దేహః పతిత స్తదా॥ ౭౮
జీవన్ చలన్ వదన్నాస్తే తదాజానన్ శ్వసన్నపి॥

తా. అనంతరము జ్ఞానస్వరూపుడగు రుద్రుడు మనస్సునుండి వెడలిపోగా తెలివిలేనివాడై యుండెను గాని శరీరము పడిపోలేదు. జీవించుట మొదలగు వ్యాపారములు కలదియగుచునే యుండెను.

శ్లో॥ పశ్చా త్ప్రాణో వినిష్క్రాంతో మృత మేనం తదా విదుః।
పున రేవం తదా ప్రాహు ర్దేవా విస్మితమానసాః॥ ౭౯

తా. అనంతరము ప్రాణము వెడలిపోగా శరీరము పడిపోయినందున మృతినొందినవానిగా తెలిసికొని యా దేవతలందరు ఆశ్చర్యముగలవారై మరల తిరిగి యిట్లు పలుకుచున్నారు.

శ్లో॥ దేహ ముత్థాపయే ద్య స్తు పున రేవం వ్యవస్థితః।
స ఏవ హ్యధికో స్మాసు యువరాజా భవిష్యతి॥ ౮౦

తా. ఎవడు తిరిగి యీ దేహములో ప్రవేశింపగానే బ్రతికింపగలడో వాడే మనలో నధికుడగును గాన వాడే యువరాజునకు తగినవాడు.

శ్లో॥ ఇత్యేవం తు ప్రతిసృత్య వివిశు శ్చ యథాక్రమం।
జయంత ప్రావిశః త్పాదౌ నోత్తస్థౌ తత్కళేబరం॥ ౫౧

తా. ఈప్రకారము వారు ప్రతిజ్ఞచేసికొని ఆ దేవతలందరు యేస్థానమునుండి యే దేవత బయలువెడలెనో ఆయా స్థానములను ఆయా దేవతలు తిరిగి ప్రవేశింప మొదలిడిరి. వారిలో ముందుగా పాదములనుండి బయలువెడలి వచ్చిన జయంతుడు తిరిగి పాదములను ప్రవేశింపగా ఆ శరీరము స్మృతినొందని యుండెనే గాని జీవించలేదు.

శ్లో॥ గుహ్యం చ ప్రావిశ ద్దక్షో నోత్తస్థౌ తత్కళేబరం।
ఇంద్రో హస్తౌ వివేశాథ నోత్తస్థౌ తత్కళేబరం॥ ౫౨

తా. అనంతరము దక్షప్రజాపతి గుహ్యస్థానమును ఇంద్రుడు హస్తములను ప్రవేశించిరిగాని ఆశరీరము జీవించలేదు.

శ్లో॥ చక్షు స్సూర్యః ప్రవిష్టో భూ న్నోత్తస్థౌ తత్కళేబరం।
దిశ శ్శ్రోత్రే ప్రవివిశు ర్నోత్తస్థౌ తత్కళేబరం ౫౩

తా. సూర్యుడు నేత్రములను దిక్కులు కర్ణములను ప్రవేశించినవిగాని యాశరీరము బ్రతుకలేదు.

శ్లో॥ వరుణః ప్రావిశ జ్జిహ్వాం నోత్తస్థౌ తత్కళేబరం।
నాసాం వివిశతు ర్దస్రౌ నోత్తస్థౌ తత్కళేబరం॥ ౫౪

తా. అనంతరము వరుణుడు నాలుకను అశ్వినీదేవతలు నాసికమును ప్రవేశించిరిగాని యాశరీరము బ్రతుకలేదు.

శ్లో॥ వహ్ని శ్చ ప్రావిశ ద్వాచం నోత్తస్థౌ తత్కళేబరం।
మన శ్చ ప్రావిశ ద్రుద్రో నోత్తస్థౌ తత్కళేబరం॥ ౫౫

తా. అనంతరము అగ్నిహోత్రుడు వాక్కును మనస్సును రుద్రుడు ప్రవేశించిరిగాని శరీరము బ్రతుకలేదు.

శ్లో॥ పశ్చా త్ప్రాణో వివేశాసౌ తదోత్తస్థౌ కళేబరం।
తదా దేవా విసృజ్యేత్య ప్రాణం దేవాధికం విభుం॥ ౫౬
బలే జ్ఞానే చ ధైర్యే చ వైరాగ్యే ప్రాణనే పి చ।
తతో భిషేచయాంచక్రు ర్దేవరాజ్యే మహాప్రభుం॥ ౫౭

తా. అనంతరము ప్రాణము ప్రవేశింపగా ఆశరీరము బ్రతికి లేచెను. అప్పుడు బలము జ్ఞానము ధైర్యము వైరాగ్యము బ్రతికించుట మొదలగువానియందు ఆప్రాణమునే

అధికమైన దానినిగాను దేవతలందరికిని ప్రభువునుగాను నిశ్చయము జేసికొని విష్ణుట ప్రభువగు నా ప్రాణమును యువరాజ్యాధికారమునందు నియమించిరి.

శ్లో॥ ఉత్పత్తిప్రలయస్థితిహేతుత్వాదక్షమేకం తదా జగత్।
తస్మాత్ప్రాణాత్మకం విశ్వం సర్వం స్థావరజంగమం॥ ౫౮

తా. ప్రాణము శరీరము బ్రతుకుటకు కారణమైనందున దానినే యధికమైనదానిగా జెప్పిరి కాబట్టి చరాచర ప్రపంచమంతయు ప్రాణముచే నిండి యున్నది.

శ్లో॥ అంశైః పూర్ణైర్బలాఢ్యైశ్చ పూర్ణోయం జగతాం పతిః।
న ప్రాణహీనం జగదస్తి కించిత్ప్రాణేన హీనం నచ వైసమేతేః॥

తా. ఈ ప్రాణము బలముగల తన పూర్ణమైన అంశలచేత ప్రపంచమంతయు నిండి ప్రపంచమునకు అధిపతియై యుండెను. కాబట్టి ప్రపంచములో ప్రాణములేని వస్తువులేదు. ప్రాణములేని వస్తువయును సృష్టిపొందనేరదు.

శ్లో॥ ప్రాణేన హీనం స్థితిమన్న కించిత్ప్రాణేన హీనం నచ కించిదస్తి తస్మాత్ప్రాణస్సర్వజీవాధికో యో ద్బలాధిక స్సర్వజీవాంతరాత్మ॥ ౬౦

తా. ప్రాణములేని వస్తువ నిలుచుటలేదు కాబట్టి ప్రాణములేని దేదియులేదు. కాబట్టి ప్రాణము సమస్త జీవులకంటె నధికమైనదియు బలముగలదియు సమస్త జీవులకు నంతరాత్మయు నై యున్నది.

శ్లో॥ ప్రాణాత్కోఽపి హ్యధికో వా సమో వా శాస్త్రే దృష్టశ్శ్రుతపూర్వో న చాస్తి॥

తా. ఎవడైనను ప్రాణముకంటె నధికమైనవాడుగాని ప్రాణముతో సమానమైనవాడుగాని యుండినట్లు నేజూచలేదు శాస్త్రములలనను వినియుండలేదు.

శ్లో॥ తత్తత్కార్యానుగః ప్రాణో హ్యేకో దేవో హ్యనేకథా॥ ౬౧
తస్మాత్ప్రాణం వరం ప్రాహుః ప్రాణోపాసనతత్పరాః॥

తా. దేవుండగు ప్రాణము తానొక్కడె యున్నను ఆయా కార్యముల ననుసరించి అనేక స్వరూపములుగల వాడగుచున్నాడు. కాబట్టి ప్రాణము నుపాసనచేయువారు ప్రాణమునే అధికమైనదానిగా జెప్పుచున్నారు.

శ్లో॥ లీలయైవ జగత్స్రష్టుం హంతుం పాలయితుం ప్రభుం॥ ౬౨

శేషాహిశివశక్రాద్యా శ్చేతనా శ్చ జడా అపి॥
వాసుదేవా దృతే కోపి నైనం పరిభవిష్యతి॥ ౭౩

తా. ప్రాణుండు విలాసముగానే ప్రపంచమునుసృజించుటకును పోషించుటకును శింపజేయుటకునుసమర్థుడైయున్నాడు. విష్ణుగాక మిగిలినఆదిశేషుఁడు శివుఁడు ఇంద్రుఁడు మొదలగు చేతనములు అచేతనములు నన్నియును ఈప్రాణుని తిరస్కరించలేరు.

శ్లో॥ సర్వదేవాత్మకః ప్రాణ స్సర్వదేవమయో విభుః।
వాసుదేవానుగో నిత్యం తథా విష్ణువశస్థితః॥ ౭౪

తా. సమస్తదేవతుల యంతర్వర్తియు సమస్తదేవతాస్వరూపుఁడును సమర్థుండు నగు ప్రాణుఁడు విష్ణుమూర్తి ననుసరించి యాభగవంతుని వశవర్తియై యుండును.

శ్లో॥ వాసుదేవప్రతీపం తు న శృణోతి న పశ్యతి।
దేవాః ప్రతీపం కుర్వంతి రుద్రేంద్రాద్యా స్సురేశ్వరాః।

తా. ప్రాణుఁడు విష్ణుమూర్తికి వ్యతిరేకమైన విషయమును వినఁడు, చూడఁడు. రుద్రుఁడు ఇంద్రుఁడు మొదలగువారు ఒకానొకప్పుడు విష్ణుమూర్తికి వ్యతిరేకమును జేయుటయు కలదు.

శ్లో॥ ప్రతీపం క్వాపి కురుతే న ప్రాణ స్సర్వగోచరః।
తస్మా త్ప్రాణో మహావిష్ణో ర్బల మాహు ర్మనీషిణః॥ ౭౫

తా. సమస్త ప్రదేశములయందు వ్యాపించి యుండినట్టి ప్రాణుఁడు విష్ణుమూర్తికి నెప్పుడును వ్యతిరేకమును జేయఁడు. ఆ కారణమువలన శ్రీ మహావిష్ణువునకు ప్రాణము బలముగా నుండెనని విద్వాంసులు చెప్పిరి.

శ్లో॥ ఏవం జ్ఞాత్వా మహావిష్ణో ర్మాహాత్మ్యం లక్షణం తథా।
పూర్వబంధానుగం లింగం జీర్ణాం త్వచ మివోరగః॥ ౭౬
విసృజ్య పరమం యాతి నారాయణమనామయం॥

తా. ఈ ప్రకారము శ్రీవిష్ణుమూర్తియొక్క మహత్త్వము లక్షణముల నెఱింగి పూర్వజన్మంబున జేసిన కర్మఫలములచే సంప్రాప్తంబైన శరీరత్రయ రూపమగు సంసారబంధమును కూసమును సర్పము విడిచిపెట్టినట్లుగా విడిచిపెట్టి నాశనరహితుండును పరమపురుషుండు నగు నారాయణమూర్తిని పొందుచున్నాఁడు.

శ్లో॥ శ్రుత్వా శంఖోదితం వాక్యం పున ర్వ్యాధః ప్రసన్నధీః॥
ప్రశ్రయానతో భూత్వా పునః పప్రచ్ఛ తం మునిం॥

తా. ఈ పరిహారము శంఖము నీశ్వరుడు చెప్పిన వాక్యమును విని ఆ కింతుడు నిర్మల చిత్తము గలవాడై వినయవిధేయతలతో గూడి నమస్కరించి తిరిగి యాము నీశ్వరునితో నిట్లు పలుకుచున్నాడు.

శ్లో॥ బ్రహ్మ న్మహానుభావస్య వ్యాధస్యాస్య జగద్గురోః। ౧౯
న ఖ్యాతో మహిమా లోకే కథం సర్వేశ్వరస్య వై।
దేవానాం చ మునీనాం చ భూపానాం చ మహాత్మనాం॥ ౨౦
మహిమా శ్రూయతే లోకే పురాణేషు సహస్రశః॥
ఏత దాచక్ష్వ మే బ్రహ్మన్ శ్రోతుం కౌతూహలం హి మే॥ ౨౧

తా. ఓబ్రాహ్మణుడా! మహానుభావుడును ప్రపంచమునకు గురువునగు ఈ వ్యాధుని యొక్క మహత్తులోకములో నెచ్చటైనను ప్రసిద్ధికెంది యుండలేదు యేమి కారణము? దేవతలయొక్కయు మునీశ్వరులయొక్కయు రాజులయొక్కయు సత్పురుషులయొక్కయు మహత్తులోకములో పురాణములయందు ప్రసిద్ధికెంది యున్నది. యేమి కారణము? ఓ బ్రాహ్మణుడా! నాకు వినుటకు కుతూహలము కలిగియున్నది కాబట్టి దీనినంతయు సవిస్తరముగా జెప్పవలయును.

శంఖఉవాచ॥

శ్లో॥ పురా వ్యాధో హరిం దేవం నారాయణ మనామయం।
అశ్వమేధై ర్యష్టుకామో గంగాతీరం యయౌ ముదా॥ ౨౨

తా. శంఖమహాముని చెప్పుచున్నాడు. పూర్వకాలంబున వ్యాధుడు సంతోష చిత్తముగలవాడై వికారరహితుండగు విష్ణుదేవుని గురించి అశ్వమేధ యజ్ఞమును జేయ దలచి గంగానదీ తీరమునకు వచ్చెను

శ్లో॥ హలై శ్చకార భూశుద్ధిం నానామునిగణై ర్యుతః।
అంతర్వల్మీకలీన స్తు కణ్వో నామ సమాధిగః॥ ౨౩
హలోత్కృష్టో వినిష్క్రాంతః క్రోధా దిద మువాచ హ॥

తా. ఆగంగాతీరమందు వ్యాధుడు భూశుద్ధినిజేయుటకు నాగలితో దున్నించుచుండగా నొకపుట్టలో సమాధి నిష్ఠయందుండిన కణ్వుడను మునీశ్వరునకు, నాగలిపట్టుటవలన యాకణ్వుడు బయటికివచ్చి కోపముగలవాడై యిట్లు పలుకుచున్నాడు.

శ్లో॥ దృష్ట్వా పురస్థితం వ్యాధం శశాప హ మహావిభుం॥ ౨౪
అద్యప్రభృతి న ఖ్యాతిం మహిమా భువనత్రయే।
తవ నాప్నోతి నేవేశ భూలోకే తు విశేషతః॥ ౨౫

తా. మహానుభావుడును ముందున్న యాప్రాణిని జూచి యిట్లు శపించుచున్నాడు. ఇది మొదలు మూడులోకముల యందును నీకీర్తి ప్రసిద్ధిని పొందకయుండును. అందులో భూలోకములో నేమియు ప్రసిద్ధిజెందదు.

శ్లో॥ ప్రఖ్యాతా స్తే భవిష్యంతి హ్యవతారా జగత్త్రయే।
ఇత్యుక్తో మునినా తేన వాయుః క్రోధా త్తదా బ్రవీత్॥ ౨౬

తా. మూడులోకములయందును రామకృష్ణాద్యవతారములే ప్రసిద్ధిజెందియుండును అని మునీశ్వరుడు శపింపగా వాయువనువాడు మిక్కిలి కోపము గలిగి యిట్లు పలుకుచున్నాడు.

శ్లో॥ వినా పరాధం శప్తో సి తితీక్షు ర్మాం నిరాగసం।
తస్మా త్కణ్వ మహాబాహో గురుద్రోహీ భవా శు చ॥ ౨౭

తా. ఓకణ్వమునీశ్వరా! వాయుందేమియు నపరాధము లేకుండిన నన్ను నీవు కోపము గలవాడవై యుండియు నిష్కారణముగా శపియించితివి గావున నీవు శీఘ్రముగానే గురుద్రోహము గలవాడవగుదువు.

శ్లో॥ లోకే నిందితవృత్తి శ్చ భవేత్యాహ సదా గతిః।
తతః ప్రభృతి లోకే స్మి న్ప్రాణస్య స్య మహాప్రభోః॥ ౨౮
న ఖ్యాతో మహిమా లోకే భూలోకే తు విశేషతః॥

తా. మరియు దూషితమైన ప్రవర్తనగలవాడవు నగుదువు, అని వాయువు తిరిగి కణ్వ మహామునికి శాపమిచ్చెను. కాబట్టి అది మొదలు యీలోకములో ప్రభువగు వాయువునకు ప్రసిద్ధిలేకయున్నది. మరియు భూలోకములో నేమియు లేదు.

శ్లో॥ శాపా త్కణ్వో గురుం జగ్ధ్వా సూర్యశిష్యో భవత్తదా॥ ౨౯
ఇత్యేత త్కథితం సర్వం యత్పృష్టం తు త్వయాధునా।
యచ్ఛ్రోతవ్య మితో వ్యాధ పృచ్ఛ మాం మా విచారయ॥ ౩౦

తా. ఓకిరాతుడా! ఇట్లు వాయువుచే శపింపబడిన కణ్వ మహాముని గురువుని భక్షించి పిమ్మట సూర్యునకు శిష్యుడాయెను. కాబట్టి నీవడిగిన దానినంతయును జెప్పితిని గాన యికముందు నేమైన నడుగదగినది యున్న యెడల నడుగుము. ఆలోచింపవలదు.

ఇతి శ్రీస్కాందపురాణే వైశాఖమాహాత్మ్యే నారదాంబరీషసంవాదే వాయుశాపకథనం నామ ఏకోనవింశో ధ్యాయః

అథవింశోధ్యాయః

వ్యాధఉవాచ॥

శ్లో॥ కిం త్వా విభునా సృష్టాః కోటిశోథ సహస్రశః।
దృశ్యంతే భిన్నకర్మాణో నానామార్గా స్సనాతనాః॥
నైకస్వభావా ఏతే హి కుత ఏవ మహామతే।
సర్వం తత్ప్రృచ్ఛతే మహ్యం విస్తరా త్తత్త్వతో వద॥ 2

తా. కిరాతుడడుగు చున్నాడు విశేషబుద్ధిగలయో మునీశ్వరా ? విభువగు నారాయణమూర్తిచే అనేక కోట్లకొలది జీవులు సృజింపబడినవి. యేమికారణము ? ఈజీవులు అనేక స్వభావములు గలవియై అనేకమార్గముల ననుసరించి చిరకాలమునుండి యూ వచ్చుచున్న యీజీవులనేక కర్మములను జేయుచుండిరి. యేమి కారణము? ఓ స్వామీ దీని నంతయు వినవలయునని కుతూహలము గలిగి యుంటిని గాన విశదము గా జెప్పవలయును.

శంఖఉవాచ॥

శ్లో॥ త్రివిధా జీవసంఘా హి రజస్సత్త్వతమోగుణాః।
రాజసా రాజసం కర్మ తామసా స్తామసం తథా॥ 3
సాత్త్వికా స్సాత్త్వికం కర్మ కుర్వం త్యేతే యథాక్రమం॥

తా. శంఖ మునీశ్వరుడు చెప్పుచున్నాడు. జీవసమూహములు సత్త్వగుణము రజోగుణము తమోగుణము అని గుణత్రయభేదముచే మూడు విధములను పొంది సాత్త్విక గుణముగలవారు సాత్త్విక కర్మమును రజోగుణము గలవారు రాజస కర్మమును తమోగుణముగలవారు తామసకర్మమును క్రమప్రకారముగా జేయుచుందురు.

శ్లో॥ క్వచిచ్చ గుణవైషమ్య మేతేషాం సంసృతౌ భవేత్॥
తేనైవో చ్చావచం కర్మ కుర్వంతః ఫలభాగినః॥

తా, ఈజీవులు జన్మమెత్తి సంసారమును పొందియుండగా నొకానొకప్పుడు గుణముల వ్యత్యాసము కలుగుచుండును. ఆగుణముల న్యూనాధికములవలన న్యూనాధిక కర్మములను జేయుచు అధిక కర్మమున కధికఫలమును తక్కువ కర్మమునకు తక్కువ ఫలము ననుభవింపుచుందురు.

శ్లో॥ క్వచి త్సుఖం క్వచి ద్దుఃఖం క్వచి చ్చాభయ మేవ చ॥ 5
గుణానా మేవ వైషమ్యా త్ప్రాప్నువంతి నరా ఇమే॥

తా. ఒకప్పుడు సుఖము నొకప్పుడు దుఃఖము ఒకప్పుడు భయము ఒకప్పుడు భయము లేకపోవుట ఈరీతిగా, ఈమనుష్యులు గుణముల వ్యత్యాసము వలన ఫలముల ను పొందుచున్నారు.

శ్లో॥ ప్రకృతిస్థా ఇమే జీవా బద్ధా ఏతై ర్గుణై స్త్రిభిః॥ ౬

గుణకర్మానురూపేణ కర్మణో వ్యత్యయః ఫలం।

గుణానుగుణ్యం భూయ స్తే ప్రకృతిం యాం త్యమీ జనాః॥ ౭

తా. ఈజీవులు మాయలోనుండి సత్వరజస్తమో గుణములచే బద్ధులై గుణముల కు తగిన కర్మములను జేయుచు కర్మములకు తగిన ఫలములను పొందుచు నిట్లు మాటి మాటికి గుణముల ననుసరించి యీమనుష్యులు మాయనే పొంది తగిన ఫలము ననుభ వింతురు.

శ్లో॥ ప్రకృతిస్థాః ప్రాకృతికా గుణకర్మాభిమోహితాః।

గతిం ప్రాకృతికం యాంతి వ్యత్యయః ప్రకృతే ర్న హి॥ ౮

తా. మాయా సంబంధముగల యీ జీవులు మాయకు లోబడి గుణకర్మముల ననుసరించి జన్మంబులనెత్తుచు మాయా సంబంధమగు మార్గమునే అనుసరించుచున్నారు మాయ ననుసరించిన జీవులకే గాని భేదము మాయకేమియు విపర్యాసములేదు.

శ్లో॥ తామసా దుఃఖబహులా స్సదా తామసవృత్తయః।

నిర్దయా నిష్ఠురా లోకే సదా ద్వేషైకజీవినః॥

రాక్షసాద్యాః పిశాచాంతా స్తామసీం యాంతి వై గతిం॥

తా. తామస వృత్తిగలవారలు యెల్లప్పుడు విశేష దుఃఖములను పొందువార ను దయలేనివారును కఠినులును యీలోకములో నెల్లప్పుడు విరోధము గలిగియుండి యే జీవించుచు రాక్షసజన్మము మొదలు పిశాచము వరకునుండు జన్మముల నెత్తుచు తమోగుణ సంబంధమైన మార్గములనే యనుసరించుచుందురు.

శ్లో॥ రాజసామిశ్రమతయఃకర్తారఃపుణ్యపాపయోః॥ ౧౦

పుణ్యా స్స్వర్గం ప్రాప్నువంతి క్వచి త్పాపాచ్చ యాతనాం।

అత ఏతే మందభాగ్యా ఆవర్తంతే పునఃపునః॥ ౧౧

తా. రజోగుణము గలవారు మిశ్రమగు బుద్ధిగలవారై పుణ్య పాపముల రెంటిని జేయుచుందురు. అప్పుడు పుణ్యమధికముగానుండినయెడలస్వర్గలోకమునుపొందు

మధికమైన యెడల నరకమును పొందుచుందురు. కాబట్టి జ్ఞానములేనట్టివారు మాటిమాటికి యీసంసార చక్రములో తిరుగుచుందురు.

శ్లో॥ ధర్మశీలా దయావంత శ్శ్రద్ధావంతో నసూయకాః।
సాత్వికా స్సాత్వికీం వృత్తి మనుతిష్ఠంత ఆసతే॥ ౧౨

తా॥ ధర్మస్వభావముగలవారును దయగలవారును శ్రద్ధగలవారును అసూయలేనివారును సాత్వికగుణముగలవారనగు సత్పురుషులు మంచి కర్మముల నాచరింపుచునే యుందురు.

శ్లో॥ తే చోర్ధ్వం యాంతి విమలా గుణాపాయే మహౌజసః।
అతో విభిన్నకర్మాణః పృథగ్భావాః పృథగ్విధాః॥ ౧౩

తా. ఆసత్పురుషులు మిక్కిలి తేజస్సు గలవారై నిర్మలులైత్రిగుణములనతిక్రమించి యూర్ధ్వలోకమును పొందుదురు. కాబట్టి జీవులు వేరువేరుగా కర్మలు వేరువేరు స్వభావములు వేరువేరు ప్రవర్తనలు గలవారలై యుందురు.

శ్లో॥ గుణకర్మానురూపేణ తేషాం విష్ణు ర్మహాప్రభుః।
కర్మాణి కారయే జ్ఞానీస్వస్వరూపాప్తయే విభుః॥ ౧౪

తా. మహానుభావుడగు విష్ణుమూర్తి వారి వారి కర్మలను గుణముల ననుసరించి కర్మలను జేయించుచున్నాడు, జ్ఞానము గలవాడు స్వకీయ రూపమును పొందుటకు సమర్థుడై యున్నాడు.

శ్లో॥ విష్ణో ర్వైషమ్యనైర్ఘృణ్యే పూర్ణకామస్య వై న హి।
సృష్టిం స్థితిం హృతం చైవ సమ మేవ కరో త్యయం॥ ౧౫
స్వగుణా దేవ తే సర్వే కర్మణః ఫలభాగినః॥

తా. సంపూర్ణ కోరికలు గలవాడైన విష్ణుమూర్తికి భేదబుద్ధిగాని దయలేకుండుటగాని లేవు. సృష్టి స్థితిలయములను సమానముగానే జేయుచున్నాడు. కాబట్టి సమస్త జీవులు తమకర్మను గుణముగానే ఫలమును పొందుచున్నారు.

శ్లో॥ ఆరామోప్తా యథా సర్వాం త్సమం వర్ధయతి ద్రుమాన్॥ ౧౬
ఏకకుల్యాజలం గ్రాహ్యా ద్రుమా శ్చ ప్రకృతింగతాః॥
నా రామోప్తరి వైషమ్యం నైర్ఘృణ్యం వాకథంచన॥

తా. తోటవేసినవాడు చెట్లకు నొక్క ప్రదేశమందుండునట్టి జలమును తెచ్చి సమానముగా పోషించినప్పటికిని యావృక్షము ఆయాటిస్వభావమునే పొంది యుండు

ను. (అనగా కొన్ని మంచివిగాను మరికొన్ని చెడ్డవిగాను పెరుగును) గాబట్టి తోటవే సిన వానికి నైపన్యము నైర్ఘృణ్యము మొదలగు భేదబుద్ధులు లేవుగదా.

వ్యాధఉవాచ॥

శ్లో॥ జనానాం పూర్ణభోగానాం కదా ముక్తి ర్భవే న్మనే।
సృష్టికాలే థవా హ్యంతకాలే వా స్థాపనస్య చ॥ ౧౮

తా. ఓమునీశ్వరుడా ! సంపూర్ణజ్ఞానైశ్వర్యముగల జనులకు సృష్టికాలములో వా ప్రళయకాలములో వా స్థితి కాలములో వా యెప్పుడు ముక్తికలుగునో చెప్పుము.

శ్లో॥ క్వచి చ్చ సృష్టికాలస్య సంహారస్యా పి వై స్థితేః।
ఏత ద్విస్తార్య మే బ్రహ్మన్ భగవచ్చేష్టితం వద॥ ౧౯

తా. ఒకప్పుడు సృష్టిగా గనుపించుచున్నది. ఒకప్పుడు స్థితినిపొందుచున్నది. ఒకప్పుడు నాశనమును పొందుచున్నది. ఈమూడు కాలములలో నెప్పుడు ముక్తిని పొందుదురు ? ఓబ్రాహ్మణుడా ! భగవంతుని చరితము నెఱుగవలయునని యున్నది గావున నాకు సవిస్తరముగ చెప్పుమని కిరాతుడడిగెను.

శంఖఉవాచ॥

శ్లో॥ చతుర్యుగసహస్రాణి బ్రహ్మణో దివ ముచ్యతే।
రాత్రి శ్చ తావతీ తస్య హ్యహోరాత్రిం దినం భవేత్॥ ౨౦

తా. శంఖమహాముని చెప్పుచున్నాడు. నాలుగువేల యుగములు బ్రహ్మదేవునకొక పగలు అగును. అన్ని యుగలు తిరిగి అయిన మొదల ఒకరాత్రియు నగును. ఇట్టి పగలు రాత్రి కలసి బ్రహ్మదేవునకొక దినమగును.

శ్లో॥ దశపంచదినా న్యాహుః పక్షం మాసో ద్వయాత్మకః।
మాసద్వయం ఋతుం ప్రాహు రయనం చ ఋతుత్రయం॥ ౨౧
అయనే ద్వే వత్సర స్స్యా త్తాదృక్శతసమా యది।
గచ్ఛంతి బ్రహ్మణో హ్యస్య బ్రహ్మకల్పం తదా విదుః ౨౨

తా. పదిహేను దినములొక పక్షమగును. రెండు పక్షములు ఒకమాసమును రెండుమాసములొక ఋతువును, మూడు ఋతువులొక అయనమును రెండు అయనములు ఒక సంవత్సరమును అగును. అట్టినూరు దివ్య సంవత్సరములు బ్రహ్మకు గడచిన పిమ్మట బ్రహ్మకల్పము అప్పుడు జరుగునని పెద్దలు వచించిరి.

శ్లో॥ తావాన్ హి ప్రళయః కాల ఇతి వేదవిదాం మతం॥

తా. పూర్వము చెప్పిన కాలనిర్ణయము చొప్పున జరిగిది ప్రళయమని వేదవేత్తల యభిప్రాయమై యున్నది.

శ్లో॥ ప్రళయ స్త్రివిధః ప్రోక్తో మానవో మానవాత్యయే।
దైనందినో ద్వితీయో హి బ్రహ్మణో దివసాత్యయే॥
బ్రహ్మణో థ లయే పశ్చా ద్బ్రాహ్మం చ ప్రళయం విదుః॥ ౨౪

తా. ప్రళయము మూడువిధములుగా జెప్పబడినది. అదియేలాగుననగా ? మనుష్యులందరు నశించి నప్పుడు కలిగినది మానవ ప్రళయమనియు బ్రహ్మదేవునకు నొకదినము గడచిన పిమ్మట జరిగినది దినప్రళయమనెడు రెండవదియనియు నూరు సంవత్సరములు గడచిన పిమ్మట బ్రహ్మనశింపగా జరిగినది మూడవది బ్రహ్మప్రళయమనియు నిట్లు మూడు విధములుగా జెప్పిరి.

శ్లో॥ బ్రహ్మణ స్తు ముహూర్తే తు మనో స్తు ప్రళయం విదుః।
ప్రళయేషు వ్యతీతేషు చతుర్దశసు వై క్రమాత్॥ ౨౫
దైనందినలయం ప్రాహుః ప్రళయానాం స్థితిం పునః॥

తా. బ్రహ్మదేవునకు నొక ముహూర్తమయిన యెడల మనువునకు ప్రళయమగును. క్రమముగా పదునాలుగు ప్రళయములు జరిగిన పిమ్మట దినప్రళయములు జరుగుచుండును. కాబట్టి ప్రళయముల స్థితియిట్టిది.

శ్లో॥ త్రయాణా మేవ లోకానాం లయో మన్వంతరే భవేత్॥ ౨౬
చేతనానాం తదా నాశో న లోకానాం క్షయో భవేత్।
ఉదగ్రై రేవ పూర్తి శ్చ యధా పూర్వం తథా పునః॥ ౨౭

తా, మన్వంతరమందు మూడులోకములు నశించును. అప్పుడు చేతనములు మాత్రము నశించి స్థావరరూపముగానుండి లోకములు నశింపక పూర్వమునలెనే యుదకములచేత నిండియుండును.

శ్లో॥ మన్వంతరాంతే భూయాత్తు చేతనానాం పునర్భవః।
దైనందినలయే వ్యాథ సర్వస్యాపి క్షయో భవేత్॥

తా. మన్వంతరము సంపూర్తి అయిన పిమ్మట చేతనములు తిరిగి జనియించును. ఓకిరాతుడా ! దినదినము జరుగునట్టి ప్రళయములలో సమస్తము నశించును.

శ్లో॥ సత్యలోకం వినా సర్వే లోకా నశ్యంతి సాధిపాః।
సచేతనా స్సాధిభూతాః ప్రసుప్తే చతురాననే॥ ౨౯

తా. బ్రహ్మదేవుడు నిద్రించగా దినప్రళయము జరిగి నప్పుడు బ్రహ్మలోకము గాక మిగిలిన సమస్త లోకములు అధిపతులతోడను చేతనములుతోడను అధిదేవతలతోడను గూడ నశించిపోవును.

శ్లో॥ తత్త్వాభిమానినో దేవాః కేచి చ్చ మునయ స్తథా।
శిష్యంతి సుప్తా స్సర్వేపి సత్యలోకవ్యవస్థితాః॥ ౩౦

తా. వేదాంతజ్ఞానమునందు పూర్ణులైన కొందఱు దేవతలు కొందఱు మునీశ్వరులు మరియు నెవరైనను జ్ఞానము గలవారందరును దినప్రళయమునందు నశింపక మిగిలియుండి సత్యలోకములో బ్రహ్మతో గూడ నిద్రించుచుందురు.

శ్లో॥ తిష్ఠంతి సుప్తి మాపన్నా యావత్కల్ప మతీంద్రియాః।
పున ర్నిశాత్యయే బ్రహ్మా యథా పూర్వ మకల్పయత్॥ ౩౧

తా. అజ్ఞానులు దినకల్పమగునంత పర్యంతము నిద్రించుచు విషయవ్యాపారరహితులై యుందురు. ఇట్లు రాత్రి గడచిన పిమ్మట బ్రహ్మదేవుడు తిరిగి పూర్వము సృజియించినరీతిగా ప్రపంచమును సృజియించును.

శ్లో॥ ఋషీ న్దేవా న్పితౄన్ లోకా న్ధర్మా న్వర్ణా న్పృథక్పృథక్।
పున ర్దేశావతారా హి విష్ణో ర్దేవస్య చక్రిణః॥ ౩౨

తా. మునీశ్వరులను దేవతలను పితృదేవతలను భూరాది లోకములను ధర్మములను వేరువేరుగా వర్ణములను దేశములను చక్రధారియగు విష్ణుమూర్తి యొక్క అవతారములను సృజియించెను.

శ్లో॥ నియమేన భవం త్యేతే తథా న్యేపి చ భూరిశః।
దేవతా ఋషయ శ్చైవ ఆకల్పం చ గిరాంపతేః॥ ౩౩

తా. ఈదేవతలు మునులును మరియు సమస్త దేవతలును బ్రహ్మదేవుని కల్పాంతము వఱకు నియతముగా నివసించియే యుందురు.

శ్లో॥ పునః రేవాభివర్తంతే బ్రహ్మణా సహ ముక్తిగాః।
భూపా శ్చ సాధవో యే చ సిద్ధిం ప్రాప్తాః పరంగతాః॥ ౩౪
తే నైవ చాభివర్తంతే సత్యలోకవ్యవస్థితాః॥

తా. ముక్తినిపొందినవారును న్యాయపరిపాలన జేసిన రాజులును సిద్ధిని పొందిన వైరాగులును వీరందరును బ్రహ్మలోకమునందుండి బ్రహ్మదేవునితోగూడ నిద్రించుచు తిరిగి లేచుచుందురు.

శ్లో॥ తదాశ్రిగాః పున ర్యాంతి తన్నామ్నా శ్రుతిసంస్థితాః॥ ౩౫
తత్తద్గోత్రేషు జాయంతే తత్తత్కర్మరతా స్సదా॥

తా. ఆయారాశుల యందుండిన దేవతలు మునులు మొదలగువారు వారివారికి విధిగా యుండు వేదానుసారులై ఆయా గోత్రములయందు జనియించి యెల్లప్పుడు వారివారికి విధ్యుక్త కర్మములను జేయుచుందురు.

శ్లో॥ దైత్యానా మపి సర్వేషాం యదాకలియుగాత్యయః॥ ౩౬
కలినా సహ గచ్ఛంతి స్వాం గతిం నిరయాలయాః॥
తేషాం చ రాశి సంస్థా యే తన్నామానో పరే పిచ॥ ౩౭
జాయంతే కర్మణా స్వేన తత్తత్కర్మవిధాయకాః॥

తా. కలియుగమంతమైన పిమ్మట రాక్షసులు పిశాచములు మొదలగువారు తమస్థానమగు నరకస్థానములను కలిపురుషునితో గూడ పొందుదురు. ఆపిశాచ గణములయందుండిన వారును ఆయాపేరు గల యితరులును తమతమ కర్మను గుణ్యముగా జనియించి ఆయా కర్మములను జేయుచుందురు.

శ్లో॥ సృష్టికాలం ప్రవక్ష్యామి ముక్తికాలం తథైవచ॥ ౩౮
బ్రహ్మాదీనాం చ దేవానాం సమాహితమనా భవ॥

తా. ఓ కిరాతుడా! బ్రహ్మ మొదలగు సమస్త దేవతల సృష్టికాలమును ముక్తికాలమును జెప్పుచున్నాను సావధాన చిత్తముగలవాడవై యుండుము.

శ్లో॥ నిమేషో దేవదేవస్య బ్రహ్మకల్పసమో మతః॥ ౩౯
తస్యా వసానే చోన్మేషో దేవదేవశిఖామణేః॥
నిమేషాంతే భవే దిచ్ఛా స్రష్టుం లోకాం శ్చ ముక్తిగాః॥ ౪౦

తా. దేవతలను దేవుడగు శ్రీవిష్ణుమూర్తి యొక్క కన్నుమూయుట బ్రహ్మదేవునకు కల్పమగును. కల్పాంతమయిన పిమ్మట దేవతాసార్వభౌముండగు శ్రీభగవంతుని కన్ను దెరచుట సంభవించును. ఇట్లు కల్పమంతమయిన పిమ్మట భగవంతుని హృదయమందున్న లోకములను తిరిగి సృజియించవలయునని కోరిక కలుగును.

శ్లో॥ సో శక్త్యోద్వదకే సర్వా న్లీనసంఘా ననేకశః॥
సృష్ట్వా స్సృష్ట్వా సమం లింగం లింగభంగ ముపాగతాః॥ ౪౧

తా. ఆభగవంతుడు తనయుదరమందుండినటియుసృజియింప తగినవారునులింగశరీరముతో గూడిన వారును లింగ శరీరభంగ మయినవారును అను అనేక జీవ సమూహములను సృజియింపవలెనని నిచ్ఛగలవాడాయెను.

శ్లో॥ సుప్తా స్సంస్థితా స్సర్వే పి తమోగా అపి సర్వశః।
పూర్వకల్పే లింగభంగ మాపన్నా విధిపూర్వకం॥                                        ౪౨
మానవాంతా జీవకోశా జీవన్ముక్తా శ్చ ముక్తిగాః।
పూర్వకల్పే విముక్తా శ్చ బ్రహ్మాద్యా మానవాంతకాః॥                                ౪౩
ధ్యానసంస్థా హి తిష్ఠన్తి విష్ణుకుక్షిగతా అపి॥

తా. నిద్రించుచున్నవారును జాగ్రత కలిగియున్న వారును అజ్ఞానదశయందున్నవారును పూర్వకల్పములో విధిప్రకారముగా లింగ శరీరభంగము గలవారును పిపీలిక మొదలు మనుష్యుడంతముగాగలజీవులును ముక్తినిపొందినవారునుజీవన్ముక్తి గలవారును పూర్వకల్పములో బ్రహ్మమొదలు మనుష్య పర్యంతము ముక్తిని పొందిన వారునగు సమస్త జీవరాశులు ప్రళయకాలమునందు విష్ణుమూర్తి యొక్క హృదయమునందుండి ధ్యానముజేయుచుండును.

శ్లో॥ ఉన్మేష ప్రథమే భాగే చతుర్వ్యూహాత్మకో విభుః॥
భూత్వా తు పూర్వషాడ్గుణ్యా ద్వాసుదేవా చ్చ వ్యూహగాత్।
దత్వా తు బ్రహ్మణో ముక్తిం సాయుజ్యాఖ్యాం మహావిభుః॥

తా. కన్నుదెరచి నంతటనే షడ్గుణైశ్వర్య సంపన్నుండగు విష్ణుమూర్తి వాసుదేవాది నాలుగువ్యూహములు గలవాడగుటవలన వాసుదేవవ్యూహము ననుసరించి బ్రహ్మదేవునకు సాయుజ్యమనెడు ముక్తినిచ్చెను.

శ్లో॥ దత్వా తదను సాయుజ్యం తత్వజ్ఞానం మహాత్మనాం।
సారూప్యం చైవ కేషాం చిత్సామీప్యం చ తథా విభుః॥                                  ౪౬
సాలోక్యం చ తథా న్యేషాం దత్వా దేవో జనార్దనః।
అనిరుద్ధవశే సర్వాన్ స్థితాన్ లోకాన్ లోకయూత్॥                                        ౪౭

తా. బ్రహ్మదేవునకు సాయుజ్యముక్తి నిచ్చిన పిమ్మట మఱికొందఱు మహానుభావులకు తత్వజ్ఞానమును కొందఱకు సారూప్యముక్తియును కొందఱకు సామీప్యముక్తియును కొందఱకు సాలోక్యముక్తియును ప్రభువగు విష్ణుమూర్తి యిచ్చెను.

యము అనిరుద్ధవ్యూహము ననుసరించి భగవంతుని కుక్షియందుండిన సమస్తలోకములను జూచుచుండును.

శ్లో॥ ప్రద్యుమ్నస్య వశే దత్వా సృష్టిం కర్తుం మనోదధే।
మాయాం జయాం కృతిం శాంతి ముపయేమే స్వయం హరిః॥

తా. ఆవిష్ణుమూర్తి ప్రద్యుమ్న వ్యూహములోనుండి సృష్టిని జేయుట యందిచ్ఛగలవాడగును. ఆవిష్ణుమూర్తిమాయ, జయ, కృతి, శాంతి, అను నాలుగుశక్తులను వాసుదేవము అనిరుద్ధము ప్రద్యుమ్నము సంకర్షణము అను నాలుగు వ్యూహముల యందుండి క్రమముగా వరియించెను.

శ్లో॥ చతుర్వ్యూహైః పూర్ణగుణై ర్వాసుదేవాదికైః క్రమాత్।
తాభి ర్యుక్తో మహావిష్ణు శ్చతుర్వ్యూహాత్మకో విభుః॥ ౪౯
భిన్నకర్మాశయం లోకం పూర్ణకామో వ్యజీజనత్॥

తా. ప్రభువగు విష్ణుమూర్తి పూర్ణమైన గుణములు గల వాసుదేవము మొదలుగాగల నాలుగు వ్యూహములుగలవాడై మాయ మొదలగు నాలుగు శక్తులతోగూడి సంపూర్ణమైన కోరికలు గలవాడగుచు ప్రపంచమును వేరువేరు కర్మములు అభిప్రాయములు గలదానిగా సృజియించెను.

శ్లో॥ ఉన్మేషాంతే పున ర్విష్ణు ర్యోగమాయాం సమాశ్రితః॥ ౫౦
సంకర్షణా ద్వ్యూహాగా చ్చ హర త్యేత చ్చరాచరం।
తదేత త్సర్వ మాఖ్యాతం కార్యం చింత్యం మహాత్మనః॥ ౫౧

తా. ఈప్రకారముగా బ్రహ్మదేవునకు పగలు అగునంతకాలము సృష్టిజేసిన పిమ్మట విష్ణుమూర్తి యోగమాయ నాశ్రయించి కన్నులుమూయగా బ్రహ్మదేవునకు రాత్రియగును. అప్పుడు విష్ణుమూర్తి సంకర్షణమను వ్యూహమును పొంది జంగమస్థావరాత్మకమైన యీప్రపంచమునంతయు నశింపజేయును. కాబట్టి మహానుభావుడగు విష్ణుమూర్తియొక్క కృత్యమీరీతిగా జరుగుచుండును గాన విచారించి దానినంతయును జెప్పితిని.

శ్లో॥ య దచింత్యం దుర్విభావ్యం బ్రహ్మాద్యై రపి యోగిభిః॥ ౫౧

తా. ఓకింతుడా! ఆభగవంతుని కృత్యములు బ్రహ్మ మొదలగు దేవతలచేతను యోగీశ్వరులచేతను తెలిసికొన శక్యముకానిదై యుండును.

వ్యాధఉవాచ॥

శ్లో॥ కే వా భాగవతా ధర్మాః కై ర్విష్ణుశ్చ ప్రసీదతి॥ ౹౹౨
తా నహం శ్రోతు మిచ్ఛామి సాంప్రతం వదనా న్మునేః॥

తా. కిరాతుడడుగుచున్నాడు. ఓమునీశ్వరా భగవత్సంబంధమగుధర్మము లెవ్వి? ఏధర్మములనుజేసిన విష్ణుమూర్తియనుగ్రహముకలవాడగును? మునీశ్వరుండవగునీముఖము వలన వినవలయునని నేను కోరికగలవాడనై యుంటిని కాబట్టి చెప్పవలయును.

శంఖఉవాచ॥

శ్లో॥ యేన చిత్తవిశుద్ధి స్స్యా ద్య స్సతా ముపకారకః॥ ౹౹౩
తం విద్ధి సాత్వికం ధర్మం యశ్చ కేనా ప్యనిందితః।
శ్రుతిస్మృత్యుదితో య స్తు యది నిష్కామకో భవేత్॥ ౹౹౪
య స్తు లోకా విరుద్ధో పి తం ధర్మం సాత్వికం విదుః॥

తా. శంఖమునీశ్వరుడు చెప్పుచున్నాడు ఏధర్మము మనస్సునందుండెడి దుర్గుణములను పోగొట్టునో ఏధర్మము సత్పురుషులకు నుపకారియగునో. ఏధర్మము యెవని చేతను దూషింపబడకుండునో. ఏధర్మము వేదములయందు ధర్మశాస్త్రములయందు చె ప్పబడునో ఏది కోరికరహితునిగా జేయునో ఏధర్మము లోకమునకు ననుకూలమై యుండునో ఆధర్మము నే సాత్వికధర్మముగాను తెలిసికొనుచున్నారు.

శ్లో॥ చతుర్విధా హి తే ధర్మా వర్ణాశ్రమవిభాగతః॥ ౹౹౫
నిత్యనైమిత్తికాః కామ్యా ఇతి తే చ త్రిధా మతాః॥

తా. బ్రాహ్మణాది చతుర్వర్ణములచేతను బ్రహ్మచర్యాది చతురాశ్రమములచే తను నాలుగు విధములుగా నుండియున్న ధర్మములు నిత్యమనియు నైమిత్తికమనియు కామ్యమనియు తిరిగి మూడు విధములుగా నుండెను.

శ్లో॥ తే సర్వే స్వస్వధర్మా శ్చ యదా విష్ణో స్సమర్పితాః॥ ౹౹౬
తదా వై సాత్వికా జ్ఞేయా ధర్మా భాగవతా శ్శుభాః॥

తా. పూర్వమందు జెప్పబడిన నాలుగు వర్ణములవారును వారివారి ధర్మములను జేయుచు విష్ణుమూర్తికి ఫలసమర్పణను జేసినయెడల నప్పుడు ఆధర్మములు సాత్వికధర్మములనియు శుభముల నొసగు భగవత్సంబంధమగు ధర్మములనియు జెప్పబడును.

శ్లో॥ దేవతాంతర దైవత్యా స్సకామా రాజసా మతాః॥ ౹౹౭

యక్షరక్షః పిశాచాదిదైవత్యా లోకనిష్ఠురాః॥
హింసాత్మకా నిందితాశ్చ ధర్మాస్తే తామసాస్స్మృతాః॥ ౫౮

తా. విష్ణుసంబంధముగాక యితరదేవతా సంబంధములగునవియు కోరికతో గూడినవియు నగు ధర్మములు రాజసధర్మములనియు యక్షులు రాక్షసులు పిశాచములు మొదలగు దేవతాసంబంధములగు నవియును జనులకందరకును కఠినమైనవిగా నుండునవియు హింసాస్వరూపమైనవియు దూష్యములగు ధర్మములు తామస ధర్మములని చెప్పబడు చున్నవి.

శ్లో॥ సత్వస్థాస్సాత్వికాన్ధర్మాన్ విష్ణుప్రీతికరానిచ్ఛభాక్।
కుర్వంత్యనీహయా నిత్యం తే వై భాగవతాస్స్మృతాః॥ ౫౯

తా. సాత్వికగుణముగలవారు శుభములనొసగునవియు విష్ణుమూర్తికి ప్రీతికరములగు సాత్విక ధర్మములను ఫలమునపేక్షింపక యెల్లప్పుడు జేయుచుందురు కాబట్టి వారే భాగవతులని చెప్పబడుదురు.

శ్లో॥ యేషాం చిత్తం సదా విష్ణౌ జిహ్వాయాం నామ వై విభోః॥
పాదౌ చ హృదయే యేషాం తే వై భాగవతాస్స్మృతాః॥ ౬౦

తా. ఎవరి యొక్క మనస్సు యెల్లప్పుడు విష్ణుమూర్తియందుండునో నాలుక ఆభగవంతుని నామస్మరణమును జేయుచుండునో, ఆకృష్ణుని పాదములు యెవరిహృదయమునందు ధ్యానింపబడుచుండునో, వారు భాగవతులు.

శ్లో॥ సదాచారరతా యే చ సర్వేషా ముపకారకాః॥
సదైవ మమతాహీనా స్తే వై భాగవతాస్స్మృతాః॥ ౬౧

తా. ఎవరు యెల్లప్పుడు ఆచారముగలవారు గాను సమస్తప్రాణులకు నుపకారము జేయువారుగాను ఎల్లప్పుడు ఈషణములయందు మోహావేశమును వదలియుందురో, వారే భాగవతులని చెప్పబడుదురు.

శ్లో॥ యేషాం చ శాస్త్రే విశ్వాసో గురౌ సాధుషు కర్మసు।
యే విష్ణుభక్తా స్సతతం తే వై భాగవతాస్స్మృతాః॥ ౬౨

తా. శాస్త్రమందు గురువుయందు సత్పురుషులయందు కర్మములయందు నెవరికి విశ్వాసముండునో ఎవరు విష్ణుమూర్తియందు భక్తిగలవారై యుందురో వారే భాగవతులని చెప్పబడుదురు.

శ్లో॥ యేషాం హి సమ్మతా ధర్మా శ్శాశ్వతా విష్ణువల్లభాః॥
శ్రుతిస్మృత్యుదితా యే చ తే ధర్మా శ్శాశ్వతా మతాః॥ ౬౩

తా. ఎవరికిష్టమగుధర్మములు స్థిరమైనవియు విష్ణుసంబంధమగునవియు వేదముల చేతనుస్మృతులచేతను చెప్పబడినవియునైయుండునో అవియే శాశ్వతమగు ధర్మములని చెప్పబడియున్నవి.

శ్లో॥ అటనం సర్వదేశేషు వీక్షణం సర్వకర్మణాం।
శ్రవణం సర్వధర్మాణాం విషయాసక్తచేతసాం॥ ౬౪

తా. సమస్తపుణ్య ప్రదేశములయందు సంచరించుటయు సమస్త పుణ్యకార్యములను జూచుటయు విషయములయందు మనస్సును బోనివ్వనట్టి సమస్తధర్మములను వినుచుండుటయు జేయుచుండవలెను.

శ్లో॥ అకించిత్కర మేతేషాం షండస్యేవ వరస్త్రియః॥

తా. చక్కని స్త్రీలైనప్పటికిని నపుంసకునికి పనికి రానట్లుఈప్రపంచభోగము లన్నియు జ్ఞానులకు నుపయోగములు కావు.

శ్లో॥ సాధూనాం దర్శనేనైవ మనో ద్రవతి వై సతాం॥ ౬౫
చంద్రస్య కౌముదీసంగాచ్చంద్రకాంతశిలా యథా॥

తా. చంద్రకిరణ ప్రసారమువలన చంద్రకాంతశిల కరగినట్లు సజ్జనుల దర్శనమగుటతోడనే సత్పురుషుల చిత్తములు కరగుచుండును.

శ్లో॥ క్వచిత్సచ్ఛాస్త్రశ్రవణాద్విషయేభ్యో జ్వలన్మనః॥ ౬౬
తిష్ఠత్యేవ సతాం పుంసాం తేజోరూపో హ్యకల్మషః।
పద్మబంధోః ప్రభాసంగాత్సూర్యకాంతశిలా యథా॥ ౬౭

తా. ఒకానొకప్పుడు మంచిశాస్త్రములను వినుటవలన సత్పురుషులయొక్క మనస్సు నిర్మలమైనదై విషయముల గురించి యసహ్యముచే సూర్యకిరణ ప్రసారముచే సూర్యకాంతమణి వలెనే మండుచు ప్రకాశముకలదియగుచు నుండును.

శ్లో॥ నిష్కామైర్ద్విజనైర్యస్తు శ్రద్ధయా సముపాశ్రితః।
యో విష్ణువల్లభో నిత్యం ధర్మో భాగవతో మతః॥ ౬౮

తా. కోరికలుహీనులగు మనుష్యులచేశ్రద్ధతోగూడ చేయబడినదియు విష్ణుప్రీతికరమగునదియు నగు యేధర్మముకలదో అదియే భగవత్సంబంధమగు ధర్మమని చెప్పబడును.

శ్లో॥ తైర్త్సృష్టా బహవో ధర్మా ఇహాముత్ర ఫలప్రదాః।
విష్ణుప్రీతికరా స్సూనామ్నా స్సర్వదుఃఖవిమోచకాః ౬౯

తా. ఈలోకంబున పరలోకంబున సుఖములనిచ్చునవియు విష్ణుమూర్తికి సంతోషకరమైనవియు రహస్యమైనవియు సమస్తదుఃఖములను పోగొట్టునవియునగు ననేక ధర్మములు పూర్వమునుండియు మహానుభావులగువారికి తెలియబడియేయున్నవి.

శ్లో॥ దధ్న స్సార మివోద్ధృత్య ధర్మాం వైశాఖసంభవం।
రమాయై భగవా నాహ క్షీరాబ్ధౌ హితకామ్యయా॥ ౨౦

తా. పెరుగుతెఱచి వెన్నదీసినట్లువలెనే సమస్తధర్మములలో శ్రేష్ఠమగు వైశాఖధర్మమును విష్ణుమూర్తి లక్ష్మిదేవికి మేలుజేయువాడై పాలసముద్రంబున శయనించియుండగా నొకప్పుడు చెప్పెను.

శ్లో॥ మార్గచ్ఛాయావినిర్మాణం ప్రపాదానం చ వై తథా॥
వ్యజనై ర్వీజనం చైవ ప్రశ్రియాణాం సమర్పణం॥ ౨౧

తా. ఆ ధర్మము లేవియనగా? మార్గములో నీడగానుండునట్లు నిర్మించుట చలివేంద్రి నేర్పరుచుట విసనకఱ్ఱలతో వీచుట మరియు నుపచారములనుజేయుటయును జరుపుచుండవలయును.

శ్లో॥ ఛత్రస్యో పానహో ర్దానం దానం కర్పూరగంధయోః।
వాపీకూపతటాకానాం నిర్మాణం విభవే సతి॥ ౨౨

తా. గొడుగునిచ్చుట పాదుకలనిచ్చుట కర్పూరము మంచిగంధముల నిచ్చుట భాగ్యముండినయెడల దిగుడుబావులను నూతులనుకట్టించుట చెరువులను త్రవ్వించుటయు జేయవలయును.

శ్లో॥ సాయాహ్నే పానకస్యాపి దానం చ కుసుమస్య చ।
తాంబూలదానం పాపఘ్నం గోరసానాం విశేషతః॥ ౨౩

తా. సాయంకాలమునందు పానకమునిచ్చుటయు పుష్పములనిచ్చుటయు తాంబూలమునిచ్చుటయు పాపములనుపోగొట్టు ఆవుసంబంధమగు పాలు మొదలగువానిని విశేషముగానిచ్చుటయు, జేయవలెను.

శ్లో॥ లవణాన్వితతక్రస్య దానం శ్రాంతాయ వై పథి।
అభ్యంగకరణం చైవ ద్విజపాదావనేజనం॥ ౨౪

తా. ఎండవేడిమిచే నలసియున్నవానికి ఉప్పుకలిపిన మజ్జిగనిచ్చుటయు తలంటిపోయుటయు బ్రాహ్మణులకు పాదప్రక్షాళన జేయుటయు, జేయవలెను.

శ్లో॥ కటకంబలపర్యంకదానం గోదానమేవ చ।

మధుయుక్తం తిలానాం చ దానం పాపవినాశనం॥ ౭౫

తా. చాప కంబళి శయ్య మొదలగువానినిచ్చుటయు గోవునిచ్చుటయు తియ్యనిపదార్థములు గలిపిన నువ్వులను దానమిచ్చుటయుజేసిన పాపములు నశించిపోవును.

శ్లో॥ సాయాహ్నే చేక్షుదండానాం దాన ముర్వారుకస్యచ ।
రసాయనప్రదానం చ పితృనిర్వాపనం తథా ॥

తా. సాయంకాలంబున చెఱకుగడలనిచ్చుటయు దోసపండ్లనిచ్చుటయు మరియు రసములనిచ్చుటయు పితృదేవతలకు తర్పణాంజలుల నిచ్చుటయు జేయుచుండవలయును.

శ్లో॥ ఏతే ధర్మాత్రిశిష్యోక్తా మాసే స్మిన్మాధవప్రియే ।
ప్రాత స్సూర్యోదయే స్నాత్వా శృణ్వ న్ద్విజకులేరితం॥ ౭౭
నిత్యకర్మాణి కృత్వైవం మధుసూదన మర్చయేత్ ।
కథాంమాధవమాసీయాం శృణుయాచ్చ సమాహితః॥ ౭౮

తా. ఓ కిరాతుడా! ఇప్పుడు నేజెప్పినధర్మములన్నియు నన్నిధర్మములలో నుత్తమమైనవిగా జెప్పబడెను గాన విష్ణుప్రీతికరమైన యీవైశాఖమాసములో సూర్యోదయకాలంబున స్నానముజేసి బ్రాహ్మణులచే జెప్పబడిన ధర్మములననుసరించుచు సంధ్యావందనాది నిత్యకర్మములనుజేయుచు విష్ణుమూర్తిని పూజింపుచు సావధానచిత్తుడై వైశాఖమాసకథను వినుచుండవలయును.

శ్లో॥ తైలాభ్యంగం వర్జయేచ్చ కాంస్యపాత్రే తు భోజనం ।
నిషిద్ధభక్షణం చైవ వృథాలాపం తు వర్జయేత్ ॥ ౭౯

తా. నూనెతో తలనంటుకొనుటయును కంచములో భుజించుటయును, శాస్త్రములో నిషేధింపబడిన పదార్థములను భుజించుటయును వ్యర్థమైనసంభాషణజేయుటయు వైశాఖమాసములో విడువవలయును.

శ్లో॥ అలాబూం గృంజనం చైవ లశునం తిలపిష్టకం ।
ఆరనాళం భిస్సటం చ ఘృతకోశాతకీం తథా ॥ ౮౦

తా. సొరకాయను, వెల్లుల్లి, నువ్వులపిండి, ఘ్రలిగడ్డను, చద్దియన్నము, నేతిబీరకాయ, మొదలగువానిని విడువవలయును.

శ్లో॥ ఉపోదకీం కళింగం చ శిగ్రుశాకం చ వర్జయేత్ ।
నిష్పావాని కుళుత్థాని మసూరాణి చ వర్జయేత్ ॥ ౮౧

తా. బచ్చలికూర కొండిసపండు ములగకాడలు పక్వముగాని పదార్థములను ఉల వలను చిరుసెనగలను భుజింపకూడదు.

శ్లో॥ వృంతకాని కళింగాని కోద్రివాణి చ వర్జయేత్ ।
తందులీయవశాకం చ కౌసుంభం మూలకం తథా ॥ ౪-౨

తా. తొడిమగల పదార్థములను, కొండిశపండ్లను, అళ్ళను, చిత్రికూరను, యవ ధాన్యముయొక్క కూరను, కుసుమపువ్వులను, ముల్లంగిదుంపలను, వైశాఖమాస వ్రతముగలవారు విడువవలయును.

శ్లో॥ ఔదుంబరం బిల్వఫలం తథా శ్లేష్మాతకీఫలం ।
సర్వథా వర్జయేద్విద్వాన్మాసేస్మిన్మాధవప్రియే ॥ ౪-౩

తా. తెలిసినవిద్వాంసుడు విష్ణుప్రీతికరమగు వైశాఖమాసములో మేడిపండు మారేడుపండు, విరిగిచెట్టుపండ్లను భుజియించుట సమస్త ప్రయత్నములచేత విడువవలెను.

శ్లో॥ ఏతేష్వన్యతమం భుక్త్వా స చండాలో భవేద్ధ్రువం ।
తిర్యగ్యోనిశతం యాతి నాత్ర కార్యా విచారణా ॥ ౪-౪

తా. ఈచెప్పబడిన నిషిద్ధవస్తువులలో దేనినైనను తినినవాడు జీవించియుండగా చండాలుడై పిమ్మట నూరుజన్మములపర్యంతము మృగజన్మమెత్తుచుండును. నిశ్చయము ఇందువిషయమై విచారణయేమియు చేయనక్కరలేదు.

శ్లో॥ ఏవం మాసవ్రతం కుర్యాత్ప్రీతయే మధుఘాతినః ।
ఏవం వ్రతే సమాప్తే తు ప్రతిమాం కారయేద్విభోః ॥ ౪-౫
మధుసూదనదైవత్యాం సవస్త్రాం చ సదక్షిణాం ।
స్వర్చితాం విభవైః సర్వై ర్బ్రాహ్మణాయ నివేదయేత్ ॥ ౪-౬

తా. ఈప్రకారము విష్ణుమూర్తిప్రీతికొరకు వైశాఖమాసవ్రతమును చేయుచు విష్ణుమూర్తిప్రతిమనుజేయించి దానికి వస్త్రమునుజుట్టి తనవైభవమునననుసరించి పూజించి యాప్రతిమను దక్షిణాసహితముగా బ్రాహ్మణునకు దానమియ్యవలయును.

శ్లో॥ వైశాఖాసితద్వాదశ్యాం దద్యాద్దధ్యన్న మూజసా ।
సోదకుంభం సతాంబూలం సఫలం చ సదక్షిణం ॥ ౪-౭
దదామి ధర్మరాజాయ తేన ప్రీణాతు వై యమః ॥

తా. వైశాఖబహుళద్వాదశియందు శీఘ్రముగా పెరుగుకలిపినయన్నమును, జలముగల కలశమును, ఫలములు దక్షిణలుగలతాంబూలము, నిచ్చినయెడల ధర్మరాజు సంతోషించును.

శ్లో॥ అపసవ్యా త్సముచ్చార్య నామగోత్రే పితు స్తతః ॥ ౮౮
దద్యా ద్దధ్యన్న మక్షయ్యం పితౄణాం తృప్తిహేతవే ।
గురుభ్య శ్చ తథా దద్యా త్పశ్చా ద్దద్యా చ్చ విష్ణవే ॥ ౮౯

తా. యజ్ఞోపవీతము నపసవ్యము జేసికొని తండ్రియొక్క గోత్రనామములను జెప్పి పెరుగుకలిపినయన్నము గురువులకును అనంతరము విష్ణురూపునకు నిచ్చినయెడల పితృదేవతలు తృప్తిని జెందుదురు. నాశనరహితమగుఫలము సంభవించును.

శ్లో॥ శీతలోదకదధ్యన్నం కాంస్యపాత్రస్థ ముత్తమం ।
సదక్షిణం సతాంబూలం సభక్ష్యం చ ఫలాన్వితం ॥ ౯౦
తదామి విష్ణవే తుభ్యం విష్ణులోకజిగీషయా ।
ఇతి దత్వా యథాశక్త్యా గాం చ దద్యా త్కుటుంబినే ॥ ౯౧

తా. చల్లనియుదకము పెరుగుగలిపినయన్నమును శ్రేష్ఠమగు కంచుపాత్రయందుంచి దక్షిణలు తాంబూలము భక్ష్యములు ఫలములు మొదలగువానియునుంచి విష్ణుమూర్తి నుద్దేశించి కుటుంబవంతుండగు బ్రాహ్మణునకిచ్చి పిమ్మట తనశక్తికొలదియు గోదానమును జేసినయెడల విష్ణులోకమునుపొందును.

శ్లో॥ ఏవం మాసవ్రతం కుర్యా ద్యస్తు దంభేన వర్జితః ।
స సర్వైః పాతకై ర్హీనః కుల ముద్ధృత్య వైశతం ॥ ౯౨
పశ్యతా మేవ భూతానాం భిత్వా వై సూర్యమండలం ।
యాతి విష్ణోః పరం ధామ యోగినా మపి దుర్లభం ॥ ౯౩

తా. ఈప్రకారమెవడు కపటములేనివాడై వైశాఖమాసవ్రతమును జేయునో వాడు సమస్తపాపములను పోగొట్టుకొని నూరుతరములవారినికూడ తరింపజేసి సమస్తభూతములుజూచుచుండగా సూర్యమండలమును భేదించి యోగీశ్వరులకైనను పొందశక్యముగాని విష్ణులోకమును పొందును.

శ్లో॥ వ్యాఖ్యా త్యేవం ద్విజకులవరే మాధవీయాం శ్చ ధర్మాన్ విష్ణ్వా
దిష్టా న్నతిమహిమకా న్వ్యాధపృష్టాం త్సమస్తాన్ । వట స్సద్యః ప
శ్యతా మేవ భూమౌ ప్రపాతాహో పంచశాఖీ ద్రుమేయం॥

తా. ఈప్రకారము ఆబ్రాహ్మణోత్తముడు విష్ణువుచే నిర్ధారణజేయబడిన వైశాఖమాసధర్మములనన్నియు కిరాతుడడుగగా విశదముగా జెప్పుచున్నసమయములో నక్కడనుండు అయిదుకొమ్మలుగల యొకమఱ్ఱిచెట్టు అందరుజూచుచుండగా భూమిపైబడగా నాశ్చర్యమాయెను.

శ్లో॥ వృక్షాత్తస్మా త్కోటరే సంస్థితో హి వ్యాళో కశ్చి ద్దీర్ఘదేహీ కరాళః హిత్వా దేహం పాపయోనిం చ సద్య స్సవై తస్థౌ ప్రాంజలి ర్నమ్రమూర్ధా॥ ౯౨

తా. అప్పుడు ఆవృక్షముయొక్క తొఱ్ఱలోనుండి పెద్దశరీరముగలదియు భయంకరమైన యొకసర్పము బయటికివచ్చి పూర్వజన్మకృతంబైన పాపముచే సంభవించిన యాసర్పదేహమునువిడిచి యప్పుడే మనుష్యరూపమునొంది యీమునీశ్వరునెదుట దోసిలిపట్టి శిరస్సువంచి నిలుచుండెను.

ఇతి శ్రీస్కాందపురాణే వైశాఖమాహాత్మ్యే నారదాంబరీషసంవాదే భాగవతధర్మకథనం నామ వింశోధ్యాయః.

## అథఏకవింశోధ్యాయః.

### శ్రుతదేవ ఉవాచ.

శ్లో॥ తత స్తు విస్మితో భూత్వా శంఖో వ్యాధసమన్వితః।
కో భవా నితి తం ప్రాహ దశైషాచ కుత స్తవ॥ ౧
కేన వా కర్మణా సౌమ్య మతి స్తవ శుభావహా।
ఆకస్మాత్తే కథం ముక్తి రేత దాచక్ష్వ విస్తరాత్।

తా. శ్రుతదేవుడు చెప్పుచున్నాడు. అనంతరము కిరాతునితోగూడ నక్కడుండిన శంఖమహాముని యతనినిజూచి యాశ్చర్యమునుపొంది "నీవెవరవు? నీకిట్టి యవస్థయేలసంభవించెను? నీవేకర్మజేయుటచే నిట్టి మంచిబుద్ధికలిగెను? శీఘ్రముగా ముక్తియే విధముగాకలిగెను? దీనినంతయు సవిస్తరముగా జెప్పుము" అని యాతఁ డడిగెను.

శ్లో॥ శంఖే నైవం తదా పృష్టో దండవ త్పతితో భువి।
ప్రశ్రయావనతో భూత్వా ప్రాంజలి ర్వాక్య మబ్రవీత్॥ ౩

తా. ఈప్రకారమా మునీశ్వరు డడుగగా నప్పుడు దండమువలెనే భూమిమీద పడి సాష్టాంగనమస్కారము జేసి విధేయత గలిగి శరీరమును వంచి దోసిలిపట్టి యిట్లు చెప్పుచున్నాడు.

శ్లో॥ అహం పురా ద్విజః కశ్చి త్ప్రయాగే బహుభాషణః ।
రూపయౌవనసంపన్నో విద్యామదసుగర్వితః ॥ ౪
ధనాఢ్యో బహుపుత్రాఢ్య స్సదాహంకారదూషితః ।
కుసీదస్య మునేః పుత్రో నామ్నా రోచన ఇత్యహం॥ ౫

తా. నేను పూర్వకాలంబున ప్రయాగ తీరమందు వాసముజేయుచుండు కుసీదుడనెడు యొక మునీశ్వరుని తనయుడను. విశేషముగా మాట్లాడువాడను సౌందర్యము యౌవనము గలవాడను. విద్య మిక్కిలి వచ్చియుండుటచే గర్వించినవాడను. మిక్కిలి ధనము గలవాడను విశేషముగా సంతానము గలవాడను. ఎల్లప్పుడు అహంకారముండుటచే దూషింపబడినవాడను రోచనుడనెడు పేరుగలవాడనై యుంటిని.

శ్లో॥ ఆసనం శయనం నిద్రా వ్యవాయో ఽక్షపరిక్రియాః
లోకవార్తా కుసీదం వా వ్యాపారా స్తే మమాభవన్ ॥ ౬

తా. కూర్చుండుట, పండుకొనుట, నిద్రపోవుట, సంభోగము చేయుట, జూదమాడుట, లోకములోనుండు వార్తలను చెప్పుకొనుట, వడ్డీవ్యాపారము జేసికొనుట, ఈ మొదలగు వ్యాపారములను జేయుచునుంటిని.

శ్లో॥ కింతు నిత్యాని కర్మాణి లోకనిందావిశంకితః ।
సదంభ శ్చ సదా కుర్వే న శ్రద్ధా మే కదాచన ॥ ౭

తా. ఇక నేమిచేయుదుననగా లోకులు ఆక్షేపింతురను భయముచే సంధ్యావందనాది నిత్యకృత్యములు మాత్రము కపటస్వభావముతో చేయుచుందునేగాని యాకర్మలయందైనను శ్రద్ధ యొకప్పుడును లేదు.

శ్లో॥ దుర్బుద్ధే ర్మమ దుష్టస్య కియత్కాలో గతో మమ ।
తదా వైశాఖమాసే స్మిన్ జయంతో నామ వై ద్విజః॥ ౮
శ్రావయామాస తన్మాసధర్మాన్ భాగవతప్రియాన్ ।
తత్రత్య వాసినాం పుణ్యకర్మణాంచ ద్విజన్మనాం ॥ ౯

తా. ఇట్లు దుర్మార్గపు బుద్ధి గలిగి చెడుగు వ్యాపారములనే జేయుచుండగా కొంతకాలము జరిగెను. అంతట నొకప్పుడు వైశాఖమాసములో జయంతుడను యొక

బ్రాహ్మణుడు ఆ పుణ్యక్షేత్రముల యందు నివసించి యుండెడి పుణ్యాత్ములైన బ్రాహ్మణులకు భగవద్భక్తులకు సంతోషకరమగు వైశాఖమాస ధర్మములను వినుపించుచుండెను.

శ్లో॥ నారీనరాః క్షత్రియాశ్చ వైశ్యాశ్శూద్రాస్సహస్రశః ।
  ప్రాతస్స్నాత్వా సమభ్యర్చ్య మధుసూదన మవ్యయం ॥ ౧౦
  కథాం శృణ్వంతి సతతం జయంతేన సమీరితాం ।
  శుచిర్భూత్వా మౌనధరా వాసుదేవకథారతాః ॥ ౧౧
  వైశాఖధర్మనిరతా దంభాలస్యవివర్జితాః ॥

తా. బ్రాహ్మ, క్షత్రియ, వైశ్య, శూద్రులు అనెడు నాలుగు జాతుల పురుషులును స్త్రీలును అందరును వైశాఖమాసములో ప్రాతఃకాలంబున స్నానముజేసి వాళన రహితుడగు విష్ణుమూర్తిని పూజించి శుచిగలవారై యితర సంభాషణములను వర్జించి విష్ణు సంబంధము లగునవియు వైశాఖమాస సంబంధము లగునవియు నగు ధర్మముల యందాసక్తి గలవారలై కపటము మాంద్యమును విడిచి యెల్లప్పుడు ఆ జయంతుడు చెప్పుచుండెడి కథలనే వినుచుండిరి.

శ్లో॥ తాం సభాం చ ప్రవిష్టోహం కౌతుకాచ్చ దిదృక్షయా ॥ ౧౨
  సోష్ణీషేణ మయా మూర్ధ్నా నమస్కారోపి నో మునే ।
  తాంబూలం చ ముఖే కృత్వా కంచుకం చ మయా ధృతం ॥ ౧౩

తా. ఓమునీశ్వరా! ఇట్లు కథాకాలక్షేపము జరుగుచుండు సమయములో నా సభను జూచుటయందు వాంఛగలవాడనై చొక్కాయి తొడిగికొని తలపాగ జుట్టి తాంబూలమును నమలుచు యాసభలోనికి వెళ్లినవాడనై యొక్క మహానుభావునికైనను నమస్కరింపనైతి.

శ్లో॥ కథావిక్షేపమకరం లోకవార్తాభిరంజసా ।
  సర్వేషాం చిత్తచాంచల్య మభూద్వై లోకవార్తయా ॥ ౧౪

తా. మరియు నేను ఆకథను వినకుండుటయే గాక వారు వినుచుండెడి కథ వాక్షేపించుచు ఇతరములగు లోకవార్తలను చెప్పుచు నక్కడ నుండెడివారి మనస్సులను చలించునట్లు జేసియుంటిని.

శ్లో॥ క్వచిద్వ్యాసః ప్రసార్యాహం క్వచిన్నిందన్క్వచిద్ధసన్
  ఏవం కాలో మయా నీతః కథా యావత్సమాప్యతే ॥ ౧౫

తా. ఒకచోట నొకనివస్త్రము లాగుచు మరియొకచోట ఒకని నిందించుచు నింకొకచోట మరియొకనితో నవ్వుచు నిట్లు కథ సమాప్తియగునంత పర్యంతము పరిహాసము జేయుచుంటిని.

శ్లో॥ పశ్చాత్తేనైవ దోషేణ సద్యోల్పాయుర్వినష్టధీః ।
సన్నిపాతేన పంచత్వం ప్రాప్తోహం చ పరే దినే ॥ ౧౬

తా. అనంతరము అప్పుడు మూఢుడనై నేజేసిన దోషముచే నాయాయుర్దాయమంతయు శీఘ్రముగా నశించి సన్నిపాత రోగముసంభవించి యామరుదినము నందే మృతినొందితిని.

శ్లో॥ తప్తసీసజలైః జనపూర్ణం నిరయం చ హలాహలం
ప్రాప్య భుక్త్వా యాతనాం చ మన్వంతాని చతుర్దశ ॥ ౧౭
యుక్తే పధ చ లక్షేషు తథా చతురశీతిభిః ।
క్రిమా ద్యోనిషు జాతోహ మిదానీం చావసం ద్రుమే ॥ ౧౮
దశయోజనవిస్తీర్ణే శతయోజన మున్నతే ।
వ్యాళోహం తామసః క్రూర స్సప్తయోజనకోటరే॥ ౧౯
భూత్వా వసామి విప్రర్షే కర్మణా బాధితః పురా ।
అయుతం చ సమాయాతా నిరాహారస్య కోటరే॥ ౨౦

తా. అటుపిమ్మట కాచబడిన సీసము చేతను జలముల చేతను నిండియున్న నరకమందుండి కాలకూటవిషమనుభవించుచు పదునాలుగుమన్వంతరములుయాతనలననుభవించి పిమ్మట ఎనుబదినాలుగు లక్షల జీవరాసులయందు క్రిములుగా జన్మించుచు పిదప యొక సర్పమునై పది యామడలు పొడవును నూరు యామడలు యెత్తును గల యీ వృక్షచెట్టు నందుండు ఏడు యామడలు విశాలముగల తొర్రలో నుండి తామసుడను క్రూరుడనై పూర్వజన్మంబున జేయబడిన పాపకర్మముచే బాధింపబడుచు పదివేల సంవత్సరములనుండి యాహారము లేక యీ తొర్రలో నివాసము జేయుచుంటిని.

శ్లో॥ దైవాత్త్వ ముఖాంభోజసమీరితకథామృతం।
శ్రుత్వా చ చక్షుస్సులుకై స్సద్యో ధ్వస్తాశుభో మునే॥ ౨౧
వ్యాళయోనిం విసృజ్యాహం దివ్యరూపధరః పుమాన్।
ప్రాంజలిః ప్రణతో భూత్వా పాదౌ తే శరణం గతః॥ ౨౨

తా. ఓ మునీశ్వరా! ఇట్లుండగా దైవవశమున మీ ముఖమువలన చెప్పబడినది యీ అమృతముతో సమానమగు హరికథను నా నేత్రములతో వినినంతనే (సర్పములకు నేత్రములే చేవులుగా నుండును) సమస్త కష్టములు దొలగింపబడినవాడనై సర్పశరీరమును విడిచి శ్రేష్ఠమగు పురుషస్వరూపమును ధరించినవాడనై మీకు నమస్కరించి దోసిలిపట్టి మీ పాదములనే రక్షకములనుగా పొందితిని.

శ్లో॥ కస్మిన్ జన్మని త్వం బంధు ర్న జానే మునిసత్తమ।
న మయో పకృతం క్వాపి సానుబంధః కుత స్సతాం॥ ౨౩

తా. ఓ మునీశ్వరా! మీరు నాకు ఏజన్మంబున బంధువులుగా నుండిరో నాకు తెలియదు. ఇట్టి మేలును నాకు చేసితిరి. నేనెప్పుడును మీకు నుపకారమును చేసి యుండలేదు. సత్పురుషులు సమస్త ప్రాణులతోడను సంబంధమును గలిగియే యుందురు.

శ్లో॥ సాధూనాం సమచిత్తానాం సదా భూతదయావతాం।
పరోపకారప్రకృతి ర్న చైషా మన్యథా మతిః॥ ౨౪

తా. సర్వ భూతములయందు సమ స్వభావము గలవారును ఎల్లప్పుడు ప్రాణులయందు దయగల సత్పురుషులయొక్క బుద్ధి పరోపకారమునందే యిచ్ఛగలదై యుండునుగాని మరియొక విధముగా నుండదు.

శ్లో॥ మమా ద్యా నుగ్రహేణ త్వం యథా ధర్మే మతి ర్భవేత్।
న భూయా ద్విస్మృతిః క్వాపి విష్ణో ర్దేవస్య చక్రిణః॥ ౨౫

తా. నాబుద్ధి యెల్లప్పుడు ధర్మము జేయుటయందే యుండునట్లుగాను చక్రధారియగు విష్ణుమూర్తి ధ్యానము నెప్పుడు నే మరువకుండునట్లుగాను నన్నిప్పుడు అనుగ్రహించవలయును.

శ్లో॥ మహతాం సాధువృత్తానాం సంగతి శ్చ సదా భవేత్।
దారిద్ర్య మేక మేవ స్యా న్మదాంధపరమాంజనం॥ ౨౬

తా. గ్రుడ్డివానికి సమస్తమును జూపునట్టి కాటుకవలెనే ధనమదము గలవానికి దరిద్రము, సచ్చరిత్రగల మహానుభావుల సహవాసము, నెల్లప్పుడుండవలయును.

శ్లో॥ ఇతి తం బహుధా స్తుత్వా ప్రణమ్య చ పునః పునః।
ప్రాంజలిః ప్రణత స్తస్థౌ తూష్ణీ మేవ తదగ్రతః॥ ౨౭

తా. ఈప్రకారము అనేక విధములుగా స్తుతియించి మాటిమాటికి నమస్కరించుచు దోసిలిజేసి శిరస్సునువంచి యామునీశ్వరు నెదుట నిలుచుండి యూరకుండెను.

శ్లో॥ శంఖో దోర్భ్యాం సముత్థాప్య పూర్ణప్రేమ పరిప్లుతః।
పస్పర్శ పాణినా చాంగం శృతేన చ గతాగసం॥ ౨౮
చక్రే సో నుగ్రహం తస్మి న్దివ్యరూపధరే ద్విజే।
ప్రాహ తం కృపయా విష్టో భావివృత్తాంత మంజసా॥ ౨౯

తా. శంఖమునీశ్వరుడు మిక్కిలి ప్రేమగలవాడై చేతులతో నెత్తి గూర్చుండబెట్టి ధర్మములను వినుటచే సమస్త పాపములు నశించిన యాపురుషుని తన హస్తముచే నన్ని యవయవములను స్పృజించి శ్రేష్ఠమగు స్వరూపమును ధరించియున్న యా బ్రాహ్మణునియందు అనుగ్రహముంచి దయతో గూడినవాడై యాతనితో ముందు జరుగబోవువాని వృత్తాంతమును జెప్ప నుపక్రమించెను.

శ్లో॥ ద్విజ తే మాసమాహాత్మ్యశ్రవణా చ్చ హరే రపి।
మహాత్మ్యశ్రవణా త్సద్యో విధ్వస్తాఖిలబంధనః॥ ౩౦
అతిహాయ కళంకం చ క్రమా ద్గత్వా పున ర్భువి।
దశార్ణవిషయే పుణ్యే భవితా త్వం ద్విజోత్తమః॥ ౩౧
వేదశర్మే తివిఖ్యాత స్సర్వవేదవిశారదః।
తత్ర తే భవితా జాతిస్మృతి రాత్యంతికీశుభా॥ ౩౨

తా. ఓ బ్రాహ్మణుడా! వైశాఖమాస ధర్మములను వినుట వలనను విష్ణుమూర్తియొక్క కథలను వినుటవలనను శీఘ్రముగానే విడిపోయిన సమస్త సంసారబంధనములు గలవాడవై సమస్త కలుషములను క్రమముగా పోగొట్టుకొని తిరిగి జన్మంబున పుణ్యకరమైన దశార్ణదేశమునందు బ్రాహ్మణుడవుగా బుట్టి వేదశర్మయను పేరుగలవాడవై సమస్త వేదశాస్త్రముల నభ్యసించినవాడవై శుభప్రదమగు పూర్వజన్మ జ్ఞానము గలవాడవై యుందువు.

శ్లో॥ తథా స్మృతానుబంధ స్త్వం త్యక్తసర్వేషణ శ్శుభః।
కరోషి సకలా న్ధర్మా న్వైశాఖోక్తా న్హరిప్రియాన్॥ ౩౩

తా. పూర్వజన్మ సంబంధములను తెలిసికొనినవాడవై ఈషణత్రయములను విసర్జించి మేలునందే వాంఛగలిగి విష్ణుమూర్తికి ప్రీతికరమైన వైశాఖమాస ధర్మముల న్నియు జేయగలవు.

శ్లో॥ నిర్ద్వంద్వో నిస్పృహో నిస్సంగో గురుభక్తో జితేంద్రియః।
సదా విష్ణుకథాలాపో భవితా తత్ర జన్మని॥ 34

తా. ఆజన్మంబున శీతోష్ణాది ద్వంద్వరహితుడవును, వాంఛారహితుడవును, మోహము లేనివాడవును, గురువునందు భక్తిగలవాడవును, ఇంద్రియములను జయించినవాడవును ఎల్లప్పుడు విష్ణుకథా కాలక్షేపము గలవాడవగుదువు.

శ్లో॥ తత స్సిద్ధిం సమాప్యాథ విధ్వస్తాఖిలబంధనః।
ప్రాప్స్యసి పరమం ధామ యోగై రపి దురాసదం॥ 35

తా. ఇట్లుజేయుచుండగా సమస్త బంధములను విడగొట్టుకొని ఫలసిద్ధినిపొంది యజ్ఞములచేత నైనను పొందశక్యముగాని సుత్కృష్ట స్థానమగు విష్ణులోకమును పొందగలవు.

శ్లో॥ మా భైషీః పుత్ర భద్రం తే భవితా మత్ప్రసాదతః।
హాస్యాద్భయా త్తథా క్రోధా ద్ద్వేషా త్కామా దథాపివా॥ 36
స్నేహా ద్వా సకృ దుచ్చార్య విష్ణో ర్నామాఘహారిచ।
పాపిష్ఠా అపి గచ్ఛంతి విష్ణో ర్ధామ నిరామయం॥ 37

తా. కుమారునితో సమానమైనవాడా! నీవుభయపడకుము. నా యనుగ్రహము వలన నీకు శుభము కలుగగలదు. పరిహాసము చేగాని భయముచేగాని కోపముచేగాని విరోధముచేగాని కోరికచేగాని లేక స్నేహముచేగాని యేవిధముగా నైనను పాపములను పోగొట్టునట్టి విష్ణునామమును ఒక్కపర్యాయమైనను స్మరించిన మొదల పాపాత్ములైనను నాశనరహితమగు విష్ణులోకమును పొందగలరు.

శ్లో॥ కిముత శ్రద్ధయా యుక్తా జితక్రోధా జితేంద్రియాః।
దయావంతః కథాం శ్రుత్వా గచ్ఛంతీతి ద్విజోత్తమ॥

తా. ఓబ్రాహ్మణశ్రేష్ఠుడా! శ్రద్ధగలవారును క్రోధములేనివారును ఇంద్రియములను జయించినవారును దయగలవారునగు సత్పురుషులు వైకుంఠమును పొందగలరని చెప్ప నక్కరయే లేదు.

శ్లో॥ కేచి త్కేవలయా భక్త్యా కథాలాపైకతత్పరాః।
సర్వధర్మోజ్ఝితా వాపి యాంతి విష్ణోః పరంపదం॥ 38

తా. కొందరు సమస్త ధర్మములను విడిచి పెట్టినవారైనను ముఖ్యముగా విష్ణుభక్తినిపొంది యా భగవంతుని సంబంధమగు కథలను సంభాషించుటయందే యాసక్తులైవారై విష్ణులోకమును బొందుచున్నారు.

శ్లో॥ ద్వేషాదినా చ భక్త్యా వా కేచి ద్విష్ణు ముపాసతే।
తేపి యాంతి పరం ధామ పూతనే వాసుహారిణీ॥ ౮౦

తా. కొందఱు భక్తిచేతను కొందఱు విరోధము చేతను విష్ణును సేవించి ముక్తిని పొందుచున్నారు. అదియేలాగుననగా ? పూతనయను రాక్షసి కృష్ణమూర్తి యొక్క ప్రాణములను తీయవలయునని వచ్చి యాకృష్ణునిచేతనే చంపబడి వైకుంఠమును పొందిన విధముగానే పొందుదురు.

శ్లో॥ మహద్భి స్సంగతో నిత్యం వాగ్విసర్గ స్తదాశ్రియః।
ముముక్షూణాం చ కర్తవ్య స్స విధిశ్శ్రుతిచోదితః॥ ౮౧

తా. మోక్షమునందు వాంఛగలవారు సత్పురుషులతో సహవాసము, ఎల్లప్పుడు వారితో సంభాషించుట వారిని యాశ్రయించుట, ఇట్టి సద్వ్యాపారములు చేయతగినవని శ్రుతులయందు చెప్పబడెను.

శ్లో॥ స వాగ్విసర్గో జనతాఘవిప్లవో యస్మి న్ప్రతిశ్లోక మబద్ధవత్యపి।
నామా న్యనంతస్య యశోంకితాని శృణ్వంతి గాయంతి గృణంతి సాధవః॥ ౮౨

తా. ఏశ్లోకమందైనను తప్పులుండినను విష్ణునామములు గూర్చబడి యుండెనేని సత్పురుషులు అట్టినామములు గల శ్లోకములను వినుచు గానముజేయుచు తలచుచుందురు. కాబట్టి విష్ణుసంబంధమగు సంభాషణములే సమస్త జనుల పాపములను పోగొట్టును.

శ్లో॥ యః కష్టసేవాం న చ కాంక్షతే విభు ర్న వాధనం భూరినరూపయౌవనే। స్మృత స్సకృ ద్గచ్ఛతి ధామ భాస్వరం కం నా దయాళుం శరణం వ్రజేత॥ ౮౩

తా. ఏప్రభువు అతి కష్టమైన సేవను గాని విశేషధనమును గాని ఆకారమును గాని యౌవనమును గాని కోరక తన నామస్మరణమునే గోరుచుండునో అట్టిభగవంతుని నామస్మరణము ఒక్కపర్యాయము జేసినను ప్రకాశించుచు వైకుంఠమును పొందును. కాబట్టి అట్టి వానిని విడిచి మఱియొక దేవునైనను రక్షకునిగా పొందును.

శ్లో॥ త్వమేవ శరణం యాహి నారాయణ మనామయం।
భక్తవత్సల మవ్యక్తం చేతోగమ్యం దయానిధిం॥ ౮౪

తా. నాశన రహితుడును భక్తులయందు ప్రేమగలవాడును గోచరుడు కాని వాడును జ్ఞానమువలననే తెలియదగిన వాడును దయాసముద్రుండునగు ఆ నారాయణా మూర్తినే రక్షకునిగా పొందుము.

శ్లో॥ కురు సర్వా నిమాంధర్మా న్వైశాఖోక్తా న్మహామతే।
తేన తుష్టో జగన్నాథ శ్శర్మ తే చ విధాస్యతి॥ ౨౬

తా. విశేషబుద్ధి గలవాడా! వైశాఖమాసమును గురించి జెప్పబడిన సమస్త ధర్మములను జేసితివేని జగత్ప్రభునగు ఆ నారాయణమూర్తి సంతసించి నీకు సుఖము నియ్యగలడు.

శ్లో॥ ఇత్యుక్త్వా విరరామాథ వ్యాధం దృష్ట్వా సువిస్మితః।
స దివ్యః పురుషః ప్రాహ పున స్తం మునిపుంగవం॥ ౨౭

తా. ఈప్రకారము శంఖ మునీశ్వరుడు పలికి చాలించెను. అనంతరము యా దివ్య పురుషుడు కిరాతునిజూచి యాశ్చర్యముగు పొంది తిరిగి యామునీశ్వరునితో నిట్లు పలుకుచున్నాడు.

దివ్యపురుషఉవాచ॥

శ్లో॥ ధన్యో స్మ్య నుగృహీతో స్మి త్వయా శంఖ దయాళునా।
దిష్ట్యా గతా మే దుర్యోని ర్యామి చైవ పరాం గతిం॥

తా. దివ్య పురుషుడు పలుకుచున్నాడు. ఓశంఖ మునీశ్వరా! దైవవశమున దయాస్వభావముగల నీవు నన్ను అనుగ్రహించుటచే నే ధన్యుడనైతి. నాహీన బన్మము తొలగి పోయెను. యుత్తమ లోకమును పొందగలను.

శ్లో॥ ఇతి తం చ పరిక్రమ్య హ్యనుజ్ఞాతో దివం యయౌ।
తత స్సాయ మభూ ద్రాజ& శంఖో వ్యాధేన తోషితః॥ ౨౮

తా. ఈప్రకారమాదివ్య పురుషుడు పలికి యామునీశ్వరు చుట్టు దిరిగి ప్రదక్షిణముజేసి యా మునీశ్వరుని వలన యనుజ్ఞవడసి స్వర్గలోకమునకు వెళ్ళెను. ఓ రాజా అనంతరము సాయంకాలమాయెను. అప్పుడు కిరాతుడు శంఖ మునీశ్వరున కనేకయుపకారములను జేసి సంతోష పెట్టెను.

శ్లో॥ సంధ్యాం సాయంతనీం కృత్వా రాత్రిశేషం నినాయ చ।
నానాఖ్యానై శ్చ భూపానాం దేవానాం చ మహాత్మనాం॥ ౨౯
లీలాభి రవతారాణాం దృష్టగోష్టిభి రేవ చ।

బ్రాహ్మే ముహూర్తే చోత్థాయ పాదౌ ప్రక్షాళ్య వాగ్యతః॥౧౦
ధ్యాయేచ్చ తారకం బ్రహ్మ కృత్వా శౌచాది సత్క్రియాః॥

తా. ఆమునీశ్వరుడు సాయంకాల సంధ్యావందనముజేసి రాజులయొక్కయు దేవతలయొక్కయు మహానుభావులయొక్కయు కథలను భగవంతుని దశావతార విలాసములను మరియు రాముజూచిన యితర చరిత్రములను జెప్పికొనుచు వారిద్దరును యారాత్రిని గడపిరి. పిమ్మట ఆమునీశ్వరు డరుణోదయకాలంబున లేచి పాదప్రక్షాళనముజేసికొని శుచిగానుండి సమస్త క్రియలనుజేసి మౌనము నవలంబించి తారక బ్రహ్మమును ధ్యానించెను.

శ్లో॥ వైశాఖే మేషగే సూర్యే స్నాత్వా ప్రాక్చ భగోదయాత్॥ ౧౧
కృత్వా సంధ్యాదికం కర్మ తథాసంతర్ప్య చాఖిలాన్।
వ్యాధ మాహూయ హృష్టాత్మా మూర్ధ్ని ప్రోక్ష్య నిరీక్ష్య చ॥౧౨
రామేతి ద్వ్యక్షరం నామ దదౌ వేదాధికం శుభం॥

తా. పిమ్మట వైశాఖమాసములో సూర్యుడు మేషసంక్రమణమును పొంది యుండగా సూర్యోదయముకంటె ముందుగా స్నాన సంధ్యావందనాది నిత్యకృత్యముల నెరవేర్చి సమస్త దేవతలను తృప్తినొందించి సంతుష్టాంతరంగుడై కిరాతుని బిలిచి మంత్రోదకమును శిరస్సున జల్లివేదములకంటె నధికమైనదియు శుభముల నొసగునది యునగు "రామ" అనురెండు అక్షరములుగల మంత్రముపదేశించెను.

శ్లో॥ విష్ణో రేకైకనామాపి సర్వవేదాధికం మతం॥ ౧౩
తేభ్య శ్చానంతనామభ్యో ధికం నామ్నాం సహస్రకం।
తాదృఙ్నామసహస్రేణ రామనామ సమం మతం॥ ౧౪

తా. విష్ణుమూర్తి యొక్కనామము ఒక్కటైనను అన్నివేదముల కంటె నధికమైనది. కాబట్టి విష్ణుమూర్తి యొక్క అటువంటి నామములు మితిలేక యనేకములు గానున్నవి. వానిలో సహస్రనామములు మిక్కిలి యధికమైనవి. కాబట్టి అట్టి సహస్రనామములతో "రామ" అను రెండు అక్షరములుగల పదము సమానముగా జెప్పబడినది.

శ్లో॥ తస్మా ద్రామేతి తన్నామ జప వ్యాధ నిరంతరం।
ధర్మా నేతాన్ కురు వ్యాధ యావ దామరణాంతికం॥ ౧౫

తా. ఓకిరాతుడా! ఇట్టిమహత్త్వగలదికాబట్టి యెల్లప్పుడును రామనామమునే జపియింపుము. నీవు మరణించువరకు వైశాఖధర్మములను జేయుచుండుము.

శ్లో॥ తత స్తే భవితా జన్మ వల్మీకస్య ఋషేః కులే।
వాల్మీకి రితి నామ్నా చ భూమౌ ఖ్యాతి మవాప్స్యసి॥ ౪౬

తా. ఆనంతరము నీవు వల్మీకమునీశ్వరునకుబుట్టి వాల్మీకుడను మునీశ్వరుడవై భూమిలో ప్రసిద్ధికెక్కెదగలవు.

శ్లో॥ ఇతి వ్యాధం సమాదిశ్య ప్రతస్థే దక్షిణాం దిశం।
వ్యాధోపి తం పరిక్రమ్య ప్రణమ్య చ పునః పునః॥ ౪౭
కించి ద్దూరానుగో భూత్వా స రుద న్విరహాతురః।
యావ ద్దృష్టిపథం తావ త్పశ్యం స్తస్య గతిం పునః॥ ౪౮
పున ర్నివవృతే కృచ్ఛ్రా త్త మేవ హృది చింతయన్॥

తా. ఈప్రకారమాకిరాతునకు ఉపదేశముజేసి యామునీశ్వరుడు దక్షిణదిక్కుగా ప్రయాణమాయెను. అంతట కిరాతుడా మునీశ్వరునకు మాటిమాటికి ప్రదక్షిణముచేయుచు నమస్కరించుచు యా మునీశ్వరునితో గూడ కొంచెము దూరము వెళ్ళి సాగనంపి యామునీశ్వరునియొక్క ఎడబాటు సహింపనివాడై దుఃఖింపుచు కండ్లకగుపడునంతవరకు ఆమునీశ్వరునిజూచుచు యామునీశ్వరుని మనస్సులోతలచికొనుచు అతికష్టప్రయత్నముతో వెనుకకు మరలివచ్చెను

శ్లో॥ వనం నిర్మాయ తన్మార్గే ప్రపాం కృత్వా సునిర్మలాం। ౪౯
అతి యోగ్యా న్విమాన్ ధర్మా న్వైశాఖోక్తాం శ్చకార హ॥

తా. అనంతరమాకిరాతుడు ఆమార్గములో నొకతోటనువేయించి చలివేంద్రనేర్పరచి నిర్మలమగు జలమునిచ్చుచు మిక్కిలియోగ్యములగు వైశాఖధర్మములను జేయుచుండెను.

శ్లో॥ వన్యైః కపిత్థపనసై ర్జంబూచూతాదిభిః ఫలైః॥ ౫౦
మార్గగానాం సమార్తానా మాహారం పరికల్పయన్॥

తా. అనేకఫలవృక్షములుగలతోటలను ఏర్పరచి వెలగపండ్లు పనసపండ్లు నేరేడుపండ్లు మామిడిపండ్లు మొదలగువానిని మార్గాయాసముచే నలసియున్న వారలకు న్నాహారముగానిచ్చుచుండెను.

శ్లో॥ ఉపానద్భి శ్చందనై శ్ఛత్రై శ్చ వ్యజనై రపి॥ ౬౧

వాలుకా స్తరణోపేతచ్ఛాయాభి శ్చ క్వచి త్క్వచిత్ ॥

అపాజహార పాంథానాం శ్రమం స్వేదోద్భవం తథా॥ ౬౨

తా. పాదుకలను మంచిగంధములను గొడుగులను విసనకఱ్ఱలనిచ్చుచు యినుకతిన్నెలయందు అక్కడక్కడ నీడగానుండునట్లు ఆచ్ఛాదనలువేసి క్రింద ఆస్తరణములను నిచి మార్గస్థులను గూర్చుండబెట్టుచు నిట్లు మార్గాయాసమును చెమటను పోగొట్టుచుండెను.

శ్లో॥ ప్రాత స్స్నాత్వా దినారాత్రిం జప న్రామేతి వైమనుం।

వ్యాధజన్మ వినాయాసౌ వల్మీకస్య సుతో భవత్ ॥ ౬౩

తా. ఈప్రకారమాకిరాతుడు పరోపకారముజేయుచు ప్రాతఃకాలంబున స్నానముజేసి రాత్రింబవలును 'రామ' అనుమంత్రము స్మరింపుచు ఆకిరాతజన్మమును వెళ్ళబుచ్చి వల్మీకమునీశ్వరునకు తనయుడుగాబుట్టెను.

శ్లో॥ కృష్ణు ర్నామ మునిః కశ్చి త్తస్మి న్నేవ సరోవరే।

తపో వై దుస్తరం తేపే బాహ్యవ్యాపారవర్జితః॥ ౬౪

తా. వల్మీకమునీశ్వరుని వృత్తాంతమేమి యనగా పూర్వకాలంబున కృష్ణుడనుయొకమునీశ్వరుడు ఇంద్రియవ్యాపారములనువిడిచి ఆసరస్సునందే విశేషముకాలము అతికఠినముగు తపస్సును జేసెను.

శ్లో॥ వల్మీక మభవ ద్దేహ తస్య కాలేన భూయసా।

వల్మీక ఇతి తం ప్రాహు రతో వై మునిపుంగవం ౬౫

తా. అప్పుడుచలింపక విశేషకాలముతపస్సుజేయుగా ఆమునీశ్వరుని దేహముచుట్టును పుట్టలు పట్టుటచేత వల్మీకమునియని చెప్పుచుండిరి.

శ్లో॥ పశ్చా త్తపోవిరామాంతే కృష్ణౌ స్మృతిపథం గతే।

స్త్రియో విస్తరతో రాజ స్ఖలితం చేంద్రియం మునేః॥

తా. పిమ్మట కొంతకాలమునకు తపస్సిద్ధిఅయినపిమ్మట తపస్సుచాలించెను. ఆనంతరమామునీశ్వరుడు లోకవ్యాపారమునసుసరించగా ఇంద్రియములుచలించి స్త్రీయందు వాంఛగలిగెను.

శ్లో॥ జగ్రాహ శైలూషీ కాచి త్తస్యాం జజ్ఞే వనేచరః।

వాల్మీకి రితి విఖ్యాతో భువనేషు మహాయశాః॥ ౬౭

తా. అనంతరము మునీశ్వరుని యొక్క వాల్మీకము భేదించగా ఆస్త్రీయందు శ్రీరాముడు జన్మించెను. ఇట్లు వల్మీకముని శ్వరునివలన బుట్టినవాడు గాన వాల్మీకిమునియై మూడులోకములయందు విశేషకీర్తిగలవాడై ప్రసిద్ధిజెందెను.

శ్లో॥ యో వై రామకథాం దివ్యాం స్వైః ప్రబంధైర్మనోహరాం।
లోకే ప్రఖ్యాపయామాస కర్మబంధనికృంతనీం॥ ౭౮

తా. సమస్తకర్మబంధములను నశింపజేయునట్టి శ్రేష్ఠమైన శ్రీరామచరిత్రమును తనకవిత్వముచే శ్రీమద్రామాయణముగాజేసి యీలోకములో ప్రసిద్ధిజెందునట్లుగా వర్ణించిన మహానుభావుడీవాల్మీకముని యే.

శ్రుతదేవఉవాచ॥

శ్లో॥ పశ్య వైశాఖమాహాత్మ్యం భూపాలా ద్యాపి భూతిదం।
వ్యాధో ప్యపానహౌ దత్వా ఋషిత్వం ప్రాప దుర్లభం॥ ౭౯

తా. శ్రుతదేవుడు చెప్పుచున్నాడు. ఓరాజా! వైశాఖమాహాత్మ్యము ఎటువంటి ఫలముగలదియైనదో వింటివా? క్రూరవృత్తిగలవాడైనను యాకిరాతుడు పాదుకలనిచ్చి యెవరును పొందశక్యముగాని జన్మమునుపొందెను కాబట్టి యీవైశాఖధర్మము మిక్కిలి యుత్తమమైనదియగుచు నిప్పటికి నైశ్వర్యముల నిచ్చుచున్నది.

శ్లో॥ య ఇదం పర మాఖ్యానం పాపఘ్నం రోమహర్షణం।
శృణుయా చ్ఛ్రావయే ద్వాపి న భూయ స్తనపో భవేత్॥ ౮౦

తా. పాపములను పోగొట్టునదియు ఆనందమునుకలిగించునదియునగు శ్రేష్ఠమగు యీచరిత్రమును వినినవారలును ఇతరులకు వినిపించినవారలును తిరిగి భూలోకమున జన్మింపరు.

ఇతి శ్రీస్కాందపురాణే వైశాఖమాహాత్మ్యే నారదాంబరీషసంవాదే
వాల్మీకేర్జన్మకథనం నామ ఏకవింశోధ్యాయః॥

-----

## అథ ద్వావింశోఽధ్యాయః

మైథిలేయఉవాచ॥

శ్లో॥ కా హ్యస్మిం స్తిథయః పుణ్యా మాసే వైశాఖసంజ్ఞికే।
కాని దానాని శస్తాని తాసు తాసు విశేషతః ౧
కైః ప్రఖ్యాతా శ్చ వై లోకే ఏత దాచక్ష్వ విస్తరాత్॥

తా. హేమాంగుడడుగుచున్నాడు. ఓమునీశ్వరా! ఈవైశాఖమాసములో శ్రేష్ఠములగు తిథులేవి? ఆయా దానములలో శ్రేష్ఠములగుదానములేవి? ఈధర్మము లెవరివలన యీలోకములో ప్రసిద్ధిజెందియున్నవి? దీనినంతయు సవిస్తరముగా జెప్పవలయును అని హేమాంగుడడిగెను.

శ్రుతదేవఉవాచ॥

శ్లో॥ త్రింశచ్చ తిథయః పుణ్యా వైశాఖే మేషగే రవౌ॥ ౨
ఏకాదశ్యాం కృతం పుణ్యం కోటికోటిగుణం భవేత్॥

తా. శ్రుతదేవుడు చెప్పుచున్నాడు. ఓరాజా! సూర్యుడు మేషరాశిని పొంది యుండగా వైశాఖమాసము ముప్పదిదినములును ప్రశస్తములైనవియే. అయినను వానిలో సూర్యుడు మేషరాశియందుండగా నుండుయేకాదశి మిక్కిలి పుణ్యకరమైనది. ఆ దినమునజేసినపుణ్యము అనేకకోట్లకోలది పుణ్యమును వృద్ధిజేయునదియగును.

శ్లో॥ సర్వదానేషు యత్పుణ్యం సర్వతీర్థేషు యత్ఫలం॥ 3
సమవాప్నోతి వైశాఖే ఏకాదశ్యాం జలాప్లుతః।

తా. వైశాఖమాసములో నేకాదశీదినమునందు ప్రాతఃకాలంబున స్నానముజేసిన యెడల సమస్తదానములయందుండు ఫలమును సమస్తక్షేత్రములయందుండు పుణ్యమును పొందగలడు.

శ్లో॥ స్నానం దానం తపో హోమో దేవతార్చనసత్క్రియాః॥ ౪
కథాయాః శ్రవణం చైవ సద్యో ముక్తివిధాయకం।

తా. అదినంబున స్నానమునుజేయుట దానమునిచ్చుట తపస్సుజేయుట హోమముజేయుట దేవతాపూజమొదలగు సద్వ్యాపారములనుజేయుట కథనువినుట వీన్నిని జేసినయెడల శీఘ్రముగా ముక్తికలుగగలదు.

శ్లో॥ రోగాద్వ్యసనాత్తో యస్తు దరిద్రోణాపి పీడితః॥ ౫
శ్రుత్వా కథామిమాం పుణ్యాం కృతకృత్యో భవేన్నరః।

తా. రోగాదులచే పీడింపబడినవాడు గాని దరిద్రుడు గానుండువాడు గాని పుణ్య కరమగు ఈవిష్ణుకథను వినినయెడల సార్థకమైన జన్మకలవాడగును.

శ్లో॥ అస్నాత్వా చా ప్యదత్వా చ యేన నీతా ఇమాః శుభాః ౬
స గోఘ్న శ్చ కృతఘ్న శ్చ పితృఘ్న శ్చాత్మహా స్మృతః।
జలాశయా శ్చ స్వాధీనా స్స్వాధీనంచకళేబరం॥ ౭

తా. స్నానము జేయతగినతటాకాదులుండగాను తనశరీరము స్వస్థతగానుండగాను ఎవడు స్నానముజేయకయును ధర్మముజేయకయును శుభములనొసగు వైశాఖమాస దినములను వ్యర్థముగాగడపునో వాడుగోహత్యజేసినవాడుగాను చేసినమేలును మరచినవాడుగాను పితృహత్యజేసినవాడుగాను ఆత్మహత్యజేసికొనినవాడుగాను చెప్పబడెను.

శ్లో॥ మాధవో మనసా సేవ్యః కాల శ్చ సుగుణోత్తమః।
సాధవ శ్చ దయావంతః కో న సేవేత మాధవం॥ ౮

తా. శరీరము స్వస్థముగా లేనిసమయమునందు సుగుణములుగల యీవైశాఖమాసమునుగురించి మనస్సులోనైనను స్మరించవలయును. ఆకాలంబున సత్పురుషులు ప్రాణులయందు దయగలిగియుందురు. మిక్కిలి యుత్తమమగు వైశాఖమాసమును ప్రతివారును సేవింతురు.

శ్లో॥ దరిద్రై శ్చ ధనాఢ్యై శ్చపంగుభి శ్చాంధకై స్తథా।
షండై శ్చ విధవాభి శ్చ నారీభి శ్చ నరై స్తథా॥ ౯
కుమారయువవృద్ధై శ్చ రోగార్తై రపి భూమిప।
అతీవ సుఖసాధ్యో హి ధర్మో వైశాఖగోచరః॥ ౧౦

తా. ఓ రాజా! దరిద్రులు ధనముగలవారు కుంటివారు గ్రుడ్డివారు నపుంసకులు విధవలు సువాసినీలు పురుషులు పిల్లలు యౌవనముగలవారు ముసలివారు రోగపీడితులు మొదలగు సమస్తమైన వారికిని వైశాఖధర్మము మిక్కిలి సులభముగా చేయతగియున్నది.

శ్లో॥ మాస మేన మనుప్రాప్య ధర్మాంకుర మిమం శుభం।
కోన యత్నం చ కురుతే తస్మాల్లోకే స్వవసి స్సుధీః ౧౧

తా. ధర్మములకు కారణమైనదియు శుభకరమైనయు వైశాఖమాసము రాగా నవ్వాడు ధర్మము జేయవలయునని యెవడు ప్రయత్నించునో వానికంటె మేలును పొందువాడు మఱియొకడు లేడు.

శ్లో॥ యోఽతీవ సులభాన్ ధర్మా న్న కరోతి నరాధమః।
తస్యైవ సులభా లోకా నరకా నాత్ర సంశయః ౧౨

తా. మిక్కిలి సులభమగు వైశాఖ ధర్మములను ఏనరాధముడు చేయఁడో అట్టి వాఁడు నరకలోకములను సులభముగానే పొందును ఈవిషయమై సందేహములేదు.

శ్లో॥ అథాత స్సంప్రవక్ష్యామి తస్మి న్మాసే చ కోత్తమాం।
తాం తిథిం సర్వపాపఘ్నీం దధ్న స్సార మివోద్ధృతం॥

తా. పెరుగును తరచి వెన్నను తీసినట్లుగా సమస్త పాపములను పోగొట్టునట్టి వైశాఖమాసములో నుత్తమమగు తిథిని చెప్పెదను.

శ్లో॥ చైత్రమాసి మహాపుణ్యే మేషసంస్థే దివాకరే।
పాపఘ్నీ పితృదేవత్యా గయాకోటిఫలప్రదా॥ ౧౪

తా. సూర్యుడు మేషరాశి యందుండగా పుణ్యాకరమైన చైత్రమాసమునందు పితృప్రీతికరమగు తిథియే పాపములను పోగొట్టునదియు గయలో కోటిపిండ ప్రదానముల జేసిన ఫలముగలదియు నగును.

శ్లో॥ అత్రైవ శ్రూయతే పుణ్యా పితృగాథా పురాతనీ।
నరకే పితౄ నుద్దిశ్య సావర్ణా శాసతి క్షితిం॥ ౧౫

తా. సావర్ణికమనువు పూర్వము భూమిని పరిపాలించు కాలములో ఈవిషయమై నరలోకమునందు పితృదేవతలను గురించి జరిగినదియు పుణ్యాకరమైనదియు నగు ప్రాచీన పితృకథ యొకటి తెలియబడుచున్నది.

శ్లో॥ త్రింశత్కలియుగస్యాంతే సర్వధర్మవివర్జితే।
ఆనర్తే తు ద్విజః కశ్చి ద్ధర్మ ఇనర్ణ ఇతి శ్రుతః॥ ౧౬

తా. ముప్పది కలియుగములు గడచినపిమ్మట సమస్త ధర్మములు నశించియుండు కాలములో ఆనర్తదేశమునందు ధర్మవర్ణుడనెడు యొక బ్రాహ్మణుడుండెను.

శ్లో॥ దృష్ట్వా కలియుగే రాజన్ జనా న్పాపరతా న్మునిః।
తస్యైవ ప్రథమే పాదే వర్ణధర్మవివర్జితే॥ ౧౭
స కదాచి త్సత్రియాగం మునీనాం తు మహాత్మనాం॥
అగమ త్పుష్కరక్షేత్రే కుర్వతాం మౌనధారిణాం॥ ౧౮

తా. ఓ రాజా! అప్పుడా ధర్మవర్ణుడను మునీశ్వరుడు కలియుగములో మొదటి పాదములోనే సమస్త ధర్మములను విడిచి నక్కడ జనులందరు పాపములను జేయుట జూచి యొకప్పుడు పుష్కర క్షేత్రమునందు మహానుభావులగు మునీశ్వరులు మౌనము గలవారలై సత్రయాగమును జేయుచుండగా నచ్చటకేగెను.

శ్లో॥ తత్ర చాస న్పుణ్యకథాం ఋషీణాం శాస్త్రగోచరాం।
తత్ర కేచి త్కలియుగం ప్రశశంసు ర్ధృతవ్రతాః॥ ౧౯

తా. అనంతరమచ్చట మునీశ్వరులు శాస్త్రసిద్ధములగు పుణ్యకథలను చెప్పుకొనుచుండగా నచ్చట నూర్చుండెను. వారిలో కొందఱు కర్మములయందు శ్రద్ధగలవారలు కలియుగము నుత్తమమైనదానిగా పొగడుచుండిరి.

శ్లో॥ కృతే యద్వత్సరా త్సాధ్యం పుణ్యం మాధవతోషణం।
త్రేతాయాం మాసత స్సాధ్యం ద్వాపరే పక్షతో నృప॥ ౨౦
తస్మా ద్దశగుణం పుణ్యం కలౌ విష్ణుస్మృతే ర్భవేత్।
అత్యల్ప మపి వై పుణ్యం కలౌ కోటిగుణం భవేత్॥ ౨౧

తా. సమస్త ధర్మములు నశించినప్పటికిని కలియుగ మేరీతి యుత్తమమైనద నగా? కృతయుగములో సంవత్సరములో జేసిన విష్ణుప్రీతికరమగు పుణ్యము త్రేతాయుగమునందు మాసములో సంభవించును. ఓ రాజా! అదియే ద్వాపరయుగములో పదునైదుదినములలో సంభవించును. కలియుగములో నొక్కసారి విష్ణునామ స్మరణము జేసినయెడల నాపుణ్యముకంటె పదిరెట్లు యెక్కువ పుణ్యము సంభవించును. మరియు కలియుగములో జేసిన పుణ్యము స్వల్పమైనను కోటి గుణములు గలదియగును.

శ్లో॥ దయాపుణ్యవిహీనే తు దానధర్మవివర్జితే।
యది దానం న కురుతే సకృ దుచ్చార్య వై హరిం॥ ౨౨
స ఏవ చోర్ధ్వ గౌ నూనం దుర్భిక్షే చాన్నదో యథా।
ఏతత్ప్రసంగావసరే నారదో భ్యేత్య వై మునిః॥ ౨౩
కరే నైకేన శిశ్నం చ జిహ్వాం చైకేన వై హసన్।
ప్రగృహ్యా నృత్తవ త్తత్ర నన ర్త మునిసత్తమః॥ ౨౪

తా. దయయు, పుణ్యము, దానము, ధర్మము, మొదలగునవి నశియించిన యీ కలియుగములో నెవడు ధర్మము చేయనివాడైనను ఒక్కసారి విష్ణునామ స్మరణను జేయునో వాడే దుర్భిక్షకాలములో నన్నమిడిన వాడువలెనే యుత్కృష్టలోకము

పొందతగినవాడు. కావున కలియుగము త్తమమైనది. అని యచ్చటనుండు మునీశ్వరులు ప్రశంస జేయుచుండగా నంతట నారద మునీశ్వరుడు వచ్చి యొక హస్తముతో శిశ్నమును ఒక హస్తముతో నాలుకను పట్టుకొనిపిచ్చివానివలె నేయచ్చట నాట్యము జేయుచుండెను.

శ్లో॥ సభ్యా స్తదా త మిత్యూచుః క మేత దితి నారద।
ప్రత్యువాచ సతాం త్సర్వాన్ నృత్యం నృత్య న్హసన్సుధీః॥ ౨౫

తా. ఇట్లు నాట్యము జేయుట నాసభికులు జూచి ఓ నారదా! ఏమిటి యీ వర్తితనమని యడుగగా మిక్కిలి బుద్ధిశాలియగు యా నారదుడు నవ్వుచు నాట్యమును జేయుచు ఆసభికుల నందరితో నిట్లు చెప్ప నారంభించెను.

శ్లో॥ సంతోషో యదిహ ప్రోక్తం నృత్యద్భి ర్భావితాత్మభిః।
సిద్ధా వయం న సందేహః పుణ్యో యం కలి రాగతః॥ ౨౬
తత్సత్యం న చ సందేహో బహు స్వల్పేన సాధ్యతే।
కర్మణా త్త్రోష మాయాతి కేశవః క్లేశనాశనః॥ ౨౭

తా. నాట్యమును జేయించునట్టియు మహానుభావులు నగు మీచే నిప్పుడు జెప్పబడినది సంతోషకరమైనది. మేము ఫలసిద్ధిని పొందితిమి. సంశయములేదు. ఈ వచ్చిన కలియుగము పుణ్యప్రదమైనదియే. స్వల్పధర్మముచేనైనను విశేషపుణ్యము సంభవించుటయు సత్యమే, సందేహములేదు, పాపములనునశింపజేయువిష్ణుమూర్తియు తన నామస్మరణము నొక్కసారి జేసిన సంతోషించుటయు నిజమే యగును.

శ్లో॥ తథాపి వః ప్రవక్ష్యామి దుర్ఘటం చ ద్వయం ధ్రువం।
శిశ్నస్య నిగ్రహః పుత్రా జిహ్వాయా అపి నిత్యశః॥ ౨౮
ద్వయం యద్ధి భవే ద్యస్య స ఏవ స్యా జ్జనార్దనః।
భవద్భి ర్నాత్రి స్థాతవ్యం తస్మా త్కలియుగాగమే॥ ౨౯

తా. పుత్త్రిసదృశులగు యో మునులారా! ఈప్రకారమైనప్పటికి మీకు నొక విషయమును జెప్పెదను వినుడు, నేను నాలుకను శిశ్నమును పట్టుకొనుటకు కారణమేమనగా? శిశ్నేంద్రియమును జయించుటయును జిహ్వేంద్రియమును జయించుటయు నీరెండుకార్యములీ కలియుగములో జేయుట కష్టసాధ్యము నిశ్చయము, ఈరెండుకార్యముల నెల్లప్పుడు యెవడు జేయునో వానికే విష్ణుమూర్తి యనుగ్రహము కలవాడగును. కాబట్టి యీకలియుగములు నిచ్చట మీకు నుండతగదు.

శ్లో॥ పాషండం భారతం హిత్వా సంచరధ్వం యథాసుఖం।
యత్ర కుత్రాపి దేశేషు మనో యత్ర ప్రసీదతి॥ ౩౦

తా. ఈకలియుగములో వేదబాహ్యమగు యీభరతఖండమును వదలి మరియొక ప్రదేశమునందెక్కడైనను మీమనస్సున నిష్టముగానుండు ప్రదేశమునకువెళ్ళి యచ్చట మీయిష్టానుసారముగా సంచరింపుడు.

శ్లో॥ ఇతి తద్వచనం శ్రుత్వా మునయ శ్శంసితవ్రతాః।
సత్రం సమాప్య సహసా యయు స్తే చ యథాసుఖం॥ ౩౧

తా. ఈప్రకారమా నారద మునీశ్వరుడు చెప్పిన వృత్తాంతమును విని నియమముతోగూడిన వ్రతములగల యామునీశ్వరులు తాము చేయు సత్రయాగమును సమాప్తినొందించి యామునులందరు తమకిష్టమైనప్రదేశములకు సుఖముగా చేరిరి

శ్లో॥ ధర్మవర్ణోఽపి తచ్ఛ్రుత్వా త్యక్త్వా భూమిం మనో దధే।
సవ్రత శ్చోర్ధ్వతేజస్కో ధృత్వా దండకమండలూ॥ ౩౨
జటావల్కలధారీ చ భూత్వా చైవం యయౌ పునః।
కలౌ యుగే త్వనాచారాన్ ద్రష్టుం విస్మితమానసః॥ ౩౩

తా. అనంతరము ధర్మవర్ణుడును ఆనారదుడు జెప్పినవృత్తాంతమును విని యాశ్చర్యమునుజెంది యాభూమియందు నుండుటకు నిష్టములేనివాడై సవ్రతమునవలంబించి యింద్రియములను జయించి దండము కమండలము జడలు నారచీరలను ధరియించి యిప్పుడీ కలియుగములో మనుష్యులాచార హీనులై యెట్లుప్రవర్తన గలవారలై యుందురో చూడవలయునని కుతూహలముతో తిరిగి భూప్రదేశమునకు వచ్చెను.

శ్లో॥ తత్ర పశ్య జ్జనాన్ ఘోరా న్పాపాచారరతాః ఖలాః।
పాషండినో ద్విజా స్సర్వే శూద్రాః ప్రవ్రజన స్థితాః॥ ౩౪

తా. అక్కడ పాపాచారములయందే యాసక్తిగలవారును క్రూరులును దుర్మార్గులునగు మనుష్యులను జూచెను. ఆపాపాత్ముల ప్రవర్తనయేలాగునుండెననగా? బ్రాహ్మణులందరును వేదబాహ్యులైరి. శూద్రులు సన్యాసము పొందువారైరి.

శ్లో॥ భర్తారం ద్వేష్టి భార్యా చ శిష్యో ద్వేష్టి గురుం తథా।
భృత్య శ్చ స్వామిహంతా చ పుత్రః పితృవధే రతః॥ ౩౫

తా. భార్య పెనిమిటిని శిష్యుడు గురువుని నింద్ించుచుండిరి. నౌకరు తనయజమానుని చంపువాడయ్యెను. కుమారుడు తండ్రిని చంపువాడయ్యెను.

శ్లో॥ శూద్రప్రాయా ద్విజా స్సర్వే బస్తప్రాయా శ్చ ధేనవః ।
గాథాప్రాయా స్తథా వేదాః క్రియాసామాన్యా శ్శుభాః క్రియాః ॥

తా. బ్రాహ్మణులందరు శూద్రులతో సమానులైరి. ఆవులన్నియు మేకలతో సమానములైనవి, ఆతీరుననే నాలుగు వేదములు కథలతో సమానములైనవి, యజ్ఞాదిక్రియలన్నియు సామాన్యక్రియలతో సమానములైనవి.

శ్లో॥ భూతప్రేత పిశాచాద్యాః ఫలదా స్తత్ర దేవతాః ।
తా ఏవ శ్రద్ధయా ర్చంతి జనాః పాపరతా శ్శఠాః ॥ ౩౭

తా. భూతములు ప్రేతములు పిశాచములు మొదలగు క్షుద్రదేవతలే యాప్రదేశంబున ఫలమునిచ్చునవి యగుటచే పాపములయందే యాసక్తిగలవారును మూర్ఖులునగు జనులు అట్టి దేవతలనే శ్రద్ధతో పూజింపుచుండిరి.

శ్లో॥ సర్వే వ్యవాయనిరతా స్తదర్థే త్యక్తజీవితాః ।
కూటసాక్షిప్రవక్తార స్సదా కైతవమానసాః ॥ ౩౮

తా. అందరు సంభోగమునందే యాసక్తిగలిగి యుండిరి. అందువిషయమై తమ ప్రాణములనైనను విడువదలచియుండిరి, అబద్ధసాక్ష్యమును జెప్పువారైయుండిరి, ఎల్లప్పుడు కపటస్వభావముగలవారై యుండిరి.

శ్లో॥ మనస్యేకం వచస్యేకం కర్మణ్యేకం సదా కలౌ ।
సర్వేషాం హైతుకీ విద్యా సా పూజ్యా నృపమందిరే॥ ౩౯

తా. కలియుగములో నెప్పుడు మనస్సులోనుండునది యొకటి. చెప్పునది మరియొకటి చేయునది యింకొకటి, యిట్లు కపటముగానుండును. అందరికిని విద్యయేదో యొకప్రయోజన సహితముగానే యుండును గాని పరమార్థముగానుండదు. అట్టిప్రయోజనకారియగు విద్యయే రాజసభలయందు పూజింపబడును.

శ్లో॥ గీతాద్యా స్సకలా విద్యా నృపాణాం చ ప్రియావహాః ।
హీనా శ్చ పూజ్యతాం యాంతి నోత్తమా శ్చ కలౌయుగే॥ ౪౦

తా. ఈకలియుగములో సంగీతము మొదలగు విద్యలు రాజులకు సంతోషకరములుగా నుండును. హీనులు గౌరవింపబడుదురు. ఉత్తమపురుషులు గౌరవింపబడరు.

శ్లో॥ శ్రోత్రియా శ్చ ద్విజా స్సర్వే దరిద్రా స్స్యుః కలౌ యుగే ।
విష్ణుభక్తి ర్నరాణాం తు ప్రాయశో నైవ వర్తతే ॥ ౪౧

తా. కలియుగములో శ్రోత్రియులు గానుండు బ్రాహ్మణులు దరిద్రులుగా నుందురు. మనుష్యులకు తరుచుగా విష్ణుభక్తియుండదు.

శ్లో॥ ప్రాయః పాషండభూయిష్ఠం పుణ్యక్షేత్రం భవిష్యతి।
శూద్రా ధర్మప్రవక్తారో జటిలా స్తాపసాః కలౌ॥ ౪౨

తా. తరుచుగా పుణ్యక్షేత్రములు వేదబాహ్యులు గలవియగును, కలియుగమున శూద్రులు ధర్మములను చెప్పువారును జడలను ధరించువారును తపస్సుజేయువారు నైయుందురు.

శ్లో॥ సర్వే చాల్పాయుషో మర్త్యా దయాహీనా శ్శఠా జనాః।
సర్వే ధర్మప్రవక్తార స్సర్వే చ గ్రహణోత్సవాః॥ ౪౩

తా. మనుష్యులందరును అల్పాయుర్దాయము గలవారును, దయలేనివారును, మూర్ఖులును, అందరు ధర్మముజెప్పెడివారును, అందరు ధర్మమును గ్రహించినవారు వలెనే యుందురు.

శ్లో॥ స్వార్చనం చాపి హిచ్ఛంతి వృథా నిందాపరాయణాః।
అసూయానిరతా స్సర్వే పరే ప్రాభా గృహంగతే॥ ౪౪

తా. కొందఱు తమరిని పూజించుట కోరుచుందురు. కొందఱు వ్యర్థముగాని తరులను దూషింపుచుందురు. కొందఱు యితరులు విశేషయున్నతస్థితిలో నుండగా ద్వేషబుద్ధిగల వారగుదురు.

శ్లో॥ భ్రాతా చ భగినీం గంతా పితా పుత్రీం చ వై కలౌ।
సర్వేపి శూద్రీనిరతా స్సర్వే వారాంగనారతాః॥ ౪౫

తా. కలియుగములో సోదరుడు తోబుట్టువుతో సంభోగించువాడు నగును, తండ్రికుమార్తెతో సంభోగించువాడగును, అందరును శూద్రస్త్రీలను కోరువారును వేశ్యాస్త్రీలను కోరువారు నగుదురు.

శ్లో॥ సాధూ న్నైవ హ్యావజానంతి బహుపాపాం శ్చ మన్యతే।
వ్యక్తిం కుర్వంతి సాధూనాం దోష మేకం నరాగ్రహాః॥ ౪౬

తా. సత్పురుషులను ఎవరును గౌరవింపరు పాపాత్ములను మిక్కిలి గౌరవింతురు దుష్టస్వభావముగలవారు సత్పురుషులను నొక్కదోషమున్నను ప్రకటింపజేయుదురు.

శ్లో॥ పాపానాం దోషజాతాని గుణత్వేన వహంతి హి
దోష మేవ పరిగృహ్ణంతి కలౌ తు విగుణా జనాః ॥ ౪౭

తా. పాపాత్ములకు ననేకదోషములున్నను గుణములనుగానే తలచుచుందురు. కాబట్టి కలియుగములో దుర్గుణములుగల మూఢజనులు దోషమునే మంచిదానిగా గ్రహించుచున్నారు.

శ్లో॥ జలూకా స్తనసంయుక్తో రక్తం పిబతి నో పయః ।
ఔషధ్య స్సత్వహీనా హి ఋతూనాం వ్యత్యయా స్తథా॥ ౪౮

తా. జలగ స్తనములను పట్టుకొని పాలుపీల్చక రక్తమునుపీల్చిన రీతిగాదుర్మార్గులు దోషములను గ్రహించుచుందురు. మరియు ఓషధులు సారములేనివియై యుండును. ఋతువులు తమ కాలముల నతిక్రమించి వ్యాపారముగలవి యగును.

శ్లో॥ దుర్భిక్షం సర్వరాష్ట్రేషు కన్యా కాలే న సూయతే ।
నటనర్తకవిద్యాసు ప్రీతిమంతో నరాః కలౌ ॥ ౪౯

తా. అన్ని దేశములయందు దుర్భిక్షము సంభవించును. స్త్రీలు తగినవయస్సులో ప్రసవించుటలేదు. కలియుగములో నాట్యము జేయువారియందును నాట్యవిద్యలయందును జనులు కుతూహలము గలవారలై యుందురు.

శ్లో॥ వేదవేదాంతవిద్యాసు నిరతా యే ధనాధికాః ।
భృత్యా న్పశ్యంతి తా న్మూఢా స్తే భ్రష్టా శ్చాఖిలాశిషః॥ ౫౦

తా. ధనవంతులగు మూఢులైనవారు వేదములయందు వేదాంత విద్యలయందు నాసక్తి గలవారిని నౌకర్లనుగా జూచుచుందురు. అట్టి బ్రాహ్మణుల యాశీర్వచనములును ఫలమునీయకుండును.

శ్లో॥ త్యక్తశ్రాద్ధక్రియా స్సర్వే త్యక్తవేదోదితక్రియాః ।
జిహ్వాయాం విష్ణునామాని న వర్తంతే కదాచన ॥ ౫౧

తా. అందరును శ్రాద్ధాదులను విడిచిపెట్టినవారును, వేదములయందు జెప్పబడిన యజ్ఞాదులను విడిచిపెట్టినవారు నగుదురు. ఎవరి నాలుకచేత నొకప్పుడైనను విష్ణునామ స్మరణము చేయబడకుండును.

శ్లో॥ శృంగారరసనిర్మాణా స్తద్గీతా స్త్యేవ తే జగుః ॥

తా. శృంగార రసమునందే కుతూహలము గలవారై యా శృంగార సంబంధములగు ప్రబంధముల నే పఠింపుచుండిరి.

శ్లో॥ తదాఖుః ఖాదయత్యద్ధా దూర్వామూలం తదాశ్రియం।
తేన భాగత్రయం చాత్ర మేకో భాగావశేషితః॥ ౫౭
తం దృష్ట్వా తే క్షీయమాణం మూలం దుఃఖేన కర్షితాః।
అథో దృష్ట్వా చాంధకూపం తటపాతాదిభీషణం॥ ౫౮
దురుత్తారం మహాఘోరం కర్మణాప్తం సుదుఃఖితాః॥ ౫౯
అగ్రే చాపి దురుత్తార మవలంబవివర్జితం।
తాన్ దృష్ట్వా విస్మితో భూత్వా దయాళు ర్వాక్య మబ్రవీత్॥

తా. అప్పుడు వారు పట్టుకొనిన గరిక యొక్క మొదటి భాగము నొక యెలుకభక్షింపుచుండుటచేత మూడుభాగములు నశించి యొకభాగమే మిగిలియుండి క్షీణించియున్న యామొదలునుజూచి యదికూడ నశించి పడిపోదు మేమోయని దుఃఖపడుచుండు వారును, మరియు నీకూపము దట్టముమగు చీకటిచే నిండియున్నది ఒడ్లుకూడ విరిగి పడుచున్నవి కాబట్టి భయంకరముగానున్నదియు బయలకు వచ్చుటకు వీలుగాని యీగొప్ప కూపము మనపాప కర్మముచే సంభవింపబడినదని దుఃఖించుచున్నవారును, మరియు పైభాగమును జూడగా పట్టుకొనుటకేమియు నాధారము లేదు బయటికి యేలాగు రాగలుగుదుమని యేడ్చుచున్న యాపితృదేవతలను జూచి యాశ్చర్యమునొంది దయగలవాడై వారితో నిట్లు పలుక నుపక్రమించెను.

శ్లో॥ కే యూయం పతితా హ్యస్మిన్ కేన దుస్తరకర్మణా।
కస్య గోత్రే సముత్పన్నాః కథం వో ముక్తి ర్వాంఛితా॥ ౬౧

తా. ఓ జీవులారా! మీరెవరు? యేమిపాపముజేయుటచే మీరీకూపములోబడితిరి? ఎవనివంశములోబుట్టినవారలు? మీకెట్లు ముక్తికలుగును?

శ్లో॥ ఏతత్ దూర్వాయం వదధ్వం మే శర్మ వో థ భవిష్యతి।
ఇత్యేవ ముదితా స్తేన పితరో థ సుదుఃఖితాః॥ ౬౨
త మూచుః కరుణా వాచం ధర్మశ్రుతిపురస్సరాః॥

తా. దీనినంతయునువిస్తరముగా నాకుజెప్పినయెడల మీకు మేలుకలుగును. అని యీప్రకారము ధర్మవర్ణుడుపలుకగా నా పితృదేవతలువినిదుఃఖించినవారలై ధర్మమునకు శ్రితులకు వ్యతిరేకము కాని వాక్యములను దీనస్వభావముతో నిట్లుచెప్పమొదలిడిరి.

పితర ఊచుః ॥

శ్లో॥ వయం శ్రీవత్సగోత్రీయా భువి సంతానవర్జితాః ॥ ౬౩
పిండశ్రాద్ధవిహీనా శ్చ తేన పచ్యామహే వయం ।
నిస్సంతానో పి నో వంశో జాతః పాపైః కలౌ యుగే ॥ ౬౪

తా. పితృదేవతలు చెప్పుచున్నారు. మేము శ్రీవత్సగోత్రమునందు బుట్టినవారము. భూమిలో మావంశమునందు తిరిగి సంతానము కలిగియుండలేదు. అందువలన శ్రాద్ధాదులుచేయకుండుటచే మాకు పిండములులభింపక పోవుటవలన నిట్టిదుఃఖ మనుభవించుచుంటిమి. కలియుగములో నిట్టి పాపాత్ములగుటచే మావంశము సంతానవిహీనమైయున్నది.

శ్లో॥ నాస్మాకం పిండద శ్చాస్తి వంశే పాపతుయం గతే ॥
తేనాం ధకూపపతనం నిస్తంతూనాం దురాత్మనాం ॥ ౬౫

తా. మావంశము నాశనముపొందినయెడల మాకు పిండమునిచ్చువాడును లేడు గాబట్టి యాధారములేనట్టియు దురాత్ములమగు మాకు నిట్లు కూపములోబడుట సంభవించెను.

శ్లో॥ ఏకో హి వర్తతే వంశే ధర్మవర్ణో మహాయశాః ।
స విరక్త శ్చర న్నేకో స గార్హస్థ్య ముపేయివాన్ ॥ ౬౬

తా. మావంశములో మిక్కిలిప్రసిద్ధిగల ధర్మవర్ణుడను యొక పురుషుడుగలడు అతడు సంసారమునందు యిష్టములేక వైరాగ్యముపొంది గృహస్థాశ్రమము స్వీకరించక దేశములలో దిరుగుచున్నాడు.

శ్లో॥ తంతు నా తేన బధ్రామో దూర్వానాలావలంబితాః
నిస్తంతుత్వా చ్చ తన్మూల మాఖుః ఖాదతి వ్రత్యహం॥ ౬౭

తా. ఆయన యనువట్టి సూత్రముండుటచే మేమిక్కడ గరికయొక్క కాడ నాశ్రయించి తిరుగుచున్నాము. ఆయన యనంతరము సంతానరహిత మగుటవలన మావంశము నశించును గాన యిక్కడ మాకు నాధారముగా నుండుకాడను నిత్యము యెలుక భక్షించుచున్నది.

శ్లో॥ ఏకస్యే వావశిష్టత్వా త్కించి న్మూలావశేషితః ।
అధునా ఖాద్యమాన శ్చ వర్తతే సామ్య పశ్యతాం ॥ ౬౮

తా. ఓ సజ్జనుడా! మావంశములో నొక్కడే యుండుటవలన మాకు నాధారముగానుండు గరికయొక్క మొదలుకూడ యెలుకచే భక్షింపబడుచు కొంచెము పట్టుతో నున్నది నీవు యిదిగో దానిని చూడుము.

శ్లో॥ తస్య చాయుః క్షయే తాత శేష మాఖు ర్హరిష్యతి ।
పశ్చా త్కూపే పతిష్యామో దురుత్తారేంధతామసే॥ ౧౯

తా. ఆ ధర్మవర్ణుని యాయుర్దాయము క్షీణించిన పిమ్మట మృతినొందగానే యోతండ్రీ! మిగిలిన మొదలనుకూడ యెలుక భక్షింపుటవలన దట్టమైన చీకటిచే నిండియున్నదియు బయటికి వచ్చుటకు శక్యము కానిదియు నగు యీగొప్ప నరకకూపములో పడిపోగలము.

శ్లో॥ తస్మా త్త్వం చ భువం గత్వా ధర్మవర్ణం ప్రబోధయ ।
అస్మద్వాక్యై ర్దయాపాత్రై ర్గార్హస్థ్యే విముఖం మునిం॥ ౨౦

తా. కాబట్టి నీవు భూలోకమునకు వెళ్లి దయయుంచితగిన మా వాక్యములను మేము చెప్పినరీతిగా గృహస్థాశ్రమమునందు యిచ్ఛలేనివాడును మునీశ్వరుడగు ఆ ధర్మవర్ణునితో నిట్లు చెప్పవలయును.

శ్లో॥ పితర స్తే భృశార్తా హి నరకే పతితా మయా ।
అంధకూపే దురుత్తారే దృష్ట్వా దూర్వావలంబితాః ॥ ౨౧

తా. నీ పితృదేవతలు బయలువెడల శక్యము గానిదియు అంధకారమైన నరక కూపములో బడి గరిక నాధారముగా పట్టుకుని యున్నారు. వారిని నేను చూచితిని

శ్లో॥ సా దూర్వా వంశరూపా హి తన్మూలం సతతం మునే ।
కాలాఖ్యో మూషక స్తస్య మూలం ఖాదతి ప్రత్యహం॥

తా. ఓ మునీశ్వరా! ఆగరిక యేమిటి అనగా? ఎల్లప్పుడు అవిచ్ఛిన్నముగా వచ్చుచున్న వంశస్వరూపమే అయినది. కాలమనెడు యెలుక వంశస్వరూప మగు నా సూత్రమును వంశము క్షీణించిన కొలదిని నిత్యము కొట్టివేయుచుండును.

శ్లో॥ వంశనాశో నుక్రమతో ఏక స్త్వ మవశేషితః ।
తేన మూలేస్మిన్ దూర్వాయా నష్టే భాగత్రయం మునే॥ ౨౩

తా. క్రమముగా వంశమంతయు నశించినది నీవొక్కడవు మిగిలితివి. ఓమునీశ్వరా! ఆకారణము వలన యీ గరికయొక్క మొదలు మూడు భాగములవరకు నశించియున్నది,

శ్లో॥ ఏకో భాగో వశిష్టో త్ర యత స్త్వం వర్తసే భువి ।
కించి త్తాదతి వై త్వాఖు స్తవ చాయుఃక్షయకారిమాత్ ॥ ౨౮

తా. నీవొక్కరుడవు యింకా భూమియందు జీవించి యుండుటవలన నొక్క భాగము మిగిలియున్నది. ఆభాగమును కూడ నీ యాయుర్దాయము నశించినకొలది యెలుక కొంచెముకొంచెముగా తినివేయుచున్నది.

శ్లో॥ మ్రీరతే త్వయి చాస్మాకం తవాపి పతనం భవేత్ ।
కూప ఏవాంధతామిస్రే సంతానేపి క్షయం గతే ॥ ౨౯

తా. నీవును మరణము పొందినవాడవగుచుండగా సంతాన మేమియు లేక వంశము నశించిపోవుటచే గాఢాంధకారము గల యీ నరకకూపములో మేము నీవు కూడ పడిపోదుము.

శ్లో॥ తస్మా ద్దార్హాస్థ్య మాసాద్య కురు సంతతివర్ధనం ।
తేనా స్మాకం తవాపి స్యా ద్గతి రూర్ధ్వా న సంశయః॥ ౨౬

తా. ఆ కారణము వలన నీవు గృహస్థాశ్రమమును స్వీకరించి సంతానమును వృద్ధి పొందించితివేని నీకును నాకును పుణ్యకరమగు నూర్ధ్వలోకము కలుగును. సందేహము లేదు.

శ్లో॥ యష్టవ్యా బహవః పుత్రా యద్యేకోపి గయాం వ్రజేత్ ।
యజేత వా శ్వమేధం చ నీలం వా వృష ముత్సృజేత్ ॥

తా. అనేక పుత్రులను జనింప జేసినయెడల వారిలో నొకడైనను కాశీ గయ మొదలగు పుణ్యక్షేత్రములను గురించి యాత్రనైనను జేసికొనును. అశ్వమేధాది యజ్ఞములనైనను జేయును. నల్లని వృషభము నైనను ఉత్సర్జనము జేయును.

శ్లో॥ యద్యేకో పి చ వైశాఖే మాఘే వా కార్తికే పివా ।
అస్మా నుద్దిశ్య వై స్నానం శ్రాద్ధం దానం కరిష్యతి ॥ ౨౭

తా. మరియు వారిలో నొక్కడైనను వైశాఖ మాసములోగాని మాఘ మాసములోగాని కార్తిక మాసములోగాని మమ్ముల నుద్దేశించి దానముగాని శ్రాద్ధమునుగాని జేయుచుండును.

శ్లో॥ తేన చోర్ధ్వగతి ర్భూయా న్నరకా దుద్ధృతి శ్చ నః ।
ఏకో వా విష్ణుభక్త స్స్యా దేకో వా హరివాసరీ ॥

తా. కావున అట్టి శుభకార్యములను జేయుటవలన నరకములనుండి బయలు వెడలి యూర్ధ్వలోకమును పొందువారమగుదుము. మరియు వారిలో నొక్కడైనను విష్ణుభక్తి గలవాడు కాదగును. ఒక్కడైనను యేకాదశీ దినంబున నుపవాసము జేయువాడు కావచ్చును.

శ్లో॥ ఏకో వా శృణుయాద్విష్ణోః కథాం పాపవినాశినీం ।
తేనో ద్ధృతం కులశతం భావి చాపి కులం శతం ॥ ౮౦

తా. మరియు నొక్కడైనను పాపములను నశింపజేయునట్టి విష్ణుకథలను వినిన యెడల వానిచే గడచినవి నూరు తరములు రాబోవునవి నూరు తరములు తరింపజేయ బడుచుండును.

శ్లో॥ అపి పాపవ్రతః క్వాపి నరకం నైవ పశ్యతి ।
కిమన్యై ర్బహుభిః పుత్రై ర్దయాధర్మవివర్జితైః॥ ౮౧
యే జాతా నార్చయం త్యద్ధా విష్ణుం నారాయణం కులే ।
నాపుత్రస్య హి లోకోస్తి సర్వమేత జ్జనా విదుః ॥ ౮౨

తా. తాను పాపప్రవర్తన గలవాడైనను కుమారుడు భగవద్భక్తుడగు నేని తండ్రి నరకమును జూచుటయును సంభవింపదు. కాబట్టి యెందరు సుతులు కలిగినను సమస్త ప్రపంచములో వ్యాపించియుండు నారాయణమూర్తిని యెవరు పూజింపరో దయా ధర్మరహితులగు అట్టి తనయుల నేకులు కలిగినను ప్రయోజనము లేదు. వంశములో తనకు కుమారుడు కలుగని యెడల సుగతిలేదని యున్నది కాబట్టి సుగుణవంతుడగు తనయుడే కలుగ వలయును. యీవిషయమందరికి తెలిసిన విషయమే అయియున్నది.

శ్లో॥ తథాపి చ దయాయుక్తం తత్సంతానం చ దుర్లభం ।
ఇతి తం బోధయిత్వా తు వాక్యై రేతై శ్చసూనృతైః॥ ౮౩
విరక్తస్య ధ్వరే తస్య గార్హస్థ్యే త్వం మతిం కురు ॥

తా. కాబట్టి దయాదాన ధర్మబుద్ధిగల సంతానముగలుగుట మిక్కిలి దుర్లభము. ఓమునీశ్వరా ! ఈ ప్రకారము మేము చెప్పిన యథార్థమైనవాక్యముల నాధర్మ వర్ణునితో చెప్పి బోధించి యాధర్మవర్ణుని వివాహముచేసికొనుట యందును యాగాదులను జేయుటయందును వాంఛ గలవానిగా జేయుము.

శ్లో॥ పితౄణాం వచనం శ్రుత్వా ధర్మవర్ణో తివిస్మితః ॥ ౮౪

ప్రణమ్య ప్రాంజలిః ప్రాహ రుదన్ వై జాతవేపథుః॥
నామ్నా హం ధర్మవర్ణ శ్చ యుష్మద్వంశ్యో దురాగ్రహీ॥ ౮౫

తా. ఇట్లు చెప్పిన పితృదేవతల వాక్యములను విని యా ధర్మవర్ణుడు మిక్కిలి యాశ్చర్యముగలవాడై వారికి నమస్కరించి దోసిలిపట్టి శరీరము కంపము నొందుచుండ యేడ్చుచు వారితో నిట్లు పలుకుచున్నాడు. ఓ పితరులారా! మీవంశములో బుట్టినట్టియు వ్యర్థమగు పట్టుదలగల ధర్మవర్ణుడు నేనే అయియుంటిని.

శ్లో॥ సత్రే తు శ్రుత్వా వచనం నారదస్య మహాత్మనః।
జిహ్వాదార్ఢ్యం గుహ్యాదార్ఢ్యం న కస్యాపి కలౌ యుగే॥ ౮౬
దృష్ట్వా భువి చ పాపిష్ఠాన్ జనా నపి చ శంకితః।
భీమో దుర్జనసంగత్యా చరన్ ద్వీపాంతరే వసన్॥ ౮౭

తా. కలియుగములో నెవరికిని జిహ్వేంద్రియమును జయించుటయు శిశ్నేంద్రియమును జయించుటయు సాధ్యము కాదని మునీశ్వరులచే జేయబడు సత్రయాగములో జెప్పిన నారద మహాముని మాటను వినియు పిమ్మట భూలోకములో పాపాత్ములగు మనుష్యులను జూచియు సందేహించి దుర్మార్గుల సహవాసము జేయుటకు భయపడియు నితర ద్వీపములయందు సంచరించుచుంటిని.

శ్లో॥ పాదా స్త్రయో గతా హ్యస్య కలేః పాదేంత్యమే పి చ।
గతా స్సార్ధత్రయో భాగా ఇదానీం జనకా ఇమే॥ ౮౮

తా. ఓ తండ్రులారా! ఈకలియుగములో మూడు పాదములు గడచినవి. ఒక్కపాదము మిగిలినది. ఆపాదములో కూడ మూడు భాగములు నర గడిచినది.

శ్లో॥ నా హం వేద్మి భవద్దుఃఖం వృథా జన్మ గతం మమ।
యస్మిన్ కులే త్వహం జాతే ఋణం పిత్రోర్న వై హృతం॥

తా. మీరు యిట్లు దుఃఖపడుట నేనెరుగనైతిని. నా జీవితమంతయు వ్యర్థముగా గడుపబడెను. మీవంశమునందు బుట్టి మీఋణమును తీర్చుకొనక పోతిని.

శ్లో॥ కిం తేన జాతమాత్రేణ భూభారేణా న్నశత్రుణా।
యో జాతో నార్చయే ద్విష్ణుం పితౄ న్దేవా నృషీం స్తథా॥ ౯౦

తా. ఎవడు విష్ణుమూర్తిని పితృదేవతలను దేవతలను మునీశ్వరులను పూజింపడో వానివలన భూభారము కొఱకును అన్నమును భుజించుటకును గాక యేమి ప్రయోజనమున్నది.

శ్లో॥ యుష్మదాజ్ఞాం కరిష్యామి మమాజ్ఞాపయత క్షితౌ।
యథా న కలిబాధా స్యా త్తత్ర స్సంసారతో పివా॥ ౯౧
కర్తవ్యాన్యపి కృత్యాని మయా పుత్రేణ భూతలే।
ఇత్యుక్త్వా స్తేన వంశ్యేన ధర్మవర్ణేణ ధీమతా॥ ౯౨

తా. ఓపితరులారా ! మీయాజ్ఞను చేసెదను యేమి యాజ్ఞాపింతురో చెప్పుడు. మరియు భూలోకమునకు వెళ్ళి యక్కడ సంసారములోనున్నప్పటికి కలిబాధ నాకు కలుగకుండు నట్లునన్ను అనుగ్రహింపవలయును. మీకు పుత్రుడనగు నేను భూలోకములో మిమ్ము నుద్దేశించి జేయతగిన కార్యములన్నియు జేసెదను. అని వారి వంశమందు బుట్టినవాడును బుద్ధిమంతుడునగు ధర్మవర్ణుడు చెప్పి చాలించెను.

శ్లో॥ కించి దాశ్వాస్తమనస ఇద మూచు ర్మహీపతే।
పుత్ర పశ్య దశా మేతాం పితౄణాం తే మహాత్మనాం॥ ౯౩

తా. ఓరాజా ! అనంతరము పితృదేవతలు కొంచెమాలోచించి యిట్లు పలుకుచున్నారు. ఓ పుత్రుడా ! మహాప్రభావులగు నీపితృ దేవతలస్థితియే తీరుగా నున్నదో జూచితివా ?

శ్లో॥ సంతత్యభావా త్పతతాం దూర్వామాత్రావలంబినాం।
త్వం గార్హస్థ్య ముపాలభ్య సంతత్యా స్మాత్సముద్ధర॥ ౯౪

తా. వంశము నశించి పోవుచుండుటచే గరికయే నాధారముగా గలిగి యీ మహానరకకూపములో బడుటకు పంసిద్ధులముగా నున్న మమ్ములను నీవు గృహస్థాశ్రమము నవలంబించి సంతానము వడసి యీకూపములోనుండి మమ్ములను బయటికి వచ్చులాగున జేయుము.

శ్లో॥ యే చ విష్ణుకథా రక్తా యే స్మరం త్యనిశం హరిం।
యే సదాచారనిరతా న తా న్నైవ బాధతే కలిః॥ ౯౫

తా. ఎవరు విష్ణు కథలయందు ఆసక్తిగలిగి యెల్లప్పుడు విష్ణుమూర్తినే ధ్యానము జేయుచుందురో. ఎవరు యెల్లప్పుడాచారము గలిగి యుందురో వారికి కలిబాధ కలుగనేరదు.

శ్లో॥ సాలగ్రామశిలా యస్య గృహే తిష్ఠతి మానద।
అథవా భారతం గేహే న తం నైవ బాధతే కలిః॥ ౯౬

తా. ఓపూజ్యాత్మా ! గృహమునందు సాలగ్రామము గలవారిని లేక భారతము గలవారిని యీకలిపురుషుడు బాధింపడు.

శ్లో॥ యశ్చ వైశాఖనిరతో మాఘస్నానపరశ్చ యః।
కార్తికే దీపదాతా యోన తం వా బాధతే కలిః॥ ౯౭

తా. వైశాఖమాస ధర్మములయం దాసక్తిగలవానిని మాఘస్నానమం దాసక్తిగలవానిని కార్తికమాసములో విష్ణుసన్నిధియందు దీపముల నుంచువానిని కలి బాధింపడు.

శ్లో॥ ప్రత్యహం శృణుయాద్యస్తు కథాం విష్ణోర్మహాత్మనః।
పాపఘ్నీం మోక్షదాం దివ్యాం న తం వై బాధతే కలిః॥ ౯౮

తా. పాపములను పోగొట్టునదియు మోక్షము నిచ్చునదియు శ్రేష్ఠమగు మహానుభావుడైన విష్ణుమూర్తి యొక్క కథను నిత్యము వినినవానిని కలి పురుషుడు బాధింపడు.

శ్లో॥ యద్గృహే వైశ్వదేవశ్చ యద్గృహే తులసీ శుభా।
యదంగణే శుభా గావశ్చ న తం వై బాధతే కలిః॥ ౯౯

తా. గృహమునందు వైశ్వదేవము జేయుచున్నవానిని దొడ్డిలో తులసి చెట్టుగలవానిని యింటి ముందర ఆవు గలవానిని కలిపురుషుడు బాధింపడు.

శ్లో॥ తస్మాన్నావస తత్ర త్వం యుగే పాపాత్మకేపి చ।
శీఘ్రం గచ్ఛ భువం పుత్ర మాసోయం మాధవాహ్వయః॥ ౧౦౦

తా. ఈ కారణమువలన కలియుగము పాపాచార భూయిష్ఠమైననునీవుయిక్కడ నుండవలదు శీఘ్రముగా భూలోకమునకు వెళ్లవలయును. యిప్పుడుత్తమమగు వైశాఖ మాసము వచ్చియున్నది.

శ్లో॥ సర్వేషాముపకారాయ మేషసంస్థే దివాకరే।
త్రింశచ్చ తిథయః పుణ్యా మేషసంస్థే దివాకరే॥ ౧౦౧

తా. మేషములో సూర్యుండుండగా ముప్పది దినము లుత్తమములయిన వగుచు సర్వజనులకు నుపకారము జేయతగియున్నవి.

శ్లో॥ ఏకైకస్మిన్ కృతం పుణ్యం కోటికోటిగుణం భవేత్।
తత్రాపి చైత్రబహుళో దశోన్నృణాం చ ముక్తిదః॥

తా. సూర్యుడు మేషరాశియందుండు దినములలో నొక్కొక్క దినమందు జేసిన పుణ్యము అనేకకోట్ల గుణములు గలదియగును. వానిలోను చైత్ర బహుళ దశమి మనుష్యులకు ముక్తినిచ్చును.

శ్లో॥ ప్రియా చ పితృదేవానాం సద్యో ముక్తివిధాయినీ।
యే వై ప్రీత్యాం త్వముద్దిశ్య శ్రాద్ధం కుర్వంతి తద్దినే॥

తా. పితృదేవతలకు అమావాస్యా తిథి ప్రీతికరమైనది కాబట్టి ఆ తిథియందు పితృదేవతలను గురించి శ్రాద్ధమును జేయువారు శీఘ్రముగానే ముక్తినొందగలరు.

శ్లో॥ సోదకుంభం పిండదానం త దక్షయ్యఫలం భవేత్।
యే చ కుర్వంతి వై శ్రాద్ధ మమాయాం చ మధౌ సుత॥ ౧౦౪

తా. ఓపుత్రుడా ! చైత్రబహుళామావాస్య దినమందు శ్రాద్ధముజేసి ఉదక సహితమగు కుంభదానమును పిండ ప్రదానమును జేయువారు నాశరహితమగు ఫలమును పొందగలరు.

శ్లో॥ తైః కృతం తు గయాక్షేత్రే శ్రాద్ధం కోటిగుణం భవత్।
యది శ్రాద్ధం మధౌ దర్శే శాకేనాపి చ శ్రాద్ధకృత్॥ ౧౦౫
కోటిశ్రాద్ధం గయాయాం తు కృతం తేన న సంశయః॥

తా. ఆయమావాస్య దినమందు గయాక్షేత్రమునందు శ్రాద్ధముజేసిన యెడల కోటిరెట్లు ఫలముగలదియగును. ఆయమావాస్య తిథియందు శ్రాద్ధమును జేయుటకు శక్తిలేనివారు యేదైన నొకకూరతోగాని శ్రాద్ధమును గయాక్షేత్రమునందు జేసిన యెడల కోటిగుణములు ఫలము గలది యగును సందేహములేదు.

శ్లో॥ కుంభం చ పానకైః పూర్ణం కర్పూరాగరువాసితం॥ ౧౦౬
యో న దద్యాన్మధౌ దర్శే స పితృఘ్నో న సంశయః॥

తా. చైత్రబహుళామావాస్య దినమందు కర్పూరము అగరు మొదలగు పరిమళ ద్రవ్యములచే పరిమళించు నదియగు పానకముతో నిండియున్న కలశమును యెవడు దానమియ్యడో వాడు పితృహత్యజేసిన వాడగును. సందేహము లేదు.

శ్లో॥ యో దద్యాచ్చ మధౌ దర్శే స పానీయం సశీతలం॥ ౧౦౭
శ్రాద్ధం చ భక్తిసంయుక్తః కురుతే చ కులోద్ధృతిం।
పితౄణాం చ తదా లోకే నదీచామృతవర్షిణీ॥ ౧౦౮

తా. చైత్రబహుళామావాస్య దినమందు మిక్కిలి చల్లనిదియగు జలముతో నిండి యున్న పాత్రమును దానమిచ్చుటవలనను భక్తిగలవాడై పితృదేవతలను తరింపజేయు దానము ఇచ్చుటవలనను పితృలోకములో పితృదేవతలకై యమృతముపర్షించునది యొక టి కలుగును.

శ్లో॥ కుంభదానా త్పిరసతి శ్రాద్ధదానా త్ప్రిదాయినీ!
అన్నసూపఘృతాపూప లేహ్యపాయసకర్దమాన్॥ ౧౦౯

తా. చైత్రబహుళామావాస్య తిథియందు జలసహితమగు కుంభదానమును జేయుటవలనను శ్రాద్ధమును జేయుటవలనను పితృదేవతలకు అన్నము సూపము ఘృతము అపూపములు పాయసము లేహ్యము మొదలగు పదార్థములను పితృదేవతలకు సమృద్ధముగా కలుగజేయును.

శ్లో॥ తస్మాజ్ఝడితి గచ్ఛ త్వం యదా వా మాభవిష్యతి।
కురు శ్రాద్ధం పిండదానం సోదకుంభం మహామతే॥ ౧౧౦

తా. ఓబుద్ధిశాలీ! ఈ వైశాఖమాస మిట్టి ఫలము కలది గనుక నీవు భూలోకమునకు శీఘ్రముగా వెళ్లి శ్రాద్ధమును జేసి ఉదకుంభదానమును పిండప్రదానము జేయుము. లేక ఆలస్యము జేసిన యెడల మాసుగతికి వ్యతిరేకము సంభవించును.

శ్లో॥ సర్వేషా ముపకారాయ గార్హస్థ్యం చ సమాశ్రయ।
ధర్మార్థకామై స్సంతుష్టః ప్రాప్య సంతాన ముత్తమం॥

తా. మా అందరికి నుపకారముకొఱకు నీవు గృహస్థాశ్రమమును పొంది యుత్తమమగు సంతానమును పొందియు ధర్మార్థకామములను పొందియు సంతసించుము.

శ్లో॥ పునశ్చ మునివృత్తి స్త్వం సుఖం ద్వీపే సుసంచర।
ఇత్యాదిష్టః పితృభి శ్చ తూర్ణం భూమిం యయౌ మునిః॥

తా. అనంతరము తిరిగి మునివృత్తి నవలంబించి యీ ద్వీపములలో నీస్వేచ్ఛగా సంచరింపుము. అని యీ ప్రకారము పితృదేవత లాజ్ఞాపింపగా నా ధర్మవర్ణుడను మునీశ్వరుడు శీఘ్రముగా భూలోకమునకు వెళ్లెను.

శ్లో॥ చైత్రే మాసి మేషసంస్థే పుణ్యే మాసి దివాకరే।
ప్రాత స్స్నాత్వా సంతర్ప్య పితౄ న్దేవా నృషీం స్తథా॥ ౧౧౩
సోదకుంభం తథా శ్రాద్ధం కృత్వా పాపవినాశనం।
తేన దత్వా పితౄణాం చ ముక్తిమాన్ప్రీతిమాన్ తతాం॥ ౧౧౪
స్వయం వివాహ మకరో త్సంతతిం ప్రాప్య సై సతీం।
లోకే ప్రఖ్యాపయామాస తాం తిథిం పాపనాశినీం॥
స్వయం పున స్తదా భూత్వా గంధమాదన మాయయౌ॥ ౧౧౫

తా. అనంతరము మేషరాశియందు సూర్యుడుండగా చైత్రమాసములో ప్రాతఃకాలంబున స్నానముజేసి పితృదేవతలను దేవతలను మునీశ్వరులను తర్పణాదులచే తృప్తినొందించి పాపమును నశింపజేయు జలసహితమగు కుంభమును దానమిచ్చి అమావాస్యయందు శ్రాద్ధమునుజేసి పితృదేవతలకు పునరావృత్తి రహితమగు ముక్తిని కలుగజేసి తాను వివాహమును జేసికొని యోగ్యమైన సంతానమునుపొంది పాపమును నశింపజేయు చైత్రబహుళ అమావాస్య తిథియొక్క ప్రభావమును భూమిలో వ్యాపింపజేసి సంతోషముతోడను భక్తితోడ గూడినవాడై తాను తిరిగి తపస్సు జేయుటకొఱకు గంధమాదన పర్వతమును గురించి వెళ్లెను.

శ్లో॥ తస్మాత్పుణ్యతమా చైషా మధోర్దర్శా శుభావహా।
నానయా సదృశీ లోకే తిథిర్దృష్టా శ్రుతాపి వా॥ ౧౧౬

తా. ఆకారణమువలన చైత్రబహుళ అమావాస్య తిథిపుణ్యాకరమైనదియు శుభముల నొసగునదియై యున్నది. దీనితో సమానమైన తిథిని లోకములో నెక్కడను జూడలేదు వినలేదు.

ఇతి శ్రీస్కాందపురాణే వైశాఖమాహాత్మ్యే నారదాంబరీషసంవాదే
కలిధర్మనిరూపణే పితృముక్తిర్నామ
ద్వావింశోధ్యాయః

## అథత్రయోవింశోధ్యాయః
### శ్రుతదేవఉవాచ॥

శ్లో॥ అథాత స్సంప్రవక్ష్యామి మాహాత్మ్యం పాపనాశనం।
అక్షయ్యాయా స్తృతీయాయా సితే పక్షే చ మాధవే॥ ౧
యే కుర్వంతి చ తస్యాం వై ప్రాత స్స్నానం భగోదయే।
తే సర్వే పాపనిర్ముక్తా యాంతి విష్ణోః పరం పదం॥ ౨

తా. శ్రుతదేవుడు చెప్పుచున్నాడు. ఓ రాజా! వైశాఖ ధర్మములు శ్రేష్ఠములయినవి కాబట్టి మరియు పాపములను నశింపజేయు వైశాఖ మహత్తును చెప్పెను వినుము. వైశాఖ శుక్లతదియ అక్షయతదియని చెప్పబడును. అదినమందు

సూర్యోదయ కాలమందెవరు స్నానముజేయుదురో వారందరు పాపరహితులై విష్ణు మూర్తి యొక్క యుత్తమస్థానమగు వైకుంఠమును పొందుచున్నారు.

శ్లో॥ దేవాన్పితౄన్మునీన్యస్తు కుర్యాద్దద్యాచ్చ తర్పణం।
తేనాధీతం చ తేనేష్టం తేన శ్రాద్ధశతం కృతం॥ ౩

తా. దేవతలు మునీశ్వరులు పితృదేవతలు మొదలగు వారిని గూర్చి యెవడు తర్పణ జేయునో వాడు మిక్కిలి చదువుకొనిన వాడును యజ్ఞములను జేసిన వాడును అనేక శ్రాద్ధములను జేసిన వాడునగును.

శ్లో॥ మధుసూదనమభ్యర్చ్య కథాం శృణ్వంతి యే నరాః।
అక్షయ్యాయాం తృతీయాయాం తే నరా ముక్తిభాగినః॥

తా. అక్షయ తదియయందు విష్ణుమూర్తిని పూజించి యాభగవంతుని కథనువిని నవారు ముక్తిని పొందువారగుదురు.

శ్లో॥ యే దానం తత్ర కుర్వంతి మధుద్విట్ప్రీతయే శుభం।
తదక్షయ్యం ఫలం తేన మధుసూదనశాసనాత్॥ ౫

తా. ఆదినమందు విష్ణుమూర్తి ప్రీతికొఱకు శుభప్రదమగు దానమును జేసిన వారు విష్ణుమూర్తి యనుగ్రహము వలన నాశనరహితమగుఫలమును పొందుచున్నారు.

శ్లో॥ దేవర్షిపితృదైవత్యా తిథిరేషా మహాశుభా।
త్రయాణాం తృప్తిదాత్రీ చ కృతే ధర్మే సనాతనే॥ ౬

తా. ఈయక్షయతదియయను తిథి దేవతలకు మునీశ్వరులకు పితృదేవతలకు ప్రీతికరమైనదిగాను మిక్కిలి శుభప్రదమైనది. కాబట్టి యీదినమందు పూర్వమునుండి యు నాచరింపబడుచుండు వైశాఖ ధర్మములను జేసిన యెడల దేవతలకు మునులకు పితృదేవతలకు తృప్తిని కలుగజేసినదియగును.

శ్లో॥ పవిత్ర్యాతి [illegible] [illegible] [illegible] [illegible] [illegible]।
వక్ష్యామి నృపశార్దూల సావధానమనాః శృణు॥ ౭

తా. ఓ రాజశ్రేష్ఠా! [illegible] [illegible] వలన కలిగినది జెప్పెదను సావధాన మనస్కుఁడవై [illegible] [illegible]

శ్లో॥ పురా పురందరస్యాసీ[illegible] [illegible] [illegible] [illegible]।
దేవానాం చైవ దైత్యానాం ద్వంద్వయుద్ధం మహాద్భుతం॥ ౮

తా. పూర్వకాలమందు దేవేంద్రునకు బలిచక్రవర్తికి యుద్ధము జరుగు కాలము నందు దేవతలు రాక్షసులు ద్వంద్వ యుద్ధము జేసికొనిరి.

శ్లో॥ స నిర్జిత్య బలిం దైత్యం పాతాళతల వాసినమ్।
పునర్భువం సమాసాద్య చోతథ్యస్యాశ్రమం యయౌ॥ ౯

తా. ఆయుద్ధమునందు పాతాళలోక నివాసియగు రాక్షసుండగు బలిచక్రవర్తిని యింద్రుడు జయించి భూలోకమును జూచుటయందు కుతూహలుడై భూమిని గురించి వెళ్లి ఉతథ్య మునీశ్వరుని యాశ్రమమునకు వెళ్ళెను.

శ్లో॥ తత్రాపశ్య చ్చ తత్పత్నీం గుర్విణీం మందగామినీం।
చలచ్ఛ్రోణీతటాబద్ధ కాంచీదామ్నాం సుమండితాం॥ ౧౦
క్వణత్కంకణ నిర్ఘోష జితమత్తాళికోకిలాం।
వల్గుచిత్రాంబరాం రామాం మంజువాచాశుచిస్మితాం॥ ౧౧
లసత్కుంభ స్తలాభ్యాం చ కుచాభ్యా ముపశోభితాం।
హసత్పద్మ ముఖాం దివ్యాం నీలోత్పలసులోచనామ్॥ ౧౨
కేతక్యుదకపాండుభ్యాం గండాభ్యాం చ మనోరమాం।
శ్రమోచ్ఛ్వసంతీం మీనాక్షీం పర్ణశాలాముఖే స్థితాం॥ ౧౩
స్వపతీం శయనే క్వాపి తాం దృష్ట్వా మోహ మాగతః।
బలాత్కారేణ బుభుజే గుర్విణీం పాకశాసనః॥ ౧౪

తా. అక్కడ మెల్లగానడచునదియును గర్భముగలదియును, కదలుచుండెడిపిరుదుల యందు బంగారు వడ్డాణముగలదియు, మరియు ననేక యాభరణములతో నలంకరింపబడినదియు, మదించిన తుమ్మెదలు కోకిలల యొక్క ధ్వనిని తిరస్కరించునట్టి మ్రోగుచుండెడి కంకణములు గలదియు, అందమగు ననేక రంగులుగల వస్త్రమును ధరించినదియు, మనోహరమైనదియు మృదువుగా మాట్లాడునదియు, తెల్లనిచిరునగవుగలదియు, ఏనుగుకుంభ స్థలములవంటి స్తనములతో నందమైనదిగానున్నదియు, వికసించినపద్మమువంటి ముఖముగలదియు, ప్రకాశించుచున్నదియు, నల్లగలువలవంటి నేత్రములుగలదియు, మొగలిపువ్వులు జలముతో సమానముగా తెల్లగానుండు చెక్కిళ్ళుగలదియు, ఆయాసముచే నిట్టూర్పులు విడుచుచున్నదియు, చేపలవంటి నేత్రముగలదియు, మనస్సునకు నింపుగానున్నదియు, ఆ పర్ణశాలయొక్క వాకిట నొక శయ్యయందు పరుండినదియు అగు [illegible]

మునీశ్వరుని భార్యను జూచి యాదేవేంద్రుడు మోహము జెంది బలవంతముగా నామెతో సంభోగించెను.

శ్లో॥ గర్భస్థ స్తుతదా పిండ స్స్వస్య పాతవిశంకయా।
ఛాదయామాస వైయోనిం ద్వారే పాదేన దుఃఖితః॥ ౧౫

తా. అప్పుడు గర్భములోనుండు పిండము దేవేంద్రుడు మైథునము జేయుటవలన తనకు భంగము కలిగి పడిపోదునేమోయని సందేహము జెంది దుఃఖించినవాడై తన పాదమును యోనిద్వారమునకు నడ్డుపెట్టెను.

శ్లో॥ తత శ్చస్కంద వీర్యం తద్భూమావేవ బలిద్విషః।
గర్భస్థాయ చుకోపాసౌ భగవాన్పాకశాసనః॥ ౧౬

తా. ఇట్లు యోనిద్వారమునకు పాదము నడ్డుపెట్టుటవలన యాదేవేంద్రుని వీర్యము యామెగర్భములో ప్రవేశింపక భూమియందు జారిపడెను. అప్పుడు దేవేంద్రుడు గర్భమందుండు శిశువుయందు కోపము గలవాడాయెను.

శ్లో॥ తం శశాప చ గర్భస్థం రుషా తామ్రాంతలోచనః।
జాత్యంధో భవ దుర్బుద్ధే మామవంస్థా యతః పదా॥ ౧౭
ప్రచ్ఛాద్య యోనిద్వారం చ తతో దీర్ఘతపాహ్వయః।
పదా త్ప్రస్కందితా ద్వీర్యా జ్జ్వలంత స్సమజాయత॥ ౧౮

తా. ఇట్లు దేవేంద్రుడు ఆశిశువునందు కోపముచే నెఱ్ఱని నేత్రములు కలవాడై యో దుర్మార్గుడా! యోనిద్వారమునకు నీపాదము నడ్డుపెట్టి నాకోర్కెకు భంగము కలిగించి నన్ను తిరస్కరించితివి గాన నీవు పుట్టినప్పటి నుండియు గ్రుడ్డివాడవై యుండుమని శాపమిచ్చెను అనంతరము ఆపాదమునుండి స్రవించిన వీర్యమువలన దీర్ఘతపుడు కాంతిగలవాడగుచు నుద్భవించెను.

శ్లో॥ పశ్చాదింద్రో యయౌ శీఘ్రం మృపే. శ్శాపవిశంకితః।
పలాయంతం హరిం దృష్ట్వా జహాసు ర్వటవో ఖిలాః॥

తా. అనంతరము దేవేంద్రుడు ఉతథ్యమునివచ్చి శపించునేమోయని భయముచే పరుగెత్తుచుండగా నామునీశ్వరుని శిష్యులు జూచి నవ్విరి.

శ్లో॥ తత స్తు వ్రీడితో భూత్వా యయౌ మేరో ర్గుహాం శుభాం।
తత్ర లీన శ్చచారాసౌ ము స్తరం వై తపో మహత్॥

తా. అనంతరము ఆ యవమానముచే సిగ్గుపడి మేరువ పర్వతమునకు వెళ్లి యొక గుహాలో దాగియుండి దేవేంద్రుడు కఠినమగు విశేషతపస్సును జేసెను.

శ్లో॥ మేరౌ విలీయ వసతి దేవేంద్రే లజ్జయాన్వితే।
గూఢై ర్విజ్ఞాయ తాం వార్తాం దైతేయా బలిపూర్వకాః।
సురా నాక్రమ్య బుభుజు ర్బలీంద్ర శ్చామరావతీం।
దిక్పాలానాం విభూతిం చ శంబరాద్యా బలీయసః॥ ౨౨

తా. దేవేంద్రుడు సిగ్గుతో గూడినవాడై మేరువు పర్వతమునందు దాగియుండ గా నా వార్తను గూఢచారుల వలన విని బలిచక్రవర్తి మొదలగు రాక్షసులు దేవతల నాటంకపఱచి దేవేంద్రుని రాజ్యవైభవమును బలిచక్రవర్తియు నితరులగు దేవతుల నైశ్వర్యమును బలవంతులగు శంబరుడు మొదలగు రాక్షసులు నపహరించి యనుభవించుచుండిరి

శ్లో॥ బలా ద్బుభుజిరే హీననాథే రాష్ట్రే దివౌకసాం।
రక్షితార మజానంతో దేవా శ్చాగ్నిపురోగమాః॥ ౨౩
పప్రచ్ఛు ర్ధిషణం దేవం దేవాచార్య మకల్మషం॥

తా. ఇట్లు రాక్షసులు బలవంతముగా రాజ్య మపహరించి యనుభవించుటచే దేవతా రాజ్యము దేవేంద్రుని యాధిపత్యము లేనిదగుట వలన నగ్ని మొదలగు దేవత లందరును తమకు నధిపతియగు నింద్రుని వృత్తాంతము నెరుగనివారై దేవతలకు గురువును దోషరహితుండు నగు బృహస్పతుల వారినడిగిరి.

శ్లో॥ పప్రచ్ఛు రింద్రవృత్తాంతం క్వ చ తిష్ఠతి నః ప్రభుః॥ ౨౪
దైత్యాక్రాంత మిదం రాష్ట్రం హీననాథం దివౌకసాం।
కుతో నా యాతి దేవో సౌ భూయా న్కాలో గతో విభోః॥ ౨౫

తా. దేవతలిట్లు యడిగిరి. ఓస్వామీ! దేవేంద్రుని వృత్తాంతము మాకు దెలియకుండెను మా ప్రభువగు నింద్రుడెక్కడుండెను. దేవతల యీ రాజ్యము దేవేంద్రుని యధికారము లేక రాక్షసులచే నాక్రమింపబడి యనుభవింప బడుచుండెను. ఆదేవేంద్రుడు వెళ్లి చాలాకాలమాయెను. ఎచ్చటికి వెళ్లెనో తెలియదు.

శ్లో॥ తం యామో యత్ర ధిషణ? ప్రార్థయామ శ్చ తం విభుం।
ఇతి పృష్ట స్తదా దేవై ర్ధిషణ స్తా నువాచ హ॥ ౨౬

తా. ఆదేవేంద్రుం డెక్కడుండెనో చెప్పినయెడల మేము అచ్చటికి వెళ్లి ఆయింద్రుని ప్రార్థించి తీసికొని వత్తుమని యా దేవతలు చెప్పగా బృహస్పతి వారి తో నిట్లనియెను.

శ్లో॥ రసాతలే బలిం జిత్వా చోతథ్యస్యా శ్రమం యయౌ।
భుక్త్వా పత్నీం చ దార్ఢ్యేన తచ్ఛిష్యై రేవ నిందితః॥
పీడిత స్తు దివం యాతుం గుహాం మేరో ర్వివేశ హ॥
తత్రైవాస్తే శచీయుక్త స్స్వకృతం చింతయ న్విభుః॥ ౨౮

తా. దేవేంద్రుడు పూర్వము పాతాళలోకమునకు వెళ్లి బలిచక్రవర్తిని జయించి భూలోకమునకు వచ్చి ఉతథ్యమహాముని యాశ్రమమునకు వెళ్లి యామునీశ్వరుని భార్యతో బలవంతముగా సంభోగించి యామునీశ్వరుని శిష్యులచే నిందింపబడినవాడై సిగ్గుపడి స్వర్గలోకమునకు తిరిగి రానొల్లక మేరువు పర్వతముయొక్క గుహలో బ్రవేశించి యక్కడనే భార్యతోగూడ యుండి తన దుష్కృతముయొక్క నివారణమును గురించి విచారించుచుండెను.

శ్లో॥ ఇతి తస్య వచ శ్శ్రుత్వా దేవా అగ్నిపురోగమాః।
గుహాం మేరో ర్యయు శ్శీఘ్రం ద్రష్టుం ప్రార్థయితుం విభుం॥

తా. ఇట్లు బృహస్పతి చెప్పిన వాక్యమును అగ్ని మొదలగు దేవతలందరు విని తమకు నధిపతియగు నింద్రునిజూచి ప్రార్థించి తీసికొనివచ్చుటకు శీఘ్రముగా మేరువు పర్వత గుహకు వెళ్లిరి.

శ్లో॥ తత్ర దృష్ట్వా గుహాలీనం దేవేంద్రం పాకశాసనం।
తుష్టువు ర్వివిధై స్తోత్రై స్తద్వీర్యై ర్లోకవిశ్రుతైః॥ ౩౦

తా. ఆ మేరువు పర్వతమునందు గుహలో దాగియున్నవాడును దేవతలకు నధిపతియు నగు నింద్రునిజూచి యా దేవతలు దేవేంద్రుని పరాక్రమము గలిగి లోకములో ప్రసిద్ధి కెక్కినవియు ననేకవిధములగు స్తోత్రములచే స్తుతియించిరి.

శ్లో॥ ఇంద్ర తుభ్యం నమ స్తే స్తు సర్వదేవాధిపాయ తే।
వయం దైత్యై రర్దితా స్తే త్వయా హీనా భృశార్దితాః॥ ౩౧

తా. ఓయింద్రుడా! సమస్త దేవతలకు నధిపతివగు నీకు నమస్కారము. నీవు ప్రభువుగా నుండకుండుటచే రాక్షసులచే మిక్కిలి పీడింపబడిన వారమై విశేషము గా దుఃఖించుచున్నాము.

శ్లో॥ స్థానభ్రష్టా శ్చరామోంగ నానాదేశేషు దుఃఖితాః।
తస్మా దాగత్య దేవేంద్ర జహి శత్రూ న్నరిందమ॥ 32

తా. శత్రువులను నశింపజేయునట్టి యో దేవేంద్రుడా! ఇట్లు దుఃఖించుచు మా నివాసములను వదలి అనేక దేశములలో దిరుగుచుంటిమి. కాబట్టి నీవువచ్చి శత్రువులను సంహరింపుము.

శ్లో॥ ఇతి స్తుత స్తదా దేవై ర్నిశ్చక్రామ గుహాముఖాత్।
లజ్జయా వనతో భూత్వా పశ్యన్ భూమిం చ చక్షుషా॥ 33

తా. ఇట్లు దేవతలచే నుతింపబడి అప్పుడు దేవేంద్రుడు ఆగుహలోనుండి బయటికివచ్చి సిగ్గుచే ముఖము వంచుకొని నేలను జూచుచుండెను.

శ్లో॥ న కించి దపి చోవాచ దుఃఖా ద్గద్గదభాషణః।
తద్జ్ఞాత్వా ధిషణః ప్రాహ తం సురేంద్రం భయానకం॥ 34

తా. ఇట్లు సిగ్గుచే కొంచెమైనను మాట్లాడక దుఃఖమువలన గద్గదస్వరముతో మాట్లాడసాగెను. ఇట్లు దేవేంద్రుడు భయము గలవానిగా నెరిగి బృహస్పతి యాతనితో నిట్లు చెప్పెను.

శ్లో॥ మా శంకా తే సురపతే కర్మాధీన మిదం జగత్।
మానాపమానౌ సుఖం దుఃఖం లాభాలాభౌ జయాజయౌ॥
పూర్వకర్మానురోధేన భవం త్యేతే న సంశయః॥
జీవః కర్మానుగో దుఃఖం దిష్టం దైవేన కాలతః॥ 35

తా. ఓయింద్రుడా! నీవేమి సందేహింపపనిలేదు. ఈప్రపంచమంతయు కర్మలకు స్వాధీనమైయున్నది. గౌరవము అవమానము సుఖము దుఃఖము లాభము నష్టము గెలుపు ఓడుట యీ మొదలగునవి పూర్వజన్మంబున జేయబడిన పుణ్యపాప కర్మముల ననుసరించి పొందుచున్నారు. సందేహము లేదు. జీవుడు కర్మల ననుసరించి దుఃఖమును పొందును కాబట్టి అది యాయాకాలమునకు నీశ్వరునిచే నిర్ణయింపబడియే యున్నది.

శ్లో॥ ప్రాజ్ఞాః ప్రాయో న శోచంతి న ప్రహృష్యంతి వై సుఖాత్।
తస్మా త్ప్రారబ్ధతః ప్రాప్తం దుఃఖం చేదం తవ ప్రభో॥

తా. ఓయింద్రుడా! మిక్కిలి తెలిసిన విద్వాంసులు ప్రారబ్ధవశమువలన సంభవించిన సుఖదుఃఖములను పొంది సంతోషింపరు. విచారపడరు. కాబట్టి నీకు నిట్టి దుఃఖము ప్రారబ్ధమువలన సంభవించినది.

శ్లో॥ తత్ప్రాప్య మఘవన్ దుఃఖం నైవ శోచితు మర్హసి।
ఇత్యుక్త్వా గురుణా చాహ మఘవా నమరాధిపాన్ ॥

తా. ఓయింద్రుడా! అట్టి ప్రారబ్ధమును పొంది నీవు దుఃఖింపపనిలేదు. అని బృహస్పతి చెప్పగా నా దేవేంద్రుడు దేవతలతో నిట్లు పలుకుచున్నాడు.

ఇంద్ర ఉవాచ॥

శ్లో॥ పరస్త్రీసంగదోషేణ బలం వీర్యం యశో బలం।
మంత్రశక్తి శ్శస్త్రశక్తి ర్విద్యాశక్తి శ్చ మానద॥ 39
అభవ న్నష్టవీర్యా శ్చ తూష్ణీం తేన వసా మ్యహం॥

తా. పరస్త్రీ సంభోగ పాపము వలన బలము శౌర్యత్వము కీర్తియు మంత్రశక్తి శస్త్రశక్తి విద్యాశక్తి మొదలగు శక్తులన్నియు సారవంతములు కానివిగానై యున్నవి. ఆకారణము వలన నేను అసమర్థుడనై యుంటిని.

శ్లో॥ పాకశాసనవాక్యం తు శ్రుత్వా స్వాచార్యసంయుతాః॥ 40
మంత్రయామాసు రేకాంతే పున స్తస్య బలాప్తయే॥
తదా గురు శ్చ తా న్ప్రాహ కరుణాంచ విదుత్తమః॥ 41

తా. దేవతలు బృహస్పతియు ఆదేవేంద్రుడు చెప్పిన మాటను విని తిరిగి దేవేంద్రునకు బలము సంభవించుటకు రహస్య ప్రదేశమునకు వెళ్ళి యాలోచింపగా తెలిసిన వారలలో నుత్తముడగు ఆ బృహస్పతి దయతో గూడినట్లుగా వారితో నిట్లు చెప్పెను.

బృహస్పతిః॥

శ్లో॥ మాసో వైశాఖనామా యం ప్రియో వై మధుఘాతినః।
సర్వా శ్చ తిథయః పుణ్యా మాసేఽస్మి న్మాధవప్రియే॥ 42

తా. బృహస్పతి చెప్పుచున్నాడు. వైశాఖ మాసము విష్ణుమూర్తికి ప్రీతికరమైనది విష్ణుప్రీతికరమైన వైశాఖ మాసములో తిథులన్నియు పుణ్యాకరములే యగును.

శ్లో॥ తత్రాపి చ సితే పక్షే మాసేస్మి న్వ్యాకుయాహ్వయా।
య స్తస్యాం స్నానదానాది శ్రద్ధయా చ కరోతి వై॥ 43

తస్య పాపసహస్రాణి నశ్యంత్యేవ న సంశయః ।
అనవద్యం తథైశ్వర్యం బలం ధైర్యం భవంతి చ ॥ ౨౨

తా. అట్టితిథులలోను వైశాఖశుద్ధ తదియ అక్షయతదియయని చెప్పబడును. ఆతదియదినంబున శ్రద్ధతో స్నానదానము మొదలగునవి జేసిన వానియొక్క పాపముల నేకములున్నను నశించుచున్నవి. సందేహములేదు. మరియు విపులమగునైశ్వర్యమును బలమును ధైర్యమును బొందుచున్నారు.

శ్లో॥ తస్మాత్తస్యాం తృతీయాయాం హరిణా బలివిద్విషా।
స్నానదానాదిసద్ధర్మాన్కారయామో హితాత్తయే ॥ ౨౩

తా. కాబట్టి ఆయక్షయతదియదినంబున దేవేంద్రునకు మేలు సంభవించుకొరకు బలిచక్రవర్తికి విరోధియగు ఆ దేవేంద్రునిచే మనమందరము స్నానదానాది సత్కర్మాలను జేయింపవలెను.

శ్లో॥ భవిష్యతి చ సా శక్తి ర్విద్యాయాం మంత్రశస్త్రయోః ।
బలం ధైర్యం యశ శ్చైవ యథాపూర్వం భవిష్యతి ॥

తా. అట్లు జేసినయెడల విద్యయందు మంత్రములయందు శస్త్రములయందుండు శక్తియు బలము ధైర్యము కీర్తి మొదలగునవియన్నియు పూర్వమువలెనే సంభవించియుండును.

శ్లో॥ ఇత్యేవం తు విచార్యాథ గురు ర్దేవై స్సమాహితః ।
ఇంద్రేణ కారయామాస ధర్మా నేతాన్ హరిప్రియాన్ ॥

తా. ఈప్రకారము బృహస్పతియు దేవతలు నాలోచించి సమాహితచిత్తము గలవాడై విష్ణుప్రీతికరమగు ధర్మములనన్నియు నింద్రునిచే జేయించెను.

శ్లో॥ అక్షయాయాం తృతీయాయాం భుక్తిముక్తిఫలప్రదాన్ ।
తేన పూర్వవ దేవాసీ ద్బలం ధైర్యాదికం విభోః ॥

తా. అక్షయతదియయందు భుక్తిని ముక్తిని నిచ్చునట్టి వైశాఖధర్మములను జేయుటవలన ఆ దేవేంద్రునకు పూర్వమువలెనే బలము ధైర్యము మొదలగునవి కలిగెను.

శ్లో॥ పరస్త్రీసంగదోషోఽపి సద్య ఏవ విలీయత।
పశ్చాద్ధతాసుభ శ్శత్రో రాహృత్య స్మృక్త ఇవోడుపః ॥ ౨౮
దేవతానాం తథా మధ్యే శుశుభే చ హరి ర్యథా॥

తా. పరస్త్రీ సంభోగమువలన కలిగినదోషము తత్కాలమునందే నశించిపోయెను. దోషములు నశించిపోవుటచే ఆదేవేంద్రుడు రాహువువలన విడువబడిన చంద్రుడువలెను ప్రకాశించి యాదేవతలచకుమ విష్ణుమూర్తివలెనే ప్రకాశించెను.

శ్లో॥ పశ్చాద్దేవై స్సమాయుక్తో వినిర్జిత్య తథా సురాన్ ॥ ౧౦
తృతీయాయా శ్చ మహాత్మ్యా ద్భాగ్యోద్రిక్తో మరావతీం।
వివేశ విభవై స్సార్థం శంఖతూర్యాదినిస్వనైః॥ ౧౧

తా. అనంతరము దేవేంద్రుడు దేవతలతోకూడి స్వర్గమునకువెళ్ళి రాక్షసులనోడించి యక్షయతదియయొక్క ప్రభావమువలన మిక్కిలి భాగ్యముగలవాడై శంఖము ఢంక మొదలగు వాద్యధ్వనులతోగూడ అమరావతీ పట్టణమును ప్రవేశించెను.

శ్లో॥ అనుజ్ఞాతా శ్చ శక్రేణ స్వధామ నిర్యయు స్సురాః ।
తత శ్చ యజ్ఞభాగాం శ్చ లేభిరే చ యథా పురా ॥

తా. దేవేంద్రుని యాజ్ఞాప్రకారముగా దేవతలందరును యెవరిగృహములకువారు వెళ్ళిరి. అనంతరము పూర్వము వలెనే వారి వారి యజ్ఞభాగములను కూడ పొందుచుండిరి.

శ్లో॥ పిండభాగాం శ్చ పితరో యథాపూర్వం ప్రపేదిరే ।
స్వాధ్యాయే మునయ స్తుష్టా దైత్యానాం చ పరాజయః ౧౩

తా. పితృదేవతలు పూర్వమువలెనే పిండములను పొందుచుండిరి. మునీశ్వరులు వేదాధ్యయనముజేయుచు సంతోషించుచుండిరి. రాక్షసులకు పరాజయము కలిగెను.

శ్లో॥ తదా ప్రభృతి లోకేస్మిన్ తృతీయా చాక్షయాహ్వయా ।
ప్రఖ్యాతా సర్వలోకేషు దేవర్షిపితృతుష్టిదా ॥ ౧౪

తా. అదిమొదలు ఈలోకములో అక్షయ తదియ దేవతలకు పితృదేవతలకు మునీశ్వరులకు తృప్తిని కలుగజేయునదియై మూడు లోకములయందు ప్రసిద్ధి కెక్కియున్నది.

శ్లో॥ తస్మా త్పుణ్యతమా చైషా సర్వకర్మనికృంతనీ ।
భుక్తిముక్తిప్రదా నృణాం తృతీయా చాక్షయాహ్వయా॥ ౧౫

తా. ఆకారణమువలన అక్షయ తదియ మనుష్యులకు పుణ్యమునిచ్చునదియును సమస్త కర్మబంధములను నశింపజేయునదియు భుక్తిని ముక్తి నిచ్చునదియై యున్నది.

ఇతి శ్రీస్కాందపురాణే వైశాఖమాహాత్మ్యే నారదాంబరీషసంవాదే
అక్షయతృతీయాయా శ్శ్రేష్ఠత్వకథనం నామ త్రయో
వింశోధ్యాయః ॥

## అధ చతుర్వింశోధ్యాయః.

శ్రుతదేవఉవాచ॥

శ్లో॥ తిథి ష్వేతాసు పుణ్యాసు ద్వాదశీ సితపక్షిణీ ।
వైశాఖమాసే రాజేంద్ర సర్వాఘౌఘవినాశనీ ॥ ౧

తా. శ్రుతదేవుడు చెప్పుచున్నాడు. ఓరాజోత్తమా! మరియు పుణ్యాకరములగు వైశాఖమాసములో ముప్పది దినములలోను శుద్ధద్వాదశీతిథి సమస్తపాపములను పోగొట్టునదిగా జెప్పబడెను.

శ్లో॥ కిం దానైః కింతపోభి శ్చ కి ముపోష్యై ర్వ్రతై శ్చ కిం ।
కి మిష్టై శ్చైవ పూర్తై శ్చ ద్వాదశీ యై ర్న సేవితా॥ ౨

తా. ఎవరు ద్వాదశీవ్రతమును జేయరో వారు అనేక దానములు జేసినను తపస్సులుచేసినను ఉపవాసములుజేసినను వ్రతములుజేసినను యజ్ఞములను జేసినను చెరువులు మొదలగువానిని త్రవ్వించిన నేమియు ప్రయోజనములేదు.

శ్లో॥ గంగాయా ముపరాగే తు యో దద్యా ద్గోసహస్రకం ।
తత్ఫలం సమవాప్నోతి ప్రాతస్స్నాత్వా హరే ర్దినే ॥ 3

తా. గ్రహణదినమందు గంగాతీరమునందు వెయ్యి గోదానములను జేసిన యేమి ఫలముకలుగునో అట్టిఫలమును విష్ణుప్రీతికరమగు దినమునందు ప్రాతఃకాలంబునస్నానము జేసినవారు పొందుదురు.

శ్లో॥ య ద్దత్తం చార్హతే చాన్నం ద్వాదశ్యాం చ సితే శుభే ।
సిక్థే సిక్థే భవే త్తస్య కోటిబ్రాహ్మణభోజనం ॥ ౪

తా. శుభములనొసగు వైశాఖశుద్ధ ద్వాదశియందు యోగ్యుండగు బ్రాహ్మణునకు వన్నమిడినయెడల యొక్కొక్క మెతుకు కోటిబ్రాహ్మణులకు భోజనముపెట్టిన ఫలము నిచ్చును.

శ్లో॥ యో దద్యా త్తిలపాత్రం తు ద్వాదశ్యాం మధుసంయుతం ॥
నిర్ధూతాఖిలబంధ స్తు విష్ణులోకే మహీయతే ॥ ౫

తా. ద్వాదశీదినమందు యెవడు తిలలు మధువుగలపాత్రము నిచ్చుచున్నాడో వాడు సంసారబంధములనన్నియు పోగొట్టుకొని వైకుంఠమునందు నివసించుచున్నాడు.

శ్లో॥ ఏకాదశ్యాం సితే పక్షే కుర్యా జ్జాగరణం హరేః ।
న జీవ న్నేవ ముక్త స్స్యా త్తుష్టా స్స్యు స్సర్వదేవతాః ॥ ౬

తా. వైశాఖశుద్ధ ఏకాదశీదినంబున రాత్రియంతయు హరినామ కీర్తనముచే జాగరణము జేసినయెడల అట్టి పురుషుడు జీవించియుండగానే ముక్తిజెందినవాడగును. మరియు దేవతలందరును సంతోషింతురు.

శ్లో॥ కోటీందుసూర్యగ్రహణే తీర్థా న్యుత్లావ్య యత్ఫలం।
తత్ఫలం సమవాప్నోతి ప్రాత స్స్నాత్వా హరే ర్దినే॥ ౭

తా. కోటిచంద్రగ్రహణములయందును సూర్యగ్రహణములయందును సమస్తతీర్థములలో స్నానముజేసిన యేమిఫలము సంభవించునో అట్టిఫలమును విష్ణుదినమునందు ప్రాతఃకాలంబున స్నానముజేసినవారు పొందగలరు.

శ్లో॥ తులస్యాః కోమలైః పత్రై ర్ద్వాదశ్యాం విష్ణు మర్చయేత్।
సమస్తకుల ముద్ధృత్య విష్ణులోకాధిపో భవేత్॥ ౮

తా. ద్వాదశీదినమందు మృదువగు తులసీదళములచే విష్ణుమూర్తిని పూజించినవారు యేడుతరములవరను తనవంశమును తరియింపజేసి యనంతరము విష్ణులోకమును పొందగలరు.

శ్లో॥ యమం పితౄ న్గురూ న్దేవా న్విష్ణు ముద్దిశ్య మానవాః।
మాధవే శుక్లద్వాదశ్యాం సోదకుంభం సదక్షిణం॥
దధ్యన్నం చైవ యో దద్యా త్తస్య పుణ్యఫలం శృణు।
ప్రయాగే ప్రత్యహం చైవ కుర్యా ద్యః కోటిభోజనం॥
యావ త్సంవత్సరం పుణ్యం షడ్రసాన్నై ర్మనోరమైః।
తత్ఫలం సమవాప్నోతి మధుశాసనశాసనాత్॥ ౧౧

తా. వైశాఖశుద్ధ ద్వాదశీదినమందు యమునిగురించియు పితృదేవతలగురించియు గురువులగురించియు దేవతలగురించియు విష్ణునిగురించియు దక్షిణాసహితమగు జలకలశమును, పెరుగుతోగూడినయన్నము నిచ్చినవారికేమిఫలము కలుగుననగా, ప్రయాగక్షేత్రమునందు నిత్యము కోటిమనుష్యులకు షడ్రసోపేతముగా రుచిగల పదార్థములతో సంవత్సరపర్యంతము భోజనము పెట్టినవాడు యేమిపుణ్యమును పొందునో అట్టి పుణ్యమును పొందును.

శ్లో॥ సాలగ్రామశిలాదానం యః కుర్యా ద్ద్వాదశీదినే।
వైశాఖే శుక్లపక్షే తు సర్వపాపైః ప్రముచ్యతే॥ ౧౨

తా. వైశాఖమాసములో శుద్ధ ద్వాదశీదినమందు సాలగ్రామదానమును జేసిన వానియొక్క సమస్తపాపములు నశించిపోవుచున్నవి.

శ్లో॥ ద్వాదశ్యాం పయసా య స్తు స్నాపయే న్మధుసూదనం।
రాజసూయాశ్వమేధాభ్యాం యత్ఫలం పరిజాయతే।
తత్ఫలం సమవాప్నోతి గంగాయాం నాత్ర సంశయః॥ ౧౩

తా. వైశాఖశుద్ధ ద్వాదశీదినంబున విష్ణుమూర్తికి పాలచే స్నానమును జేయించినవాడు గంగాతీరమందు రాజసూయము అశ్వమేధములను జేసిన యేమిఫలముగలుగునో ఆ ఫలమును పొందుగలడు.

శ్లో॥ పంచామృతై శ్చ యో విష్ణుం భక్త్యా సంస్నాపయేద్విభుమ్॥ ౧౪
స సర్వకుల ముద్ధృత్య విష్ణులోకే మహీయతే॥

తా. పంచామృతములతో విష్ణుమూర్తిని స్నానమునుజేయించినవాడు తన వంశీకులనందరిని తరింపజేసి వైకుంఠమునందు నివసించుచున్నాడు.

శ్లో॥ యో దద్యా త్పానకం హ్యస్యాం సాయాహ్నే ప్రీతయే హరేః॥ జీర్ణపాపం జహా త్యాశు జీర్ణాం త్వచ మివోరగః॥ ౧౫

తా. ఈ ద్వాదశీ దినమందు సాయంకాలంబున విష్ణుమూర్తికి సంతోషముకొఱకు పానకము నిచ్చినవాడు శిథిలమైయున్న కూసమును సర్పము విడిచినట్లుగానే శిథిలమైన పాపమును విడిచిపెట్టును.

శ్లో॥ సాయాహ్నే చైవ యో దద్యా దుర్వారుకరసాయనం॥ ౧౬
భవే న్ముక్తః కర్మబంధా దుర్వారుకరసాయనాత్॥

తా. సాయంకాలమందు దోసపండ్ల రసము నిచ్చినయెడల ఆ ఫలము వలన సంసారరూపమగు కర్మబంధము వలన విడువబడి ముక్తిని పొందువాడగును.

శ్లో॥ ఇక్షుదండం చూతఫలం దద్యా ద్రాక్షాఫలాని చ॥ ౧౭
న విచ్ఛిత్తి స్సంతతే స్స్యా త్తస్య వై శతపూరుషం॥

తా. చెఱకుగడలను మామిడిపండ్లను ద్రాక్షపండ్లను యిచ్చినవానియొక్క వంశము నూరు తరముల వరకు నశింపకుండ వృద్ధిపొందును.

శ్లో॥ యో దద్యా ద్గంధలేపం తు సాయాహ్నే ద్వాదశీదినే॥ ౧౮
బాహ్యాభ్యంతరై స్సకలై ర్ముచ్యతే నాత్ర సంశయః॥

తా. వైశాఖ శుద్ధ ద్వాదశీ దినమందు సాయంకాలంబున మంచి గంధమును పూసినవాడు బాహ్యములగు సమస్త దోషములనుండి విడిచిపెట్టబడుచున్నాడు.

శ్లో॥ యత్కించిత్కురుతే పుణ్యాం ద్వాదశ్యాం రాజసత్తమ॥ ౧౯
మాధవే తు సితే పక్షే తదక్షయ్యఫలం లభేత్॥

తా. ఓ రాజోత్తమా! వైశాఖమాస శుద్ధ ద్వాదశీ దినంబున నేకొంచమైనను పుణ్యమును జేసిన ఆపుణ్యము యెన్నటికిని నశింపని ఫలము నిచ్చుచున్నది.

శ్లో॥ ప్రఖ్యాతి మస్యాః వక్ష్యామి యేన జాతేతి భూమిప॥ ౨౦
సర్వేషాం సర్వపాపఘ్నీం సర్వమంగళదాయినీం॥

తా. ఓ రాజా! ఈ ద్వాదశీతిథి అందరియొక్కయు సమస్త పాపములను పోగొట్టునదియు సమస్త శుభముల నిచ్చునదియు గావున దీనికి నెవని వలన భూమిలో ప్రసిద్ధి కలిగినదియు జెప్పెదను వినుము.

శ్లో॥ పురా కాశ్మీరదేశే తు ద్విజో దేవప్రితాహ్వయః॥ ౨౧
తస్యాసీన్మాలినీ నామ తనయా చారురూపిణీ।
తాందదౌ సత్యశీలాయ విప్రవర్యాయధీమతే॥ ౨౨

తా. పూర్వకాలంబున కాశ్మీర దేశములో దేవప్రియుడను యొక బ్రాహ్మణుడు కలడు. ఆయనకు మాలిని యను పేరుగల అందమైన యొక కూతురు గలదు, ఆమెను బుద్ధిమంతుండును సత్యశీలుడను యొక బ్రాహ్మణోత్తమున కిచ్చి పెండ్లిజేసెను.

శ్లో॥ తా ముద్వాహ్య యయౌ ధీమాన్ స్వదేశం యవనాహ్వయం
రూపయౌవనసంపన్నా తస్య చైవ ప్రియాభవత్॥ ౨౩

తా. ఆచిన్నదానిని వివాహము జేసికొని సత్యశీలుడు తన దేశమగు యవనదేశమునకు వెళ్లెను. ఆయన భార్యయును సౌందర్యము యౌవనము కలదియై యుండెను.

శ్లో॥ సదా విద్వేషసంయుక్త స్తస్యాం తిష్ఠతి నిష్ఠురః।
నాన్యస్య కస్యచి ద్ద్వేషీ తాం వినా నృపతే పతిః॥ ౨౪

తా. ఓరాజా! ఆబ్రాహ్మణుడు తన భార్యవిషయమై యెల్లప్పుడు విరోధము కలవాడగుచు మిక్కిలి కఠిన స్వభావము కలవాడుగా నుండెను. మరియు నాబ్రాహ్మణుడు తన భార్యతో గాక యితరులగు నెవ్వరితోడను విరోధము కలవాడుకాడు.

శ్లో॥ తస్మిన్ సా క్రోధసంయుక్తా వశీకరణలంపటా।
అపృచ్ఛ త్ప్రమదా రాజన్ యాః స్వకాంతాః పతిభిః పురా॥ ౨౫

తా. ఓరాజా! ఆతని భార్యయును పెనిమిటి తనయందు క్రోధము కలవాడగుటచే పెనిమిటియందు కోపము కలదియై పెనిమిటిని స్వాధీనము జేసికొనదలచి పూర్వము పెనిమిటిచే విడువబడిన స్త్రీలవద్దకు వెళ్లి యుపాయమును వారినడిగెను.

శ్లో॥ తాభి రుక్తా తు సా భూప వశ్యో భర్తా భవిష్యతి।
అస్మాకం ప్రత్యయో జాతో భర్తృత్యాగావమానినాం॥

తా. ఓరాజా! అప్పుడా స్త్రీలు చెప్పిన దేమియనగా మేము చెప్పిన ప్రకారము నీవు జేసితివేని పెనిమిటి నీకు స్వాధీనుడై యుండును మేమును మా పెనిమిట్లచే విడువబడినప్పుడు జేసితిమి. మాకు నమ్మకము కలిగేయున్నది.

శ్లో॥ ప్రయుజ్య భేషజం వశ్యం నీతా హి పతయః పురా।
యోగినీం త్వం తు గచ్ఛాద్య దాస్యతే భేషజం శుభం॥ ౨౭

తా. స్వాధీనమయ్యెడి యౌషధము నుపయోగించగా పూర్వము మా భర్తలు స్వాధీనమయిరి. కాబట్టి యొక సన్యాసినిగలదు ఆమెవద్దకు వెళ్లి యడిగినయెడల పెనిమిటి స్వాధీనమయ్యెడి యౌషధము నీయగలదు.

శ్లో॥ న వికల్ప స్త్వయా కార్యో భవితా దాసవత్పతిః।
యోగినీమందిరం గత్వా తాసాం వాక్యేన భూపతే॥ ౨౮
ప్రసాద మతులం లేభే తస్యా దుశ్చారిణీ సతీ।
శత స్తంభసమాయుక్తాం కుటీం భేజే త్వరాన్వితా॥ ౨౯

తా. మేము జెప్పినరీతిగా నీవుజేసితివేని పెనిమిటి నీకు సేవకుడువలెనే విధేయుడై యుండును. దీనికి సందేహింపవలదు. అని యా స్త్రీలు చెప్పగా ఓరాజా! దుష్టప్రవర్తనగల యా చిన్నదియు వారి మాటలను విని విశేషముగ యుపాయము సంభవించెనని సంతోషించి త్వరగలదియై నూరు స్తంభములుగల యా సన్యాసినిగుడిసెకు వెళ్లెను.

శ్లో॥ సువిస్తృతాం సువర్చస్కాం తత్రైవా యాత మామికాం।
ప్రావృతా దీర్ఘవస్త్రేణ సన్నిధితా చ యోగినీ॥ 30

తా. ఆగుడిసె యేతీరుగా నుండెననగా విశాలమైనదియు మిక్కిలి శోభస్కరముగా నుంచినదియు అందరు వచ్చుచు పోవుచుండెడిదియౌనగు గుడిసెలో కషాయవస్త్రమును జుట్టుకొనియున్న సన్యాసినిని జూచెను.

శ్లో॥ దీర్ఘాభి శ్చ సటాభి స్తు ప్రావృతా దీప్తిసంయుతా।
సదాచారసమోపేతా వీక్షమాణా శనైశ్శనైః॥ 3౧

అక్షసూత్రికరా సా తు జపతీ ప్రార్థితా తయా।
దదౌ వశ్యకరం మంత్రం క్షోభకం ప్రత్యయాత్మకం 3౨

తా. పొడుగుగల జడలతో వ్యాపించియున్నదియు ప్రకాశించుచున్నదియు శుశ్రూషజేయు స్త్రీలతోగూడి యున్నదియు స్ఫుటము గాకుండ మెల్లమెల్లగా జూచుచున్నదియు చేతిలో జపమాల గలదియు నగు యాసన్యాసినిని జూచి యాచిన్నది ప్రార్థింపగా వాగోసాయి స్వాధీనమగునట్టిదియు నమ్మకము కలిగించునదియు నగు మంత్రమును ప్రయోగించెను.

శ్లో॥ తత స్సా ప్రణతా భూత్వా పద్భ్యాం దత్వాం గుళీయకం।
వజ్రమాణిక్యసంయుక్త మతిరక్తప్రభాన్వితం॥ 33
మృదుకాంచనసంయుక్తం భానురశ్మిసమద్యుతి।
తతో దృష్ట్వా తు సంతుష్టా పాదస్థం చాంగుళీయకం॥ 3౪

తా. అనంతరమా చిన్నది యా సన్యాసినికి నమస్కరించి వజ్రములు మాణిక్యములతో గూడినదియు మిక్కిలి యెఱ్ఱని కాంతిగలదియు మెత్తని బంగారముచే జేయబడినదియు సూర్యకాంతి వలెనే ప్రకాశించునదియు నగు యుంగరమును యాసన్యాసినిపాదములయందు సమర్పింపగా అనంతరము ఆ యోగిని తన పాదములయం దుంచబడిన యుంగరమును జూచి సంతోషించెను.

శ్లో॥ హృష్టయా చ తయా జ్ఞాతం తత్పత్యే రవమానజం।
తదోక్తా హి తయా భూప తాపస్యా హితయుక్తయా।

తా. ఇట్లు ఆసన్యాసిని సంతసించి పెనిమిటి యవమానమువలన కలిగినయామె దుఃఖమును గుర్తెరిగి యో రాజా! యామెకు హితవుగా నుండునట్లు యాసన్యాసిని యిట్లు చెప్పుచున్నది.

శ్లో॥ చూర్ణో రక్షాన్వితో హ్యేష స్సర్వభూతవశంకరః।
చూర్ణం భర్తరి సంయుజ్య రక్షాం గ్రీవాశ్రయాం కురు॥

తా. ఓ చిన్నదానా! ఇదిగో సమస్త భూతములు స్వాధీనమయ్యెడిచూర్ణమును యంత్రము నిచ్చుచున్నాను. ఈ చూర్ణమును పెనిమిటిచే తినిపించి యీ యంత్రమును నీ కంఠమునందు ధరియించుకొనుము.

శ్లో॥ భవిష్యతి పతి ర్వశ్యో నాన్యాం యాస్యతి సుందరిం।
నాప్రియం వదతి క్వాపి దుశ్చారిణ్యాస్తవా పి చ 3౭॥

తా. ఈ పరికారము నీవు జేసినయెడల పెనిమిటి నీకు స్వాధీనముయి యుండు
ను మరియొక స్త్రీతో సంభోగింపడు. ఎప్పుడును నీతో నయిష్టముగా మాట్లాడడు.
నీవు దుర్వృత్తిగా సంచరించినను నీయందే ప్రేమకలవాడుగా నుండును

శ్లో॥ చూర్ణం రక్షాం గృహీత్వా సా ప్రాప్తా భర్తృగృహం పునః।
ప్రదోషే పయసా యుక్త శ్చూర్ణో భర్తరి యోజితః॥

తా. ఆచిన్నది యా సన్యాసిని యిచ్చిన చూర్ణమును యంత్రమును తీసికొని
యింటికివెళ్లి సాయంకాలమున చూర్ణమును పాలలో గలిపి పెనిమిటికి త్రాగనిచ్చెను

శ్లో॥ గ్రీవాయాం హి కృతా రక్షా న విచారః కృత స్తయా।
తదా స పీతచూర్ణ స్తు భర్తా నృపవరోత్తమ॥ ౩౯

తా. ఓ రాజశ్రేష్ఠుతా! ఆ రక్షాయంత్రమును కంఠమునందు ధరియించెను.
ఇది కూడని పనియని యెంతమాత్రమును సందేహింపలేదు. పెనిమిటియు నామెచే
నివ్వబడిన చూర్ణసహితమగు పాలను త్రాగెను.

శ్లో॥ తచ్చూర్ణాత్ క్షయరోగో భూ త్పతిః క్షీణో దినేదినే।
గుహ్యే తు కృమయో జాతా ఘోరా దుష్టవ్రణోద్భవాః॥

తా. ఆచూర్ణమును తినుటచే పెనిమిటి క్షయరోగము కలవాడగుచు ప్రతిదిన
ము క్షీణించుచుండెను. మరియు నాసనస్థానమందు వ్రణములు కలిగి ఘోరములగు
పురుగులు కూడ కలిగెను.

శ్లో॥ దినైః కతిపయై రాజ న్పత్యు ర్నైవ వ్యవస్థితిః।
ఉవాస స్వేచ్ఛయా సా పి పుంశ్చలీ దుష్టచారిణీ॥ ౪౦

తా. ఓరాజా! కొన్ని దినములు గడువగా పెనిమిటికి దేహములో స్వస్థత లేక
పోయెను. ఆచిన్నది దుష్టప్రవర్తన కలిగి జారవృత్తితో స్వేచ్ఛగా సంచరించు
చుండెను.

శ్లో॥ హతతేజా స్తతో భర్తా తా మువాచాకులేంద్రియః।
క్రిందమానో దివారాత్రిం దాసోస్మి తవ శోభనే॥ ౪౧
త్రాహి మాం శరణం ప్రాప్తం న కామే న్యాంపరస్త్రియం।

తా. అనంతరము ఆమె పెనిమిటియు శక్తి తగ్గిపోయియింద్రియములు చలించు
చుండ రాత్రింబవలు నేడ్చుచు ఓచిన్నదానా! నీకు దాసుడనైతిని నన్ను రక్షింపు
ము. పరస్త్రీని నేకోరను. అని భార్యతో పలికెను.

శ్లో॥ తత్తస్య విదితం జ్ఞాత్వా భీతా సా మేదినీపతే॥ ౪౩
అలంకారకృతే పత్యు ర్జీవనేచ్ఛు ర్న వై హితా।
యోగినీం చ యయౌ హా శీఘ్రం తస్యై సర్వం న్యవేదయత్॥ ౪౪

తా. ఓ రాజా! ఇట్లు పెనిమిటి పలుకగా విధేయుడాయెనని పెనిమిటియొక్క యుద్దేశ్యమును తెలిసికొని పెనిమిటియందు నిష్టము లేనిదైనను మృతినొందినయెడల తాను అలంకార హీనురాలు నగుదుననెడి భయముతో తిరిగి శీఘ్రముగా ఆసన్న్యాసినియొద్దకు వెళ్లి యిక్కడ జరిగిన వృత్తాంతమునంతయు నామెతో జెప్పెను.

శ్లో॥ తయా చ భేషజం దత్తం ద్వితీయం బాహాశాంతయే।
దత్తే చ భేషజే తస్మిన్ స్వస్థో భూ త్తత్ క్షణా త్పతిః॥ ౪౫

తా. అప్పుడా సన్యాసిని ఆ రోగము తగ్గుటకొఱకు రెండవయౌషధము నియ్యగా దానిని తీసికొని యింటికివెళ్లి పెనిమిటికియ్యగా నాతడు భక్షించి ఆ క్షణముననే దేహము స్వస్థత గలవాడయ్యెను.

శ్లో॥ తిష్ఠ త్యుపపతి ర్గేహే గృహకృత్యాపదేశతః।
సర్వవర్ణసముద్భూతా జారా స్తిష్ఠంతి వైగృహే॥ ౪౬

తా. అనంతరము ఒక జారపురుషుడు ఆగృహములో నేదోయొక పనిని జేయుచుండు మిషనుపొంది ఆగృహమునందే యుండును. మరియు నెల్లప్పుడు అన్నివర్ణములవారు నామెకు విటగాండ్రుగానుండి గృహమునకు వచ్చుచు వెళ్లుచుండెడివారు.

శ్లో॥ న కించి ద్వచనే శక్తిర్భర్తు ర్జాతా కథంచన।
తత స్తేనైవ దోషేణ సర్వాంగేషు చ జజ్ఞిరే॥ ౪౭
కృమయో శ్చాస్థిభేత్తారః కాలాంతకయమోపమాః॥

తా. ఇట్లు ఆమెజారవృత్తి నవలంబించి పెనిమిటిజూచుచుండినను స్వేచ్ఛగాసంచరించినప్పటికిని యామె యుపయోగించిన చూర్ణమహిమచే అతి కష్టముగా నైనను కొంచెముగా నైన మాటలన జాలడాయెను. ఇట్లు బహు జనులతో సంభోగించుటచే అన్ని యవయవములయందు రోగములుపుట్టి కాలయముడు వలెనే బాధించుచున్నయు నెముకలనుకూడ భక్షించునట్టి పురుగులు పుట్టెను.

శ్లో॥ నేత్రయో ర్జిహ్వయో శ్చాపీ చ్ఛేదః కర్ణద్వయస్య చ॥ ౪౮
స్తనయో శ్చాంగుళీనాం చ పంగుత్వం చాపి చాగతం।
తేన పంచత్వ మాపన్నా గతా నరకయాతనాం॥

తా. ఆపురుగులవలన ముక్కు నాలుక నశింపజేయబడెను. రెండు చెవులు తినబడెను. స్తనములు వేళ్లు కూడ తినబడెను. ఇట్టి యవస్థనొంది తుదకు మృతినొందివరక యాతనలననుభవించెను.

శ్లో॥ తామ్రిభాండే చ సా దగ్ధా యుతాని శతపంచచ।
శ్వానయోనిషు సంజాతా శతవారం పునఃపునః॥ ౫౦

తా. ఆమెను రాగిపాత్రిలో నుంచి యమభటులు అనేకవేల సంవత్సరములు తపింపజేసిరి. పిమ్మట అనేక పర్యాయములు మాటిమాటికి కుక్కజన్మ మెత్తుచుండెను

శ్లో॥ ఛిన్ననాసా ఛిన్నకర్ణా కృమిమూర్ధా నిరంతరం।
ఛిన్నపుచ్ఛా భగ్నపాదా తాడితా చ గృహేగృహే॥ ౫౧
పశ్చాత్సౌవీరదేశేషు పద్మబంధో ర్ద్విజస్య చ।
దాస్యా గృహే శునీ జాతా బహుదుఃఖసమాకులా॥ ౫౨

తా. ఆ కుక్కజన్మములో చెవులు తెగిపోవుటయు ముక్కయూడిపోవుటయు శిరస్సునందు నెల్లపుడు పురుగులు పట్టుటయు తోక యూడిపోవుటయు కాళ్ళు విరిగిపోవుటయు గలిగి ప్రతిగృహమునందు ప్రవేశించుచు వారిచే కొట్టబడుచు నిట్లు కొంతకాలము గడువగా పిమ్మట సౌవీర దేశములో పద్మబంధువనెడు బ్రాహ్మణునకునొక దాసిగలదు. ఆదాసీ గృహమునందు ఆడకుక్కగాబుట్టి విశేషదుఃఖ మనుభవించుచుండెను.

శ్లో॥ ఛిన్నకర్ణా ఛిన్ననాసా ఛిన్నపుచ్ఛాంఘ్రి రాతురా
కృమిపూర్ణశిరా నిత్యం కృమియోని శ్చ తిష్ఠతి॥ ౫౩

తా. ఆ జన్మంబున వూడిపోయిన చెవులు ముక్కు తోక పాదములు గలదియై యెల్లప్పుడు శిరస్సునందును యోనియందు పురుగులు నిండియుండుటచే బాధపడుచుండెను.

శ్లో॥ ఏవం త్రింశ ద్గతా వర్షా అస్మిన్ జన్మని భూమిప
దైవా త్కర్మవిపాకేన వైశాఖే మేషగే రవౌ॥ ౫౪
శుక్లపక్షే తు ద్వాదశ్యాం పద్మబంధో స్తనూద్భవః।
నద్యాం స్నాత్వా శుచి ర్భూత్వా సార్ద్రవస్త్రో గృహం యయౌ॥

తా. ఇట్లు ఆకుక్క జన్మంబున ముప్పది సంవత్సరములు గడచినపిమ్మటఆకుక్కయొక్క పుణ్యావశముచే సూర్యుడు మేషరాశియందుండగా వైశాఖ శుద్ధద్వాదశి దినం

బున పద్మబంధుని కుమారుడు నదికి వెళ్ళి స్నానము జేసి శుచిగా ఆ తడివస్త్రముల తోనే యింటికి వచ్చెను.

శ్లో॥ తులసీవేదికాం ప్రాప్య పాదావవనిజేన హ ।
వేదికాయా మధో దేశే సా శునీ స్వాప మాగతా॥ ౧౯
ప్రాక్సూర్యోదయవేళాయాః పాదోదకపరిప్లుతా ।
సద్యో ధ్వస్తాశుభా జాతా జాతిస్మృతి రభూ త్క్షణాత్॥ ౧౭

తా. ఇట్లు యింటికివచ్చి తులసియరుగువద్దకు వెళ్ళి పాదప్రక్షాళనము జేసికొనియెను. అంతకు పూర్వము సూర్యోదయముకాక ముందు ఆబ్రాహ్మణునియింట ప్రాచిజేయు ఆదాసీ వచ్చుచుండగా దానితోకూడ వచ్చి ఆతులసి యరుగుక్రిందఆకుక్క పడుకొనెను. అప్పుడు ఈ బ్రాహ్మణుడు పాదములను కడిగికొనిన జలము ప్రవహించగా నాకుక్కయును తడిసెను. అందువలన ఆకుక్కయొక్క పూర్వమందు జేయబడిన సమస్తదోషములు శీఘ్రముగానే నశించి పూర్వజన్మ జ్ఞానము కలిగెను.

శ్లో॥ స్మృత్వా కర్మ కృతం పూర్వం సా శునీ తాపసంపదా।
చుక్రోశ కరుణా దీనా మునే గ్రాహీ తి వై పునః॥ ౧౮

తా. అప్పుడాకుక్క పూర్వమందు జేయబడిన పాపములను దెలిసికొనినదగుటచే మిక్కిలి విచారపడి దిక్కులేనిదియై యోమునీశ్వరా ! నన్ను రక్షింపుమనుచు దయ కలుగునట్లుగా రోదనము జేసెను.

శ్లో॥ స్వకర్మ చ మునీంద్రాయ స్మృత్వా చఖ్యౌ భయాకులా।
భర్తు ర్విప్రయోగం తు స్వస్య దుశ్చరిత ంతథా॥ ౧౯
యా న్యాపి యువతీ బ్రహ్మ స్భర్తు ర్వశ్యం సమాచరేత్
వృథా ధర్మా దురాచారా పచ్యతే తామ్రభాజనే॥ ౨౦

తా. అనంతరము తనపూర్వజన్మ వృత్తము స్మృతికి దెచ్చుకొని భయముకలదియగుచు తాను పెనిమిటికి విషముపెట్టుటయు తన దుష్టప్రవర్తనయు మొదలగు తన కర్మల నన్నియు చెప్పి మరియు నిట్లు చెప్పుచున్నది. ఓబ్రాహ్మణుడా! ఇతరముగుస్త్రీయైనను పెనిమిటిని స్వాధీనముజేసికొనుటకు నిటువంటి యుపాయములను ప్రయోగించినయెడల అట్టివారు వ్యర్థములగు ధర్మములుకలవారలై దురాచారములుకలవారలగుచు నరకములో రాగిపాత్రయందు వండబడుదురు.

శ్లో॥ భర్తా నాథో గురు ర్భర్తా భర్తాదైవత ముత్తమం।
విప్రియాం కృత్య సాధ్వీ సా కథం సుఖ మవాప్నుయాత్॥ ౬౧

తా. కాబట్టి పెనిమిటియే స్త్రీలకు యధిపతి పెనిమిటియే గురువు. పెనిమిటియే యుత్తమమగు దేవత, గావున యిటువంటి పూజనీయుండగు పెనిమిటికి. నపకారజేసిన స్త్రీసుఖమును పొందనేరదు.

శ్లో॥ తిర్యగ్యోనిశతం యాతి కృమికోటిశతాని చ।
తస్మా ద్భూసుర కర్తవ్యం స్త్రీభిర్భర్తుర్వచస్సదా॥ ౬౨

తా. మృతినొందిన పిమ్మట అనేక పర్యాయములు మృగజన్మము నెత్తుచు పురుగులుతో గూడుకొనినదగుచు నుండును. కాబట్టి యోబ్రాహ్మణుడా స్త్రీలు పెనిమిటి యాజ్ఞాప్రకారము ముఖ్యముగా నడచుకొనవలయును,

శ్లో॥ సా హం పశ్యే పున ర్యోనిం కుత్సితాం యాతనాన్వితాం।
యది నోద్ధరసే బ్రహ్మ న్నద్య త్వద్దృష్టిసంముఖాం॥ ౬౩

తా. ఓబ్రాహ్మణుడా! నేను పూర్వజన్మమందు అటువంటి దుష్ప్రవర్తనగల దానిని కాబట్టి నీసన్నిధానమందున్న యిట్టి నన్ను అనుగ్రహించి తరింపజేయకుంటివేని తిరిగి నిందితమైన నరకయాతనను పొందగలవు

శ్లో॥ తస్మా దుద్ధర మాం బ్రహ్మన్ దుష్కృతాం పాపచారిణీం।
సుకృతస్య ప్రదానేన వైశాఖే శుక్లపక్షకే॥ ౬౪
యా కృతా తు త్వయా బ్రహ్మన్ ద్వాదశీ పుణ్యవర్ధనీ।
తస్యాం త్వయా కృతం పుణ్యాం స్నానదానాన్నభోజనైః॥
దుశ్చారిణ్యా అపి బ్రహ్మన్ తేన ముక్తి ర్భవిష్యతి॥

తా. కాబట్టి యోబ్రాహ్మణుడా! వైశాఖమాస శుక్లపక్షములో నీవు జేసిన పుణ్యమును నాకు నొసంగి పాపప్రవర్తన గలిగినట్టియు దురాత్మురాలనగు నన్ను తరింపజేయుము. మరియు పుణ్యమును వృద్ధిపొందించునట్టి వైశాఖశుద్ధద్వాదశి దినంబున స్నానముజేయుట దానమిచ్చుట భోజనముపెట్టుట మొదలగు సత్కార్యములచే నేమి పుణ్యమును సంపాదించితివో అపుణ్యమును నాకు నొసంగితివేని యాపాపములవలన విడువబడి ముక్తినిపొందగలను.

శ్లో॥ యస్యాం తు భూసుర స్నాతో స్వగృహే మనుజః కిల।
సర్వతీర్థఫలావాప్తిం లభతే నా త్ర సంశయః॥

తా. ఓబ్రాహ్మణుడా ! మనుష్యుడు వైశాఖశుద్ధ ద్వాదశీదినంబున ప్రాతఃకాలమందు తనగృహమునందు స్నానము జేసినను సహస్ర క్షేత్రములను సేవించిన ఫలమును పొందుచున్నాడు. ఇందువిషయమై సందేహములేదు.

శ్లో॥ తప్తం దత్తం హుతం యత్రి కృతం దేవార్చనాది యత్॥ ౬౭
త దక్షయ్యఫలం జ్ఞేయం య త్కృతం ద్వాదశీదినే।
ఏవం విధిఫలం య త్స్యా త్త ద్దేహి సకలం మమ॥

తా. వైశాఖశుద్ధద్వాదశియందు తపస్సుజేయుట హోమముజేయుట దానమిచ్చుట దేవతలను పూజించుట మొదలగు సత్కార్యములను జేయుటవలన ఫలము నాశనములేక స్థిరముగానుండును గాన యట్టి విధిప్రకారము జేసిన యావత్తుఫలము నాకు నొసంగుము,

శ్లో॥ ద్వాదశ్యా ముపవాసేన త్రయోదశ్యాం తు పారణాత్।
య త్ఫలం స్యా త్త దప్యద్ధా తేన ముక్తి ర్భవిష్యతి॥ ౬౯

తా. ద్వాదశీదినంబున యుపవాసముండి త్రయోదశియందు పారణను జేయుటవలన గలిగిల ఫలము విశేషమైనదగుచు ముక్తినికలిగించు చున్నది.

శ్లో॥ దయాంకురు మహాభాగ దీనాయాం దీనవత్సల।
దీననాథో జగన్నాథో యుష్మన్నాథో జనార్దనః॥ ౭౦

తా. మహానుభావుడవును అనాథలయందు ప్రేమకలవాడవునగునో బ్రాహ్మణుడా ! దిక్కులేని నాయందు దయనుంచుము. దీనులనురక్షించువాడును ప్రపంచమునకు నధిపతియునగు విష్ణుమూర్తి మీకు ప్రభువుగానుండి మీకుప్రసన్నుడైయుండెను.

శ్లో॥ తదీయా స్తాదృశా ఏవ యథా రాజా తథా ప్రజాః।
వైవస్వతపదధ్వంసి న్పరితాహి సుదుఃఖితాం॥ ౭౧

తా. రాజాయెటువంటివాడుగా నుండునో ప్రజలును ఆవిధముగానే యుండు నన్నట్లు భగవద్భక్తులగు మీవంటివారును భగవంతునితో సమానులుగా నుందురు. పాపమునుపోగొట్టి యమలోకమును పొందింపజేయకుండునట్టి శక్తిగలవాడా ! నేను దుఃఖించుచుంటిని గాన నన్ను రక్షింపుము.

శ్లో॥ త్వద్ద్వారవాసినీం దీనాం శునీం మాం దీనవత్సల॥

తా. దీనులయందు ప్రేమగలవాడా ! శునకజన్మమెత్తినట్టియు నీద్వారమునందు కావలికాసి యున్నట్టి యుదీనురాలనగు నన్ను రక్షింపుము.

శ్లో॥ బ్రహ్మహత్యా సహస్రం వా గోహత్యానాం సహస్రకం॥ ౭౨
అగమ్యానాం చ కోటిశ్చ దహ త్యేషా శుభా తిథిః॥

తా. శుభప్రదమగు వైశాఖశుద్ధద్వాదశీతిథి। వెయ్యిగోహత్యల వలన గలిగిన పాపమును వెయ్యిబ్రహ్మహత్యల వలన గలిగిన పాపమును చేయతగని పనులు కోటి చేసినందువలన గలిగిన పాపమును పోగొట్టుచున్నది.

శ్లో॥ తస్యాం కృతం మహాపుణ్యం మహ్యం దత్వా మహామునే॥ ౭౩
మా ముద్ధర సముద్విగ్నాం దీనాం నాథ సముద్ధర॥
అంతే తుభ్యం ద్విజేంద్రాయ నమ ఉక్తిం వదా మ్యహం॥ ౭౪

తా. ఓప్రభువా! అట్టి ద్వాదశీతిథియందు జేయబడిన విశేషపుణ్యమును నాకు నిచ్చి ఆపత్సముద్రములో మునిగియున్న నన్ను రక్షింపుము. బ్రాహ్మణోత్తముడవగు నీకొఱకు ఇదిగో చివరకు నమస్కారమును జేయుచున్నాను. అని పలికి నమస్కారమును జేసెను.

శ్లో॥ ఇతి తస్యా వచ శ్శ్రుత్వా శునీ మాహ మునే స్సుతః।
స్వకృతం జంతవో శ్నంతి సుఖదుఃఖాత్మకం శుని॥ ౭౫

తా. ఈప్రకారము చెప్పిన ఆకుక్కయొక్క వాక్యములను ఆమునీశ్వరుని కుమారుడు విని యాకుక్కతో నిట్లు చెప్పుచున్నాడు. ఓశునకమా! ప్రతిజంతువయును తమ పూర్వజన్మమందు జేయబడిన సుకృత దుష్కృతములచే సుఖదుఃఖముల ననుభవించును.

శ్లో॥ తస్మా త్కిము త్వయా కార్యం క్షుద్రయా పాపశీలయా।
యయా భర్తా వశం నీతో రక్షాచూర్ణాదిభి ర్ద్విజః॥ ౭౬

తా. ఆకారణమువలన పాప స్వభావము గలదానవు నీచురాలవగు నీతో నేమి ప్రయోజనమున్నది. మరియు యంత్రము ఔషధములచే బ్రాహ్మణుడగు నీపెనిమిటిని స్వాధీనము జేసికొనినట్టి దుర్మార్గురాలవు.

శ్లో॥ సాధుభ్యో యత్కృతం పాపం తస్య దుఃఖకరం భవేత్।
సాధుభ్యో యత్కృతం పుణ్యం స్వస్య దుఃఖహారం భవేత్॥ ౭౭

తా. సత్పురుషులకు పాపకృత్యములను జేసినయెడల తనకు దుఃఖకరమైనది యు సత్పురుషులకు పుణ్యకార్యములను జేసినయెడల తనయొక్క దుఃఖమును పోగొట్టునది

శ్లో॥ ఉభయభ్రంశతా మేతి పాపేభ్యో యత్కృతం భవేత్।
శర్కరామిశ్రితం క్షీరం కాద్రవేయనివేదితం॥ ౭౮
విషవృద్ధికరం దృష్టం మేవం పాపకరం భవేత్॥

తా. పాపాత్ములకు నుపకారము చేసినందువలన నిహలోకపరలోక సుఖములు రెండును నశించును. మరియు పంచదార కలిపి పాలను సర్పమునకు ద్రాగనిచ్చిన విషమే వృద్ధియగునట్లుగా పాపము నే చేయును.

శ్లో॥ వద త్యేవం మునిసుతే శునీ దుఃఖైకరూపిణీ॥ ౭౯
పున శ్చోర్ధ్వముఖీ తత్ర తేత్రి బహుభాషిణీ।
పద్మబంధో పరిత్రాహి శునీం త్వద్ద్వారవాసినీం॥ ౮౦
త్వదుచ్ఛిష్టాశనీం నిత్యం త్వం పాహీ తి పునఃపునః॥

తా. ఈప్రకారము ఆమునికుమారుడు దయారహితుడై పలుకగా ఆకునకము మిక్కిలి దుఃఖముకలదియగుచు ఊర్ధ్వముగా ముఖముపెట్టి యరచుచు ఆమునీశ్వరుని తండ్రినిగురించి మొరబెట్టి నిట్లు యేడ్చుచు పలుకుచున్నది. ఓపద్మబంధువా! నీగృహద్వారమునందు నిత్యము కాచియుండి యెల్లప్పుడు మీయుచ్ఛిష్టము నే తిని బ్రతుకుచున్నట్టి శునకమునగు నన్ను రక్షింపుము.

శ్లో॥ స్వపోష్యా యే హి వర్తంతే గృహస్థస్య మహాత్మనః॥ ౮౧
తేషా ముద్ధరణాం కార్య మితి వేదవిదాం మతం॥

తా. మహానుభావులగు గృహస్థులకు తమ సంరక్షణములో నున్నట్టివారిని తరింపజేయవలసినని వేదవేత్తలగు మహానుభావుల యభిప్రాయమైయున్నది.

శ్లో॥ చాండాలా వాయసా శ్చైవ సారమేయా శ్చ నిత్యశః ౮౨
గృహస్థానాం దయాపాత్రం ప్రత్యహం బలిభోజినః॥

తా. కాకులు కుక్కలు అపరిశుద్ధ జంతువులైనను వానికి గృహస్థుడు నిత్యము బలులనిచ్చి భుజింపజేసి దయతో జూడవలయును.

శ్లో॥ అశక్తం నోద్ధరే త్పోష్యం రోగాద్యుపహతం యది ౮౩
సోధః పతే న్న సందేహ ఇతి వేదవిదాం మతం॥

తా. రోగము మొదలగువానిచే నశక్తుడుగా నుండునట్టివానిని రక్షింపనివాడు నరకమును పొందును. సందేహములేదు. ఈరీతి పెద్దల యభిప్రాయమైయున్నది.

శ్లో॥ కర్తార మేకం జగతాం హి కర్తా కృత్వాత్మనా పాతి సమస్త జంతూన్॥ ౨౪॥ దారాదిరూపవ్యపదేశతో హరి స్తస్మా త్తదాజ్ఞా ఖలు పోష్యరక్షా॥

తా. ప్రపంచ సృష్టికర్తయగు విష్ణుమూర్తి భార్యాపుత్రాదులనెడు వ్యవహారమును గల్పించి వారిని పోషించుటకు నొక యజమానుని కల్పించి తానే సమస్త జంతువులను రక్షించుచుండును. కాబట్టి ఆయజమానుని యాజ్ఞకు పోషింపబడువారు ముఖ్యముగా ననుకూలురై యుండవలయును.

శ్లో॥ తాం పోష్య రక్షాం పరిహృత్య జంతు ర్దైవేన క్లుప్తా యది ప్రవర్తతే న్యధీః॥ ౨౫॥ స ద్వైవ ద్రోగ్ధా సకలస్య హంతా కీనాశలోకం నితరాం ప్రయాతి॥

తా. ఆయజమానుని సంరక్షణము విడిచి యేజంతువులైనను దైవవశమున బుద్ధి చెడిపోయి మరియొక విధముగా సంచరించినయెడల అట్టి జంతువు దైవమునకు ద్వేషియై సమస్త సుకృతమును నశింపజేసికొని యమలోకమును ముఖ్యముగా పొందును.

శ్లో॥ కర్తవ్యత్వా ద్దయాళుత్వా ద్దీనా ముద్ధర నిర్దయ॥ ౨౬
ఇతి తస్యా వచ శ్శ్రుత్వా దుఃఖార్తాయా గృహే సుతః।
నిశ్చక్రామ గృహా త్తూర్ణం పద్మబంధు ర్దయానిధిః॥ ౨౭

తా. దయలేని యోబ్రాహ్మణుడా! నీవు చేయతగినవాడ వౌటవలనను నేను దయజూడతగినదాని నగుటవలనను నిన్ను వేడితిని కాబట్టి నన్ను తరింపజేయుము. ఇట్లు దుఃఖము కలిగి పలికిన యాశునకముయొక్క వాక్యములను పద్మబంధువు గృహములో నుండి విని దయగలవాడై గృహమునుండి శీఘ్రముగా బయలువెడలి కుమారుడుండు ప్రదేశమునకు వచ్చెను.

శ్లో॥ కి మేత దితి తాం ప్రాహ పుత్ర స్సర్వం న్యవేదయత్।
స తు పుత్రవచ శ్శ్రుత్వా త మేవం ప్రాహ విస్మితః ౨౮

తా. అప్పుడా శునకమును «యీవృత్తాంతమేమి'' యని పద్మబంధువు యడుగగా ఆయన కుమారుడా వృత్తాంతము నంతయును జెప్పెను. ఆపద్మబంధువు కుమారుడు చెప్పిన యాశపయముయు విని యాశ్చర్యము కలవాడై కుమారునితో నిట్లు పలికె

చున్నాడు.

పద్మబంధురువాచ॥

శ్లో॥ మమాత్మజ కథం వాక్య మీదృశం వ్యాహృతం త్వయా।
న సాధూనా మిదం వాక్యం భవతీహ వరానన॥ ౨౯

తా. పద్మబంధువు చెప్పుచున్నాడు. శ్రేష్ఠమగు ముఖముగలవాడా! నా యొక్క కుమారుడవై యుండియు నీవీరీతి మాటలను పలుకదగునా? ఇటువంటి సమయములో సత్పురుషులగు వారలకు నిది తగినదికాదు.

శ్లో॥ ఆత్మసౌఖ్యకరాః పాపా భవంతిపరిభావితాః।
పశ్య పుత్రి జనా స్సర్వే పరోపకరణాయ వై॥ ౩౦

తా. పాపాత్ములు తమ సౌఖ్యమును విచారించుకొని సుకృతమును పొందకుందురు. ఓకుమారుడా! సన్మార్గులకు యితరులందరును పరోపకారమునే జేయుచుందురు. నీవు చూచితివా?

శ్లో॥ శశీ సూర్యో౽థ పవనో మేదినీ హుతభు గ్జలం
చందనం పాదపా స్సంతః పరోపకరణే స్థితాః॥ ౩౧

తా. చంద్రుడు సూర్యుడు వాయువు భూమి అగ్నిహోత్రము జలము మంచిగంధము వృక్షములు సత్పురుషులు యెల్లప్పుడు పరోపకారమును జేయుటయందుండినవి.

శ్లో॥ అస్థిదానం కృతం పుత్రి కృపయా హి దధీచినా।
దేవానా ముపకారాయ జ్ఞాత్వా దైత్యా న్మహాబలాన్॥ ౩౨

తా. రాక్షసులు మహాబలముకలిగి దేవతలను బాధించుచుండగా నప్పుడు దేవతల యుపకారము నిమిత్తము తన శరీరమందుండు యెముకను దధీచిమహాముని దేవతలకు దయగలవాడై యిచ్చెను.

శ్లో॥ కపోతార్థే స్వమాంసాని శిబినా భూభుజా పురా।
ప్రదత్తాని మహాభాగ శ్యేనాయ క్షుధితాయ వై॥ ౩౩

తా. ఓ భాగ్యవంతుడా! పూర్వకాలమందు శిబిచక్రవర్తి గువ్వపిట్టను సంరక్షించుకొఱకు ఆకలితో గూడియున్న డేగకు తన శరీరమాంసమును ఖండించి యిచ్చి గువ్వపిట్టను కాపాడెను.

శ్లో॥ జీమూతవాహనో రాజా పురా సీ త్క్షితిమండలే।
తేనాపి జీవితం దత్తం గరుడాయ మహాత్మనే॥ ౩౪

తా. పూర్వమందు భూమండలములో జీమూతవాహనుడను రాజుగలడు. ఆ రాజు మహానుభావుడగు గరుత్మంతునకు తన ప్రాణమును సమర్పించెను.

శ్లో॥ తస్మా ద్దయాళునా భావ్యం భూసురేణ విపశ్చితా।
శుద్ధే వర్షతి దేవ స్తు కిమశుద్ధేన వర్షతి॥ ౯౫

తా. కాబట్టి విద్వాంసుండగు బ్రాహ్మణుడు దయాస్వభావము గలిగియే యుండవలయును. మనస్సునందు పరిశుద్ధి గలిగినయెడల భగవంతుడు అనుగ్రహించుచున్నాడు. మనశ్శుద్ధి లేనివానిని భగవంతు డనుగ్రహించఁబోడు.

శ్లో॥ కి న్న దీపయతే చంద్ర శ్చండాలానాం గృహే సదా।
తస్మా దహం శునీ మేతాం యాచంతీం చ పునః పునః॥ ౯౬
ఉద్ధరిష్యే నిజైః పుణ్యైః పంకమగ్నాం చ గాం యథా।
ఇతి పుత్రం నిరాకృత్య ప్రతిజజ్ఞే మహామతిః॥ ౯౭

తా. చండాలురు పరిశుద్ధిలేనివారైనను వారి గృహములయందు చంద్రుడు ఎల్లప్పుడు ప్రకాశించుట లేదాయేమి? కాబట్టి మాటిమాటికి యాచింపుచున్న యీశునకమునకు నేజేసిన పుణ్యముల నిచ్చి బురదలో దిగబడిన ఆవునువలెనే రక్షించెదను. అని విశేషబుద్ధిశాలియగు ఆపద్మబంధువు కుమారుని తిరస్కరించి ప్రతిజ్ఞజేసి పలికెను.

శ్లో॥ తదా దత్త్వం మహాపుణ్యం ద్వాదశీదినసంభవం।
శుని! గచ్ఛ హరే ర్ధామ నిర్ధూతాఖిలకల్మషా॥ ౯౮

తా. అప్పుడా పద్మబంధువు ద్వాదశీదినంబున జేసిన సత్కార్యములవలన గలిగిన విశేషపుణ్యమును దానికిచ్చి యోశునకమా! నీపాపములనన్నియు పోగొట్టుకొని విష్ణులోకమునకు వెళ్ళుమని పలికెను.

శ్లో॥ తద్వాక్యా త్సహసా భూప దివ్యాభరణభూషితా।
విముచ్య జీర్ణం దేహం తు దివ్యరూపధరా శుభా॥ ౯౯
శతాదిత్యప్రభా జాతా సావిత్రీ ప్రతిమా యథా॥
జగామ మున్తాత్ర్ త్వం విప్రం ద్యోతయంతీ దిశో దశ॥ ౧౦౦

ఓ రాజా! ఆబ్రాహ్మణుడు ఇట్లు పలికినవెంటనే యాశునకము తన ప్రాతశరీరమును విడిచి శ్రేష్ఠమగు దివ్యరూపములను ధరించి ప్రకాశింపుచున్న యాభరణములు గలదియై నూరుగురు సూర్యులకాంతితో సమానముగా ప్రకాశించుచు రెండవసావిత్రివలెనుండి ఆబ్రాహ్మణునియొద్ద యనుజ్ఞబడసి పదిదిక్కులను ప్రకాశింపజేయుచు స్వర్గలోకమునకు వెళ్లెను.

శ్లో॥ భుక్త్వా దివి మహాభోగాన్ పశ్చా జ్జాతా మహీతలే।
నరనారాయణా ద్దేవా దూర్వశీ నామ నామతః॥ ౧౦౧

తా. ఆమె స్వర్గములో ననేక భోగముల ననుభవించి పిమ్మట భూలోకములో దేవుండగు నరనారాయణుని వలన బుట్టి యూర్వశియను పేరుతో ప్రసిద్ధికెక్కెను.

శ్లో॥ వైశాఖశుద్ధద్వాదశ్యాః ప్రభావేన వరాంగనా।
దేవానాం చ ప్రియా జాతా అప్సరస్త్వం చ సా యయౌ॥

తా. శ్రేష్ఠంబగు యాచిన్నది వైశాఖ శుద్ధ ద్వాదశీమహాత్మ్యముచే దేవతలకు ప్రీతికరమైనదై దేవవేశ్యగా బుట్టెను.

శ్లో॥ య ద్యోగిగమ్యం హుతభుక్ప్రకాశం వరం వరేణ్యం పరమార్ధ రూపం। యాం ప్రాప్య సంతోషి హి యాంతి మోహం తత్ప్రాప రూపం చ శునీ హి దేవీ॥ ౧౦౩

తా. శునక స్వరూపమును విడిచి దేవతాస్వరూపమును పొందిన యాచిన్నది యోగీశ్వరులచే పొందతగినదియు అగ్నిహోత్రునివలెనే ప్రకాశించునదియు శ్రేష్ఠంబైనదియు కోరతగినదియు జ్ఞానముకలవారైనను చూచినంతనే మోహము పొందతగినదె యగు పరమార్ధ స్వరూపమునగు సౌందర్యమును పొందెను.

శ్లో॥ పశ్చాత్స పద్మబంధుర్హి తాం తిథిం పుణ్యవర్ధనీం।
లోకే ప్రఖ్యాపయామాస మధుద్విట్ప్రాణవల్లభాం॥ ౧౦౪

తా. అనంతరమా పద్మబంధువను మునీశ్వరుడు పుణ్యమును వృద్ధిపొందించునదియు విష్ణుమూర్తికి ప్రీతికరమైనదియు నగు పూర్వోక్తమైన వైశాఖ శుద్ధ ద్వాదశియను తిధిని లోకములో ప్రకటింపజేసెను.

శ్లో॥ కోటీందుసూర్యగ్రహణాధికా సా సమస్తరూపాధికపుణ్యరూపా।
యజ్ఞైస్సమస్తై రతిరిచ్యమానా ద్విజేన ఖ్యాతా భువనత్రయే చ॥ ౧౦౫

తా. ఆ ద్వాదశీతిథి కోటి సూర్యగ్రహణములు చంద్రగ్రహణములకంటె నధికమైనదియగుచు అన్నిరూపములకంటె నధికమగు పుణ్యస్వరూపమగుచు సమస్త యజ్ఞములకంటె నధికమైనదియగుచు మూడులోకములయందు ప్రకటింపజేయబడెను.

ఇతి శ్రీస్కందపురాణే వైశాఖమాహాత్మ్యే నారదాంబరీషసంవాదే శునీమోక్షప్రాప్తిర్నామ చతుర్వింశోధ్యాయః॥

—౦౦—

## అథపంచవింశోధ్యాయః

శ్రుతదేవఉవాచ॥

శ్లో॥ యా స్తిస్రి స్తిథయః పుణ్యా అంతిమా శ్శుక్లపక్షకే।
వైశాఖమాసి రాజేంద్ర పౌర్ణమాంతా శ్శుభావహాః॥ ౧

తా. శ్రుతదేవుడు చెప్పుచున్నాడు. ఓరాజశ్రేష్ఠుడా! వైశాఖమాస శుక్లపక్షమందు త్రియోదశి చతుర్దశి పౌర్ణమి యీ మూడుతిథులును పుణ్యాకరములై శుభముల నొసంగును.

శ్లో॥ అంత్యాః పుష్కరిణీసంజ్ఞా స్సర్వపాపక్షయావహాః।
మాధవే మాసి యః పూర్ణం స్నానం కర్తుం న చ క్షమః॥
తిథి ష్వేతాసు స స్నాయా త్పూర్ణ మేవ ఫలం లభేత్॥

తా. పైనిచెప్పబడిన మూడుతిథులును పుష్కరిణియను పేరుగలవియై సమస్త పాపములను పోగొట్టుచున్నవి. మరియు వైశాఖశుక్ల పూర్ణిమయందు స్నానమును జేయలేనివాడు యీ మూడుతిథులలో దేనియందు జేసినను సంపూర్ణమగు ఫలమును పొందగలడు.

శ్లో॥ సర్వే దేవా స్త్రయోదశ్యాం స్థితా జంతూ న్పునంతి హి॥ 3
పూర్ణాయాస్స ర్వతీర్థై శ్చ విష్ణునా సహ సంస్థితాః।
చతుర్దశ్యాం సయజ్ఞాశ్చ దేవా ఏతా న్పునంతి హి॥

తా. సమస్త దేవతలును వైశాఖ శుద్ధ త్రియోదశియం దుండినవారలై సమస్త ప్రాణులను తరింపజేయుదురు. పూర్ణిమయందు సమస్త తీర్థములతోడను విష్ణుతోడను గూడి తరింపజేయుదురు. ఈ దేవతలు చతుర్దశి తిథియందు యజ్ఞములతోగూడి యీ ప్రాణులను తరింపజేయుదురు.

శ్లో॥ బ్రహ్మఘ్నం వా సురాపం వా సర్వా నేతా న్పునంతి హి।
ఏకాదశ్యాం పురా జజ్ఞే వైశాఖ్యా మమృతం శుభం॥

తా. వైశాఖస్నానము బ్రహ్మహత్య జేసినవానిని కల్లు ద్రాగినవానిని మరియు సమస్త పాపాత్ములను తరింపజేయుచున్నది. పూర్వము వైశాఖశుద్ధ ఏకాదశియందు అమృతము పుట్టినది.

శ్లో॥ ద్వాదశ్యాం పాలితం తచ్చ విష్ణునా ప్రభవిష్ణునా।
త్రయోదశ్యాం సుధాం దేవా న్పాయయామాస వైహరిః॥

తా. సమర్థుండగు విష్ణుమూర్తిచే ఆయమృతము సంరక్షింపబడినది. విష్ణుమూర్తి త్రయోదశీ దినమందు ఆయమృతమును దేవతలచే త్రాగించెను.

శ్లో॥ జఘాన చ చతుర్దశ్యాం దైత్యా న్దేవవిరోధినః॥
పూర్ణాయాం సర్వదేవానాం సామ్రాజ్యాప్తి ర్బభూవ హ॥

తా. భగవంతుడు దేవతలకు విరోధులగు రాక్షసులను చతుర్దశియందు సంహరించెను. పూర్ణిమయందు దేవతలకు స్వర్గలోకాధిపత్యమును తిరిగి పొందించెను

శ్లో॥ తతో దేవా స్సుసంతుష్టా ఏతాసాం చ వరం దదుః।
తిసృణాం చ తిథీనాం వై ప్రీత్యోత్ఫుల్లవిలోచనాః॥ ౮

తా. అనంతరము దేవతలు సంతోషించినవారలై ఆశ్చర్యమునుపొంది త్రయోదశి చతుర్దశి పూర్ణిమ యీమూడుతిథులకు వరముల నిచ్చిరి.

శ్లో॥ ఏతా వైశాఖమాసస్య తిస్రశ్చ తిథయ శ్శుభాః।
పుత్రపౌత్రాదిఫలదా నరాణాం పాపహానిదాః॥ ౯

తా. వైశాఖమాసములో ఈమూడుతిథులును శుభములనొసంగునవియు నరులకు పుత్రులు పౌత్రులు మొదలగు సంపత్తులను కలుగజేయునవియు పాపములను పోగొట్టునవియునై యున్నవి.

శ్లో॥ యో మాధవే త్వసంపూర్ణే న స్నాతో మనుజాధమః।
తిథిత్రయే తు సంస్నాత్వా పూర్ణ మేవ ఫలం లభేత్॥ ౧౦

తా. ఏహీనుడైనను వైశాఖమాసములో ముప్పదిదినములయందు స్నానముజేయకపోయినను ఈమూడుదినములయందు స్నానముజేసినయెడల సంపూర్ణఫలమును పొందుచున్నాడు.

శ్లో॥ తిథిత్రయే హ్యకుర్వాణ స్స్నానదానాదికం నరః।
చాండాలీం యోని మాసాద్య పశ్చా ద్రౌరవమశ్నుతే॥ ౧౧

తా. ఏమనుష్యుడైనను యీమూడుతిథులయందు స్నానము దానము మొదలగు వానిని జేయకుండినేని అట్టివాడు చండాలజన్మమెత్తి పిమ్మట రౌరవమను నరకమును పొందుచున్నాడు.

శ్లో॥ ఉష్ణోదకేన యస్స్నాతి మాధవే చ తిథిత్రయే।
రౌరవం నరకం యాతి యావదింద్రాశ్చతుర్దశ॥ ౧౨

తా. వైశాఖమాసములో ఈమూడుతిథులయందు వేడినీళ్ళతో స్నానముజేసినవాడు ఇంద్రులుండునంతపర్యంతము పదునాలుగు మనువులుండు నంతపర్యంతము నరకమును పొందును.

శ్లో॥ పితౄన్ దేవాన్ సముద్దిశ్య దధ్యన్నం న దదాతి యః।
పైశాచీం యోని మాసాద్య తిష్ఠ త్యాభూతసంప్లవం॥ ౧౩

తా. ఆదినములయందు పితృదేవతలగూర్చియు దేవతులగూర్చియు పెరుగుతో గూడిన యన్నమునీయనివాడు పంచభూతములు నశించునంత పర్యంతము పిశాచజన్మము నెత్తుచుండును.

శ్లో॥ ప్రివృత్తానాం చ కామానాం మాధవే నియమే కృతే।
అవశ్యం విష్ణుసాయుజ్యం యుజ్యతే నాత్ర సంశయః॥ ౧౪

తా. వైశాఖమాస వ్రతమును జేయువాడు కోరినకోరికల నిచ్ఛవాడుగా నుండేనేని ముఖ్యముగా విష్ణుమూర్తియందైక్యము నొందుచున్నాడు. సందేహములేదు.

శ్లో॥ ఆమాసం నియమాసక్తః కుర్యా ద్యది దినత్రయే।
తేన పూర్ణఫలం ప్రాప్య మోదతే విష్ణుమందిరే॥ ౧౫

తా. వైశాఖమాసము నెలదినములును నియమముగానుండి ఆమూడుదినములలోను దానములుజేసిన సంపూర్ణఫలమును పొంది జన్మాంతమున విష్ణులోకమునుపొంది యానందించుచుండును.

శ్లో॥ యో వై దేవాన్ పితౄన్ విష్ణుం గురు ముద్దిశ్య మానవః।
న స్నానాది కరో త్యద్ధా ముష్య శాపప్రదా వయం॥

తా. వైశాఖమాసములో నెవడు దేవతలు పితృదేవతలు విష్ణు గురువు వీరిని గూర్చి స్నానము మొదలగు కర్మలను జేయడో వానినిగురించి యిట్లు శాపమిచ్చుచున్నాము.

శ్లో॥ నిస్సంతానో నిరాయుశ్చ నిశ్శ్రేయస్కో భవే దితి।
ఇతి దేవా వరం దత్వా స్వధామాని యయుః పురా॥ ౧౭

తా. అట్టు చేయనివాడు సంతానములేనివాడుగాను స్వల్పాయుర్దాయము గలవాడుగాను శ్రీయన్నులేనివాడుగానగును అని దేవతలు పూర్వమందు పలికి వారి స్థానములకు వెళ్ళిరి.

శ్లో॥ తస్మా త్త్రితిథిత్రియం పుణ్యాం సర్వాఘౌఘవినాశనం।
అంత్యపుష్కరిణీసంజ్ఞం పుత్రపౌత్రప్రవర్ధనం॥ ౧౮

తా. ఆకారణమువలన ఆమూడుతిథులును అంత్యపుష్కరిణీయను పేరుతో ప్రసిద్ధికెక్కి పుణ్యకరమై సమస్తపాపములను పోగొట్టునవియై పుత్రులు పౌత్రులు మొదలగువారిని వృద్ధిపొందించునవియై యున్నవి.

శ్లో॥ యా నారీ సుభగా సూపపాయసం పౌర్ణిమాదినే।
బ్రాహ్మణాయ సకృ ద్దత్వా కీర్తిమంతం సుతం లభేత్॥ ౧౯

తా. పౌర్ణమిదినమందు బ్రాహ్మణునకు సూపము పరమాన్నములతో భోజనము పెట్టిన స్త్రీ కీర్తిగల తనయుని గనును.

శ్లో॥ గీతాపాఠం తు యః కుర్యా దంతిమే చ దినత్రయే।
దినేదినే శ్వమేధానాం ఫల మేతి న సంశయః॥ ౨౦

తా. త్రయోదశి మొదలు మూడుదినములయందు భగద్గీతాపారాయణమును జేసినవాడు ప్రతిదినమందు అశ్వమేధమును జేసినఫలమును పొందుచున్నాడు సందేహము లేదు.

శ్లో॥ సహస్రనామపఠనం యః కుర్యా చ్చ దినత్రయే।
తస్య పుణ్యఫలం వక్తుం క శ్శక్తో దివి వా భువి॥ ౨౧

తా. ఆమూడుదినములలో సహస్రనామ పారాయణమును జేసినవాని ఫలమును జెప్పుటకు సమర్థులగువారు భూలోకములోను స్వర్గలోకములోను లేరు.

శ్లో॥ సహస్రనామభి ర్దేవం పూర్ణాయాం మధుసూదనం।
పయసా స్నాప్య వై యాతి విష్ణులోక మకల్మషం॥ ౨౨

తా. పూర్ణిమయందు విష్ణుమూర్తిని పాలతో స్నానముజేయించి సహస్రనామములతో పూజించినయెడల పాపరహితముగు విష్ణులోకమును పొందుచున్నాడు.

శ్లో॥ సమస్తవిభవై ర్యస్తు పూజయే న్మధుసూదనం।
న తస్య లోకాః క్షీయంతే యుగకల్పాదివ్యత్యయే॥ ౨౩

తా. నల్లని వృషభమును వృషోత్సర్జనము జేసినను వైశాఖమాసములలో స్నానమును జేసినను సమస్త కర్మబంధములను విడగొట్టుకొని ధర్మార్థ కామ మోక్షములను పొందుచున్నాడు.

శ్లో॥ గాం సవత్సాం ద్విజేంద్రాయ సీదతే చ కుటుంబినే।
ఇహాపమృత్యు ర్నిర్ముక్తః పరత్ర చ పరం వ్రజేత్॥

తా. దరిద్రుండగు బ్రాహ్మణునకు దూడతోగూడ గోదానము జేసినయెడల అపమృత్యువును పోగొట్టుకొని జన్మానంతరము ఉత్కృష్టమగు స్థానమును పొందును.

శ్లో॥ స్నానదానవిహీనస్తు వైశాఖీం చైవ యోనయేత్।
శ్వానయోనిశతం ప్రాప్య విష్ఠాయాం జాయతే కృమిః॥ ౩౧

తా. ఎవడు వైశాఖమాసములో స్నానము జేయకను దానముల నియ్యకను వెళ్ళబుచ్చునో వాడు నూరుజన్మముల పర్యంతము శునక జన్మమెత్తుచు అపరిశుద్ధపదార్థములయందు పురుగుగా బుట్టుచుండును.

శ్లో॥ తిస్రః కోట్యోర్ధకోటీ శ్చ తీర్థాని భువనత్రయే।
సంభూయ మంత్రయాం చక్రుః పాపసంఘాతశంకితాః॥ ౩౨

తా. భూలోకములో నుండునట్టి మూడుకోట్ల యేబది లక్షల తీర్థములు కలసి తమకు సంభవించెడు పాపమును గూర్చి యిట్లు ఆలోచన జేసికొనినవి.

శ్లో॥ జనా అస్మాసు పాపిష్ఠా విసృజంతి స్వకం మలం।
త దస్మాకం కథం గచ్ఛే దితి చింతాసమన్వితాః॥ ౩౩
తీర్థపాదం హరిం జగ్ము శ్శరణ్యం శరణం విభుం।
స్తుత్వా చ బహుభి స్స్తోత్రైః ప్రార్థయామాసు రంజసా॥ ౩౪

తా. ఓతీర్థములారా! పాపాత్ములగు మనుష్యులు మనయందు స్నానముజేసి తమసంబంధమగు పాపమును మనకు విడిచిపెట్టుచున్నారు. కాబట్టి అట్టి మనకు సంభవించిన పాపము మనకు యెచ్చటికి వెళ్ళి యేమి పరిహారోక్తి చేసికొనిన నశించునని విచారముగలవారై సమస్త తీర్థములు పాదమునందుగలవాడును రక్షకుండును సమర్థుండనగు విష్ణుమూర్తిని శరణుపొంది శీఘ్రముగా ననేక స్తోత్రములచే పొగడిరి.

శ్లో॥ దేవదేవ జగన్నాథ సర్వాఘౌఘవినాశన।
జనా అస్మాసు పాపిష్ఠా స్స్నాత్వా పాపాని సర్వశః॥ ౩౫

విసృజ్య త్వద్పదం యాంతి త్వదాజ్ఞాధారిణో భువి।
అస్మాకం చైవ తత్పాపం కథం గచ్ఛే జ్జనార్దన॥ ౩౬

తా. దేవతల కందరకును దేవుడవును ప్రపంచమున కధిపతియును సమస్తపాపములను నశింపజేయువాడవునగు యోవిష్ణుమూర్తీ! పాపాత్ములగు జనులు మాయందు స్నానముజేసి వారి పాపమును మాయందు విడిచిపెట్టి నీ యాజ్ఞాప్రకారము నడచుకొనుచు శ్రేష్ఠమగు నీస్థానమును పొందుచున్నారు. మాకు సంక్రమించిన వారిపాపము మమ్మెట్లు నేరీతి విడుచును?

శ్లో॥ తదుపాయం వదార్థీనాం త్వత్పాదశరణైషిణాం।
ఇతి తీర్థైః ప్రార్థిత స్తు భగవాన్ భూతభావనః॥ ౩౭
ప్రహాస ప్రాహ తీర్థాని మేఘగంభీరయా గిరా।

తా. మీపాదములనే రక్షకములనుగా నమ్మియుండి కోరుచున్న మాకు తగిన యుపాయమును జెప్పుమని ప్రార్థించి తీర్థములడుగగా సమస్తభూతములచే సన్మానింపబడునట్టియు భగవంతుడగు విష్ణుమూర్తి నవ్వుచు మేఘధ్వనులతో సమానమగు వాక్యములతో నిట్లు చెప్పుచున్నాడు.

శ్రీ భగవానువాచ॥

శ్లో॥ సితే పక్షే మేషసూర్యే వైశాఖాంతే దినత్రయే॥ ౩౮
సర్వతీర్థమయే పుణ్యే మమాపి ప్రాణవల్లభే।
యూయం భానూదయా త్పూర్వం బహిస్సంస్థజలాప్లుతాః।
విముక్తాఘాః పుణ్యరూపా భవం త్వాశు వినిర్మలాః॥ ౩౯

తా. భగవంతుడు చెప్పుచున్నాడు. సూర్యుడు మేషరాశియందుండగా శుక్లపక్షములో సమస్త తీర్థస్వరూపములగు నవియు నాకు మిక్కిలి ప్రియమైనవియు త్రయోదశి మొదలు మూడు తిథులయందును సూర్యోదయముకంటె ముందుగా గ్రామమునకు వెలుపలనుండు జలములయందు స్నానముజేసిన మీరు శీఘ్రముగా పాపములవలన విడువబడినవారై నిర్మలులగుచు పుణ్యస్వరూపులు కాగలరు.

శ్లో॥ భవద్భిశ్చ విముక్తాఘైర్యైన స్నాతా దినత్రయే॥
తేషు తిష్ఠతు తత్పాపం జనైర్యుష్మద్విరేచితం॥
ఇతి తీర్థపదో విష్ణుస్తీర్థానాం చ వరం దదౌ॥ ౪౦

తా. మీరు పాపములవలన విడువబడిన వారగుచుండగా జనులు మీయందు విడువబడిన పాపము మీరు ఆమూడు దినములయందు యేజలములందు స్నానముజేసిన ఆజలములయందు మీపాపము సంక్రమించును. ఈప్రకారముచెప్పి పాదములయందు తీర్థములుగల విష్ణుమూర్తి తీర్థములకు వరమునిచ్చెను.

శ్లో॥ అనుజ్ఞాప్య చ తాన్యాగాత్తత్రైవాంతరధీయత।
స్వధామాని పునః ప్రాప్య తాని తీర్థాని సర్వశః॥ ౪౨
ప్రతివర్షే తు వైశాఖే తత్రైవాంత్యదినత్రయే।
తేనాఘౌఘం విముచ్యైవ యాతి నిర్మలతాం మహా॥ ౪౩

తా. ఆభగవంతుడిట్లు పలికి ఆతీర్థములకు ననుజ్ఞయిచ్చి తాను యోగము నవలంబించి యంతర్థానమాయెను. ఆతీర్థములును వారివారి స్థానములకువెళ్లి ప్రతిసంవత్సరము వైశాఖమాసములో ఆమూడు తిథులలోను స్నానముజేసి మనుష్యుల స్నానములవలన తమకు గలిగిన పాపములను పోగొట్టుకొని నిర్మల స్వరూపులగుచున్నారు. కాబట్టి మిక్కిలి ఆశ్చర్యమైనది.

శ్లో॥ యే తు స్నానం న కుర్వంతి వైశాఖాంతదినత్రయే।
తే భవంతు సమస్తానాం జనానాం పాతకాశ్రయాః॥ ౪౪

తా. వైశాఖశుద్ధ త్రయోదశిమొదలు మూడుతిథులలో నేతీర్థములు స్నానము జేయవో, ఆతీర్థములు సమస్త జనులయొక్కయు పాపములను పొందగలవు.

శ్లో॥ ఇతి శాపం చ తీర్థానాం హ్యస్నాతానాం దదాతి చ।
న తేన సదృశః పాపో యో న స్నాతో దినత్రయే॥ ౪౫

తా. ఈప్రకారము ఆమూడుతిథులలోను స్నానము జేయనివానికి శాపమిచ్చెను. కాబట్టి ఆమూడుతిథులలో స్నానము జేయనివాని పాపముతో సమానమైన పాపము మరియొకటి లేదు.

శ్లో॥ విచారితేషు శాస్త్రేషు న దృష్టో న చ వై శ్రుతః।
తస్మాద్దినత్రయే కార్యం స్నానదానార్చనాదికం॥ ౪౬

తా. శాస్త్రములనన్నియు విచారింపగా దీనితో సమానమైనది యింకొకటి లేదు గాన ఆమూడుదినములలో స్నానము దానములు ముఖ్యముగా జేయవలయును.

శ్లో॥ అన్యథా నరకం యాతి యావదింద్రాశ్చతుర్దశ।
ఇత్యేతత్సర్వమాఖ్యాతం శ్రుతకీర్తే మహామతే॥

తా॥ ఈపరికారము జేయనియెడల పదునాలుగు ఇంద్రులుండునంత కాలము నరకములోనుండును. విశేషబుద్ధిశాలివగు యోశ్రుతికీర్తి మహారాజా! ఈ పరికారము వైశాఖమాహాత్మ్యమునంతయుజెప్పితిని.

శ్లో॥ పృష్టంవైశాఖమాహాత్మ్యం యథాదృష్టంయథాశ్రుతం।
మాహాత్మ్యస్యచ లేఖోయం మాధవస్యచ వర్ణితః॥

తా॥ నీవు అడిగిన వైశాఖధర్మమును నేనుచూచినంతలోను వినినంతలోను జెప్పితిని. మఱియు దీనియందు వైశాఖమాహాత్మ్యమును విష్ణుమూర్తిమాహాత్మ్యమును జెప్పఁబడెను.

శ్లో॥ కార్త్స్న్యేద్వక్తుంబ్రహ్మణాపి నాలంవర్షశతైరపి।
పురాకైలాసశిఖరే పార్వత్యై శంకర స్స్వయం॥
ఆహమాధవ మాహాత్మ్యం పృచ్ఛత్యైశతవత్సరం।
తచ్చాపినాంత మగమ దశక్తో విరరామహ॥

తా॥ విష్ణుప్రీతికరమైన వైశాఖమాహాత్మ్యమును బ్రహ్మదేవుఁడు నూరుసంవత్సరములపర్యంతము జెప్పినను సమర్థుడుకాడు. మఱియు పూర్వకాలమందు కైలాసపర్వతనివాసులగు పార్వతీపరమేశ్వరులు విహరించుచుండగా నొకప్పుడు పార్వతీదేవి వైశాఖధర్మములను జెప్పుమని సాంబమూర్తినడిగెను. అప్పుడుసాంబమూర్తి చెప్పనారంభించి నూరుసంవత్సరములపర్యంతము జెప్పినను సంపూర్తినొందకుండుటచే పిమ్మట విసికి చాలించెను.

శ్లో॥ కోనువర్ణయితుంశక్తః కార్త్స్న్యేన్మాహాత్మ్యముత్తమం।
వినా విష్ణుం జగన్నాథం నారాయణ మనామయం॥

తా॥ ప్రపంచమునకు నధిపతియును నాశనరహితుడునగు విష్ణుమూర్తిగాక మిగిలినమరియెవరైనను వైశాఖమాహాత్మ్యమును సంపూర్తిగా జెప్పుటకు సమర్థులుకారు.

శ్లో॥ పురానర్వేపి ఋషయో మాహాత్మ్యంపాపనాశనం।
లేశంచ లేశం వ్యాచఖ్యు ర్జనానాంహితకామ్యయా॥

తా॥ పూర్వమందు సమస్త మునీశ్వరులు జనులకు మేలుజేయ

నిశ్చయించి పాపములను నశింపజేయునట్టి వైశాఖమాహాత్మ్యమును
ఎంతసూక్ష్మమునున్నను విరళముగాఁజెప్పి ప్రకటనజేసిరి.

శ్లో॥ నాతఃకేనాపివ్యాఖ్యాతే వ్యాశక్తత్వాన్మహీపతే।
త్వంచమాసేతువైశాఖే కురుదానాదిసత్క్రియాః॥
తేనభుక్తించ ముక్తించ సంప్రాప్స్యసినసంశయః॥

తా॥ ఓరాజా! సమర్థతలేకపోవుటచే యింతకంటె మరియెవరిచే
తను విస్తరించి చెప్పఁబడలేదు. వైశాఖమాసములో నీవు స్నానదా
నాది సత్కారములనుఁ జేసినయెడల భుక్తినిముక్తినిపొందగలవు.

శ్లో॥ ఇతితంబోధయిత్వాచ మైథిలంజనకాహ్వయం।
శ్రుతదేవస్తమామంత్ర్య గంతుంచక్రేమనోగతిం॥

తా॥ ఈప్రకారము శ్రుతదేవుఁడను బ్రాహ్మణుఁడు మిథిలాధిపతి
యగు జనకమహారాజునకు వైశాఖధర్మములనుఁ జెప్పి యారాజువలన
ననుమతివడసి మనోవేగముతో వెళ్ళనిశ్చయించెను.

శ్లో॥ జాతాహ్లాదస్సరాజర్షి ర్గళద్బాష్పాకులేక్షణః।
ఉత్సవంకారయామాస స్వామీవ్యర్థేమనోరమం॥

తా॥ అంతట యా రాజోత్తముడు సంతుష్టాంతరంగుడై కండ్ల
నుండి యానందబాష్పములు స్రవించుచుండగ తనకు సద్గురుఫలము
సంభవించుటకుసర్వజనులకునానందకరమైనయుత్సవమును జేయించెను.

శ్లో॥ గ్రామంప్రదక్షిణీకృత్య శిబికామధిరోప్యతం।
చతురంగబలైర్యుక్త స్స్వయం పృష్ఠమథాన్వగాత్॥

తా॥ పిమ్మట ఆమునీశ్వరుని సవారీలో గూర్చుండబెట్టి తాను చతు
రంగబలములతోగూడ ఆయనవెనుక నడచుచు గ్రామములో ప్రద
క్షిణముగా నూరేగించెను.

శ్లో॥ పునశ్చాంతపురంప్రాప్య సకలైర్విభవైరపి।
వస్త్రైరాభరణైశ్చైవ గోభూతిలహిరణ్యకైః॥
ప్రణమ్యచపరిక్రమ్య తస్థౌప్రాంజలిరగ్రతః॥

తా॥ తిరిగి తనగృహమునకు తీసికొనివచ్చి సింహాసనమున గూర్చుం

డఁబెట్టి యీ మునీశ్వరుని పూజించి తనభాగ్యము ననుసరించి వస్త్రములు ఆభరణములు గోవులు భూమి తిలలు బంగారము మొదలగు దానములను యితర బ్రాహ్మణులకు దానములనిచ్చి యీమునీశ్వరుని చుట్టు తిరిగి నమస్కారము జేసి ఆయన యెదుటనిలబడియుండెను.

శ్లో॥ తతస్తునమహాతేజా శ్శ్రుతదేవో మహాయశాః।
సంతుష్టఃపరమప్రీతో యయౌధామ స్వకంమునిః॥

తా॥ అనంతరము విశేషకాంతిగలవాడును విశేషకీర్తిగలవాడు నగు ఆ శ్రుతదేవమహాముని సంతోషించి మిక్కిలి యానందముగలవాడై తనస్వస్థానమునకు వెళ్ళెను.

నారదఉవాచ.

శ్లో॥ ఇత్యేతత్పరమాఖ్యాన మంబరీషతవోదితం।
శ్రవణాత్సర్వపాపఘ్నం సర్వసంపద్వివర్ధనం।
యేనభుక్తించముక్తించ జ్ఞానంమోక్షంచవిందతి॥

తా॥ నారదుఁడు చెప్పుచున్నాడు. ఓ అంబరీషమహారాజా! ఈప్రకారము విన్నంతనే సమస్తపాపములను పోగొట్టునదియు సమస్తసంపత్తులను వృద్ధిపొందించునదియు శ్రేష్ఠంబగు నీ వైశాఖమాహాత్మ్యమును నీకుఁ జెప్పితిని. కాఁబట్టి యీ వ్రతమును జేసినవాడు భుక్తిని ముక్తిని జ్ఞానమును మోక్షమును పొందుచున్నాడు.

శ్లో॥ ఇతితస్యవచశ్శ్రుత్వా అంబరీషోమహాయశాః॥
ప్రహృష్టాంతరవృత్తిశ్చ బాహ్యవ్యాపారవర్జితః॥
ప్రణనామతథామూర్ధ్నా దండవత్పతితోభువి॥

తా॥ ఈ ప్రకారము నారదుఁడు జెప్పినవాక్యములను విశేషకీర్తిశాలియగు అంబరీషమహారాజువిని హృదయమునందు విశేషయానందము గలుగుటచే మైమరచి బాహ్యవ్యాపారములనువిడిచి యీ నారదునిచుట్టు తిరిగి సాష్టాంగ దండప్రణామము జేసెను.

శ్లో॥ వివిధైరర్హణైశ్చాపి పూజయామాసతంపునః।
సంపూజితస్తమామంత్ర్య నారదోభగవాన్మునిః॥

 

లోకాంతరంయయౌధీమాఞ్ఛాపానైకత్రసంస్థితిః॥

తా॥ అంబరీషమహారాజు తనకుండు వైభవము కొలది ఆ నారదమునీశ్వరుని పూజింపగా పిమ్మట నారదుఁడు శాపకారణమున నొక్కప్రదేశమునందును నిలిచియుండువాడుకానందున మరియొక లోకమును గూర్చి వెళ్ళినవాడాయెను.

శ్లో॥ అంబరీషోపిరాజర్షిః ర్నారదోక్తానిమాఃశ్శుభాః॥
ధర్మాఃకృత్వావిలీనో భూత్పరేబ్రహ్మణినిర్గుణే।

తా॥ శ్రేష్ఠుఁడగు అంబరీషమహారాజు నారదునిచే చెప్పఁబడినవియు శుభములనొసగునవియునగు వైశాఖధర్మములను చేసి అనంతరము గుణశూన్యమగు పరబ్రహ్మమునందు ఐక్యముపొందెను.

సూత ఉవాచ.

శ్లో॥ యఇదంపరమాఖ్యానం పాపఘ్నంపుణ్యవర్ధనం।
శృణుయాద్వాపఠేద్వాపి సయాతిపరమాంగతిం॥

తా॥ సూతమునీశ్వరుఁడు చెప్పుచున్నాడు. పాపములను పోగొట్టునదియు పుణ్యములను వృద్ధిపొందించునదియునగు యీయుత్తమవైశాఖమాహాత్మ్యమును వినినవాడును చదివినవాడును యుత్కృష్టస్థానమును పొందగలడు.

శ్లో॥ లిఖితంపుస్తకంయేషాం గృహేతిష్ఠతిమానద।
తేషాంముక్తిః కరస్థాహి కిముతచ్ఛ్రవణాత్మనాం॥

తా॥ ఈ వైశాఖమాహాత్మ్యమును వ్రాయఁబడిన పుస్తకము యెవరిగృహములోనుండునో వారికి ముక్తిసులభముగా పొందఁబడును. ఈ మాహాత్మ్యమును వినినవారు ముక్తిని సులభముగా పొందుదురని చెప్పనక్కరలేదు.

ఇతి శ్రీస్కాందపురాణే వైశాఖమాహాత్మ్యే నారదాంబరీష సంవాదే ఫలశ్రుతికథనం నామ
పంచవింశోధ్యాయః

శ్రీకృష్ణార్పణమస్తు స్వస్త్యస్తు.